# నాటక పితామహుడు

( కీ. శే. ధర్మవరము రామకృష్ణమాచార్యుల వారి నాటకములపై విమర్శ )

FOR STUDENTS ONLY




డాక్టరు. దివాకర్ల వేంకటావధాని
ఎం. ఏ (ఆనర్సు) పి. హెచ్. డి.
ఉస్మానియా విశ్వ విద్యాలయము
హై ద రా బా దు.

ప్రతులకు:

టాగూర్ పబ్లిషింగ్ హౌస్

విద్యావిషయ ప్రచారకులు

హైదరాబాదు.

లేక

డా. దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. ఆనర్సు పిహెచ్. డి.

18/4 ఆర్. టి. బరకత్పుర

హైదరాబాదు.

అని వ్రాయవలెను.

వెల రు. **3-50** న. పై.

ముద్రణ :

శివాజీ ప్రెస్

సికిందరాబాద

# తొలి పలుకు

ఆంగ్లమున Shakespeare మొదలగు నాటక కర్తల గ్రంథములలో నొక్కొక్క దానిపై నెన్నెన్నో విమర్శ గ్రంథములు వెలువడినవి. తెలుఁగు వాఙ్మయమున మొత్తము మీఁద విమర్శ భాగము తక్కువ; ఉన్నదాననైనను అట్టి యుత్తమ విమర్శ గ్రంథము లెన్నో లేవు. తెలుగునఁ దొలుఁదొలుత స్వతంత్ర నాటకముల వ్రాయఁ బూనుటకుఁ గాని, వానియందుఁ బాశ్చాత్య నాటక పద్ధతులను యథావకాశముగాఁ బ్రవేశపెట్టుటకుఁ గాని, వానిని సర్వజనాహ్లాదకరముగా రంగముపైఁ బ్రదర్శింపఁజేయుటకుఁ గాని, శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారే మొదటివారు. ఈయన వ్రాసిన నాటకములలోఁ దెలుఁగున నింతవఱకు వెలువడిన వివిధములయిన రూపకములన్నిటికి ఆదర్శము లున్నవి. ఆంగ్ల విమర్శకులు Shakespeare నాటకములనుగూర్చి వ్రాసిన విమర్శల పద్ధతి ననుసరించి, సార్థకనాముఁడయిన యీ యాంధ్ర నాటక పితామహుని నాటకములలోఁగల మెఱుఁగుల నిందు యథాశక్తిగాఁ జూపఁ బ్రయత్నించితిని.

కేవల సంస్కృత లక్షణమునే కాక యెడనెడ పాశ్చాత్య లక్షణమును గూడ గ్రహించి యాచార్యులుగారు నాటకములు వ్రాసియుండుటచే ప్రతిప్రకరణము మొదటను దానికి సంబంధించిన యీ లక్షణ ద్వంద్వమును గొంతవఱకు సమన్వయించి చెప్పియుంటిని. ఆచార్యులుగారి నాటకములను గుఱించిన విమర్శను మాత్రమే వ్రాసినచో, వానిని జదువన వారికి చూచిన వారికి తప్ప నితరులకు నా యీ వ్యాసమభిరుచి కలిగింపఁజాలదను నూహతో నీ లక్షణద్వయ సమ్మేళనము గావించి యిందు చొప్పించియుంటిని.

ఆచార్యులుగారు ముప్పదికిఁ బైఁగా నాటకముల రచించిరఁట. కాని వానిలో ముద్రితము లయినవి పదునాలుగే. అముద్రితములయిన యితర నాటకముల ప్రతులు సంపాదింప నెంతగాఁ బ్రయత్నించినను లాభము లేకపోయెను. అందుచే ముద్రితము లయిన యీ పదునాలుగు నాటకములఁ బురస్కరించికొనియే యీ వ్యాసమును వ్రాసితిని.

సుగృహీతనామధేయులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ నాటకోపన్యాసములలో నాచార్యులుగారి యొక్కయు, కోలాచలము శ్రీనివాసరాయల యొక్కయు నాటక రచనా కౌశలమును బ్రశంసించుచుఁ జివర వీరి నాటకములలోఁ బ్రశంసనీయములయిన పాశ్చాత్య పద్ధతులెన్నో కలవని నుడివిరి. ఆ గ్రంథము చదివినప్పుడే నాకాచార్యులుగారి నాటకములఁ జదువుటకును, వానిని గూర్చి వ్యాసము వ్రాయుటకును బుద్ధి పొడమినది. వారి నాటకోపన్యాసములే నా యీ రచన కొజ్జబంతులు. వారికిని, ఈ వ్యాస రచన విషయమున నాకు మార్గదర్శకులుగ నుండి యెంతో తోడ్పడిన మా గురువర్యులు శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారికిని నా కృతజ్ఞతా పూర్వక వందనముల నర్పించుచున్నాను.

ఆంధ్ర విశ్వ విద్యాలయమువారు నా కీ వ్యాసరచనకై 1937 వ సంవత్సరమున **M. A. (Hons)** పట్టము నొసంగిరి. దీని నిప్పుడు ముద్రించుట కనుమతి నిచ్చిన యా విశ్వ విద్యాలయాధికారుల కెంతయుఁ గృతజ్ఞుఁడను.

గ్రంథకర్త.

---

## ఈ వ్యాస రచనమున నాకుఁ దోడ్పడిన గ్రంథములు.


1. సాహిత్య దర్పణము
2. దశ రూపకము
3. ప్రతాపరుద్రీయము
4. Sanskrit Drama in Theory and practice by Keith
5. Dramatic poetry - Dryden.
6. The Theory of English Drama - Prof. A. Nicolt
7. All the Dramas of Shakespeare with notes and introduction-Edited by Verity.
8. An introduction to the study of English Literature by Hudson.
9. Shakespearean Tragedy - by Bradley.
10. నాటకోపన్యాసములు - శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు
11. Article written on 'చిత్రాంగి' in Triveni by Prof. T.Virabhadrudu.
12. Portions of Aristotle's Poetics.
13. Moulton's criticism on Shakespeare.
14. నాటక విమర్శ - శ్రీ పాద కామేశ్వరరావుగారు.
15. ఆచార్యులుగారి నాటకములలో ముద్రింపఁబడిన పీఠికలు. .

# వి ష య సూ చి క





# 1. ఆంధ్ర నాటకముల ఆరంభదశ

నన్నయకుఁ బూర్వ మాంధ్రభాషకు స్థిరమైనరూపము కాని, కావ్య రచనావశ్యకము లైన ఛందోవిస్తృతులు కాని లేకుండె ననుట సర్వపండిత సమ్మతమైన విషయము. అప్పటి యాంధ్ర వాఙ్మయము ప్రాయికముగా శాసనాదిరూపమునే తాల్చి యుండెను గాని యింకను గావ్యాకృతిని వహింపలేదు. తొలుఁదొలుత నీ భాషాపాదపమునఁ గావ్యరూపస్వాదు ఫలమును బండించినవాఁడు నన్నయ. ఇతఁడు రాజరాజనరేంద్రుని ప్రేరణచే సర్వధర్మ సమన్వయసంధాన దక్ష మయి పంచమ వేదము నాఁ బరఁగు భారతము నాంధ్రీకరింప నారంభించెను. ఇతఁడు స్వతంత్ర కావ్యరచనానుకూలములైన ప్రతిభా వ్యుత్పత్తులు కలవాఁడే యయ్యు నొకవంకఁ దన నాఁటి కసంస్కృతమై యవ్యవహితమై యున్న భాషకు సుస్థిరాకారము నొసఁగు భారమటుండ స్వతంత్ర కావ్యరచన భారమును గూడ వహించుట కష్టతర మని కాఁబోలు నట్టి పనికిఁ బూనుకొనఁ డాయెను. అదిగాక తత్కాల పరిస్థితులును, ప్రభు శాసనమును భారతమువంటి వైదిక మతప్రచారక గ్రంథము యొక్క యావిష్కరణమునకు మిక్కిలి యనుకూలములై యుండెను. నన్నయ తరువాతఁ దిక్కనయు, నెఱ్ఱనయు నాతనిచే నారంభింపఁబడిన యా యుత్తమ కావ్యము నాంధ్రీకరణము పూర్తిచేసిరి. ప్రతిభాశాలులయిన యీ మూగురు కవులును తమతమ యుగములందలి కవుల కెల్లరకును నాదర్శప్రాయులగుటచే నప్పటి యాంధ్రకవులు పెక్కురు వీరి మార్గమునే యనుసరించి ప్రసిద్ధములైన యితర పురాణములఁ గొన్నిటి నాంధ్రీకరించిరి. నన్నెచోడుని కుమారసంభవము వంటి స్వతంత్ర కావ్యములు కూడ నొండు రెండు వెలువడినను ఆంధ్రీకృతము లయినవానిలో నివి పదింట నొక్కటి కూడ నుండవు. మొత్తముమీఁద నెఱ్ఱన యుగాంతమువఱకు వెల్వడిన యాంధ్రవాఙ్మయమునఁ బురాణ పరివర్తనమే ప్రధాన లక్షణ మని భావింపవచ్చును.

భారత కవుల యాంధ్రీకరణ పద్ధతి యసామాన్యమైనది. వ్యాసరచిత భారతము నుండి కథాంశములను మాత్రము గైకొని వారు తక్కిన మెఱుఁగుల నన్నిటిని దామే తీర్చిదిద్దిరి. వలయునెడలఁ బూర్వోత్తర కథాభాగములను సైతము తారుమారు చేయుటకు వారు వెనుదీయలేదు. కథాగమనమున కడ్డుకలిగించునట్టియు, నప్రసక్తములైనట్టియు, గూఢ వేదాంత గర్భితము లగుటచే దుర్గ్రహములైనట్టియుఁ గథాభాగము

లను గేవలము సూచించి విడిచివైచిరి. సనత్సుజాతీయము, భగవద్గీత మొదలగున విట్టి వానికిఁ దార్కాణములు. వీరు వర్ణన భాగములను రచించుటలో మిక్కిలి స్వాతంత్ర్యము వహించి మూలగతములయిన వర్ణనలతోపాటు స్వకపోలకల్పితము లయిన వర్ణనలఁ గూడ గొన్నిటి నందుఁ బ్రవేశపెట్టిరి. పాత్రముల శీల స్వభావము లను వర్ణించుపట్లఁ గూడఁ గొన్నియెడల మూలవిరుద్ధమైన పద్ధతి నవలంబించిరి. తిక్కన ద్రౌపదీ పాత్రకును వ్యాసుని ద్రౌపదీ పాత్రకును స్వభావ విషయమునఁగల తారతమ్యమే దీనికిఁ బ్రబల దృష్టాంతము. కాన వ్యాసుని భారతము చెంత నుంచుకొని యందలి శ్లోకము లన్నియు నియ్యెడ నాంధ్రీకృతములయినవని చూచుటకాని, యందలి వర్ణన లన్నియు నిందు మక్కికి మక్కిగా ననువదింపఁబడినవని చూచుట కాని మిక్కిలి నిష్ఫలములయిన కార్యములు. మొత్తము మీఁద నాంధ్రీకరణమన్న పేరున్నను నాంధ్రమహాభారత మొక స్వతంత్ర రచనమువలెనే చూపట్టును గాని మూలగ్రంథము నతి సన్నిహితముగా ననుసరించిన కేవల పరివర్తనము వలెఁ గాని పింపదు. కవిత్రయము వారి యీ పరివర్తన పద్ధతి నంత సమగ్రముగా ననుకరింప లేకపోయినను బురాణ పరివర్తకులు పెక్కు రా మార్గము వెంటనే పోయిరని చెప్ప వచ్చును.

స్థూలముగాఁ జూచినచో సంస్కృత వాఙ్మయము నంతను బురాణములు, కావ్యములు, నాటకములు అని మూఁడు ముఖ్యభాగములుగా విభజింపవచ్చును. అందుఁ బురాణములు వివిధవిషయ సంకలితములును, నతివిస్తృతములును. కావ్యములు వర్ణన ప్రధానములు; వస్త్వైక్యముతోఁడి ప్రౌఢ రచన కునికిపట్టులు. నాటకములు ప్రధానముగా రసాశ్రయములు. సంవాదపూర్వకములయి యవి యనతి విస్తృతములుగ నుండును. ప్రథమాంధ్రకవు లా కాలప్రభావమును బట్టి ధర్మోపదేశ బాహుళ్యము గల పురాణ ముల నాంధ్రీకరించి భాషాసేవఁ గావించిరి, ఎఱ్ఱన యుగానంతరము వెలసిన యాంధ్ర కవులు పురాణపరివర్తనమును విడిచి విశేష ప్రసిద్ధినందిన సంస్కృత కావ్యముల నాంధ్రీకరింప మొదలిడిరి. నన్నెచోడుఁడు తన కుమార సంభవమున నుద్భటుఁడను సంస్కృత కవి రచించిన కుమారసంభవమును బేర్కొనెను. కాని యాతఁడా కావ్యము నందలి వర్ణనములను గుమారసంభవము నందలి వానిని వలె నెచ్చట నైనను గ్రహించి యుండెనేమో కాని దాని ననుపదముగ ననువదించిన వాఁడు మాత్రము కాదు. కాఁగా సంస్కృత కావ్య పరివర్తనకుఁ బ్రప్రథమమున నారంభించిన వాఁడు శ్రీనాథుడు. ఇతఁడు శ్రీహర్షుని నైషధము నాంధ్రీకరించుటయేకాక హరవిలాసము నందుఁ గుమారసంభవమునందలి శ్లోకములఁ బెక్కింటి నాంధ్రీకరించెను. ఈతని

యాంధ్రీకరణమునకును గవిత్రయము వారి యాంధ్రీకరణమునకును విశేష తారతమ్యము కలదు. ఇతని పద్ధతి కవిత్రయము వారిదివలె నతి స్వతంత్రము కాదు. ఔచిత్యంబు పాటించి యనౌచిత్యంబు పరిహరించి యతిమనోహరముగ నాంధ్రీకరించుచు వచ్చినను ఇతఁడు మూల గ్రంథమునందలి శ్లోకములను సన్నిహితముగా ననుసరింపక మానినవాఁడు కాఁడు. సీసపద్యములం దితఁడు స్వకల్పిత పాదములఁ బ్రవేశపెట్టిన చోట్లును, గ్రంథకర్త యభిప్రాయము గూఢముగా నున్నప్పుడు దానిని స్వేచ్ఛగా వివరించిన పట్లును, నచ్చటచ్చటఁ గలవు. మొత్తము మీఁద నితనిపరివర్తనము కవిత్రియము వారి దానివలె నతి స్వతంత్రమును, నథునాతనుల నాటక పరివర్తనముల వలె మక్కీకి మక్కీయును గాక మూలభిన్నము కాని స్వతంత్రి పరివర్తనమై విలసిల్లుచున్నది. పురాణకావ్యపరివర్తనము సాగిన తరువాత నాటకములు పరివర్తింపఁబడుట సహజ పరిణామక్రిమము. శ్రీనాథ యుగము నందలి కవులు నైసర్గికమైన యీ క్రిమమును పరిశీలింపక పోయినవారు కారు. శ్రీనాథుని పరివర్తన పద్ధతినే యవలంబించి వీరు ప్రిసిద్ధములయిన సంస్కృత నాటకములఁ గొన్నిటి నాంధ్రీకరించిరి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రిుఁడు తన శృంగార శాకుంతలమునఁ గాళిదాసుని శాకుంతలము నందలి శ్లోకములఁ గొన్నిటిఁ దెనిఁగించి యచ్చటచ్చటఁ జొప్పించెను. నందిమల్లయ ఘంట సింగనలు వేదాంతపరమయిన ప్రిబోధచంద్రోిదయమును సంపూర్ణముగ ననువదించిరి. రాజశేఖరుని విద్ధ సాలభంజిక యేకదేశముగనో, పూర్ణముగనో మంచన కేయూరబాహు చరిత్రమున ననూదితమని యనుకొనుట కాధారములు పెక్కు గలవు.

కాని యీ పరివర్తనమునం దొక విశేషము కానవచ్చుచున్నది. పురాణ పరివర్తకులు గాని, కావ్యపరివర్తకులు గాని మూల గ్రంథముల నాంధ్రీకరించుచో వాని యాకృతులం దెట్టి మార్పును గావించియుండలేదు. వర్ణన భావముల విషయమున వారు కొంత స్వాతంత్ర్యము వహించినను ఆకృతిజోలికి మాత్రము పోయినవారు కారు. ఈ నాటక పరివర్తకు లట్లుకాదు. వీరు నాటకములను యథారూపముగా నాంధ్రీకరింపక ప్రిబంధములుగా నాంధ్రీకరించియుండిరి. దీనితో సాదృశ్యముగల విషయ మాంధ్ర వాఙ్మయమునందు మఱియొకటి కలదు. కేతన సంస్కృతమున దండి విరచితమైన దశకుమార చరిత్రిము నాంధ్రీకరించుచు దాని రూపము నిట్లే మార్చియుండెను. సంస్కృతమున గద్యరచితమైన యీ గ్రంథము నాతఁడు పద్యమయ కావ్యముగాఁ జేసెను. గద్యమైనను, బద్యమైనను రసాత్మకమయిన వాక్య ప్రపంచము కావ్యమే యగు ననువిషయము నెఱింగియును కేతన యీ గ్రంథము నట్లుమార్చుట

కప్పటి వాఙ్మయ పరిస్థితులే కారణములై యుండును. కేతనకుఁ బూర్వముండిన కవుల రచనలలో నెడనెడఁ బద్యములతోపాటు గద్యముకూడ వ్రాయఁబడి యుండినను అంతము గద్య మయమైన కావ్య మొక్కటియు లేదు. వాఙ్మయమునం దపూర్వమైన క్రొత్తమార్గము నొకదానిని ద్రొక్కుటకుఁ గాని పద్యమయ కావ్యమునం దభిమానము సూచముట్టుగా విడుచుటకుఁ గాని కేతనకు మన సొగ్గియుండదు. అట్లే యా నాటక పరివర్తకులు గావించిన మార్పునకును బ్రబలమయిన హేతువు లుంటి తీరవలయును. వీరి పరివర్తనము ఉన్నంతవఱకు శ్రీనాథుని పద్ధతినే యనుసరించి యుంట నాతి మూలమును, నాతి స్వతంత్రమును నై మిక్కిలి మనోహరముగా నున్నది. ఆంధ్ర వాఙ్మయమున కా భాగ్యము లేకపోయెను గాని వారే యీ పద్ధతిని సంస్కృత నాటకముల నాంధ్ర నాటకములుగా ననువదించి యుంచినచో సంస్కృతనాటకముల యంద మాంధ్ర పరివర్తనములఁ గొఱవడిన దను కించలేక యాంధ్రులు తద్రసమును మన సారఁ గ్రోలి యానందించి యుండెడివారే !

పాల్కురికి సోమనాథుని రచనలలో దృశ్య కావ్యప్రశంస కలదు. శివరాత్రి జాగరణము సందర్భమున వేడ్కలు, వినోదములు, ప్రదర్శనములు బహువిధములుగ నుండె నని యాతఁడు వర్ణించి యున్నాఁడు.

"ప్రమథపురాతన పటుచరిత్రములు
క్రమమొందఁ బహునాటకము లాడువారు
భారతాది కథలఁ జీరమరుగుల
నారంగ బొమ్మల నాడించువారు"
"వెండియు భవు బహువిధ చరిత్రము ల
ఖండితగతి నాటకంబు లాడుచును"

మున్నగు వాక్యముల వలన నప్పుడొక విధమయిన నాటక ప్రదర్శనము లుండెడి వని విదిత మగుచున్నది. అప్పుడు "తోలుబొమ్మల నాడించుచు భారతాది కథలను బ్రదర్శించుట, వీధి భాగవతములను బోలు ననేక విధములగు ప్రదర్శనములలో శివుని బహువిధ చరిత్రములను నాటకములుగాఁ జేసి యాడుట మొదలగు వేడ్కలు జరిగినవి. దీనివలన నాటకరచనయుఁ బ్రదర్శనమును గూడ నా కాలమున జన సామాన్యమునఁ బ్రబలముగనే యుండె నని తెలియుచున్నది. అది యిటీవలి కాల మునఁ బ్రదర్శింపఁబడు వీథినాటకములను బోలియుండునని సోమనాథుని వర్ణనలను బట్టి మన మూహింపవచ్చును. ఆంధ్రలోకమున నిట్టి నాటక ప్రదర్శనములు పండిత

పామర జనుల కా కాలమునుండియు నానందమును గూర్చుచున్నవి కనుకనే కాఁబో లును శిష్టకవులు 19 వ శతాబ్దివఱకును నాంధ్రమున నాటకరచనాభారమును వహింప లేదు."

నాటకముల మాట యిట్లుండఁ గవి సార్వభౌముఁడగు శ్రీనాథుని రచనముగాఁ బ్రసిద్ధి గాంచిన వీథి నాటక మొండు కానవచ్చు చున్నది. దశరూపకములలో నొకటి యైన వీథికి లాక్షణికు లొసఁగిన లక్షణము దీనఁ గానిపింప దనుట నిర్వివాదము. ఇందు శృంగార రసాలంబనములును, నసభ్యములును నగు చాటుపద్యములు కొన్ని గలవు. మహాకవి యైన శ్రీనాథుడు వీధీ లక్షణము నెఱుంగక యుండఁడు; ఎఱిఁగి యెఱింగి యీ రీతిగాఁ గొన్ని పద్యములు రచించి వీథి యను నామము పెట్టియు నుండఁడు. వీథి యను నామ మా పద్య సముదాయమున కవాంతరముగాఁ గలిగి యుండ నోపు. లేదా పలువురు పండితులు సందేహించున ట్లిది శ్రీనాథ రచితమే కాక మఱి యెవ్వరిదో యయ్యు శ్రీనాథుని పేరఁ బరఁగు చుండవచ్చును. శ్రీనాథుఁడు భీమఖండమున యక్షగానములఁ పేర్కొని యుండెను*. దీనిని బట్టి యాతని కాలము నకే యక్షగానము లనఁబడు దేశినాటకము లున్నట్లు తెలియుచున్నది. తంజాపూరు మధుర నాయకుల కాలమున నీ దేశినాటకములు విరివిగా రచింపఁబడి ప్రవర్తితము లయినవి. రచనలో వీనికిని సంస్కృత నాటకములకును బోలిక కానరాదు.

ఇట్లు పదునేఁడవశతాబ్ది యారంభము వఱకును దెనుఁగున స్వతంత్ర నాటక ములు గాని, సంస్కృతనాటకముల యథా రూప పరివర్తనములు గాని వెలువడి యుండలేదు. ఈ కారణముచే నంతకుఁ బూర్వమున నున్న యాంధ్రకవులు రస దోహలములగు సంస్కృత నాటకముల యౌత్కృష్ట్యమును గమనించి యుండలేదని కాని, తామై స్వతంత్ర నాటక సృష్టి చేయఁ గడంగుటకుఁ దగిన సామర్థ్యము లేని వారని కాని మనము తలంచుట పొరపాటు. పూర్వ కవులలోఁ బెక్కు రీ యుత్తమ సృష్టికిఁ గావలసిన ప్రతిభా సామర్థ్యములు కలవా రయ్యు ననివార్యములగు కొన్ని కారణములచేఁ దద్రచన విషయమున నౌదాసీన్యము వహించి యుందు రనుటకుఁ బెక్కు నిదర్శనములు కలవు. కథోపాఖ్యాన రచన కౌశలమే ప్రధానముగఁ గావలసిన భారతమువంటి యితిహాసమునందుఁ గూడఁ బ్రతిఘట్టమునందును నాటక సరణు లచ్చొత్తించిన తిక్కన స్వతంత్ర నాటకము నొకదానిని రచింపఁ బూనకుండుట కాతని శక్తిలోపమే ప్రధాన హేతు వని యనుకొనుట మిక్కిలి పరిహాసపాత్ర మగును. రూపమునఁ గాకపోయినను గుణపరంపరచే నాటకమే యనిపించుకొనుచున్న ప్రభావతీ

*క్రీడాభిరామము రెవ్వాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి 3-63.

ప్రద్యుమ్నము నంత నిపుణముగ నిర్మించిన పింగళి సూరన నాటక మొందు వ్రాయఁగడంగమికి నుపజ్ఞాలోపము కంటె భిన్నమైన హేత్వంతరమును సూచించుట లెస్స. ఇట్లే శ్రీనాథాద్యన్యకవీశ్వరులు సైత ముత్తమ నాటక రచనోత్సాహమును గానిపించకుండుటకుఁ బ్రజ్ఞాభావము కాక వేఱు నిమిత్తములు బలవత్తరములై యుండ వలెను. ప్రతిభాశాలులగు కవులు గ్రొంగ్రొత్త పోకడలఁ బోయి తమ బుద్ధివైశిష్ట్యముచే నవనవ కావ్యభూజముల మొలిపించి తద్రస పరిమళములచే వాఙ్మయ మహావనములఁ బరితోవాసితములఁ గావింతు రనుట సుప్రసిద్ధమే. పై మూగురు కవుల ప్రతిభయుఁ బ్రధానముగా నాటకోచితము. సంస్కృత నాటకముల సారమును బర్యాప్తముగ నాస్వాదించిన యీ మహాకవులు స్వతంత్ర నాటకములను బరిమితముగనైన సృష్టించి యుండవలసినది. వీరేకాదు, మన పూర్వకవు లందఱును సంస్కృత వాఙ్మయ పయోధిపారమును ముట్టినవారే. దీనికి వీరాంధ్రమునకుఁ బరివర్తించిన సంస్కృత గ్రంథజాలమే తార్కాణము. కొంచె మించుమించుగా వీరు సంస్కృతమునఁ గల ప్రసిద్ధ కావ్యముల నన్నింటిని దెనిఁగించిరని చెప్పవచ్చును. అట్టి వీరు స్వతంత్రముగా నాటకముల వ్రాయ కుండినను రసనిధానములై కావ్యముల నుత్తమము లని యెన్నఁబడుచున్న సంస్కృత నాటకములలో నొక దానినిగూడఁ దెనుఁగున నావిష్కరింపమి మిక్కిలి విస్మయావహము. కొందఱు సంస్కృత నాటకముల పరివర్తనమును బ్రారంభించియు వాని రూపమును మార్చి ప్రబంధములుగా ననువదించుట చూడ నాటకరూపరచనమున కా కాలమున నేవియో యనివార్యములైన యాటంకము లుండవలయు ననుట నిర్వివాదము.

సంస్కృత నాటకములలో నొండు రెండు తక్కఁ దక్కిన వన్నియు శృంగార రసప్రధానములు. మత ప్రచారమే ప్రయోజనముగాఁ గల ప్రబోధచంద్రోదయము వంటి నాటకము లంతకు ముందు లేవు. తెనుఁగు వాఙ్మయము యొక్క పుట్టుక యా నాఁటి పరిస్థితులనుబట్టి చాలవఱకు వైదిక మతోద్ధరణముతో సంబంధించి యుండుట సంభవించెను. అప్పటి యాంధ్రసమ్రాట్టులు కూడ దానికొఱకే విశ్వ ప్రయత్నములు చేయుచుండిరి. అట్టియెడ పంచమ[illegible]ద మనఁబరఁగి సర్వధర్మ సమన్వయ సంధాన క్షమము లగు భారతము వంటి యుత్తమ గ్రంథముల యొక్క పరివర్తనమే మిక్కిలి యావశ్యకమై కనుపట్టెను. అందుచేతనే శ్రీనాథుని యుగము వఱకును గల తెనుఁగు వాఙ్మయము మత ప్రచారమున కనువగు పురాణముల పరివర్తనము తోడనే భాసిల్లు చుండెను. పైఁగా శ్రీనాథునికిఁ బూర్వముండిన యాంధ్ర కవులలో నన్నెచోడుని వంటి స్వతంత్ర కావ్యకర్తలు తక్కువ. వాఙ్మయారంభమున

నాద్యులయిన నన్నయాదుల మార్గమును వీడి నాటక పరివర్తన మారంభించి భిన్న మార్గమును దొ్రిక్కుట కప్పటి కవులకు ధైర్యము చాలినదికాదు.

సంస్కృత నాటకములలో సంస్కృత ప్రాకృతములకు రెంటికిని విరివియైన యుపయోగము కలదు. సంస్కృతము వలెనే పా్రికృతము కూడఁ బూర్వవై యాకర ణులచే నిబద్ధమై నియమితమై యుండుటచే నది సంస్కృతముతోపాటు స్వతంత్రమై కావ్యములయందు నిరాక్షేపముగ నుపయోగింపఁబడుచు నొక ప్రిత్యేక భాషగఁ బరిగ ణింపఁబడు చున్నది. అంతియకాక సంస్కృత లాక్షణికులు నాటక నిర్మాణమునఁ బాత్ర లుపయోగించు భాష విషయమునఁ గొన్ని నియమముల నేర్పఱిచిరి. బ్రాహ్మణు లును, నాయకులును, రాజులును శుద్ధ సంస్కృతము నుపయోగింతురు. స్త్రీలును, నీచజనులును బ్రాకృతము నుపయోగింతురు. మరల నీ ప్రాకృత ప్రయోగ విషయ మునఁ గొంత వేఱుపాటు కలదు. కులీన లగు స్త్రీలు గీతములలో మహారాష్ట్రి పా్రికృతము నుపయోగింతురు. సాధారణ సంభాషణమున వీరును, బాలాదులును, సేవకులును శౌరసేని నుపయోగింతురు. అంతఃపుర పరిచారకులు మాగధిని, నీచ సేవకులు పైశాచిని వాడుదురు. ఇట్లా యా పాత్రిల యంతరములనుబట్టి సంస్కృత నాటకములలో భాషాప్రియోగము నియమితమై యున్నది. సర్వసాహిత్య మార్గము లందును సంస్కృత ఫక్కినే యనుసరించు నలవాటుకల తెనుఁగువారి కీ నిబంధ నము కొంత యాటంకము కల్గించినది. ఏలయన సంస్కృత ప్రాకృతముల వలెఁ దెలుఁగున గ్రాంథికగ్రామ్య భాషలు రెండును వ్యాకరణ పరిసంస్కృతములై యుండ లేదు. తెలుఁగున గ్రామ్యమునకు స్థిరమైన యాకృతి లేదు. కాఁగా సంస్కృత నాటక కర్తలు పా్రికృతమును, దద్భేదములను నుపయోగించిన చోటులలోఁ దెలుఁగువా రెట్టి భాషావిశేషము నుపయోగింపవలెనో స్పష్టపడి యుండదు. పోనీ, లాక్షణికులు చెప్పిన యా ఒక్క నిబంధనము నుల్లంఘించి సర్వపాత్రిలకు నొకటేభాష నుపయో గించి నాటక రచనకుఁ గడంగుటకుఁ బూర్వాంధ్రకవుల కంత నిరంకుశత్వమును, స్వాతంత్ర్యమును లేకపోయెను. దీనికి ఫలితమే తెలుఁగున నాటకములు తరుణములో వెలువడకుండుట.

సంస్కృత నాటకములయినను బ్రసిద్ధములయినవి సంఖ్యేయములే. అవి పదవ శతాబ్దికిఁ బూర్వ మేమిబ్రాయఁబడెనో కాని తరువాత వాని నంత విరివిగా వ్రాయఁ గడింగిన వారు చాల తక్కువ. వ్రాయఁబడిన నాటకములలోఁ గూడ ప్రబోధచంద్రో దయము వంటి నాటకము లేయొకటి రెండో తక్కఁ దక్కినవి ప్రసిద్ధికి రాలేదు. ప్రాచీనసంస్కృతనాటకములు కాళిదాసాదులకాలములో నప్పుడప్పుడు ప్రిదర్శింపఁబడు

చుండిన నుండవచ్చును. కాని తరువాత వానిని బ్రదర్శింపఁ బూనినవా రెవరును లేరు. ఏలయన సంస్కృత నాటకములు బహుభాషా భూయిష్ఠము లగుటచే విద్వత్సామాజిక పరిషత్తుల కొఱకే యూహింపఁబడినవి. కాని నిరక్షరులయిన సామాన్యజనుల కొఱకుఁగాదు. అదిగాక పదియవ శతాబ్దికిఁ దరువాత - అంతకుఁ బూర్వమునుండి నైతము - దేశభాష లధిగమించుచు వచ్చిన యధిక ప్రాధాన్యము కతమున సంస్కృతమునకుఁ బ్రాముఖ్యము తగ్గుచుండెను. ఈ కారణములచే సంస్కృత నాటకముల ప్రదర్శనము లేకుండె ననియే చెప్పవచ్చును. అట్టి ప్రదర్శనము లుండినచో వానిని జూచినప్పుడయిన నాంధ్రకవులకు నాటకరచనాభిలాష కలిగియుండెడి దేమో !

నాటకము గద్య పద్యమయమై సారస్వత ప్రయోజనమునేకాక (Literary purpose) రంగ ప్రయోజనమును గూడ (Theatrical purpose) నిర్వహించు కావ్య విశేషము. ఈ ప్రయోజన ద్వితయమునం దేది కొఱవడినను నది సమగ్రమైన, శ్రేష్ఠమైన నాటకము కాఁజాలదు. శ్రవ్య కావ్యములుగా మాత్రము చదివి యానందింపఁ దగిన ప్రబోధచంద్రోదయాది నాటకములలో నిట్టిలోపము కొంతవట్టు కానగును. శ్రవ్య కావ్యములయందు మనోనయన గోచరము మాత్రమే కాఁదగు కథాజగత్పాత్రలు దృశ్య కావ్యములయందుఁ జర్మచక్షుర్గోచరములగు చుండుటచే నిష్పాదిత మగు ప్రత్యక్షతయే "కావ్యేషు నాటకం రమ్యం" మ్మను నానుడికి ముఖ్య కారణము. శ్రీనాథుఁడు హర్షనైషధము నాంధ్రీకరించి యాతని తరువాతఁ దండోపతండములుగ వెలువడిన ప్రబంధము లనునొకజాతి వాఙ్మయమున కావర్శభూతుఁ డయ్యెను. ఈ ప్రబంధములు కూడ గద్య పద్యమయములై దండిచే నిర్వచింపఁబడిన చంపూ కావ్యజాతికిఁ జేరును. వర్ణన ప్రధానములే యయ్యు నివి శృంగారాది రస పరిపోషకములై హృద్యముగ నుండును. కాని నాటకములలోఁ గాననగు సంవాద క్రమముగాని, యవి నిర్వహింపఁగల రంగ ప్రయోజనముగాని వీనియందుఁజూపట్టవు. పూర్వాంధ్ర కవులు రంగ పరికర సాహాయ్యముచేఁ ప్రయోజితములయిన సంస్కృత నాటకములను గాని, యాంధ్రనాటకములను గాని చూచి యానందించి యెఱుఁగరు. అందుచేఁ గించి దూనముగా నాటకాకృతినే వహించిన బ్రబంధములఁ బఠించి తదాస్వాది తానందానుభవము చేతనే సంతుష్టులయిరి. ఈ కారణము చేతనే పినవీరభద్రాది కవులు సంస్కృత నాటకములను బ్రబంధములుగా ననువదించిరి. దీనినిబట్టి వీరు నాటకములను శ్రవ్యకావ్యములు గానే చూచి వాని సారస్వత ప్రయోజనముతో మాత్రమే తుష్టినొందిరని స్పష్టపడుచున్నది.

విజయనగర వినాశానంతరము తంజావూరు మధుర సంస్థానములు ప్రసిద్ధికి వచ్చెను. ఈ సంస్థానముల నాయకులు వాఙ్మయాభిరుచి కలవారై యనేక కావ్యములను దాము వ్రాసియుఁ, దమ యాశ్రితులచేత వ్రాయించియు నాంధ్రభాషను సర్వవిధముల నభివృద్ధిచేసిరి. వీరి పోషణమున యక్షగానములు విరివిగా రచింపఁబడి ప్రదర్శింపఁబడుచుండెను. ఈ యక్షగానములు "జక్కుల పాటలు" అను తెనుఁగు పదమునకు సంస్కృతరూప మని పండితు లూహించుచున్నారు. వీని ప్రాచీనతను నిర్ణయించుటకుఁ దగిన సాధన సామగ్రి యిపు డందుపాటులో లేదు. తొలుఁదొలుత నివి సత్కవిరచితములు కాక నటులచేతనో, మఱి యే స్వల్పపాండిత్యము కలవారిచేతనో వ్రాయఁబడిన వచనరూప సంబంధముకల పురాణ పద్యములతో విలసిల్లు చుండెను. తరువాత వీనిని జను లాదరించుటచే విద్వత్కవులు గూడ స్వతంత్రముగా నిట్టివానిని వ్రాయ నారంభించిరి. వీనిలోఁ గూడఁ బలుతెఱఁగులు కలవు. అందు సూచిపూఁడి వారు ప్రఖ్యాతిలోనికిఁ దీసికొని వచ్చిన యభినయ ప్రధానములయిన కలాపము లొక విధము. ఈ యక్షగానము లన్నియుఁ బద్యగద్యగేయమయములై సూత్రధారునిచే నుచ్చరింపఁదగిన యుపోద్ఘాతపూర్వకములైనట్టియుఁ, బాత్రప్రవేశ సూచకములైనట్టియు వచనములతో నిండియుండును. కాని వీనిలో నేదియు రసవస్తునాయక స్వరూపములయందు స్థిరత్వము గాంచినవి కాదు. ఇవి శుద్ధ దేశి మార్గమునకుఁ జెందినవి. రూపమునందుఁగాని, లక్షణమునందుఁగాని సంస్కృత నాటకములకును వీనికిని సన్నిహిత సంబంధ మేదియుఁ గానరాదు.

ఇప్పు డిప్పుడు మన భాషలో వెలయుచున్న నాటకములకు సంస్కృత రూపకములే యాదర్శములు. యక్షగానములే యిట్లు పరిణమించిన వనుకొనుట పొరపాటు. ఇంకను ఈ యక్షగానములు కాలక్రమమున మాఱి రూపమునందుఁ గించిద్భిన్నములే యయ్యును హరికథలుగాఁ బరిణమించిన వనుకొనవచ్చును. ఇట్టివి పాల్కురికి సోమనాథుని కాలము నుండియు వ్రాయఁబడి యప్పు డప్పుడు ప్రదర్శింపఁ బడుచుండుటచే నప్పటివారు వీని ప్రదర్శనముల నవలోకించుటతోడనే సంతుష్టులై సంస్కృత నాటకములను బోలిన నాటకములను మన భాషలో వ్రాయుటకుఁ బూనుకొనరైరి.

పైఁగా నాటకము లాడుటకుఁ గావలసిన నాటకశాలలు కాని, రంగ పరికరములు కాని యప్పు డాంధ్రదేశమున నెచ్చటను లేకుండెను. కృష్ణదేవరాయల వంటి రసికులయిన సార్వభౌములు కూడ శ్రవ్య కావ్య పఠన మాత్రముచేతనే తృప్తి గాంచిరి. కాని దృశ్యకావ్యములఁ గన్నారఁ జూచి యానందింపఁ దగిన యేర్పాటులు కావించి యుండలేదు. కృష్ణదేవరాయలసభలో నృత్యములు జరుగుచుండెనని స్వారోచి

పురప్రవేశ సందర్భమున మనుచరిత్రలో పెద్దనార్యుఁడు రచించిన "చిలుకలకొల్కి-కల్కి యొకచేడియ నాటకశాలమేడపై నిలువున నాడుచుండి" (V-63) అను పద్యము వలనఁ దెలియుచున్నది. కాని యవి నాటకసంబంధులగునో కాదో, యయినను ఆంధ్ర నాటకములకును వానికిని గల సంబంధ మెట్టిదో తెలిసికొనుట కాధారములు లేవు. ఇట్లే తంజావూరు రాజుల కాలమునఁ గూడ నృత్యగీతాది వినోదములకై యొకశాల నిర్మింపఁబడెను. అది "సరస్వతీ మహలు" అనుపేరితో నిప్పటికినినిల్చి యా రాజుల కళాభిరుచిని వేనోళ్ళ నుద్ఘోషించుచున్నది. ఇందుఁగూడ నాటకసంబంధులు కాని నృత్యములును, ఆ కాలమున విరివిగా నుండిన యక్షగానములు భాగవతములు మున్నగువాని ప్రయోగములును జరుగుచుండె ననుట కవకాశము కలదు కాని నాటకములు ప్రయోగింపఁబడె ననుటకుఁ దగిన నిదర్శనములు లేవు.

ఇట్లు నాటక ప్రయోగమునకు ముఖ్యావశ్యకములయిన రంగ పరికరాదులు లేక పోవుటచేతను, నాటక పాత్రధారు లార్యధర్మము ననుసరించి సంఘమున నీచముగఁ జూడఁబడు చుండుట చేతను, ప్రభువులు సైతము నాటకకళ నభివృద్ధిచేయ నంత శ్రద్ధ వహింపక పోవుటచేతను నానాఁటికవు లీ వాఙ్మయశాఖయం దభిరుచి వహించి కావ్యరచనముచే దానిఁ బరిపోషింపఁ బూనుకొనరైరి. ఈ కారణముచేఁ బ్రజాసామాన్యమునకు నాటక ప్రయోగ మెంత నీతిప్రదాయకమో, యెంత యానంద ప్రశాంతి ప్రదమో తెలియక పోవుట సంభవించెను. సంస్కృత నాటక ప్రయోగములు క్షీణించిన తరువాత వీధీనర్తకులయొక్కయు (Street Dancers), వీధీ గాయకుల యొక్కయు (Opera Singers) సంఖ్య యధిక మగుటయు విద్యావిహీనులగు ప్రాకృతజనులు వాని నాదరించుటయుఁ దటస్థించెను. కాని నాగరులును, విద్యావంతులును వీనియెడ నసహ్యాభావమునే ప్రకటించుచుండిరి. ఈ పరిస్థితివలనఁగూడ నాటక వాఙ్మయ మన్నను, దద్రచన మన్నను నాఁటి కవులకు నీరసభావమేకాని గౌరవము లేకపోయెను.

నాటక కళ సంస్కృతమున సమగ్రత్వమును బ్రాపించినది. తల్లక్షణముల సమగ్రముగా వివరించు లక్షణగ్రంథము లందుఁ బెక్కు వెలువడినవి. ఆంధ్రకవులు సంస్కృత కావ్యముల నాంధ్రీకరించినట్లు కొన్ని నాటకముల నాంధ్రీకరింపకపోవుట యటుండ నీ లక్షణ గ్రంథములయినఁ దెలుఁగున వెలయింపరైరి. తెలుఁగుభాషకుఁ దత్కావ్యములకు స్వల్పముగ లక్షణములను వివరించినవారు కూడ నీ రూపకలక్షణమును బరిత్యజించిరి. పదుమూఁడవ శతాబ్దియందలి విన్నకోట పెద్దన తన "కావ్యాలంకార చూడామణి"లో నీ రూపకప్రశంస కొలఁదిగ నైన నొనర్చి యుండలేదు.

పదునాలవ శతాబ్దియందలి భట్టుమూర్తి, "నరసభూపాలీయ" మను పేర విద్యానాథుని "ప్రతాపరుద్రీయ"మును గొంచెె మించుమించుగఁ బరివర్తనము చేయుచు నందలి రూపక ప్రకరణమును విడిచిపై చెను. ఆంధ్రనాటక రచనము కాని తత్ప్రయోగము కాని లేదుకదా దాని లక్షణము నియ్యెడ వివరింపనేల యని యతఁ డద్దాని యెడ నౌదాసీన్యము వహించియుండును. నిజము పరికింప నీలాక్షణికుల యెడఁ గొంచెమైనను దోషము లేదు. లాక్షణికుఁ డున్న గావ్యములను, దదంతర్భాగములను బరికించి వానికి లక్షణము వ్రాయునేకాని లేనివానికిఁ దానై యొక లక్షణము సృష్టించి భావికవు లీ మార్గము ననుసరింపవలెనని శాసించునట్టివాఁడు కాఁడు. అందుచే రూపక నామ వాచ్యములగు కావ్యముల యభావముచే లాక్షణికు లా శాఖ వాఙ్మయమునకు లక్షణము వివరింపరై రి.* లక్షణాభావముచేఁ గవులు రసాశ్రయములయిన రూపకములనురచించి యాంధ్రభాషాయోష నలంకరింప రై రి. ఫలితార్థ మేమనఁగా సాటి దేశభాషలలోఁ బెక్కు అనాఁడే కళాసర్వస్వములయిన రూపకములచే విరాజిల్లుచుండఁగా నాంధ్రమునకు నిన్నమొన్నటిదాఁక నా భాగ్యము లేకపోయినది.

ఇఁక పదునేడవ శతాబ్దిలోని వాఁడగు ఎలకూచి బాలసరస్వతి తాను రచించిన రాఘవయాదవపాండవీయములో "కవిసమీహిత రంగ కౌముదీనామ నాటక విధాన ప్రతిష్ఠాఘనుండ"నని వ్రాసికొనెను. ఈ రంగకౌముది నాటకవిధానమని చెప్పఁబడుటచే నాటక లక్షణములను నిరూపించు నొక లక్షణగ్రంథమై యుండవచ్చును. ఆ గ్రంథము నామమాత్రావశిష్టమగుటచే నందెట్టి నాటకములకు లక్షణము విధింపఁ బడెనో, యే లక్షణమునుబట్టి యది వ్రాయఁబడెనో, లేక యది యేదేని సంస్కృత లక్షణమునకుఁ బరివర్తనమేమో తెలిసికొనుట కవకాశము చిక్కకున్నది. ఆ కాలమున యక్షగానమనియెడి ప్రదర్శనోచితమైన వాఙ్మయభాగము కొంచెము కొంచెముగాఁ దల చూపుచుండె నని యిదివఱకే చెప్పఁబడినది. ఈ రంగకౌముది యట్టివాని లక్షణమును నిరూపించు గ్రంథ మేమోయని సందేహించుటకు వీలు కలదు. లేదా యిదికూడ నట్టి యక్షగానములలో నొకదాని పే రను కొన్నను నంత బాధ లేదు. అది లక్షణ గ్రంథమైనను యక్షగానమైనను దాని నామమును బట్టి పదునేడవ శతాబ్దిలో రంగోద్ధరణమునకై కొంత ప్రయత్నము జరుగుచుండెనని మాత్రము విశ్వసింప వచ్చును.

పదునెనిమిదవశతాబ్ది మొదటివాఁడగు కుందుర్తి వేంకటాచలపతి తాను రచించిన కార్తిక మాహాత్మ్యములో 'చాటుకృతులును బహువిధ నాటకములు........ రచన

* క్రీ. శ. 16వ శతాబ్ది యందలి చిత్రకవి పెద్దన మాత్రము లక్షణ సారసంగ్రహమున నాటక లక్షణములు తెల్పి యున్నాఁడు.

గావించి పాండ్యవిభుచేఁ బ్రభుత్వ సంపదలఁ గనితి' నని వ్రాసికొనెను. ఈతఁడు రచించిన బహువిధ నాటకము లెట్టివో నిర్ణయించుట కవి యుపలభ్యమానములు కావు. పైఁగా నితని ప్రభువులును. రసికులు, కవులు, కవిపోషకులు నైన విజయరంగ చొక్క భూపాలాది పాండ్య భూపతులు కూడ నట్టి నాటకముల నభినయింపఁజేసినట్లు కానఁబడదు. ఈతఁడు వ్రాసిన యీ నాటకములు కూడ నప్పుడు బహుళప్రచారమున నుండిన యక్షగాన భేదములే యయి యుండును. కాఁగా మనమిప్పుడు కాంచుచున్న యాంధ్రనాటకములకుఁ బదునెనిమిదవ శతాబ్దిలో సగమువఱకు బీజారోపణము కావింపఁబడలేదని యూహింపవచ్చును.

పందొమ్మిదవ శతాబ్ది యుత్తరభాగమున విజయనగర పురాధీశ్వరులగు శ్రీ మదానంద గజపతి మహారాజులుంగారు సంస్కృత నాటకముల సారము చూఱలు గొన్నవా రగుటచేఁ దత్ప్రయోగ దిదృక్షువులై నాటకసంఘము నొకదానిని స్థాపించి శాకుంతలాద్యుత్తమనాటకములఁ గొన్నిటి నభినయింపఁజేసిరి. తెలుఁగు దేశమున నాటక ప్రదర్శనము లారంభించుట కదియే ప్రథమమని స్థూలముగాఁ జెప్పవచ్చును. కాని యీ యుద్యమము చాలకాల మవిచ్ఛిన్నముగా సాగినదికాదు. మహారాజుగారి మరణముతో నాయనచే స్థాపింపఁబడిన నాటక సంఘము కూడఁ దూష్ణీంభావము వహింపవలసి వచ్చెను. ఆ కాలమునఁ దెలుఁగు ప్రజలలో నాటకాభిరుచి విస్తరింపఁ జేసిన కొన్ని విశేషపరిస్థితు లంకురించెను. మహారాష్ట్రమునను, దదితర స్థలము లందును అప్పుడు పార్శీ, హిందీ నాటక సంఘములు బయలుదేరి యా భాష యందలి నాటకములను విరివిగాఁ బ్రదర్శింప మొదలుపెట్టెను. ఈ నాటక సంఘములు తమతమ దేశములయందే నాటకములను బ్రదర్శించుటతోఁ దృప్తినొందక తెలుఁగు కన్నడ దేశములకుఁ బోయి కొన్ని నాటకముల నభినయింప నారంభించెను. క్రొత్తగా వచ్చిన ఈ నాటక ప్రదర్శనము లపారమగు జన సంఖ్య నాకర్షించుచుండెను. ఇట్టి ప్రదర్శనములు తాత్కాలికముగా జరుగుచుండుటచేఁ దెలుఁగువారిలో స్వభాషయందుఁ గూడ నట్టి నాటకములు కొన్ని యుండి ప్రదర్శింపఁ బడుచో వాని నుత్సాహముతోఁ జూచుట కభిరుచి జనించెను. ఈ పరిస్థితుల నన్నిటిని బరికించుచుండిన పండితు లప్పుడప్పుడే సంస్కృత నాటకముల నాంధ్రమునకుఁ బరివర్తింప మొదలిడిరి. తొలి దినములలో నాంధ్రవాఙ్మయమువలెనే నాటక వాఙ్మయము గూడ ముందు పరివర్తనము తోడనే ప్రారంభ మగుట యిటఁ బరిశీలింపఁ దగినది.

ఈ నాటకముల పరివర్తన పద్ధతికిని, బూర్వకవుల బరివర్తన పద్ధతికిని విశేష తారతమ్య మున్నది. పూర్వకవులు తగిన స్వాతంత్ర్యము వహించి పరివర్తనములు

నైతము స్వతంత్రములుగాఁ గానిపించున ట్లొనర్చిరి. వీ రట్లు గాక నాటకములందలి పద్యములకుఁ బ్రతిపద పరివర్తనము చేయుట కారంభించుటచే నీ పద్యముల నడక సామాన్యముగాఁ గుంటువడి శ్రుతికటువుగా నుండును. వీరాశ్లోకముల నాంధ్రీకరించు పట్ల నందలి పదములెల్లఁ బరివర్తితము లైనవో లేవో పరిశీలింతురు కాని యందలి భావములు మూలమునందు వలె సులభద్యోతితములై సమగ్రముగా వ్యక్తములైనవో లేదో చూడరు. అందుచే నీ పద్యములు కొన్నిచోట్లఁ గేవల నీరసపదముల సముదాయము వలెఁ దోఁచును. పైఁగా వీరు భావవ్యక్తికంత ప్రాధాన్యము నీయకపోవుట చేతను, మూలము కంటె పరివర్తనము సులభముగ నున్నచోఁ దమ పాండిత్యమునకు భంగము వాటిల్లునను భ్రాంతిచేతను, మూలములోని పదములకంటెఁ గ్లిష్టతరములైన పదముల నీ పరివర్తనములయందు వాడఁ జూతురు. అందుచే మూలసాహాయ్యము లేనిదే వీరి పరివర్తనముల సంపూర్ణభావము చదువరులకుఁ దెలియనే తెలియదు. అనువాదకుఁ డెంత యసామాన్య ప్రజ్ఞ కలవాఁడైనను ననువాదము గుణమునందును, నర్థసౌలభ్యమునందును, రస స్ఫురణయందును మూలమునంత పటువుగా నుండుట దుర్లభము. అందును బైని చెప్పఁబడిన యట్టి దోషములుకూడఁ గొన్ని యుండినచోఁ బరివర్తనములు మూలముతోఁ బోల్చి చూచిన మిక్కిలి నీరసములై కానవచ్చుటలో వింత యుండదు. ఈ కారణము చేతనే తెలుగువారికి సంస్కృత నాటకములు పూర్వ కవులచే నాంధ్రీకరింపఁబడలేదను విచారము.

ఎట్టెనను సంస్కృత నాటకముల పరివర్తనము ప్రారంభ మగుట తోడనే యాంధ్ర వాఙ్మయమున నొక నూతనోత్తేజము పొడసూపినది. ఆ కాలమున మచిలీపట్టణమున నుపాధ్యాయులుగా నున్న శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు నాటకాభావముచే మన వాఙ్మయమునకుఁ గల్గిన కొఱంతను వారింప భట్టనారాయణుని "వేణీసంహార నాటకము" నాంధ్రీకరించిరి. కాని యే కారణముచేతనో యా పరివర్తనము ముద్రితము కాలేదు. వీరు "మధుకరీ మంజరీయ" మను స్వతంత్ర నాటకమును గూడ రచించిరి. తరువాతఁ జెన్నపురి వాసులగు శ్రీ కొక్కొండ వేంకట రత్నము పంతులుగారు ధర్మభట్టకృతమైన "నరకాసుర విజయవ్యాయోగము" ననువదించి ప్రకటించిరి. ఈ కాలముననే విశాఖపట్టణ వాసులగు శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులుగారు కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలము నాంధ్రీకరింప నారంభించి యందలి కొంత భాగమును దాము ప్రకటించుచుండిన మాస పత్రిక ముఖమున వెలువరించిరి. కాని యా గ్రంథ మసంపూర్ణముగ నుండఁగనే యాచార్యులుగారు దివంగతులగుటచే నది యట్లే యుండిపోవలసి వచ్చెను. తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగము

పంతులుగా రానాటకమునే తమ నిసర్గమధురమైన శైలిలో ననువదించి తొలుత వివేకవర్ధనీ పత్రికా మూలమునను, దరువాతఁ బుస్తక రూపమునను వెలయించిరి. వీరిట్లు సంస్కృత నాటకములను మఱి కొన్నింటిని దెలిఁగించుటయే కాక యాంగ్లేయ మహాకవియగు షేక్స్పియరు రచించిన "మర్చెంటు ఆఫ్ వెనిస్" (Merchant of Venice), "కామెడీ ఆఫ్ ఎర్రర్సు" (Comedy of Errors) మున్నగు నాటకములను గూడఁ దెలుఁగునకు దర్జుమా జేసిరి. ఈ కాలముననే శ్రీ గురుజాడ రామమూర్తి పంతులుగారు, శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు మొదలగు మఱికొందఱు పండితులు సంస్కృతాంగ్లములనుండి మఱికొన్ని నాటకముల ననువదించి ప్రకటించిరి. వీరేశలింగము పంతులుగా రిట్లు నాటకములను రచించుటయే కాక యొక నాటక సంఘమును కూడ స్థాపించి తమ రత్నావళిని, భ్రమప్రమాద ప్రహసనమును నప్పుడప్పుడభినయింపఁ జేయుచుండిరి. ఇట్టి సంఘములు మఱికొన్ని విశాఖపట్టణము, విజయనగరము మొదలగు పెద్ద పెద్ద పట్టణములలో స్థాపింపఁబడి యచ్చటి ప్రజలను పరివర్తిత నాటకములచే నానందింపఁ జేయుచుండెను. గుంటూరులోని శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యముగా రిట్టి సంస్థనే యొకదానిని నెలకొల్పి తాము గావించిన పరివర్తనములను బౌరాణిక కథావస్తు విలసితములగు స్వతంత్ర నాటకములను బ్రవర్తింపఁ జేయుచుండిరి.

ఈ కాలముననే (క్రీ॥ శ॥ 1880 మొదలు) బళ్ళారి నగరమున సరసవినోదినీ సభ యనియు, సుమనోరమాసభ యనియు రెండు నాటక సంఘము లేర్పడి మిక్కిలి సమర్థులును, నాటక రచనా ప్రదర్శనములయం దసమాన ప్రతిభాశాలులును నగు నిరువురు న్యాయవాదులచే జయప్రదముగాఁ గొనసాగింపఁబడుచుండెను. వీరిరువురును సంస్కృత నాటకములఁ బరివర్తించు జోలికిఁ బోక చరిత్రనుండియుఁ, బురాణ ప్రబంధములనుండియు వస్తువులను గ్రహించి పెక్కు నాటకములను రచించిరి. ఆంగ్ల గీర్వాణాంధ్ర భాషలయం దసమాన వైదుష్యము కలవారగుటచే వీరి నాటకములయం దాంగ్ల సంస్కృత సరణులు రెండును గానవగును. ఆంగ్ల భాషా సంప్రదాయము ననుసరించి యిరువురును విషాదాంతనాటకములు (Tragedies) రచించిరి. వానిలో రామకృష్ణమాచార్యుల విషాద సారంగధరమును, శ్రీనివాస రాయల విజయనగర రాజ్యపతనమును నాంధ్రులందఱు నెఱింగినవే. ఈ కవు లిరువురును గొంచె మించుమించుగా సమకాలికులును సహ పౌరులును నగుట వీరిని గూర్చి యొక విషయము చెప్పవలసియున్నది. అది వీరి నాటక వస్తువుల సమానభావము. పరస్పర స్పర్ధచే వలె వీరిలోనొకరు నాటకీకరచించిన వస్తువునే రెండవవారును మరలగ్రహించి నాటకముగా

వ్రాయుట కాననగును. వీరిరువురును మంచి నటకులుకూడ నగుటచేఁ దమ రచించిన నాటకములను దాము స్థాపించిన నాటక సమాజములచే బళ్ళారి, మదరాసు, మున్నగు పట్టణములలోఁ బ్రదర్శింపఁజేయుచుండిరి. వీరు రచించిన నాటకములు పెక్కు అము ద్రితములైనను నప్రదర్శితములైనవి తక్కువ. ఆంధ్ర నాటక వాఙ్మయమున కింత రూపమొసంగి ప్రాణము పోసిన యీ మహనీయ మూర్తు లిరువురు నాంధ్రులకుఁ జిరస్మరణీయులు. / అచ్చటచ్చట నాంగ్ల నాటక పద్ధతుల ననుకరించిన వీరి నాటకములలో సంస్కృత నాటక ప్రాతికూల్యము కొంత కానవచ్చుటచేఁ బండితులకు వీరి నాటకములపై నంత యభిమానము కలుగకుండినను బ్రదర్శన కాలమున నవి యాకర్షించు ప్రేక్షక సమూహము వాని యభిరంజకత్వమును జెప్పక చెప్పుచున్నది. ఏ కారణము చేతనో శ్రీనివాస రాయల నాటకములకుఁ గృష్ణమాచార్యులవారి నాటకముల కున్నంత వ్యాప్తి కానరాదు. వారు రచించిన నాటకము లన్నిటిలో విజయ నగర రాజ్యపతనము మాత్రమే యెడపదడప ప్రదర్శింపఁబడుట కాననగును. ఆచార్యులు గారి * నాటకములలోఁ బ్రదర్శనానుకూల్యము మెండగుటచేఁ గాఁబోలును జనాదరము పడయని నాటకమే లేదు. ఇట్లు నాటకము లనినఁ దెలుఁగు ప్రజలకును, గవులకును విశేషాభిరుచిని గలిగించిన యీ పార్శీ నాటక సంఘములు ప్రశంసనీయములు. తరువాత బయలుదేరిన కవులు కేవల పరివర్తనములతోఁ దృప్తిపడక సంస్కృత మార్గానుసారముగనే కొన్ని స్వతంత్ర నాటకములను వ్రాయఁబూనిరి. ఆధునికులు వ్రాయుచున్న దృశ్యకావ్యములలో నింతింతన రాని వైవిధ్యము గోచరించుచున్నది. అందు సాంఘిక నాటకములు, విషాదాంతములు, ఏకాంకికలు, గేయ నాటికలు, శ్రవ్యనాటికలు ముఖ్యములైనవి. వీని యన్నింటియందు నాంగ్ల పాశ్చాత్య రూపక ప్రభావము పొడగట్టుచుండును.

---

* ధర్మవరము కృష్ణమాచార్యులు గారు.

# 2. ఆంధ్రనాటక పితామహుని
# నాటకములు - వాని మూలములు

## I

సంస్కృత వాఙ్మయ విభాగములలోఁ జొచ్చిన కొలఁది శిల్ప సంపదలు చూఱలొసంగు నమూల్యమైన నిధులు నాటకములు. వీని నిర్మాణమును గూర్చియు, పరికరములను గూర్చియుఁ బరిశోధించి ప్రప్రథమమున ప్రపంచమునకుఁ దెల్పినవాఁడు భరతాచార్యుఁడు. ఇతని నాట్యశాస్త్రమునందలి సూత్రముల ననుసరించియుఁ, దద్భిన్నముగను దరువాతఁ బెక్కు గ్రంథములు వెల్వడినవి. వానిలో (ధనంజయుని) దశరూపకము, సాహిత్య దర్పణము, ప్రతాపరుద్రీయము ముఖ్యములు. ఈ గ్రంథములన్నియు నాటకమునకుఁ బ్రధానాంగములయిన రస వస్తు నాయకాదులఁగూర్చి సూక్ష్మాతి సూక్ష్మ వివరములతోఁ గూడ వర్ణించియున్నవి. భరతుని నాట్యశాస్త్రము దక్క మిగిలినవన్నియు, సంస్కృత వాఙ్మయమున సుప్రసిద్ధములయిన పెక్కు నాటకముల యుత్పత్తికి ననంతరమే వ్రాయఁబడియున్నను, లక్ష్యలక్షణ సమన్వయము కొఱకంతగాఁ బ్రయత్నించినవి కాకపోవుటచే నాట్యశాస్త్రమునందలి సూక్ష్మ విషయములను, అంతర్భాగములను, అంతంతకుఁ బెంపు చేసినవే కాని తగ్గించి యుండలేదు. ప్రధానాంశములలో వీనికిని నాటకములకును గొంచె మించుమించుగ సామరస్యము కుదురును గాని యంతర్భాగముల విషయమున మాత్రమున నట్లుకాదు. అసలవి యన్నియునుండునట్లుగా నాటకమును వ్రాయుట మిక్కిలి దుర్ఘటము. ఎవ్వఁడేని వ్రాయ సాహసించినను, అయ్యది కృత్రిమముగానే యుండునుగాని సహజమైన రససిద్ధిని గలిగించి తీరునని దృఢముగాఁ జెప్పలేము. వీని యభావము రససిద్ధికి ఆటంకము కాదనుటకుఁ గాళిదాసాదుల నాటకములే ప్రబల ప్రమాణములు. మొత్తముమీఁద, లక్ష్యముల నుండి లక్షణములలోనికి వచ్చినవి కాక కేవలము లక్షణ సిద్ధములే యగుట చేతను, ఏకత్రమాత్ర దృష్టములు సర్వసామాన్య శాసకములుగా పరిణమించుట చేతను, ఈ సంస్కృత నాటక లక్షణములు కొంతవఱకు కృత్రిమముగాఁ గానిపించును. లక్షణ భంగమునకు మైకొనని సంస్కృత మహాకవులు వ్రాసిన నాటకములలోనే యీ నియమములన్నింటిఁ గన్గొనుట దుర్లభము. ఒక్కయెడ నెటనైన నున్నచో నది ఘుణాక్షర న్యాయము చేతనే.

ఇఁక సంస్కృత నాటకముల మాటయే యట్లుండఁ దెలుఁగు నాటకముల విషయము వేఱే చెప్పనక్కఱ లేదు. తెలుఁగున వెలువడిన లక్షణ గ్రంథములలోఁ జాల భాగము సంస్కృత లక్షణములకు భాషాంతరీకరణమే కాని లక్ష్యపరిశోధనముచే నేర్పడిన స్వతంత్ర రచన కాదు. అందును, ఆంధ్రనాటకముల యుత్పత్తి యనేక కారణములచే నాలస్యముగ జరిగియుండుటచే వాని లక్షణమునకై యాంధ్రమున వెదకవలసిన పనిలేదు. తొలుఁదొల్త వెలువడిన యాంధ్రనాటకములు సంస్కృత నాటకముల పరివర్తనములే. తరువాత పురాణ కథల గ్రహించి స్వతంత్రములుగా నాటకములు వ్రాసినవారు సంస్కృత లక్షణమునే యనుసరించిరి. వీరి నాటకములును సంస్కృత నాటకముల వలెనే లక్షణ విషయమున సమగ్రములు కావు. అవి యలఁతి యలఁతి మార్పులతోఁ గూడిన సంస్కృత నాటకానుకరణములు.

సంస్కృత నాటకము కాళిదాస భవభూతి ప్రముఖుల చేతులలోవలెనే యాంగ్ల నాటకము షేక్స్పియరు, బ్యూమంటు, ఫ్లెచ్చరు మొదలగువారిచేతులలోఁ బరిపూర్ణత్వమును ప్రాపించినది. సంస్కృత నాటక లక్షణమునకు భరతాచార్యుఁ డెట్లాది పురుషుఁడో యాంగ్లనాటకములకేకాక, మొత్తము పాశ్చాత్య నాటక లక్షణమున కంతకును 'అరిష్టోటలు' అట్లు. కాళిదాసాదుల నాటకములలో భరతాచార్యుని సూత్రములలోని నియమములు పెక్కిటికి, ఆకాలపరిస్థితులనుబట్టియు, కవుల స్వాతంత్ర్యమునుబట్టియు వ్యతిక్రమము సంభవించినట్లే యరిష్టోటలు చెప్పిన నియమములకుఁ గూడఁ బాశ్చాత్య నాటకములలో రంగపరికరాదుల వలనఁ గల్గిన యతిచారము కానవచ్చుచున్నది. ఏ వాఙ్మయమునన్నైనను కాలము గడిచినకొలఁది కవుల స్వాతంత్ర్యముచేతనో జనుల యభిరుచులచేతనో యిట్టి మార్పులు గలుగుచుండుట సహజమే.

ప్రస్తుతము మనము కాంచుచున్న యాంధ్రనాటకముల యారంభ మించుమించుగా పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమున జరిగి యుండెనని చెప్పవచ్చును. ఆనాఁటికే హిందూదేశమునం దెల్లెడల నాంగ్ల భాషాభ్యసనము మిక్కిలి ప్రబలి యుండెను. అందుచే ప్రాచ్యభాషా పాండిత్యము గల పండితులు సంస్కృత నాటకముల నాంధ్రీకరించియు భరతునిచేతను దదనుయాయుల చేతను విధింపఁబడిన లక్షణముల ననుసరించి స్వతంత్ర నాటకముల రచించియు నాంధ్ర నాటక వాఙ్మయము నభివృద్ధి చేయుచుండ నాంగ్ల భాషాకోవిదులు కొందఱు షేక్స్పియరు మొదలగు నాంగ్లేయ మహాకవులు రచించిన నాటకముల ననువదించుటకును, వాని ననుసరించి నూతన నాటకముల నిర్మించుటకును ప్రారంభించుచుండిరి. రామకృష్ణమాచార్యుల వారట్టి వారిలో నొకరు. ఆంధ్రాంగ్లేయ భాషలు రెంటియందును సమానాభిమానము,

నసమాన మైె దుష్యము వీరి కలవడియున్నను, వీరి నాటకములు పెక్కు పాశ్చాత్య పద్ధతి ననుసరించియే వ్రాయఁబడిన వనుట కనేక దృష్టాంతములు కలవు. స్థూల దృష్టికి సైతము వీరి నాటకములలో సంస్కృత లక్షణ వ్యతిక్రమము గోచరించును. ప్రస్తావనా భరతవాక్య విష్కంభాదుల యభావమును, గద్యబాహుళ్యమును, విషాదాంత కథా రచనమును వీరి సంస్కృత లక్షణాతిగత్వమును చెప్పక చెప్పుచున్నవి. ఆంగ్ల మున షేక్స్పియరు మొదలగు వారు తమ నాటకములు కొన్నిటిలో వాడియున్న prologue, Epilogue అను వానికిసమానములైన పూర్వోత్తర రంగములు వీరినాటక ములలోఁ గానిపించుటయు, నంకములు సంస్కృతనాటక పద్ధతికి భిన్నముగా ననేక రంగములుగా విభజింపఁబడుటయు వీరి యాంగ్ల లక్షణానుసరణమునకు ప్రత్యక్ష ప్రమాణములు. వీరాంగ్ల గీర్వాణ నాటక ప్రపంచమును, తల్లక్షణములను సవిమర్శ ముగా నవలోకించిన పిమ్మటనే తమ నాటకములలో నీ పద్ధతి నవలంబించి యుండు టచే వీరి మనస్సున కాంగ్లేయుల నిర్మాణక్రమమే మిక్కిలి మెచ్చుగొల్పి యుండు నని విశ్వసింపవచ్చును.)

సంస్కృత పద్ధతి ననాదరించి యాంగ్లేయ పద్ధతి నవలంబించుటచే వీరి నాటక ముల కలవడిన హైన్యముగాని, యసాధారణమైన యాధిక్యము గాని లేదు. వీరు నాటకములను వ్రాయఁబూనినది యాంధ్రమున. ఇందు స్వతంత్రములయిన నాటక లక్షణ గ్రంథములు లేకపోవుటచే వీ రెట్లయినను కొంచెముగనో గొప్పగనో పర భాషలలోని నాటక పద్ధతిపై నాధారపడుట మిక్కిలి యవసరము. అట్టితఱి కేవల సంస్కృత పరిజ్ఞాతలు సంస్కృత లక్షణము నవలంబింపఁ బూనినట్లే యాంగ్లభాష సంప్రదాయములలోఁగూడ నారితేరిన వీరు హృద్యమును, అవలంబనీయము నని తోఁచిన యా పద్ధతి ననుసరించుటలో నంత యాక్షేపణీయాంశ మేమియును లేదు. ఇంక నాంధ్రభాష పెక్కు విషయములలో సంస్కృత చ్ఛాయయై యున్నదికదా, యీ విషయమున మాత్ర మది భాషాంత రాధారమునకై ప్రయత్నింప నేల యను ప్రశ్న రావచ్చును. నాటక శిల్ప విషయమున సంస్కృతముతో సమానముగనో యంత కించుక యెక్కువగనో యభివృద్ధిని ప్రసిద్ధిని బడసిన యాంగ్ల వాఙ్మయము నా విషయమున నొజ్జబంతిగాఁ గైకొనుటలో దోషముకంటె గుణమే యెక్కువగా గోచరించుచున్నది. ఏలయన నది వాఙ్మయమున కితోఽధిక వృద్ధిసూచకమే కాని క్షీణతాశంసకము కాదు. పైఁగా నితర వాఙ్మయ భాగములలోసైత మాంగ్లము నాదర్శ ముగాఁ గైకొనుట కాటంకపెట్టువా రెవరు ? ఇప్పుడిప్పు డా భాషా పరిచయము గల వారు పెక్కురు తమ కుత్తమము లనిపించు కొన్నిపద్ధతుల నందుండి పరిగ్రహించుట

లేదా ? అదియుఁగాక నాటక స్వరూప సంజ్ఞా సంకేతముల విషయమున నీషద్భేద మున్నను వస్తుక్రియా ప్రపంచన విషయమున సంస్కృతాంగ్ల నాటక పద్ధతుల కంత యెన్నఁదగిన తారతమ్య మేమియు లేదు. అయినను ఆచార్యుల వారి నాటకముల విమర్శించుపట్ల ప్రాచ్యపద్ధతినే కాక పాశ్చాత్య పద్ధతిని గూడ దృష్టిపథమునం దుంచు కొనుట మిక్కిలి యావశ్యకము.

## II

ఆచార్యులుగారు రచించిన నాటకములు ముప్పదికి పైఁగా నుండునని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ నాటకోపన్యాసములలో వ్రాసియుండిరి. కాని వీనిలో పదునాలుగు మాత్రమే ముద్రితములై యందుపాటులో నున్నవి. ఆచార్యులుగారి యజామిళ చరిత్రము ఆద్యంతము వచనములో వ్రాయఁబడియుండెనని యొకానొక పీఠికాకారుఁడును, అందు నాయకుఁడైన యజామిళుఁడు ప్లేగు రోగముచే మరణించుటచే నది మరణాంతమయ్యును విషాదాంతము కాఁజాలదని శర్మగారును నుడివియుండిరి. ఈ నాటకమును గూర్చి యింత కెక్కువగా నేమియుఁ దెలియదు. ఇది ముద్రితము కాకుండుటచే లభింపలేదు. అందుచే నీ వ్యాసమునఁ జర్చింపఁ బోవు విషయములు బహుళముగా ముద్రితములయిన యా పదునాలుగు నాటకములకే సంబంధించి యుండును. కాని యాచార్యులుగారి నాటక రచనా కౌశలము నందలి సాధారణాంశము లీ పై పదునాలుగు నాటకములను బురస్కరించుకొని చెప్పఁబడునవి, ముద్రితములు కాని యా నాటకముల రచనా క్రమమును సైతము తమలో నిముడ్చుకొన కుండవు.

ఆచార్యులు గారు 1853 వ సంవత్సరమున జననమంది 1912 వ సంవత్సరమున దివంగతులయిరి. ఆయన 1875 వ సంవత్సరమునుండియు నాటక రచనమును గావించుచునే యుండినను, రచించిన వాని నన్నిటిని ముద్రించుటకు మాత్రమేలొకో తొందర పడకుండిరి.* అందుచే నాయన నాటకములు పెక్కింటికి ఆయన జీవితకాలముననే ముద్రితములు కాఁదగిన భాగ్యము లేకపోయెను చిత్రనళీయము, విషాద సారంగధరము మొదలగు రెండు మూఁడు నాటకములను మాత్రమే ఆయన స్వయ

* పెక్కురునాటకకర్తలు తమనాటకముల నాటకసమాజముల కొఱకై యముద్రితముగానే యుంతురు. ఈ సమాజములు వానిని సొంతవులు (Stage properties) గా భావించి వాని యముద్రితభావమునఁ గలుగు క్రొత్తఁదనముచే జనుల నాకర్షించుచుండును.

ముగా ముద్రించుకొనఁ గల్గిరి. ఈ కారణము చేతనే కాఁబోలు నాయన మరణానంతరము ప్రచురితము లయిన నాటకములలో ముద్రణ స్ఖాలిత్యములు విశేషముగాఁ గానిపించుచున్నవి. ఆచార్యులుగారు పెక్కు నాటకముల రచించి సరస వినోదినీ సభచే నాడించుటతోనే తృప్తినొందుటచే నా యనర్థము వాటిల్లినది. లేనిచో వానియం దిన్ని తప్పులు నిల్చియుండక పోవుటయే కాక వాని కిప్పటికంటె నెక్కుడు ప్రాచుర్య ప్రతిష్ఠలు వచ్చియుండును.

ఆచార్యులుగారి నాటకముల పౌర్వాపర్యమును నిర్ణయించుట కాధారము లెవ్వియును లేవు. నాటకములలో నచ్చటచ్చట కానిపించెడి యుపోద్ఘాతము లీ విషయమున కొంతవఱకు సాహాయ్యపడును. ఈ నాటకము లన్నిటిలోను చిత్రనళీయము మొట్టమొదట రచింపఁబడిన దఁట. ఈ నాటక మాచార్యులుగారి జీవిత కాలముననే నాలుగు ముద్రణముల నందెను. సావిత్రీ చిత్రాశ్వ నాటకము రెండవది. విషాద సారంగధర మూఁడవది. ఇంతకంటె నీ నాటకముల రచనలోని పౌర్వాపర్యమును కనుఁగొనుట కష్టము. ప్రచురణ సంవత్సరమును బట్టి దానిని నిర్ణయింతమన్న నీ నాటకములలో పెక్కు ఆచార్యులుగారి మరణాంతరమే ముద్రితము లగుటచే నవి సరిగా రచనా క్రమము ననుసరించియే వరుసగా ముద్రింపఁబడినవని చెప్పలేము. ప్రకటన కర్తలు ఆయనచే రచింపఁబడిన నాటకములలో రమ్యములును ప్రసిద్ధములును నయిన వానిని మాత్రమే ముమ్మందు ప్రకటించి యుందురు.

ఇంక నాటక రచనమును బట్టి వాని పౌర్వాపర్యమును నిర్ణయింత మన్న నదియును సాధ్యము గాదు. ఏలయన నన్ని నాటకములలోను రచనా క్రమము కొంచెమించుమించుగా నొక్కపోలికగానే యున్నది ఆచార్యులుగారు మొట్టమొదటి నాటకములలో రచించినన్ని పద్యములను తరువాతి వానిలో వ్రాసియుండలేదు. చివరి కజామిళ చరిత్ర నాటికి దానిని పూర్తిగా వచనముననే వ్రాయుటకు సాహసించిరి. ఇందలి కడపటి యంకమున భాగవతము నందలి పెక్కు పద్యములు యథోచితముగాఁ జొప్పింపఁబడినవని శ్రీ శర్మగారు వ్రాసిరి. చిత్రనళీయము, సావిత్రీచిత్రాశ్వము అను నీ రెండు నాటకములలోను పద్యముల సంఖ్య మిక్కిలి ఎక్కువగా నున్నమాట సత్యమే యైనను, తరువాతి వాని పద్యముల సంఖ్యలో ముందు వెనుకలు నిర్ణయించుటకు జాలినంత తారతమ్యము లేదు.

ఆరంభదినములలో నాచార్యులుగారు ప్రాచ్య లక్షణములను సైతము తమ నాటకములలో పాటించుచునే యుండిరి. ఆయన నాటకములకు కొంత ప్రసిద్ధి వచ్చిన తరువాతనే పాశ్చాత్య పద్ధతులను స్వేచ్ఛగా ననుకరింప మొదలిడిరి. ప్రాచ్య లాక్షణి

కుల ప్రకారము నాటకమునకు విషాదాంతము నిషిద్ధమైనది.) ఆ కారణముచే నాచార్యులుగారి విషాద నాటకములు మిగిలిన వానికంటె కొంత యాలస్యముగా రచింపఁబడి యుండుటకు హేతువు కానఁబడుచున్నది.) కాని యాచార్యులుగారే యాద్యంతము విషాదమయమయిన విషాద సారంగధరము తాము వ్రాసిన నాటకములలో నాలవది యని చెప్పుటచే నీ హేతువును సరిపడుట లేదు.

మూ ల ము లు :

ఆచార్యులుగారు తమ నాటక వస్తువుల పెక్కింటిని ప్రసిద్ధములయిన పురాణ ప్రబంధముల నుండియే గ్రహించిరి. ప్రఖ్యాత వస్తుకము కాని నాటకము ముక్తావళి యొకటి కాన్పించుచున్నది. ఆచార్యులుగా రా నాటకమును మొదట విషాదాంతముగనే వ్రాసినను తరువాత నది ముద్రణమున మోదాంతముగా మాఱినది. అదిగాక యిందలి కథ అన్ని నాటకములలోని కథకంటె కొంచెము క్లిష్టముగా నున్నది. అందుచే నిందలి కథ ఆచార్యులుగారు స్వయముగాఁ గల్పించినదయినను గావచ్చును. లేదా ఏదైన నాంగ్ల నాటకము నందలి కథకు విశేషమైన మార్పుతోడి అనుకరణమైనను కావచ్చును. రోషనార - శివాజీ నాటకము నందలి కథ చరిత్రాత్మకమైనది. సంస్కృత నాటకములలో ముద్రారాక్షసమువంటి వే యొకటి రెండో తప్ప చరిత్రాత్మకములయిన నాటకములు చాల తక్కువ. ఆచార్యులుగారు ఆంధ్రనాటక వాఙ్మయముయొక్క ఆరంభ దశలోనే దాన నీ చరిత్రాత్మక నాటకమునకుఁగూడ నొక యాదర్శప్రాయమయిన యుదాహరణము నొసంగిరి.

మిగిలిన పండ్రెండు నాటకములలో నైదు నాటకములలోని కథలు భారతము నుండి గ్రహింపఁబడినవి. అందు భారత కథతో సంబంధించినవి రెండు. అందలి యుపాఖ్యానములతో సంబంధించినవి మూఁడు. పాంచాలీ స్వయంవరము, బృహన్నల అను నీ రెండు నాటకములలో నాది విరాట పర్వములలోని కథ కొన్ని యావశ్యకములయిన మార్పులతో నాటకీకరింపఁబడినది. చిత్రనళీయము, సావిత్రీచిత్రాశ్వము అను నాటకములలోని కథ లారణ్య పర్వము నందలి యుపాఖ్యానములనుండి గ్రహింపఁబడినవి. చిత్రనళీయ కథకు శ్రీనాథుని శృంగార నైషధముతో నెట్టి సంబంధమును లేదు. నాటకమునందలి పూర్వభాగమున మాత్ర మందలి ఛాయ కొంచెముగా గోచరించుచున్నది. చిరకారి కథ చిరకారి యను ఋషి కుమారుఁడు తల్లిని చంపుటకై యాలసించె నను శాంతి పర్వములోని స్వల్పమైన గాథ నాలంబనముగా చేసికొని కవి

కావించిన స్వకపోల కల్పన. ఈ విషయము నందలి యాషత్యాదృశ్యము తప్ప నా రెంటికిని మఱెందును పోలికలేదు. ప్రమీలార్జునీయ చంద్రహాస నాటకములకు మూలము జైమినీ భారతమునందలి యశ్వమేధ పర్వము. అందు ప్రమీలార్జునీయములో మూలమునుండి గ్రహించిన కథకంటె కవి కల్పించిన కథయే హెచ్చు.

పాదుకా పట్టాభిషేకమునందలి కథ వాల్మీకి రామాయణము నందలి యయోధ్యాకాండమునుండి గ్రహింపఁబడినది. అజామిళ చరిత్రమును, ప్రహ్లాదయును భాగవతములోని కథలకు నాటక రూపములు. మిగిలిన వరూధినీ మోహినీరుక్మాంగదలు రెండును ప్రబంధముల ననుసరించి వ్రాయఁబడినవి. వరూధినీలోని కథ ఆంధ్ర కవితా పితామహుని మనుచరిత్రమునందలి శృంగారగాథయే. మోహినీ రుక్మాంగదకు మూలము. మల్లన కృత మగు రుక్మాంగద చరిత్ర మను నొక ప్రబంధము.* ఈ రెండు నాటకముల యందును, ప్రహ్లాద నాటకమునందును సందర్భోచితముగా నా మూలములందలి పద్యములే చేర్పఁబడియున్నవి.

ఇట్లు ఆచార్యులుగారు ఇతిహాస పురాణ ప్రబంధములనుండి వస్తువును గ్రహించుచు నీ నాటకముల వ్రాసిరి. ఇతిహాసములకంటె పురాణములును, పురాణములకంటె ప్రబంధములును, నాటకములకు దగ్గఱ-ఆచార్యులుగా రా కారణముచేత నే యితిహాసకథను కొంచె మెక్కువగను, పురాణకథను సామాన్యముగను, ప్రబంధకథను మిక్కిలి తక్కువగను తమ నాటకములలో మార్చియుండిరి. వాఙ్మయ వివిధ భాగముల నుండి గ్రహింపఁబడిన వస్తువులతో విలసిల్లునట్టివియైనను ఈ నాటకము లన్నియు కొంచె మించుమించుగా నొకే రూపమును దాల్చి యున్నవి.

— : : —

* ఈ కథ భాగవతమునఁ గూడ కలదు. కాని కవి ప్రబంధకథనే యెక్కువగా ననుసరించె ననుట కాయనయందలి పద్యముల నాటకమున నెడనెడఁ గూర్చుటయే ప్రమాణము.

# 3. విషాదాంత నాటకములు

## I

సంస్కృత నాటక వాఙ్మయమును బరిశీలించినంతనే తొలుఁదొల్త మనస్సు నాకర్షించు విషయ మందలి విషాదాంత నాటకముల యభావము. కొంచె మించుమించుగా లోకప్రవృత్తమునకుఁ బ్రతిబింబమని చెప్పఁదగిన నాటకమున నందువలెనేఁ ఖేద మోదాంతములగు కార్యములు రెండును బ్రదర్శనీయములు కావచ్చును. కాని సంస్కృత నాటక కర్తలలో నెవ్వరును దమ నాటకముల ఖేద పర్యవసాయులుగా నొనర్చినవారు లేరు. దీనికిఁ బూర్వకాలపు హైందవుల విచిత్ర దృష్టి పథమే ప్రధానమైన కారణము. ఏలయన వైదిక మతసిద్ధాంతములఁ బూర్ణముగ నమ్మియుండిన వారు జీవితమును కేవల మోదమయముగానే చూచిరి కాని విషాద సమ్మిశ్రితముగాఁ బరికించి యుండలేదు. అందుచేతనే సర్వత్ర విషాద రేఖామయములై ఖేదావసానములైన వస్తువుల గ్రహించిన భవభూతి ప్రముఖులగు నాటక కర్తలు కొందఱు పూర్వగాథకు ననురూపముగ నున్నను లేకపోయినను సంతములను బ్రమోదమయములుగానే యొనరించిరి. మూలమున సీత భూగర్భ విలీనయైనట్లు వ్రాయఁబడియుండ భవభూతి దానిని మార్చి తన నాటకము కృత్రిమావసాన కలుషిత మౌటకైన నంగీకరించి యతిక్లేశమున సీతారాముల సమాగమమును జేకూర్చెను.

మరణము విషాదమునకొక విధమైన యాలంబనము. కాని మరణాంతములైన నాటకములన్నియు విషాదాంతనామ యోగ్యములు కావు. ఏలయన దుర్మార్గులును లోకకంటకులు నగు వారి మరణము సంతోషమునే చేకూర్చును గాని విషాదము నొసంగదు. అందుచేతనే కంస రావణ దుర్యోధనాదుల వధతో నవసితములగు నాటకములు విషాదాంతములు కాకపోయినవి. సంస్కృత వాఙ్మయమున కంస వధ, బలి బంధనము, ఊరుభంగము, మహావీర చరిత్రము మొదలగు మరణాంత నాటకములు కలవు. కాని యందు మృతులగు వారప్రధానులును, హంతవ్యులు నగు ప్రతినాయకులగుట చేతను, వీరి మృతి శిష్టరక్షణ దుష్టశిక్షణాద్యుదాత్త గుణాంచితులగు నాయకుల విజయమునకును దద్ద్వారా లోక కల్యాణమునకును గారణ మగుటచేతను, నివి సాధారణ మోదాంత నాటకములుగానే పరిగణింపఁబడుచున్నవి. లేక వీనినే వధాంత

నాటకములని పేరుకొనవచ్చును. ఇట్లు గాక ప్రేక్షకుల సానుభూతి నాకర్షింపఁగల సుగుణములకు నిధానమైన నాయకునికే యేదో యొక కారణమున మరణము సంభవింప నాటక మచ్చటితో ముగిసినచో నప్పుడది విషాదాంత నాటక మనఁబడును. ఇట్టివి సంస్కృత నాటక వాఙ్మయమునం దెచ్చటను గానరావు.

వధ యుద్వేగకారియని సంస్కృత లాక్షణికులు దానిని రంగమునఁ బ్రదర్శింప రాదనిరి. ఒకవేళ నది నాటక క్రియ కత్యవసరమైనచోఁ గేవలము సూచ్యము మాత్రమే కావలయు నఁట. ఇట్టియెడ నాయకుని వధ విషయము తలంచుట కూడ కూడని పనియే యగును. దశరూపకమునందును సాహిత్యదర్పణము నందును విష్కంభ ప్రవేశకాదులచే నైన నాయక హింస సూచింపఁ దగదని స్పష్టముగ వివరింపఁబడి యున్నది. *[1] భరతుఁడు సైత మీ సందర్భమున "అంకే ప్రవేశకేవా ప్రకరణ మాశ్రిత్య నాటకేవాపి న వధః కర్తవ్యః స్యాద్యస్తత్రిస నాయకః ఖ్యాతః" అని ఖండితముగాఁ జెప్పివైచెను. కాని భావప్రకాశపు టష్టమాధికారమున నాయకుని మరల జీవింపఁజేయు నెడ తద్వధ చూపవచ్చునని తెలుపఁబడినది. శ్రీ హర్షుని నాగానంద నాటకమున నిట్లే నాయకమృతి జరిగినను, దేవతా ప్రసాదముచే నతఁడు మరల పునర్జీవితుఁడయ్యెను. మొత్తము మీఁద నాయక మరణాంతమగు నాటక మొక్కటియును సంస్కృతమున లేదు. ఆర్య వాఙ్మయమునందు ధర్మమే నాయకుఁడు. అట్టి ధర్మరూప నాయకుని వధ వర్ణితమగుచో నధర్మమునకు విజయము సంపాదించి నట్లే. ధర్మమున కపజయము సంపాదింప నొల్లక కవి యా నాటకము తుదిని మోదాంతమగు మార్పు కల్పించును. అందుచేతనే విషాదాంత నాటకముల కం దభావ ప్రాప్తి కలిగినది.

సంస్కృతాను యాయులగు తెలుఁగు కవులలో నుత్తమ కావ్యముల నాయక వధను బ్రదర్శించిన వారొక్కరును లేరు ఇటీవల పాశ్చాత్య విద్యా సంస్కారముగల యొక్కరిద్దరీ మార్గమును ద్రొక్కిరి. ఆచార్యులవారును *[2] తమ నాటకములఁ గొన్నిటిని విషాదాంతములుగా నొనర్చిరి.) వీని లక్షణమునకై మనము పాశ్చాత్య విషాదాంత నాటక తత్త్వమును సుంత పరిశీలింపవలయును. ఆచార్యులుగా రెక్కువగా

*[1] సా. ద. విష్కంభ కాద్యైరపి నో వధోవాచ్యో ఽధికారిణః
అధికారి వధస్యాపి క్వచిత్ప్రత్కల్పనం మతమ్ అర్వాక్ప్రహారాత్పునః ప్రత్యుజ్జీ విష్యతేయది. దశ. iii 38.

*[2] ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు.

ననుకరించినది Shakespeare నే యగుట నాతని నాటకముల లక్షణముల నెఱుంగుటయు మిక్కిలి యావశ్యకము.

పాశ్చాత్య నాటకములలోఁ బెక్కు ప్రభేదములున్నను వానిలో మోదాంత నాటకము (Comedy) విషాదాంత నాటకము (Tragedy) అనునవి ముఖ్యములు. పాశ్చాత్య విమర్శకులలోఁ బలువురు తొలుదొలుత మోదాంత నాటకము సామాన్య మానవుల జీవితముతో సంబంధించిన దనియు, విషాదాంత నాటకము మహారాజుల జీవితములతో సంబంధించిన దనియుఁ దలంచిరి. కాని తరువాత Johnson మొదలగు వారీ యూహలను విమర్శించి కేవలము రాజులను రాజకుమారులను బ్రవేశపెట్టినంత మాత్రముచేతనే నాటకము విషాదాంతము కాఁజాలదనియు, సామాన్యముగా మానవునికి మానవునికిఁ గల యంత సన్నిహిత సంబంధము మానవునికిని సార్వభౌమునికిని లేకుండుటచేఁ గేవల రాజపాత్ర ప్రవేశనము విషాదాంతత్వముయొక్క యుదాత్తతకు భంగము కలుగఁజేయునే కాని గౌరవము సంపాదింపఁ జాలదనియు, రాజుల జీవితము వలెనే సామాన్యుల జీవితముకూడ విషాదనాటక వస్తుతా గౌరవమునకుఁదగినదే యనియు నుద్ఘోషించిరి. (నాటకము చదివినప్పుడు కాని చూచినప్పుడు కాని సామాజికుల మనస్సుల జనించు భావముల యుద్వేగ పరిమాణమును, తీవ్రత్వమును బురస్కరించుకొనియే యా నాటకముయొక్క విషాదాంతత్వమును గాని మోదాంతత్వమును గాని నిర్ణయింపవలెనని వారి యూహ. విషాదాంత నాటక దర్శనమునఁ గలుగు భావము సామాన్యముగా నిర్భరమై గంభీరముగా నుండుటచే నవి ప్రేక్షకుల మనస్సులఁ జలింపఁజేయఁగల్గును; మోదాంతనాటకమువలనఁ గలుగు భావము తేలిక యగుటచేఁ బ్రేక్షకుల హృదయముల ముద్రితమై వానిలో నంత గాఢమైన చలనము గలిగింపఁజాలదు.)*

విషాదాంత నాటకములలో Aristotle చెప్పిన కరుణ సంత్రాసములఁ (Pity and fear) గలిగించుటకుఁ గాని మోదాంత నాటకములలో మోదకారణమైన హాసమును గలిగించుటకుఁగాని వానిలోఁ గానవచ్చు సంఘర్షణమే (conflict) మూల కారణము. దీనికి మోదాంతములలోఁగంటె ఖేదాంతములలోఁ బ్రాధాన్యము హెచ్చు.

* "In Vague terms we may say that in tragedy the impression is dark, in comedy light; that in tragedy we are deeply moved and our sympathies profoundly stirred; in comedy, the impression because lighter, is less penetrating and our sympathies are not so freely called into play" (Prfoessor Nicoll)

బహు భంగికమైన దీనరెండు విధములు మిక్కిలి ముఖ్యములు. అందు మొదటిదాని కంటె రెండవది యెక్కువ యుదాత్తమైనది. నాయకునకు నాటకస్థ వివిధ పాత్రలలో నొకనితో వైరుధ్యము కల్పించుట యొక పద్ధతి. నాయకుని చిత్తముననే పరస్పర విరుద్ధములైన రెండు భావములకు సంఘర్షణ కల్పించుట రెండవ పద్ధతి అనఁగా మొదటిది బాహ్యసంఘర్షణము. రెండవ దాంతరము. గ్రీకు నాటక కర్తలు పెక్కురీ మొదటి పద్ధతినే తమ నాటకములలోఁ బ్రదర్శించిరి. Shakespeare ఈ పద్ధతిని గూడ నచ్చటచ్చట వాడినను అంతర వైరుధ్యమునే హెచ్చుగాఁ బ్రకటించెను. ఆతని విషాదాంత నాటకములను గంభీరములుగను నప్రతిమానములుగను జేసిన యుత్తమగుణ మిదియే. ఆతఁడు పోను పోను బాహ్య సంఘర్షణమును తగ్గించి యాంతరమైన దానినే ప్రదర్శించుటకుఁ గావించిన ప్రయత్న మాతని నాటకములలోఁ గానిపించుచున్నది. Othello లో నాయకునికిని Iago కును మధ్య బాహ్య సంఘర్షణ మున్నను, ఆ నాటకమునకుఁ బ్రపంచ నాటకములలో నత్యున్నత స్థానము నొసంగినది Othello మనమున నుద్భవించిన భిన్న భావముల యాంతర సంఘర్షణమే. అట్లే Hamlet లోఁ బితాపుత్రులకు నడుమనున్న బాహ్య సంఘర్షణముకంటె Hamlet మనస్సంజనితమైన యాంతర సంఘర్షణమునకే యెక్కుడు ప్రాముఖ్యము. Lear లో బాహ్య సంఘర్షణమే (Outward conflict) హెచ్చు. కాని Macbeth లో నిది యున్నదో లేదో యనిపించును. అందు మనల నాకర్షించునది నాయక హృదయ గతములైన యా తీవ్ర భావముల యాంతర సంఘర్షణమే.

కొందఱు నాటకముయొక్క విషాదాంతత్వమునకు నిర్వహణాపతితములైన నాయకాదుల మరణములకును ముడి పెట్టుదురు. కాని నాటకాంతమున వారి మృతి జరుగుటచే మాత్రమే నాటక మా నామమున కర్హము కాదు. పైని చెప్పిన సంఘర్షణములు తీవ్రముగానుండి ప్రేక్షకుల మనస్సులఁ జలింపఁజేయుచో నంతమున మరణము సంభవింపక పోయినను నది విషాదాంతమే యగును. పాశ్చాత్యులలో నాధునికులు తమ విషాదాంత నాటకములలో నీ పద్ధతినే యవలంబింతురు. వ్యాధి పీడితుఁడై కాని, జరాపలితుఁడై కాని నాయకుఁడు సహజముగా మరణించినచో నది కరుణసంత్రాసములను గలిగించుటకు శక్తి లేని దగుటచే మరణాంతమే యయ్యును విషాదాంతము కాదు. Shakespeare తన నాటకములలో బహిరంతర సంఘర్షణములు ప్రదర్శించుటయే కాక యంతమునఁ బ్రధాన పాత్రల మరణమును గూడఁ బ్రదర్శించుటయే కానవచ్చుచున్నది.

నాటకమునఁ బాత్రపోషణాదులు యథార్థముగా జేయఁబడినను, సంఘర్షణము నేర్పుతోఁ బ్రదర్శింపఁబడినను, నాటక కార్య మేకవ్యక్తిగతమైనచో నది విషాదాంత గౌరవమును బొందఁజాలదు. ఈ విషాదాంత నాటకములలో విశ్వజనీనత (Universality) మిక్కిలి ముఖ్యము. ఏతద్గుణాభావము చేతనే Shakespeare నాటకములతో సమానమైన రచన గల Arden of Feversham ఉత్తమ విషాదాంత నాటకముగాఁ బరిగణించుట కందినది కాదు. నాటకమున నీ విశ్వజనీన భావము కలుగుటకుఁ బెక్కు పద్ధతులు కలవు. అందు రాజ కుటుంబములోని వారినే నాయకులుగాఁ జేసి వారి జీవితమునే వర్ణింపఁజూచుట యొకటి. "A tragic hero should be some one of high fame and flourishing prosperity" అని Aristotle చెప్పిన సూత్రమును బురస్కరించుకొని తరువాతి వారు విషాదాంత నాయకుఁడు రాజ కుటుంబములోని వాఁడై యుండవలయు నని రెండడుగులు ముందుకు వేసిరి. సామాన్య మానవునకుఁ గల్గు సుఖదుఃఖములకంటె నొక దేశమును బాలించు బాధ్యత గల రాజునకుఁ గల్గు సుఖదుఃఖములు విశ్వజనీన భావమున కాస్పదము లగుటలో సందియము లేదు. కనుకనే Shakespeare తన విషాదాంత నాటకములకు రాజులను, దత్సములను మాత్రమే నాయకులుగా నొనరించెను. అతిమానుషములైన విషయముల నాటకమునఁ బ్రవేశపెట్టుట యీ విశ్వజనీనత కలుగుటకు మఱియొక పద్ధతి. గ్రీకు నాటక కర్తలు తమ నాటకములలో దయ్యములకు (Ghosts) ప్రవేశము కలిగించిరి. కాని వీనికిని నాటకస్థ పాత్రములకును వారి నాటకములలో నంత సన్నిహిత సంబంధము లేదు. Shakespeare వారి ననుకరించి తాను గూడ విషాదాంత నాటకములు కొన్నిటిలో వీనిని వాడెను. కాని యతఁడు గ్రీకు నాటకములలోవలెఁ గాక వానిని లౌకికములుగా నొనర్చి వానికిని నాయకునికిని దగ్గఱ సంబంధము కలదని సూచించెను. Hamlet లోని రాజ భూతమును Macbeth లోని గాలి దయ్యము (witches)లును, నిట్టివారే. నాయక మనోభావములకును వీని దర్శనమునకును గార్యకారణ సంబంధ మున్నట్లు కానవచ్చుచున్నది. వీనిని గాంచునప్పుడు ప్రేక్షకుల హృదయములలో ననంతములును, నవ్యక్తములు నగు ప్రపంచ శక్తులతోడి సన్నికృష్టమైన స్పర్శ పొడచూపుచుండును.

విధి ప్రభావమును (Sense of fate) ప్రదర్శించుట గూడ విశ్వజనీన భావోత్పత్తికి వేఱొకవిధము. విధియుఁ బాత్రాంతరమువలె మిక్కిలి ప్రాధాన్యమును వహించుచు, నాయకుని వంచించుచు, నాతని తప్పు చేఁతలకుఁ జిఱునవ్వు నవ్వుచుండును. Shakespeare ఈ విధి ప్రభావమును గాఢముగాఁ బ్రదర్శించి నది

యొక Romeo and Juliet లో. అందుచేతనే యీతని యితర విషాదాంత నాటకములకును దీనికిని సుంత భేదము కలదు. అతఁడు తన నాటకములలో యదృచ్ఛా సంభవమును (Chance) గూడఁ బ్రదర్శించుట కలదు. దంకను Macbeth గృహమున కతిథిగా నరుదెంచుటయు, Othello విచారాంధోళితుఁడై యుండు సమయమున Bianca చేరుమాలును దెచ్చుటయు, యదృచ్ఛాపతితములే. కాని యొక్క Romeo-and Juliet లోఁ దప్ప మఱి యే నాటకమునను గేవల యదృచ్ఛా సంభవమే నాటకముయొక్క విషాదాంతమునకు (Catastrophe) మూల కారణమగుట కానరాదు. Hamlet ఇంగ్లండు పోవుచు దొంగ యోడమీఁద డెన్మార్కు చేరుట యచింతిత సంభవమే యయ్యును అదియే నాటకముయొక్క ఖేదాంతమునకుఁ గారణముగాఁ బరిణమింపలేదు ఇ ట్లదృష్టము (Chance)నే నాటక కార్యసాధకముగాఁ గూర్చుట నాటక నిర్మాణ కళలో నొక గొప్ప లోపము.

విశ్వజనీన భావోత్పత్తికిఁ దోడ్పడు సాధనములలో నుపకథ (Sub-plot) మఱియొకటి. రంగపరికరములు చాలి నన్ని యుండకపోవుటచే గ్రీకు నాటక కర్తలీ సాధనము నుపయోగించుకొనలేకపోయిరి. Shakespeare తన విషాదాంత నాటకము లన్నిటిలో వ్యక్తి భావ నిర్మూల మొనరించి నాయకుఁ డనుభవించు విషాద మన్యజన సామాన్యమని సూచించుటకై యీ యుపకథారచనమును జేయుచుండును. ఇది యాధికారిక వస్తువుయొక్క ప్రతిబింబముగాఁగాని, దాని వ్యాఖ్యానముగాఁ గాని రచింపఁబడును। లీయరు నాటకములో Glouster కథ రాజునకు సంభవించిన దురవస్థ యతఁ డొక్కఁడే యనుభవించునది కా దనియు, నట్టి దన్యులకుఁ గూడ సాధారణమే యనియు సూచించుచు దానిని విశాలముగా నొనరించు చున్నది, రాజహత్యకై మాక్బెత్తును దేర్చిరేచిన ప్రలోభనములకే Banquo గూడ గుఱియగుట యిట్టిదే. ఈ పై రెండు నాటకములలోను ఉపకథ సామ్యరీతిని రచింపఁ బడినది. ఇతర విషాదాంత నాటకములలో నిది ప్రతియోగము (contrast) గాఁ జూపఁబడినది. (Hamlet నాటకమున నాయకులకును, Polonious రాజ భూతములకును నిట్టి పరస్పర వైరుద్ధ్యము కలదు.) విశ్వజనీన భావమును గలిగించుటకై యిట్టివే యితర మార్గములు మఱికొన్ని కలవు. ఇందే సాధనము నవలంబించినను ఆ భావమును గలిగించుట మాత్రము విషాదాంత నాటకములలోఁ బ్రధానము. అది లేనిచో నాటకము సర్వాంగ సంపూర్ణమే యయ్యును Arden of Feversham వలె విషాదనాట కౌన్నత్యమును బడయఁజాలదు.

సాధారణముగా విషాదాంత నాటకములలో నాయకుని యౌన్నత్య పతనము కాని, మనస్సంక్షోభము కాని, దుఃఖానుభవముగాని ప్రదర్శింపఁబడును. మరణము కూడ నొక్కొక్కయెడ ప్రదర్శింపఁబడుట యున్నను, నితరాంగము లన్నియు సంపుష్టములై యున్నప్పు డది లేకున్నను నాటకము యొక్క యౌత్కృష్ట్యమున కెట్టి భంగపాటును గలుగదు.

ఎట్లైనను విషాదాంత నాటకము గంభీరమై (Serious) కరుణరేఖానిబిడమై యత్యుదాత్తముగ నుండును. ఇట్టి నిరాశా నిరుత్సాహముల కాస్పదమయిన విషాదాంత నాటకము ప్రేక్షకుల కానందము (relief) కలిగించుట యెట్లను విషయమునఁ బాశ్చాత్య విమర్శకులు పలువురు పలువిధములఁ దలంచిరి. దుఃఖాది దుస్సహ భావము లానందము లెట్లగు ననెడు నాశంక చేసికొని సాహిత్య దర్పణకారుఁ డదే రస రహస్య మనియుఁ నదే యనుభవైక వేద్యమనియు సమాధానము చెప్పికొనెను. కాఁగా మన యాలంకారికుల మతమున వాని యానందత్వ సిద్ధి శంకనీయమే కాదు. Aristotle విషాదాంత నాటకము కరుణ సంత్రాసములను కలిగించుటచే సామాజికుల భావములఁ బవిత్రీకరించి సంస్కార పూతములయిన వానినుండి తాదృశములయిన యన్య భావములఁ దొలఁగించునని చెప్పెను. మఱియు విషాదాంత నాయకులు వీరులై (heroic) యుదారచిత్తులై (noble) యుండుట గ్రీకు నాటక కర్తల నాఁటి నుండియుఁ గానవచ్చుచున్నది. ఏదోయొక కారణముచేత నాయకుఁడు వధాదికౄర కృత్యముల నొనరింపవలసి వచ్చినను, అదియే తత్కార్యారంభమునకుఁ బూర్వమున నాతని మనోజనితములగు భావములలో నైతికములయిన యౌదార్య చిహ్నముల నచ్చు కొట్టుటచేఁ బ్రేక్షకుల కనిర్వాచ్యమైన యానంద పారవశ్యమును గలిగించుట కవకాశము గల్గుచున్నది. Macbeth Duncan హత్యకుఁ బూర్వము తాఁ జేయఁ బోవుచున్న దోషమును సహస్రముఖములఁ బరికించెను. కంపమానగాత్రుఁడై సర్వత్ర రక్తాప్లుతమయిన ఖడ్గమును గాంచుచు మహాభయమునకు గుఱి యయ్యెను. అతనిని జంపి తానే రాజైనను దన యుదారమయిన యంతరాత్మచేఁ బ్రతిక్షణపీడితుఁ డగుచు జీవిత శేషమును నైరాశ్యకలుషితముగనే గడపెను. అతని యందలి యీ యౌదార్యమాతఁ డొనరించిన యా హత్యాదోషమును మఱవఁజేసి ప్రేక్షకులలో నానందసిద్ధి కలుగఁజేయును. విషాదాంత నాటకములలోఁ బ్రదర్శింపఁబడిన నాయకుని దుఃఖానుభవములలోఁ గొన్ని ప్రేక్షకులకుఁగూడ సామాన్యములే యగుటచే వారు నాయకునిపై సానుభూతి చూపుటతో స్వయం సానుభూతిని (self pity) గూడఁ బొంది యానంద పరవశు లగుదురు. విషాదాంత నాటకములఁ బ్రదర్శింపఁబడిన మహా

రాజుల యొక్కయుఁ, దత్సదృశుల యొక్కయు, దురవస్థ లైహిక జీవిత మంధకార బంధుర మనియుఁ, గర్మానుభవ మెంతటి వారికిని దప్పదనియు, నశాశ్వతమయిన యీ ప్రపంచముపైని మమత్వ ముంచుట యవిద్వాంసుని లక్షణమనియుఁ, దాత్త్వికభావములఁ గలిగించి తమ కరుణ విశేషముచేఁ బ్రేక్షకుల మనస్సులోని దుఃఖాంధకారమును లఘూకరించుటయుఁ గలదు. ఇవి యన్నియు నిట్లుండఁ బాత్రలద్వారా కవి వ్యక్తముచేయు కవితా చమత్కృతి సాధారణ శ్రవ్యకావ్యములలోకన్న దృశ్యకావ్యములలో నభినయ సహాయమువలన విస్పష్టమై శ్రోతల కవ్యయానందమును గలుగఁజేయును. పాత్రపోషణాదులవలెనే నాటకమునఁ గవితా గౌరవము కూడ నొక యపరిహార్యమయిన యౌన్నత్యహేతువు. ఇతరాంగము లెంత సమగ్రముగాఁ గూర్పఁబడినను నీరసమయిన కవిత్వము నాటకమున గొప్ప లోపముగానే కానిపించును.



విషాద నాయకుఁడు (Tragic hero):

విషాదాంత నాటకములలో నాయకునికి మిక్కిలి ప్రముఖమైన స్థానము కలదు. నాటకమే యతఁడు. తఱుచుగా నీ నాటకములలో మోదాంతములలో వలెఁ గాక యొకటి రెండు పాత్రలు మాత్రము తమ యసాధారణమైన యౌన్నత్యముచే నితర పాత్రల నతిశయించుచు నాటక సౌధమునకు మూలస్తంభమువలెఁ గానవచ్చుచుండును. మోదాంత నాటకములలోఁ గూడ నాయకుని కితర పాత్రలకంటె హెచ్చు ప్రాముఖ్య మున్నను, నందలి సర్వ పాత్రములును నాటక కార్యము నిర్వహణమున సమాన స్థానమునే యాక్రమించి యుండును విషాదాంత నాటకమునకు సర్వమైన గాంభీర్యమును, మహాత్తతను జేకూర్చువాఁడు నాయకుఁ డొక్కఁడే. ఈ కారణము వలననే సాధారణముగా నీ నాటకములు నాయకుని పేరుచేతనే వ్యవహరింపఁ బడుచుండును.

Aristotle విషాదాంత నాయకుఁ డుదారగుణ సంపూర్ణుఁడే యయ్యును మానవ సామాన్య దౌర్బల్యముచే నజ్ఞాతముగాఁ గానిఁ యింద్రియార్థ వివశుఁడై గాని యేదే నొక దోషము నాచరించువాఁడుగా నుండవలెనని సుడివెను. మానవ సహజమైన యే స్వల్పదోషమో కాక ప్రమాదము కూడ (Error of Judgement) నొక కారణముగా Aristotle చెప్పెను. అంతేకాని యతఁడు దోషాచరణమునకుఁ దావొసం

గని సద్గుణైక పుంజముగా నుండవలెనని యాతని యుద్దేశము కాదు. * గ్రీకు నాటక కర్తలు తమ నాటకములలో నజ్ఞాతముగఁ దెలియమిచే దోషము నాచరించిన నాయకులనే ప్రదర్శించిరి. ఇట్టి నాయకులు Shakespeare నాటకములలో నెచ్చటను గానరారు. కాని యతని తరువాతి నాటక కర్తలు పెక్కురు గ్రీకు నాటక కర్తల ననుసరించి యట్టివారినే ప్రదర్శించిరి. Shakespeare తన నాటకములు కొన్నిటిలో మనః పూర్వకముగ దోషము నాచరించిన నాయకులను చిత్రించెను. Macbeth రాజును చంపుటయు, Othello తన భార్యను జంపుటయు మనఃపూర్వకములే కాని యజ్ఞాతములు కావు. Othello తన ప్రియురాలిని జంపవలెననియే చంపినను నతని దోషాచరణములో నజ్ఞాతత్వము కూడఁ గొంతవఱకు గోచరించుచున్నది. ఏలయన Desdemona యథార్థముగఁ బతివ్రతయే యైనను Iago తన బుద్ధి కౌశల్యముచే నామె దుష్ప్రవర్తనమును, నవిశ్వాసమును స్పష్టముగా నిరూపించి Othelloచే నా ఘోర కార్యమును జేయించెను. ఇట్టి సమయములలో Macbeth లో వలె దోషాచరణము తరువాత నాయకుని శీలమునఁ బరివర్తనము కలిగించినచో నాటకము యొక్క యుదాత్తత్వమున కే లోపమును సంభవింపదు. అవిమృశ్యకారిత్వముచే నాపదను దన యంత తాఁదెచ్చుకొనుట కూడ Shakespeare నాయకులలోఁ గాంచనగును. Lear జ్ఞాతముగఁ గాని యజ్ఞాతముగఁ గాని తానే దోషమును జేయక పోయినను, Cordelia ను విసర్జించుట యను ననాలోచిత కృత్యముచేఁ దరువాత పెక్కు కష్టముల ననుభవించెను. Coriolanus మేర మీఱిన యౌద్ధత్యముచేఁ దన వినాశమునకుఁ దానే కారణమయ్యెను. Antony యిట్లే పిచ్చి వలపుచే "క్లియోపాత్రా" యధర పానము గావించి నిధనమును బ్రాపించెను.

నూతన యుగ (Renaissance) ప్రారంభమునఁ గొందఱు విమర్శకులు Aristotle పద్ధతికి విరుద్ధముగనే దోషములు లేని సద్గుణైక పుంజములు కూడ విషాదాంత నాయకులుగా నుండవచ్చునని నుడివిరి. Dr. Smart "Tragedies" అను తన వ్యాసములో నీ పద్ధతికిఁ బ్రబలములైన నిదర్శనములు చూపెను. వీరి యభిప్రాయము ప్రకారము నిస్సంగులగు యోగి పుంగవులు సైతము విషాదాంత నాయకులుగా నుండఁ దగుదురు. కాని నిర్దోష నాయకులగు విషాదాంత నాటకములు చాల తక్కువగ

* "The tragic hero is a person neither eminently virtuous or just, nor yet involved in crime by deliberate vice or villainy but by some reason of human frailty" Aristotle. మానవ సహజమైన యే స్వల్ప దోషమో కాక ప్రమాదము (Error of Judgement) కూడ నొక కారణముగా అరిష్టోటలు చెప్పెను.

నున్నవి. Romeo and Juliet లో రోమియో యెట్టి దోషమును ఆచరించి యుండ లేదు. ప్రేయసీ ప్రియు లిరువురును మనఃపూర్వకముగనే వివాహ కార్యమున కుపక్రమించిరి కాని విధి వారి ప్రణయ ప్రయత్నములను భగ్నము కావించెను. కొందఱు తల్లిదండ్రుల యనుమతి లేక వివాహము చేసికొనఁ బ్రయత్నించుటయే యా తరుణ దంపతు లాచరించిన దోషమనియు, వారా దోషమునకుఁ దగిన ప్రతి ఫల మనుభవించిరనియుఁ జెప్పఁజూతురు. కాని యీ దోషారోపణ మెట్లైనను Romeo లో నేదో నొక దోషమును గనిపెట్టవలయు నను ప్రయత్నముయొక్క ఫలితముగానే గోచరించుచున్నది కాని సహజముగా లేదు. ఏలయన నా ప్రియు లా పరిస్థితులలో నట్లుగాక యన్యథా ప్రవర్తించుట కవకాశమే లేదు. మొత్తము మీఁద నీ నాటక కార్యము చాలవఱకు దైవముపై నాధారపడియున్నది. కావుననే దీనికి నన్య నాటకముల కున్నంత ప్రసిద్ధియు గౌరవమును లేదు. నిర్దోషులగు నాయకులు కల నాటకము లన్నియు నిట్లే యుదాత్త భావమునఁ గొఱవడియుండును. అందుచే విషాద నాయకునియందు జ్ఞాతకృతమైనదో, యింద్రియ వశమయినదో యేదో యొక దోష ముండవలయు నను అరిస్టోటలు నియమము సమంజసముగానే యున్నది.

ఒక్కొక్కప్పుడు విషాదాంత నాయకుఁడు సర్వవిధముల గుణోత్తరుఁడే యయ్యును, అరిషడ్వర్గమునం దేదో యొక్కదానికి వశుఁడై యుండును. అప్పుడు ధర్మ్యమైన యాతని యంతరాత్మకును దీనికిని జరిగిన యంతర్వైరమున నంత శ్శత్రువే బలవత్తరమై నాయకునిచే నొక దోషమును జేయించును. ఈ దోషము తరువాత నట్టి దోషములు పెక్కింటికి దారి చూపును, చివరి కాతఁడు తానాచరించిన దోషము నెఱింగి పశ్చాత్తప్తుఁడై యాత్మహత్య కావించుకొనును. Shakespeare విషాదనాయకులు పలువు రిట్టివారే. ఒక్కొక్కప్పుడు నాయకుఁడు తన లోపముచేఁ గాక బలవంతములైన బహిః పరిస్థితులచే దోషాచరణమున కొడిగట్టును కాని యీ దోషమున నాతఁడు చలింపక యాద్యంతము నిర్మల హృదయుఁడై యుండును. ఈ రీతి నాయకు లాధునిక విషాదాంత నాటకములలోఁ గానవచ్చుచుందురు.

విషాదాంత నాటకములలో నాయకుఁడు తన సద్గుణ జాలముచేఁ బ్రేక్షకుల సానుభూతి నాకర్షించు వాఁడుగా నుండవలెను. అతని మనస్సులో ధర్మ్యా ధర్మ్యభావ ములకు సంఘర్షణము సంభవించినప్పు డాతఁడు వెలువరించు నౌదార్య సూచకములగు వాక్యములును, దోషాచరణానంతర మాతఁ డనుభవించు పశ్చాత్తాపమును బ్రేక్షకులలో

నీ సానుభూతి కలుగుట కాధారపడును. నాయకుని మరణము సామాజికుల హృదయములలో 'నయ్యో! పాపము' అను ననుకంపను గలుగఁజేయనిచో విషాదాంత నాటకముయొక్క యుదాత్తతయే భగ్నమైన దన్నమాట. నాయకుఁడు మరణించుటయే మేలను భావము ప్రేక్షకులలోఁ గలిగినయెడల నట్టివాఁడు రావణ దుర్యోధనాదులవలె వధ్యుఁడైన యుపనాయకుఁడే యగును కాని విషాద నాయకతా గౌరవమున కర్హుఁడు కాఁడు.

ఈ విషాదాంత నాటకములలో నాయకుని స్థానము తఱుచు రెండు విధములుగా నుండును. ఒక్కొక్కప్పుడు నాయకుఁడు చాకచక్యము కలవాఁడై నాటక కార్యము నంతను తన చేతిమీఁదుగానే నడపును. అప్పుడు రంగము మీఁద జరుగు సర్వకార్యమును నతని మనో భావముల యవ్యవహిత ఫలితమై కానవచ్చును. ఇతర పాత్రలెవ్వియు నప్పుడు వస్తు విస్తరణమునకుఁ దోడ్పడవు. Shakespeare నాయకులలో Macbeth ఇట్టివాఁడు. మఱియొకప్పుడు నాయకుఁడు Lear రాజువలె నాటక కార్యము నారంభించి యనాలోచితమైన యొక స్వాపరాధముచే నంతవఱకు నమిత కష్టముల పాలయి పరవశుఁడై ప్రవర్తింపవలసి వచ్చును. Lear నాటకములో మొదటి యంకమైన తరువాత నాటక గమనమంతయు నతని హస్తములనుండి జాఱి యతని శత్రువులపై నాధారపడి యుండును. ఇది యిట్లుండ నొక్కొక్కతఱి నాటకమున నాయకుఁడొక్కఁడు గాక యిరువు రుండుట సంభవించును. ఈ యిరువురి పరస్పర సంఘట్టము చేతనే యప్పుడు విషాద భావము లంకురించును Othello నాటకమునఁ జివరి యంకము వఱకు నాతఁడు చేయున దెద్దియు లేదు. Iago ఒక్కఁడే నాటకమున కంతకును జీవగఱ్ఱయై తుదిదాకఁ గథను సాగించుచుండును. ఇందు వంచనా వ్యగ్రుఁడైన యియాగోయును, నసూయా పరవశుఁడై యంత్యదశ బ్రాపింపనున్న Othello యును సమాన ప్రాముఖ్యము కలవారుగానే కానవచ్చుచున్నారు. ఇప్పుడిప్పుడు నిర్నాయకములైన (Heroless) విషాదాంత నాటకములు కూడ బయలు దేఱుచున్నవి.

విషాదాంత నాటకములలో మిక్కిలిగా దృష్టి నాకర్షించు విషయ మందలి లాలిత్య రాహిత్యము. ఇదియే ఖేద మోదాంతనాటకములకుఁగల ప్రధాన భేదములలో నొకటి. మోదాంత నాటకములు స్త్రీపుంపాత్ర పరిమేళనము కలిగి పౌరుషముతోపాటు పూఁబోడి తనమును గూడఁ బ్రదర్శించు చుండును. ఖేదాంతనాటకములలో స్త్రీ పాత్ర లుండుటయే యరుదు. ఉన్నను వారు స్త్రీ సహజ లాలిత్యమునఁ గొఱవడి సర్వవిధ

ముల పురుష సదృశలై యుందురు. Macbeth భార్యయు, కార్డిలియాయు నిట్టివారే. Desdemona లో స్త్రీ లాలిత్యము మూర్తీభవించి యున్నది. కాని యామె నాటకము నందలి వస్తు విస్తృతి కే విధముగను సహాయపడదు.

ఇతర విషయములలోవలెనే ఖేద మోదాంత నాటకములకు శైలిలోఁ గూడ నుంత భేదము కలదు. మోదాంత నాటకములలో గద్యమునుకాని యంతకంటెఁ గొంచె మున్నతమయ్యు దానికి సన్నిహితమయిన పద్యమునుగాని వాడినచోఁ జాలును. కాని ఖేదాంత నాటకములలో వాని భావరంజకత్వమున కనుగుణముగా లయాన్విత మయిన ఛందోగమన ముండుట మిక్కిలి యావశ్యకము. ఇట్లని మోదాంతములలో నుత్తమ కవిత్వమును కాని ఖేదాంతములలో గద్యాత్మకమయిన సంభాషణను కాని ప్రవేశపెట్టరాదను నియమము లేదు. పాత్రల యన్యోన్య తారతమ్యమును బ్రదర్శించుటకుఁ గాని మితిమీఱిన విషాదోత్కర్షను దగ్గించుటకుఁగాని కవి గద్య పద్యాత్మకము లయిన సంభాషణముల రెంటిని నాటకమునఁ బ్రవేశపెట్టవచ్చును. దీనినే Horace "Sometimes comedy may exalt her voice and chremes when in a passion may rail in timid strain: and so a tragic writer may often express the tragic grief in prosaic style" అని చెప్పెను. Shakespeare ఇట్టే విషాదాంత నాటకములలో నచ్చటచ్చట గద్య సంవాదమును గూడ వ్రాసియుండెను. Hamlet లో నతని యున్మాదమును, సుపరిచితులతోడి సంభాషణమును, ప్రేత భూమి యందలి (church-yard) యనాగరికుల సంభాషణమును గద్యములోనే వ్రాయఁబడినవి. కాని మొత్తము మీఁద (Shakespeare) తన విషాదాంత నాటకములలోఁ జాలభాగమును (Blank verse) అను ఛందస్సహిత భాష లోనే వ్రాసెను. Romeo and Juliet మొదలగు నాటకములలో నతఁడు లయాధిక్యముతోఁ గూడిన ఛందోవృత్తముల వాడుటయుఁ గలదు. అధునాతనులు నాటకములు ప్రకృతికి సన్నిహితములుగా నుండవలెనను నుద్దేశముతో వానిని గద్యములోనే వ్రాయుచున్నారు. ఇట్లు చేయుటలో వారు తమ పూర్వుల పద్యములు వాడి చూపఁ గలిగిన రంగపాత్ర సమీకరణమును (balancing of characters and scenes) ప్రదర్శించుటకుఁ దగిన యుత్తమమయిన సాధనమును గోల్పోవలసిన వారైరి. అదియును గాక విషాదాంత నాటకములలో లయాన్విత భాషవలన నొక గొప్ప లాభము చేకూరుచున్నది. ఏలయన నిది విషాద తత్త్వము (Tragic spirit) యొక్క నైరాశ్యమును మహాభయమును కొంతవఱకైన తగ్గించుటకు సమర్థత కలిగి యుండును.

# III

## విషాదాంత నాటక భేదములు (Types of Tragedy) :

ఈ విషాదాంత నాటకములలోఁ బెక్కువిధములు కలవు. గ్రీకు నాటకములలో "chorus" అను గాయక బృందము యొక్క ప్రవేశము సార్వత్రికము. ఈ నాటకములలో నైక్యత్రయము యథాక్షరముగాఁ బాటింపఁబడెను. కాని రానురాను chorus ప్రాముఖ్యము సంపూర్ణముగాఁ దగ్గుటయు, నైక్యత్రయమును యథేష్టముగా నతిగమించుటయుఁ గానవచ్చుచున్నది ఎలిజబెతు యుగమునకుఁ బూర్వము విషాద నాటక తత్త్వ మొక గొప్ప వాఁడు మహాసౌఖ్యమునుండి పతనము నొంది దుఃఖము నందుటలోనే యిమిడి యుండెను. అప్పుడప్పుడే ఈ నాటకములకుఁ గద్యాత్మకమైన యాకార మొసంగఁబడుచుండెను. వానిలో నీతిబోధ కొంత ప్రాముఖ్యమును వహించుటయుఁ దఱచు. తరువాతివాఁడగు "మార్లో" మహాకవి నాటకములకుఁ జారిత్రికమయిన విలువ విరివిగాఁ గలదు. కాని వీనిలో రచనాక్రమమునందును బాత్ర పోషణాదుల యందును బెక్కు లోపము లుండుటచే నివి మహోన్నతములయినవి యని చెప్పుటకు వీలులేదు. అయినను Shakespeare విషాదాంత నాటకములలోని మహత్త్వము బీజప్రాయముగా వీనియందును గలదు Shakespeare రచనలో నీ విషాదాంత నాటకముల కొక స్థిరమైన యాకార మేర్పడెను.

షేక్స్పియరు తరువాతివారితని పెక్కు విషయములలో ననుకరించిరి. ఇతని నాటకములు భిన్న భిన్న రచనా క్రమములు కలిగియున్నను వాని యన్నిటికిని సాధారణములైన లక్షణములు కొన్ని కలవు. వానిలో విషాదత్త్వము ప్రధానికమైన బహిరాచరణము వలనను, బుద్ధి భావ మధ్య జనితమైన యాంతర సంఘర్షణము వలనను ద్యోతితమగుచుండును. ఈ రెండు నొక్కొక్కప్పు డన్యోన్య ప్రతియోగులై యుండుటయుఁ గలదు. వీనిలో నతిలోకములైన శక్తుల ప్రభావము విరివిగా నుండుటయే కాక యవి నాయకుని జీవితముతో సన్నిహిత సంబంధము కలిగియుండుట యొక విశేషము. అదియుఁగాక యితని నాయకు లందఱు నొక విధమైన పరిస్థితిచే నావరింపఁబడి విధి కెదురీదలేని వింత యవస్థలో నుందురు. ఇతని తరువాత వీర్యాత్మకము లైనట్టివియు, భయాత్మకములైనట్టివియు విషాద నాటకములు వెలువడినవి. భయాత్మకములైన వానిలో (Horror tragedies) సన్నివేశములకుఁ బ్రాధాన్యము హెచ్చు. ఆధునికులు సాధారణ గృహ జీవితముతోఁ గూడిన విషాదాంత నాటకములను గూడ (Domestic tragedies) వ్రాయుచున్నారు. కాని వీనిలో విషాద నాటకముల కావశ్యములైన ధీరత్వమును గాంభీర్యమును గొఱంత పడియుండును.

# IV

ఆచార్యులుగారు రచించిన నాటకములలో మరణాంతములైనవి నాలుగు. పాశ్చాత్య విషాద నాటక క్రమమును బట్టి చూచినచో వీనిలో రెండు మాత్రమే విషాద నాటక నామమునఁ బిలువఁదగియున్నవి. ఈ విషాద నాటక రచన విషయమున మనకు మార్గదర్శకులు పాశ్చాత్యులే యగుటచే నీ నాటకముల విమర్శించు పట్ల వారి పద్ధతినే యనుసరింపవలెను. వారి విషాద నాటకములలో నాయకుఁ డంత దుష్టుఁడు కాకపోయినను మానవ సహజమగు దౌర్బల్యముచే నొక తప్పు నాచరించుటయు, నా దోషమే క్రమ క్రమముగా ననేక దోషములకు హేతువై యాతని పతనమునకు కారణభూతమగుటయు, నాతని హృదయమున పరస్పర విరుద్ధములైన రెండు భావములకు సంఘట్టనము కలుగుటయు, నాతని దెస కాననగు నౌదార్యాది సద్గుణము లాతని దోషమును మఱుగుపఱిచి సామాజికుల సానుభూతి నాకర్షింపఁ జాలుటయు ముఖ్య లక్షణములు. యథాశాస్త్రముగా నిట్టి లక్షణములు కొన్నియైన నాచార్యుల వారి పై నాటకములలో సమగ్రముగాఁ గానరాకున్నను నవి విషాద నాటకములను భావము కలిగించు పోకడలు రెండు మూఁడందుఁ గలవు. హిందూ నాటక సంప్రదాయమునకు విరుద్ధముగ నాయకునియొక్క కాని తత్తుల్యుఁడగు మఱియొకనియొక్క కాని మరణముతో నాటకములను ముగించుట, వానిలో నొకటి. తరువాత ఆచార్యులు గారే తమ నాటకములు కొన్నిటిలో వాని నామమునందును, నాందీ ప్రస్తావనల యందును నా నాటకములు విషాదాంతములని సూచించుట రెండవది. 'విషాద సారంగధర' పేరునందును, పాదుకా పట్టాభిషేకముయొక్క ప్రస్తావనలోని సూత్రధారుఁడన్న 'అందు విషాదాంతము కాక యుండినను, బృథివి నున్న యన్ని విషాద నాటకములకును మిన్నయన్న వన్నెంగన్న చెన్నున ...వాల్మీకి తన రామాయణమున నయోధ్యా కాండ రచియించి యున్నాఁడు గదా:' అను వాక్యమునందును కవి తాను వ్రాయఁబోవునది విషాద నాటకమని సూచించుటకుఁ జేసిన ప్రయత్నము స్పష్టముగాఁ గానిపించుచున్నది.

## అజామీళ చరిత్రము : అభిజ్ఞాన మణిమంత నాటకము

నాయకుఁ డంతమందు మరణించుటయే విషాద నాటకముయొక్క ప్రధాన లక్షణము కాదు. ఆతని మరణము సామాజికులలో కరుణ సంత్రాసములను గలిగించుటకు సమర్థమై యుండవలెను. ఈ భావములు సామాజికుల హృదయమున

నంకురింపనిచో నా నాటకము మరణాంతమే యయ్యు విషాదాంతము కాఁజాలదు. అందుచేతనే విషాద నాటకములలో నాయకుని దోషాచరణముతోపాటు అతని యౌదార్యమును గూడ వర్ణించి కవి సామాజికులకు నాయకునిపై సానుభూతి కలిగింపవలెను. అట్లుగాక అతఁడు సర్వథా వధ్యుఁడే యను భావము వారికిఁ గలిగినచో నా నాటకముయొక్క యుదాత్తతకు భంగము వాటిల్లును. ఇట్లే ఒకఁడు వయోఽధికత చేతనో లేక మఱి యే రోగము చేతనో బాధపడి మరణము పొందినచో నప్పుడా సంగతి వినువారి చిత్తములలో కరుణ సంత్రాసము లుదయింపవు. ఆ మృత్యువు సహజముగ బ్రదుకవలసిన కాలమంతయు ముగియుటచే సంభవించినదే కాని యహంతరముగా నతఁడు తాఁ జేసిన దోషముచేఁ దెచ్చిపెట్టుకొన్నది కాకపోవుట యందుకుఁ గారణము అజామీళ చరిత్రములో నాయకుఁడైన యజామీళుఁడు ప్లేగు రోగముచే మరణించి మరణకాలమున తా నుచ్చరించిన నారాయణ నామ ప్రభావముచే వైకుంఠము చేరెను. ఇట్లీతఁడు మానవ సహజమగు రోగముయొక్క పరిభావము చేతనే మరణించుటచేతను, మరణించినను ఉన్నతమును, వాంఛనీయము నగు వైకుంఠమును ప్రాపించుట చేతను, ఈతని చరిత్ర సామాజికులలో కరుణ సంత్రాసములను గలిగింపఁజాలదు. అందుచే నది విషాద నాటకపు పొలిమేరకు ఆపల నుండఁదగినది.

అభిజ్ఞాన మణిమంత నాటకము తొలుఁదొలుత విషాదాంతముగానే రచియింపఁబడినను ముక్తావళి నాటకమువలె తరువాత సాధారణ మోదాంత నాటకముగా మార్పఁబడెనఁట. దానికి ఆ నాఁటి యాంధ్రలోకములో విషాదాంత నాటకములపై వెలువడిన యాక్షేపణములును, నిరసనములును కారణములై యుండును. కాని యిటీవలి ముద్రణములో నది మరల విషాదాంత నాటకముగానే ముద్రింపఁబడినది. ఇచ్చట గమనింపవలసిన విశేష మొండు గలదు. నాటకముయొక్క విషాదాంతత్వము కవియొక్క యూహాపోహల ననుసరించియు, కాల పరిస్థితుల ననుసరించియు యథేష్టముగా మార్పఁబడుటకు వీలు లేదు. అవి యందలి నాయకుల స్వభావములనుబట్టి విషాదాంతములో, మోదాంతములో యగుట నిశ్చితమై యే సందర్భముల యందైనను నట్లే స్థిరముగా నుండి తీరవలెను. Shakespeare రచించిన హామ్లెటు, ఒథెల్లో అను నాటకములు మోదాంతములుగా మాఱుట యేమో యూహకు కూడ నందరాని విషయము, వారి దురదృష్టవశమున నా నాయకు లిరువురును తమ శక్తికి మించినట్టియు తామన్యథా నిర్వహింపఁజాలనట్టియు కొన్ని వింత పరిస్థితులలో పెట్టఁబడిరి. ఆ పరిస్థితు లే సందర్భమందైనను వారి యంతమునకే దారి చూపును గాని యుచ్ఛ్రియమునకు తావొసంగవు. సహజముగా విషాదాంతము కావలసిన కథను మోదాం

తముగా చేయుటకు కవి భవభూతి యుత్తర రామచరితము నందువలెను, శ్రీహర్షుఁడు నాగానందము నందువలెను, అతిలోకములైన మహిమలయొక్కయు పాత్రముల యొక్కయు సహాయమును పొంది తీరవలెను. అట్లు చేయుట నాటకముయొక్క నిసర్గమైన యవసానమునకు కృత్రిమత్వము నారోపించుట యగును.

అభిజ్ఞాన మణిమంత నాటకములో నాయకుఁడు చంద్రహాసుఁడని వ్రాయఁబడినది. కాని నాటకములోని కార్యమంతయు మంత్రియగు దుష్టబుద్ధియొక్క దుస్తంత్రముల ఫలితమై యతని మీఁదనే యాధారపడి యున్నది. మొదటినుండియు చంద్రహాసుఁడు క్రియాశూన్యుఁడైన యప్రధాన పాత్రవలెనే కానవచ్చుచున్నాఁడు. అసలితనికి ప్రథమాంకమున స్థానమేలేదు. మూఁడవ యంకమందలి యుద్యానరంగములో జరిగిన ప్రణయగాథలో నితనికి సుంత ప్రాధాన్యము కలదు కాని యా ప్రణయగాథయే నాటక కార్యమంతయుఁ గాదు. ఇతఁ డితరులచే కల్పింపఁబడిన తంత్రములకు గుఱియయ్యె. దైవ వశమున వానినుండి తప్పించుకొనుటయే కాక తానుగాఁ జేసిన కార్య మేమాత్రమును గానిపించదు. కాఁగా నీ నాటకమున నితఁడు కాక దుష్టబుద్ధియే ప్రధాన పాత్ర యనుట యుచితముగాఁ దోఁచును.

నాటక కార్యమంతయును దుష్టబుద్ధి యూహలమీఁదను చర్యల మీఁదను ఆధారపడియుండుట నిజమేయయ్యె నాతనియందు విషాద నాయక లక్షణము లేమియుఁ గానిపించుట లేదు. ఈతఁడు చంద్రహాసుని జంపుటకై చేసిన ప్రయత్నము లన్నియు నితని బుద్ధి కుశలతను జాటుచుండుటయే కాక కుటిల స్వభావమునకుఁ గూడఁ దార్కాణములుగా నున్నవి. కాని దైవ మీతనికి విరుద్ధ మౌటచే నీతని ప్రయత్నములన్నియు భగ్నములై యితనికి మిక్కిలి విచారమును గలిగించెను. పైఁగా నితఁడు చంద్రహాసుని చంపుటకై తన కుమారునికి లేఖ వ్రాసి పంపఁగా నది విషయ యొనర్చిన మాయోపాయముచే నితని మనోరథమునకు మిక్కిలి వ్యతిరేకముగా జరుగుట సంభవించెను. తన ప్రయత్నము లిన్నిసార్లు భగ్నములైనను ఈతఁడు తన పట్టుదలను మాత్రము విడువలేదు. అసలితఁడు చంద్రహాసునిపై విరోధముఁ బూనుటకు బలవంతమైన హేతువే కానరాదు. కుంతలరాజు తప్పిపోయిన మణిమంతుఁడు లభింపని పక్షమునఁ దన కుమార్తెను దుష్టబుద్ధి కుమారుఁడగు మదనుని కిచ్చుట కంగీకరించెను. అతనికి కుమార సంతతి లేకపోవుటచే రాజ్యమంతయు నప్పుడు మదనునికే సంప్రాప్తించును. ఈ కారణముచే దుష్టబుద్ధి యెట్లైనను మణిమంతునిఁ జంపుటకై ప్రయత్నములు కావించెను. ప్రకృతిచే దుష్టుఁడయిన యీతనికి పరోచ్ఛ్రియము సహింప

లేకునికి నైజ గుణము. చంద్రహాసుఁడు కుంతలరాజునకు పంపిన యమూల్యాభరణాదులఁ గాంచినంతనే చంద్రహాసుఁడు మణిమంతుఁడను విషయ మాతనికిఁ దెలియక పోయినను, అతఁడా రాజును నాశనము కావించుటకై తలపోసి, నృపునికి నచ్చఁజెప్పి, తగిన యధికారమును చేఁజిక్కించుకొని చందనావతి కరిగెను. ఇతనికి రాజ్యము లభించునను నాశయేకాని తన సంతానము సౌఖ్యమునకు భంగము కలుగునేమో యను భయమే లేదు. ఆ కారణము చేతనే యీతఁడు మదనుఁడు వాసంతిని వివాహమాడుట కంగీకరింపలేదు. తన కుమార్తెయగు విషయ నెనుబదియేండ్లు దాఁటిన ముదివగ్గున కిచ్చి వివాహము గావింప నెంచెను. ఈ దుస్స్వభావముచే నితఁడు తాను గన్న సంతానమునకుఁ గూడ విరోధి యాయెను.

ఇట్లు దుష్టబుద్ధి బ్రిదుకంతయుఁ జర్యలన్నియు నైర్ఘృణ్యముచేతను, దురాచారముల చేతను గలుషితములై యున్నవి. ఇట్టివాఁడు మరణించినచో సామాజికులలో నే విధమైన కరుణమును గలుగదు. సర్వ విధముల నితఁడు చచ్చిననే బాగుగానుండు నను తలంపే వారి హృదయములలో నుండును. ఇట్లు సామాజికులలో సానుభూతి కలిగింపఁజాలని నాయకుఁడు విషాద నాయకుఁడుగా నుండుట యా నాటకము యొక్క యుదాత్తతకు భంగము కలిగించును. కాని చంద్రహాసుని పాములచే కఱపింపఁబూనుటకుఁ బూర్వము దుష్టబుద్ధి హృదయమున పుత్రికా ప్రేమకును దురాశకును పెద్ద సంఘర్షము కలిగినది. ఈ యంతర్వైరమున నాతని హృదయములో చిరకాలమునుండి రూఢమూలమైన దురాశయే జయింపఁగల్గెను. ఏలయన చంద్రహాసుఁడు తన కుమార్తెను వివాహమాడ నంతవఱకును అతనిని చంపుటలో నితని కెట్టి వెనుబాటును లేదు. కాని యీతఁడు తన మనోరథమునకు వ్యతిరేకముగనైన నల్లుఁడగుట సంభవించిన తరువాత నతనిని జంపుటలో నతఁడు తన కుమార్తెకు గల్పింపనున్న వైధవ్య దుఃఖము సాక్షాత్కరించి యతనికిఁ గొంత దయను, వెనుబాటును గల్గించెను. కాని క్షణికమైన యీ దుఃఖము తొలఁగిన వెంటనే యీతడు క్రూరముగ తన యల్లుని చంపుటకై బిందోజీనుండి పాముల గ్రహించి దేవాలయమున కేగెను. కాని దైవ వశమున నచ్చటికి చంద్రహాసునికి బదులు మదనుఁడే వచ్చుట తటస్థించుటచే నా పాము లాతనినే కఱచి చంపెను. దుష్టబుద్ధి లోనికేగి సర్పోపహతుఁడగు నిజ పుత్రునిఁ గాంచి విచార భిన్న హృదయుఁడై నేలఁగూలెను. ఈ యాంతర సంఘర్షమునందును, మహా విచారమునందును కవి దుష్టబుద్ధి మృదు స్వభావమును, గాంభీర్యమును (nobility) కొంత ప్రదర్శింపఁ జూచెను గాని యది ముందు పేర్కొనఁబడిన యాతని దుర్మార్గతను మఱుగుపెట్టునంత యుదాత్తముగా

లేదు. కావుననే దుష్టబుద్ధిలో విషాదాంత నాయకుని కుండవలసిన సానుభూతి సంధు క్షకములగు గుణములు లోపించుటయు నీ నాటకము విషాదాంత నామయోగ్యము కాక పోవుటయు సంభవించినది.

ప్రస్తుత ముద్రిణమున మదనుడు బిందోజీ యద్భుత శక్తివలన, కేశాగ్రగత ప్రాణు డయ్యును బ్రదుకఁగల్గెననియు, అఘోరుఁడు మొదలగువారు దుష్టబుద్ధి మణి మంతుని చంపుటకై చేసిన ప్రయత్నము లన్నిటిని వెల్వరించి యాతని క్రూరత్వ మును కపటోపాయమును బయటపెట్టుటచే నతఁడా లజ్జ భరింపఁజాలక తానుజేసిన దోషము లన్నిటి నంగీకరించి పశ్చాత్తాపతప్తుఁడై పొడుచుకొని చచ్చెననియు వర్ణింపఁ బడినది. మదనుఁ డతిమానుషమయిన యా బిందోజీ విషాపసారణ ప్రభావమువలన బ్రిదుకఁగల్గుట యీ నాట కాంతమున విషాదభావమును మిక్కిలిగాఁ దగ్గించి వైచి నది. అట్లుగాక మదనుఁడు సర్పోపహతుఁడై మరణించినట్లును, దాఁ జేతులతోఁ దెచ్చిపెట్టుకొన్న పుత్త్రిమరణమునకు ఫలితమయిన మహావేదనచే దుష్టబుద్ధి కృశించి కృశించి కాలగోచరుఁడయినట్లును వర్ణింపఁబడియుండినచో నీ నాటకము యొక్క యంతమయినను కరుణ సంత్రాసములఁ గలిగింపఁ గల్గుటయుఁ గావ్యనీతి ప్రకారము దుష్టబుద్ధి తన దురాచరణములకుఁ దగిన శిక్ష యనుభవించెనని సామాజికులు సంతో షించుటయు సంభవించియుండును. యథాస్థితముగా నున్న కథనుబట్టి పరిశీలించినచో దుష్టబుద్ధి మరణమునకు హేతువు కానఁబడదు. కథాంతమం దతని హృదయమున పశ్చాత్తాపము కలిగినను ఆ పశ్చాత్తాపమునకు మూలమయిన మదన మరణము దైవ వశమున ప్రతికరింపఁ బడుటచే నతఁడు పొడుచుకొని చచ్చుటకు బదులు సంతోషించి సుఖముగాఁ గాలము గడపవలసినది. అసలు ఆచార్యుల గారికి మదన మరణము తోడనే నాటకము ముగించు నుద్దేశ ముండె ననుట కుత్తర రంగములోని 'గుణ భూషణుని నా కొమరుని జంపితిని....నా నోముల ఫలంబు నా నిదానంబు.... నా కుమారుం డిటు ననుఁ బాసిపోవ శోకాగ్ని చహియింప సుకుమారుఁ జూడ— వేసారి దరిఁజేరు విధి గానలేక వగఁ జెంది కుంది నెవ్వగ లొందికంది జగతిదుఃఖపుఁ జావు చావ లోనైతి నా కామితార్థంబునకు ఫలం బిదియె....నాదు మాత్సర్యంబునకు ఫలం బిదియె' అను దుష్టబుద్ధి వచనములు నిరర్థకముగా నున్నవి. నాటకము నిష్టము వచ్చినట్లు విషాదాంతముగను మోదాంతముగను రెండు మూఁడు సారులు మార్పవలసి వచ్చుటచే నీ పొరపాటు తటస్థించి యుండును.

ఇట్లే క్రూరత్వ మొనర్చినవాఁడు నాయకుఁ డగుట Shakespeare విషాద నాటకములలో నుత్తమోత్తమమయిన Macbethలోఁ గానవచ్చుచున్నది. Macbeth

రాజ్యతృష్ణచేఁ దన రాజగు డంకనును అతిథియై విందారగింపవచ్చిన వానిని దన చేతులతో తాఁ జంపెను. ఈ విషయ మాతని దారుణమయిన క్రూరత్వమును వేనోళ్ళఁ జాటుచున్నది. ఇట్టివాఁడు తుదిని మరణించినచో సామాజికుల చిత్తములలో కరుణ సంత్రాసము లుదయించుట యసంభవము. కాని కవి యాతఁడు స్వామిహత్యకుఁ గడంకుటకు పూర్వ మనుభవించిన యంతర్వేదనను, హత్యానంతర మనుభవించిన భయదుఃఖభావ సమ్మేళనమును పూర్ణముగా వర్ణించి సామాజికులాతని ఘోరదోషమును సైతము విస్మరించి యతనిని సానుభూతితోఁ దిలకించు నట్లొనర్చెను. కళాపరిపూర్ణుఁ డగు కవి యొనర్చిన యీ శీల పరివర్తనమే నాటకముయొక్క విషాద తత్త్వమునకు జీవగఱ్ఱగా నున్నది. అతఁ డీ మార్పుచే నాయకుని యొక్క యౌదార్యమును (Nobility) ప్రకటించి యుండకపోయినచో నతఁడు దుష్టబుద్ధివలెనే వధ్యుఁ డగుటచే సామాజికుల సానుభూతి నాకర్షింపఁజాలక పోయియుండును. కాని దుష్టబుద్ధిలో నీ యాంగ్లనాటకమునందువలె నాయకుని దోషమును విస్మరింపఁజేయఁ జాలునంత యౌదార్యము వర్ణింపఁబడకపోవుటచే నా నాటకము విషాదాంతతా గౌరవమునకు వెలియై యున్నది.

## V

### పాదుకా పట్టాభిషేకము :

కవి యిందలి కథను వాల్మీకిరామాయణము నందలి యయోధ్యాకాండమునుండి గ్రహించెను. వాల్మీకి మహర్షియే యీ భాగమునందు విషాదతత్త్వము (Spirit of tragedy) యొక్క ఉత్కర్షను బహు నిపుణముగాఁ జిత్రించెను. నిజము పరిశీలింప నిచ్చట విషాద భావవాహిని ద్విముఖముగా ప్రవహించుచున్న దనవచ్చును. పుత్రశోక వ్యథా పీడితుఁడై సత్యసంగరుఁడయిన దశరథుఁడు మరణించుటయుఁ, దాఁ దలఁచినట్లు తన పుత్త్రుఁడగు భరతుఁడు రాజ్యమును గ్రహింపక రాజమరణ ప్రాప్తమగు నూత్న వైధవ్య భారముచే దుఃఖించు తన్ను పలువిధముల దూషించి, యరణ్యమున కేగి రామాజ్ఞ ననుసరించి యాతని పాదుకలకే పట్టము గట్టుటచే కైక యాశాజ్యోతి నిర్వాపిత మగుటయు నీ వాహినీ ద్వితయమునకు ప్రభవములయిన పెద్ద జలపాతములు. కాని వాల్మీకి దశరథుని విచారవ్యథల వర్ణించినంత తీవ్రముగా కైక నిరాశయొక్క

యాధిక్యమునుగాని హృదయాంతర వివిధ భావములను గాని స్పష్టముగా వర్ణింపఁ బ్రయత్నించి యుండలేదు. అతఁ డట్లు చేసి యుండినచో పైని పేర్కొనఁబడిన రెండు విషాదగాథలును మూలమునందే తద్భావవ్యక్తీకరణమునందు పర్యాప్తములై యప్రతిమానములై యుండెడివి.

నాటక కవి యీ రెండు విషాదగాథలను మిక్కిలి ఉదారముగా చిత్రించి తద్భావవ్యంజన విషయమున మూలమునకుఁ గూడ వన్నె చేకూర్చెను. అందు మొదటిదయిన దశరథ మరణ వృత్తాంతమును గైకొందము. దశరథుఁడు దేవాసుర యుద్ధ సందర్భమున తా పోర నేగినపుడు కైక చూపిన మాయోపహార విద్య కలరి యామెకు రెండువరము లీయ వాగ్దానము గావించెను. దేనను కొఱంతలేని కైక యా వరముల నప్పుడే యడుగకుండుటచే కాలము గడచిన కొలంది దానిమాటయే మఱచెను. కాని రామపట్టాభిషేక సమయమున మంథర వచ్చి యామెకు దుర్బోధ కావించి యా వరముల సంగతి జ్ఞాపకము చేయుటయే కాక వానిలో నొకదానిచే రామ వనవాసమును, రెండవదానిచే భరత పట్టాభిషేకమును సాధింపుమని యుపదేశించెను. తన్నుఁ గన్నతల్లితో సమానముగా పూజించు మాతృభక్తిపరాయణుఁడగు రాముని నిష్కారణముగా వనభూమి కంపుట కామె హృదయము నిజముగా సమ్మతింపక పోయినను, మంథరా ప్రేరణము వలనను, అంతకంటె బలవత్తరమయిన విధి ప్రేరణమువలనను తుద కామె యట్లే చేయవలసివచ్చెను. రామపట్టాభిషేక విషయమును గూర్చి తనతో దశరథుఁడు చెప్పుటకై యేతెంచినప్పు డామె కోపగృహమున పరుండియుండెను. దశరథుఁ డామెను వేయి విధముల ననునయింపఁబ్రయత్నించెను. ఆమెయు సందర్భవశమునఁ నీ వడిగిన దేదియైనను నిరాటంకముగా నిచ్చెదనని తొలుఁదొలుత నొట్టు పెట్టించుకొని భరతునికి పట్టము గట్టుమని యడిగెను. దశరథుఁడు మిక్కిలి విచారపూరితుఁడై "నీవు నూతఁ గాకపోయినచో నీ ప్రాప్తియున్న చోట పడుము, పొమ్ము. అంతేకాని నేను రాముని విడిచి భరతున కిపుడు పట్టము కట్టఁజాల" నని నిస్సంశయముగాఁ జెప్పివైచెను. ఈ విషయము దశరథునికి రామునిపైఁ గల యపార ప్రేమను చాటుచున్నది. అతనికి రామునిపైఁ గల యీ ప్రేమోత్కర్షను సంపూర్ణముగా గ్రహించినఁగాని యీ భాగమునందలి విషాద తత్త్వము విస్పష్టముగా బోధపడదు.

దశరథునికి పెద్ద కాలమువఱకును సంతానమే కలుగలేదు. చివరి కాతనికి పుత్త్రికామేష్టి యాగముయొక్క ప్రభావముచే నీ పుత్త్రి చతుష్టయ ముదయించెను.

ఋషి దంపతులు స్వపుత్త్రి మరణ కుపితులై "మావలెనే నీవును పుత్త్రిశోకముతోడి చావే చత్తువు" అని శపించునాఁటికి దశరథుఁ డనపత్యుఁ డగుటచే నాతఁ డా శాపము వలన తన చావుమాట యెట్లున్నను, తనకు పుత్త్రి సంతానము కలుగుట దృఢపడిన దని మిక్కిలి సంతోషించెను. దశరథునికి, కానక కన్న యా సంతానముపై నంత పేృమ. అందును రాముఁడు జ్యేష్ఠుఁ డగుటచే నతని కాతనియెడఁగల ప్రేమకు పారమే లేదు. రాముఁడు సర్వగుణ సేవధియై యుండుటయు, క్షత్త్రియోచితమయిన పరాక్రిమమున కాటపట్టగుటయు, వినయాదులం దప్రతిమానుఁ డగుటయు నాతని ప్రేమకు మఱింత యాధిక్యమును గలిగించెను. ప్రజలకు రాముని సుగుణములన్నియు తెలియును. వా రాతని పాలన ననుభవించుటకై యువ్విళు లూరుచుండిరి. దశరథుఁడును సంప్రాప్త యౌవనుఁడయిన తన జ్యేష్ఠసుతునిపై రాజ్యభారమునుంచి తాను వాన ప్రస్థాశ్రమము స్వీకరించుటకై మిక్కిలి యుబలాట పడుచుండెను.

ఎన్నో విధముల రాజ్య పట్టాభిషేకమునకుఁ దగిన రాముని వీడి భరతునికి పట్టముఁ గట్టుమనుటలో నాతని కెట్టి న్యాయమును గోచరింపలేదు. అందుచేతనే ప్రియురాలి ప్రణయమును కూడ విహతము గావించుట కాతఁడొడిగట్టెను. కైక దశరథుని యీ ధిక్కారమును విని మంథర చెప్పిన వాక్యములలోని సత్యమును విశ్వసింపఁగల్గెను. వెంటనే యామె వెడలినది మరల ప్రవేశించి దేవాసుర యుద్ధకాలమున దశరథుఁడు తన కిచ్చెదననిన యా రెండు వరములలో నొకదానిచే రాముని విప్రోషితునిఁ గావించుటయు రెండవదానిచే భరతుని రాజ్యాభిషిక్తుఁ గావించుటయు జరుగవలెనని నిర్బంధించెను. దశరథుఁ డీ మాటలు విని నిర్ఘాంతపడి యామెను పెక్కు విధముల బ్రతిమాలెను. చివరికి స్త్రీయని యైన వెసుదీయక యామె పాదములు పట్టుటకు సైతము సిద్ధపడెను. పట్టాభిషేకము భరతునికే యైనను రాముఁడు వనవాసమున కరుగకుండఁ జేయుమని యాతఁడామెను ప్రార్థించెను. ప్రకృతిచే మృదువైన కైక హృదయము భర్త దీన వచనములచే ద్రవీభూతము కాఁదొడంగెను. కాని వెను వెంటనే మిత్త్రివలె కాచుకొనియున్న మంథర యామెకు కాఠిన్యమును నూరిపోయుటచే దశరథుని దీనాలాపముల కెట్టి ఫలితమును చేకూరియుండలేదు. ఇంతలో కైక సుమంత్రిని పిలిచి రాముని తీసికొని రమ్మని యాజ్ఞాపింప నాతఁడు సలక్ష్మణుఁడైన రాముని వెనువెంటనే తోడి తెచ్చెను.

దశరథుని హృదయమున నీ భాగమున సత్యపాలనా పుత్త్రి పేృమలకు తీవ్రమైన పోరాటము సంభవించెను. రెంటియందును నాతని నిష్ఠ సురూఢమే. రాముఁడు

వనవాసమున కేగిన తత్క్షణమే తాను జీవమును వీడుట తప్పదని యాతఁడెఱుంగును. అయినను పారంపర్యముగా సత్యపాలనయందు చిర ప్రథితమైన యిక్ష్వాకు వంశము యొక్క విమలకీర్తికి కళంకము తెచ్చుట కాతని చిత్తము సమ్మతింపలేదు. అందు చేతనే యాతఁడు తన ప్రాణము పోవుటకైన నంగీకరించి, కైక రామునికి వల్క-లాదు లొసంగి వనమున కేగ నాజ్ఞాపించుట వినియు నేమియుఁ జేయలేక 'పుత్రా పోయెదవా! నా యత్నము లేదు' అని మాత్రము చెప్పెను. రామలక్ష్మణాదుల రథ మరణ్యమునకై పోవుచుండఁగా నాతఁడు దాని వెంబడించెను. రథము నాపుమని యెన్నియోసారులు పలవించెను. చివరికి మూర్ఛితుఁడగుటచే కౌసల్యాదులచే తీసికొని పోఁబడెను.

దశరథుఁడు తన భార్య మాయోపహార విద్యకు మెచ్చి వరము లిచ్చుట కంగీక గింపవచ్చును. ఆతఁడిచ్చిన నీయమగ్రహింపనువచ్చును కాని తానెప్పుడో యీయ నం గీకరించిన యా వరముల నిమిత్తమున సంప్రాప్తయౌవనుఁడై రాజ్యపాలనకై ప్రకృత్యమాత్యాద్యభిలషితుఁడైన రాముని నరణ్యమునకుఁ బంపుట దశరథుని పాల మహాదోషము. అతఁడట్లు పంపకపోయిన సత్యవాక్య భంగము తటస్థించునే యనిన నది నిజమే. కాని యతఁడట్టి పరిస్థితికి తేఁబడుటయే యాతని దురదృష్టము. ఆతఁ డెంత సత్య పరిపాలన కొఱకు ప్రయత్నించినను రాముని నిష్కారణముగా నరణ్య మునకు పంపుట యను దోషము దోషముగానే యున్నది. పాపమాఁతడా పరిస్థితులలో దానిని చేయక తప్పినది కాదు. ఆతఁడిట్లు చేయుట ప్రేక్షలందఱకును అప్రీతిని కలిగించెను. వారీతనిఁ జంపుటకుఁ గూడ నట్టి సమయములో వెనుదీయరు ఇట్టి మహాదోషము నాచరించిన దశరథుఁడు విషాద నాయకుఁడెట్లగును?

కవి యీ పట్టున మిక్కిలి కౌశలమును బ్రదర్శించెను. నాయకుఁ డిట్లు దోషము నొనర్చిన పట్ల దోషాచరణము తరువాత నాతని శీలమున పశ్చాత్తాప సంభరితమైన యొక పరివర్తనము కావించుట Shakespeare అలవాటు. అతఁడు Macbeth లో నిట్టి పద్ధతినే యవలంబించెను. దోషాచరణానంతరము Macbeth మహాభయ సంకుల మైన, విచారమయమైన జీవితమును గడపెను. అతనికి భూతల స్పర్శ మాత్ర భిన్నమైన స్వర్గమగు రాజ్య మబ్బెనన్న మాటయే కాని యాతఁడు నిజముగా నరకము ననుభవించెను. అతఁడెటు చూచినను 'ఘనభ వ్యాప్తముగా' రక్త ప్లుతమైన యా ఖడ్గమే కానిపించెను. ఈ కారణమువలననే యతఁ డతినీచమైన హత్య నాచరించినను సానుభూతికి సర్వ విధముల నర్హుఁడయ్యెను. అట్లే యీ నాటకమునందును దశరథుని

చరమ దశను కవి యతి విచారాకులముగా వర్ణించెను అతఁడు రాముఁడు వని కేగక పూర్వము కైకేయిని ప్రార్థించిన విధమే యాతని మనస్సు నందలి పరితాపమును సూచించుచున్నది. తానొక ఘోరమైన దోషము నాచరించెనని యాతఁ డెఱుంగును. అందుచేతనే రాముఁడు లయోధ్య దాఁటిన తత్క్షణమే యాతని మతి చలించెను. అతఁడు జీవించుచునే యమలోక మహానలార్చులలో తాపితుఁ డయ్యెను. అతని కెయ్యెడఁ జూచినను రాముఁడే గోచరించెను; దోషము సర్వతోముఖమై యాతని మిక్కిలి బాధించెను. చివరి కాతఁడు రామా! రామా! అనుచునే తన యసువులు విడిచెను. ఈ రంగ మొక్కటే కవి శిల్ప చాతుర్యమునకు చాలును. ఈ పశ్చాత్తాపముచే, ఈ దురంత వేదనానుభవముచే, కవి దోషియైన దశరథుని పూతునిఁ జేసి సానుభూతి పాత్రునిగా నొనర్చెను. ఇదియే లేకున్నచో దశరథుని దోషమును సమర్థించుట యసాధ్యము. అతఁడు మరణించినను అంత యను కంప నాకర్షింపఁజాలఁడు.

కైక శీలము విషయమున నాటక కవి మూలమునకు భిన్నముగ ప్రవర్తించెను. మూలమున కైక రాజ్యలోభ కలుషితయైనదిగా చిత్రింపఁబడెను. మంథరా దుర్బోధ వినిన యామెకు రాముని నరణ్యమునకు పంపుటలో నెట్టి వెనుబాటును కలిగియుండ లేదు. పరమ దుర్మార్గురాలగు నా దాసి వాక్యములు విని యామె పాషాణ చిత్తురాలై వైధవ్యైక ఫలమగు భరతుని పట్టాభిషేకమును వాంఛించెను. సత్యవాక్య బద్ధుఁడగుటచే కర్తవ్యతా మూఢుఁడైన దశరథుని దీనాలాపములు వినినప్పుడు గాని, అతఁడు పుత్త్ర దుఃఖదోదూయమాన మానసుఁడై మరణించునప్పుడు గాని యామె తాఁజేసిన యప రాధముయొక్క దుఃఖావసానమును తలంచికొని పశ్చాత్తాపమును పొందియుండ లేదు. కులీనతా నిసర్గమైన కరుణ యను దివ్య జ్యోతియొక్క ఒక చిన్ని కిరణమైన చొచ్చుట కవకాశము లేకపోవుటచే నామె హృదయము నిర్దయాంధకార బంధురమై నిఖిల లోకానంద కరుఁడగు రామచంద్రుని నిష్కాసింపఁ బూనెను. అచ్చట నామెలో స్త్రీ సహజమైనట్టి లాలిత్యమే కానిపించదు. అట్టి యామెకు మూలమున నైతము భరతుఁడు రాజ్యమును గ్రహింపకపోవుటచే నైరాశ్యము సంభవించినను గావించిన దోష మక్షంతవ్యమగుటచే నామె శోచనీయురాలుగాఁ గానిపించుటయే దుర్లభము.

నాటక కవి యీ కైక మనోభావములను ప్రదర్శించుటలో నఖండమైన శిల్ప వైదుష్యమును చూపఁగల్గెను నాటకము నందలి కైక మూలమునందలి యామెవలె నిర్దయురాలు కాదు. ఆమె మిక్కిలి యమాయికురాలు. ప్రతి క్షణము ఆమె పాపభీతిని చూపించును. మంథర శ్రీరాముని పట్టాభిషేకమువలన తనకేదో యాపద రానున్నదని

చెప్పినప్పుడు ఆమె "ఆ రామునిపై నీవు పగ సాధించెదవా ! చిఱుతతనమున కందుకముతో కొట్టినంత మాత్రముననే యిట్టి పగ వలయునా ? ఆ రాముఁడెవ్వరనుకొన్నావు. నా కూర్మి సుతుఁడు. వానికి పట్టాభిషేకమయిన నా పరమ భాగ్యము కదా" అని రామ పట్టాభిషేకమునెడ తనకుఁ గల మహానందమును సూచించెను. సుగుణవంతుఁడైన రాముఁడు తానే రాజైనను తల్లియైన తన్ను నీచపు చూపు చూడఁడనియు, నొకవేళ దైవవశమున నట్టి వైషమ్య మేదైన తటస్థించునెడల తన్ను ప్రాణము ప్రాణముగాఁ జూచు పతి బుద్ధి గఱపుననియు, నందుచే, రామాభిషేకము వలన నెట్టి కీడును నాశంకింప నవసరము లేదనియు నామె మంథర మాటలు త్రోసి వైచెను. కాని మంథర బుద్ధి వైశ్వానరుని ముం దీపాటి హేతుతూలము లాగునవి కావు. ఆమె దశరథునికి కైక యెడఁ బూటకపు ప్రేమయే కాని నిక్కువంపు మక్కువ ఒక్కింతయు లేదనియు, రాముఁడు రాజైన నామె కౌసల్య పాద దాసి యగుట నిక్కువమనియు దృష్టాంత పూర్వకముగ విశదీకరించెను. పైఁగా మంచి చెప్ప వచ్చిన తన కామె రామునిపైఁ బగగట్ట నారంభించుటచే నచ్చోటు వీడి గిరివ్రజపురమునకు పోవఁబూనుట నటించెను. కైక యామె చూపిన బలవత్తరములైన హేతువులను ఖండింపలేక యామె తన్ను వీడి యేగుట నిజమే యనుకొని క్షమింపుమని ప్రార్థించి యామె చెప్పినట్లు రెండు వరముల నడుగుట కొప్పుకొనెను. భరత పట్టాభిషేకము మాట యెట్లున్నను రాముని వన నిష్కాసనము మాత్ర మామె హృదయమునకు వజ్రాఘాతమువలెఁ దాఁకెను. భరత పట్టాభిషేకమునకును రాముఁడు తపసి వేషమున పదునాల్గేండ్లు అరణ్యమున కేగుటకు నెట్టి సంబంధమో యామెకు గోచరము కాలేదు. మంథర యిది గ్రహించి "యుక్తి యున్నఁ గైకొనుము ...నీకు వరమిచ్చిన భరతుని పట్టాభిషేకమునకు పిలిపింతురు గదా ! అప్పుడు రాముఁడుండిన నీ యూరి ముండలు, దశరథుఁడును, కౌసల్యయు నూరకుందురా ? భరతుని వేఁడికొనియైన రామునికి పట్టము కట్టింతురు. అప్పుడు నీవు వరమడిగిన చెడుగు మాత్రము కట్టికొందువు... అట్లొకవేళ రాముఁడు వచ్చినను తపసి వేషముండకుండిన రాజ్యమేలునేమో యను భీతిచేతను ఈ వరమడుగఁ జెప్పినాను . దశరథుఁ డెన్ని దినములు బ్రదుకఁగలఁడని యెంచియున్నావు. ఎక్కువైన పంద్రెండేం డుండును. ఒకవేళ నింకను ఎక్కువ నాళ్ళు బ్రతికినను పదునాల్గేండ్లు రాజ్యముచేసిన వానిని తప్పించుట సుకరము కాదు" అని కైకను మాటాడకుండఁ జేసెను. కైక చేయునది లేక యామె యుపదేశించిన ట్లాచరింప నంగీకరించెను.

మంథర యెంత చెప్పినను కైకేయికి దశరథుని గాఢానురాగముపై విశ్వాసము తొలగిఁపోలేదు. ఆమె మంథర యుపదేశము ననుసరించి వినింద్య ఫలములైన

యా వరముల నడుగుటకు పూర్వ మాతని యనురాగసారము నొకసారి స్వయముగాఁ బరిశోధింప నిశ్చయించెను. ఏదో ప్రసంగము కల్పించుకొని "నీ యభీష్ట మేదయినను ఎట్టి దుస్సాధ్యమైనను, నాకు శక్యము మాత్ర మాయెనా నెఱవేర్తును. నీ యాన, నా యాన, రామునాన" అని దశరథునిచే ననిపించి రామునికి బదులు భరతునికి పట్టాభిషేకము జరుపుమని యాతనిఁ గోరెను. దశరథుఁడు కొంచెము వెనుకాడుచుండఁగా 'నీ విచ్చెదనని మాట తప్పినచో కూపమునఁ బడియెద. దీనికైన నాజ్ఞనిమ్ము' అని యేడ్పు నటించెను. దశరథుఁడు తత్కాల జనితమైన రోషావేశమున 'కూపమునఁ గాకున్న నీ ప్రాప్తియున్న దానఁ బడుపొమ్ము. నా యాజ్ఞ యేల' అని యామె చచ్చుటకైన నొడఁబడెను గాని భరతునికి పట్టాభిషేకము కట్ట నంగీకరింపలేదు. కైకేయికి రాజు ననురాగా గాఢత తెలిసిపోయెను. మంధరా వాక్య గరిత్ఫమైన యఖండ సత్యమామెకు సర్వతోముఖమై గోచరింప నిష్క్రమించిన యామె మరల ప్రవేశించి శంబరాసుర సంహారకాలమున తా వాగ్దాన మొనరించిన వరములలో నొకదాన భరతునికి పట్టాభిషేకమును రెండవదాన రామ వనవాసమును గావించి యిక్ష్వాకు వంశ ప్రతిష్ఠకు మూలకారణమైన సత్యమును నిలుపుకొనుమని నిర్బంధించెను. దశరథుఁడు కింకర్తవ్యతా మూఢుఁడై కాళ్ళఁబడి ప్రార్థించెను. క్షణక్షణ మూర్ఛావివశుఁడై యామె కరుణార్ద్ర వీక్షణ ప్రసారమునకై యెదురుచూచెను. మంధర చెప్పినట్లు రాజునకు తనపై బూటకపు ప్రేమయే కాని నిక్కపు ప్రేమ లేదని యప్పుడే స్వయముగా పరీక్షించి యెఱిఁగిన కైక యాతని కరుణింపలేదు. సుమంత్రునిచే రామునిఁ బిలిపించి యాతని కీ యుదంతము తెలిపి యడవి కేగ నాజ్ఞ యొసంగెను. దశరథుఁ డతి విచార పూరితుఁడై మతి చెడి, మరణశయ్య ప్రాపించెను.

మంధర కైక మానస తత్త్వమును బాగుగ నెఱుంగును. కౌసల్యాదులు వచ్చి ప్రార్థించు నప్పుడును, రాజు మూర్ఛాక్రాంతుఁడై కాళ్లఁబడి వేఁడినప్పుడును సహజ కోమలమగు నామె చిత్త మెక్కడ మెత్తఁబడునో యని యామె వెంట వెంటఁ దిరుగుచు దిట్టతనము నూరిపోయుచుండెను, లేకున్న కైకేయి యంత కాఠిన్యమున కొడఁబడి యుండదు.

భర్త దైన్యమును, కౌసల్యాదుల యపార విచారమును జూచి కైక మిక్కిలి యనుతాప పూరితురాలయ్యెను. నేనీ దుష్టకార్యము నేల చేసియుంటినని యామె మిక్కిలి వగచెను. "మంధరా! ఎంత కార్యమాయెనే ఏమి యుత్పాతము కలిగెనే. నా పతి సంతాపము చెప్పఁజాలను. అతఁడు జీవింపఁగలఁడా యని సంశయము పుట్టు

చున్నది అనియు భర్తను క్షమింప వేఁడుకొందుననియు నామె మంధర చెంత విల పించెను. మంధర మరల మరల దశరథుని మిథ్యానురాగమును నొక్కి చెప్పెను. అతఁడీ మాత్రమున చావఁడని ధైర్యము గొలిపెను. అమాయిక యగు కైక మంధరా 'నీ మాట నిక్కము. ఇప్పుడు వెనుదీసిన నపకీర్తి యొక్కటియే నిలుచు. నీ వలె హితము చెప్పువారు నాకు లేరు' అని యామెను ప్రశంసించి యప్పటి కూరకుండెను. రాముని యెడఁబాటుచే దశరథునికి పిచ్చి పట్టెను. కైకేయి దానికంతకుఁ దానే కారణ మని మిక్కిలి పరితపించెను. లక్ష్మణుఁడు కుపితుఁడై తన్నుఁ జంప వచ్చినప్పు డను నయ వాక్యములచే నాతనిని వారించిన సుగుణాభిరాముని నిష్కారణముగ నరణ్యముల పాలు చేసితినని యామె యశ్రువులఁ జార్చెను. మంధర దాని కన్యథా కారణమును కల్పించి రాముఁడు, లక్ష్మణుఁడు, కౌసల్య పురజనులును నీ యెదుట నిట్టి నాటక మాడి రాముఁడింత సంభావితుఁడుగా యని నమ్మి నీవు కరుణింపఁజేసిన కుహకము కదా యిది' అని యామెకు నచ్చఁజెప్పెను. మరణోన్ముఖుఁడైయున్న భర్త చెంతకేగి యామె దీన దీనాస్యయై పలవించెను. అతఁడు మరణించిన తరువాత 'ఇట్లగునని కలనైన నెంచనైతినే. ఏమి ప్రాప్తి దెచ్చికొంటిని ప్రాణేశా! నన్ను కన్నెత్తి చూడుము. నాకు వరములు వలదు. ఇంకడుగను. ఏ వరమును వలదు. రామునిఁ బిలిపింపుము' అని తన యథార్థాభిప్రాయమును సూచించెను. నిజమునకు, మంధరా వాక్యములను విశ్వసించిన కైక యామాత్రముచే భర్త మరణింపఁడని తలంచెను. ఆ ధైర్యము తోడనే యామె యంతవఱకు కాఠిన్యమును బూనఁగలిగెను. లేకున్న పట్టాభిషేకము మాట యెట్లయినను రాముఁ డయోధ్యయందే యుండుటకైన నానతి యిమ్మని రాజు వేఁడినప్పుడామె యందుల కంగీకరించియుండును.

సహజముగ కైకేయి మృదుల హృదయ. అనుల్లంఘ్యమైన దైవ ప్రేరణ మును, మంధరా దుర్బోధయును నమాయికురాలైన యామె సాధనముగా నీపై చర్య నంతను నడిపింపఁగల్గినవి. కవి యీ విషయమును మిక్కిలి చక్కగ పోషించెను. పూర్వ రంగమున దశరథుఁడనపత్యుఁడై యున్న తఱి వేఁట కరుగుటయు వనగజ బృంహితమను భ్రాంతిచే ఋషి కుమారు నేయుటయు పుత్త్రవియోగాతురులైన యా ఋషి దంపతు లాతనికి పుత్త్రశోకముతోడి మరణము కలుగునని శపించుటయు వర్ణింపఁబడి యున్నవి. ఋషిదత్తమైన యీ శాపమును ధశరథుఁ డనుభవించి తీఱ వలెను. ఆ శాపమే మంధరాకృతిని దాల్చి ముగ్ధయైన కైకచే నీ దుష్కృత్యమును చేయించెను. భరతుఁడు కైకేయిని దూషించు సమయమున 'అయ్యో! ఆ కైక నేల యిట్లాడెదవు? చిన్ననాఁటినుండియు దాని నెఱుఁగనా. దశరథుని శాపము ఫలింప

దానికి నేఁడిట్టి బుద్ధి పుట్టెఁగాక. అదియును స్వబుద్ధి కాదు. మంధర బోధయే యని తెలియదా!' అని కౌసల్య భరతుని వారించుట యించుక ప్రబల నిదర్శనముగా నున్నది. శాప ప్రభావముచే నా మంధర కైకను విధివోలె పీడించెను. ఎంత బుద్ధి తిరిగినను మానక యుపదేశించెను. అప్పటి కదియే ప్రియమై శివమెత్తిన చందమున శరీరముపై ప్రజ్ఞలేక కైక తానే మొనర్చుచుండెనో యెఱుంగకయే యా వరముల నడిగెను. షేక్స్పియరు మేక్బెత్తు నాటకమునవలె ఒక్క పాపము వేఱొక్క పాపమునకు దారి చూపెను. ఒక్కసారి పాప మొనర్చిన కఠిన హృదయము దాని మెత్తపఱచు సందర్భములు కలిగినట్లంతయు మఱింత కఠినమగుచు వచ్చెను. ఈ విధముగా శాకుంతలమున దూర్వాసుని శాపమువలన దుష్యంతుఁడు శకుంతలా నిరాకరణ దోషమునుండివలె కైక యీ శాపమున ధర్మ్య ఘాతుకతా భారమునుండి రక్షింపఁబడియెను. ఆమె కావించిన పాపము పశ్చాత్తాప పావకునియందు దగ్ధము కాఁగ నామె యగ్నిచే వినాకృత శ్యామికమైన హేమమువలె బయటఁబడెను. *

కైకేయి శీలమును కవి కావించిన యీ మార్పే నాటకముయొక్క యుదాత్తతను మిక్కిలి తోడ్పడినది. ఆమె రాముని నరణ్యమునకు పంపుటకు కేవల రాజ్యలోభమే కారణము కాదు. దానికి విశిష్ట శాపమును, మంధరా ప్రేరణమును బలవత్తరములగు కారణములని కవి సూచించెను. దీనితోపాటు తఁడు కైక యొక్క సహజమైన యౌదార్యమును గూడ ప్రదర్శింపఁగలెను. ఆమె మంధర యందెంత విశ్వాసము కలది యయ్యును స్వయముగా పరీక్షింపకుండ దశరథుని యనురాగమును శంకించియుండలేదు. అట్లాతని యనురాగహ్రాస్యము నస్పష్టమైనను ఆమె మనసులో నాతఁడనుభవించు దుఃఖాతిశయమును జూచి సహింపలేకపోయెను. ఆమె హృదయమున సాధారణ నీతికిని, మంథరా వాక్య గర్భితమైన హేతువాదమునకును గొప్ప సంఘర్షణ సంభవించెను. దుష్టా హేతువాదము బలవత్తరమై నీతిని జయించి యామెచే నా పనులనడిగించెను. ఆమెకు తా చేయఁబోవు మహాపరాధము పెక్కుసార్లు స్పష్ట రేఖలతో గోచరించి పాపభీతిని గల్గించెను. కాని బలీయమగు విధి యామెను లోఁబఱుచుకొని తన యిచ్చవచ్చినట్లు చేయించెను.

* "ఈ శాప ప్రధానము నంతగాఁ గొనియాడఁదగదు. అది కర్మ సిద్ధాంతము వంటిది. ఆ సిద్ధాంతమువలన నెట్టి కార్యములైనను సమర్థనీయము లగును గదా! అట్టిచోఁ జనులయెడ మంచి చెడ్డల తారతమ్య విచారణమేల? నాటక కవి యీ శాపమును జేర్కొనుటవలన కైకేయి శీలము నిష్కళంకము కానేరదు. ఇంక మంధరా ప్రేరణ మన్నదియు కైక రామవత్సల యన్నదియు మూలమున నున్నవే. కాకపోతే కైక యీ యెడఁ బొందిన యావేదన యందు లేదు. కాన కైక శీల సమర్థనమునకు దానినే ప్రధాన కారణముగాఁ దీసికొనవలె"నని కొందఱందురు.

ఎట్లయినను రాముని నరణ్యమునకుఁ బంపించుట యనునది కైక పాలిట ఘోరమైన దురాచరణము. దీనివలన నామెకు కలిగిన లాభమింతయు లేదు. భరతుఁడా రాజ్యమును స్వీకరింపక యామెను పలువిధముల దూషించి యరణ్యమున కేగెను. దశరథుఁడా పుత్త్రి దుఃఖ పీడితుఁడై మరణించి యామెకు వైధవ్యమును కలుగఁజేసెను. మంథరా దుర్బోధ విని యామె పోషించిన యా పాపకార్య వృక్షము యొక్క ఫలములైన యీ నైరాశ్య వైధవ్య భారములను ఆమె యనుభవింపక తప్పినది కాదు. ఆమె యిట్టి యధఃపతనమును పొందుట కవిపైని ప్రదర్శించిన యామె యౌదార్య మార్దవాదుల పురస్కరించుకొని చూచినచో కరుణ భావములను సామాజికుల హృదయములలో రగిల్చి యామెపై సానుభూతి కలిగింపఁ జాలు ననుటలో సందియము లేదు. ఈ విధముగా నీ పాదుకా పట్టాభిషేకమున విషాదభావ పౌనరుక్త్యము (Double tragedy) గోచరించుచున్నది.

## VI

విషాద సారంగధరము :

ఇది Romeo and Juliet వలె నదృష్టము మీఁద నాధారపడిన (Tragedy of fortune) విషాద నాటకము. ఆంగ్ల నాటకమున ఆ దంపతు లిరువురును గాఢాను రాగముచే ప్రేరేపఁబడి రహస్యముగా వివాహము చేసికొన ప్రయత్నించిరి. చివరి వఱకు వారు కావించిన ప్రయత్నము లన్నియు ఫలోన్ముఖములుగానే కానిపించెను. కాని విధి వారికి వ్యతిరేకమగుటచే నంత్యమున వారి ప్రయత్నము భగ్నమగుటయే కాక వారిరువురును నిధనమును ప్రాపించుట కూడ సంభవించెను. Shakespeare అదృష్టమును (chance) పధిని పెక్కు నాటకములలో ప్రదర్శించెను గాని అదియే నాటకముయొక్క విషాదాంతమునకు కారణమగునట్లు చేయలేదు. ఒక Romeo and Juliet లో మాత్ర మంతయు యదృచ్ఛా సంభవము (chance) యొక్క అవ్యహిత ఫలముగా కానిపించుచున్నది. Friare Laurence పంపిన వార్తాహరుఁడు రోమియోను కలిసికొనుటయు, అతఁ డీ యుదంతము నంతను తెలిసికొని సరియైన సమయమునకు వచ్చియుండుటయు జరిగెనేని కథ మోదాంతముగానే పరిణమించి యుండెడిది. అట్లే యీ నాటకమునఁగూడ విషాదాంతము విధివిలసితముపై నాధార పడి యున్నది. ఎట్లన న్యాయస్థానమున నపరాధియని నిశ్చయింపఁబడిన సారంగ ధరునకు రాజరాజ నరేంద్రుఁడు కరపాద ఖండన మను శిక్ష విధించెను. అర్ధరాత్రమున సారంగధరుఁ డీ శిక్ష ననుభవింపవలెను. ఇంక నాలుగు గడియలకీ గడువు సమీపించు ననఁగా రాజరాజునకు చిత్రాంగి కుట్ర తెలియవచ్చెను. అతఁడు మిక్కిలి విచారించి

వెంటనే భటుని పిలిపించి తాను రెండవ యుత్తరువు నిచ్చువఱకు సారంగధరుని శిక్ష నాపుమని తలవరి వీరసేనునకు నాజ్ఞాపత్రము పంపెను. ఈ వార్తాహరుఁడు సూటిగా వధ్యస్థలమున కేగియుండినచో సారంగధరునివధ ఆపఁబడి నాటకము మోదాంతముగా ముగియుట కవకాశముండి యుండును. కాని దైవవశమున నా వార్తాహరుఁడు దారి తప్పుటచే నర్ధరాత్రమునకు పూర్వము అనఁగా సారంగధరుని కాలు సేతులు ఖండింప బడక పూర్వమే వధ్యస్థలమును చేరుకొనలేకపోయెను సారంగధరుఁ డీ విధముగా నిరపరాధుఁడే యయ్యు నధర్మ మరణమును పొందుట తటస్థించెను.* ఇట్లు నాటకము యొక్క విషాదాంతమునకు దైవము (chance) నే ప్రబల కారణముగా సూచించుట నాటకముయొక్క శిల్ప గరిమకు భంగము వాటిల్లఁజేయునని విమర్శకులు పెక్కురు నుడివియున్నారు. అందుచేతనే Shakespeare రచిత విషాదాంత నాటకములలో నితర నాటకముల కున్నంత ప్రశస్తి Romeo and Julietకు లేదఁట.

విషాదసారంగధరమునకు నాయకుఁడు రాజరాజు. ఇతఁడు వయసు మీఱిన వాఁడే యయ్యు కామాంధుఁడు. తన కుమారుఁడగు సారంగధరుని కొఱకై దేశ దేశములనుండి రాజపుత్రికల పటములఁ దెప్పించుచు నందు చిత్రాంగి చిత్రపటము నందలి సౌందర్యమును జూచి యాతఁడు మోహించి చివరి కామెను పెండ్లియాడెను. ఈ విషయము సారంగధరునికి తెలియనే తెలియదు. చిత్రాంగికి సారంగధరునిపై వలపు కలదు గాని, యామె తండ్రి రాజరాజున కాంతరితుఁడైన సామంతుఁడగుటచే నామె విధిలేక యీ వివాహమునకు మనసున నిష్టము లేకపోయినను పై కంగీకరింప వలసి వచ్చెను. రాజరాజు చిత్రాంగిని వివాహ కాలమునుండియు మిక్కిలి ప్రేమతో చూచుచుండెను. ఆమె యందు దీనికిఁగల గ్రుడ్డి వలపే యీ నాటకముయొక్క విషాదాంతమునకు బలవంతమైన కారణము.

రాజరాజు వేఁటనుండి తిరిగి వచ్చిన వెంటనే చిత్రాంగి గృహమున కేగెను. ఆమె విచారావస్థను చూచి విషాదాశ్చర్యచకితుఁడై యతఁడామె ననునయింపఁ జూచెను. చిత్రాంగి రాజును వశపఱుచుకొని తన పట్టుదలను నెరవేర్చుకొనుటకై యబద్ధమును సత్యముగా సందర్భింపఁజేసి చెప్పెను. సారంగధరుని సహజమైన సత్ప్రవర్తన నెఱింగినను, చిత్రాంగి చెప్పిన మాటలు వినిన తరువాత రాజున కాతని యపరాధము

* చిత్రాంగిపై సందేహము కలిగిన వెంటనే సారంగధరుని శిక్షను నిలుపుమని రాజరాజు పంపిన భటుఁడు అడవిలో దారి తప్పి ఆకస్మికముగా విలంబించుటకు బదులు నేరుగా పోయి యుండెనేని యే తొందఱయు నుండకపోవును గదా. శ్రీ రా. అ. కృ. శ.

నందు సందేహమే యుదయింపలేదు. అతఁడు కోపోద్రేకముచే సత్యాసత్యములు పరిశీలింపకుండనే సారంగధరుని చెఱసాలలో పెట్టించెను. మఱునాఁడు మంత్రుల సమక్షమున ధర్మాధర్మ విచారణ మొదలయ్యెను. మతిమంతుఁడు సారంగధరుని సత్ప్రవర్తనమునుగూర్చి నొక్కిచెప్పెను. దానివలన రాజరాజునకు కోపమే కలిగెను గాని చిత్రాంగి వచనముల విశ్వాసార్హత పరీక్షించు బుద్ధియే జనింపలేదు.

రాజరాజంత కామాంధుఁడయ్యును ధర్మబుద్ధి కలవాఁడు. అతఁడు ప్రాడ్వివాకుల ధర్మ వచనములకు వ్యతిరేకముగా నడవఁడు. ధర్మాధర్మ విచారము చేయకయే సారంగధరుని శిక్షించినచో ప్రజ లేమనుకొందురో యని యాతని భయము. న్యాయస్థానమున నాతఁడంతయు నాలించెను. సారంగధరుఁడు తన పక్షమున నేమియు చెప్పుకొనలేదు. సదయుఁ డూహాబలముచే తనకు సాధ్యమైనంతవఱకు వాదించెను. కాని చిత్రాంగి యసత్య వాక్యములు మనస్సునకు నాఁటియుండుటచే రాజరాజున కందేమియు గోచరింపలేదు. సారంగధరుఁడు తన పక్షమున వాదించుకొనకపోవుట కూడ నాతని యీ సందేహమును బలపఱిచెను. అతఁడు కామాంధుఁడై తల్లిని పరాభవించుట యను ఘోరపాప మాతనికి సర్వతోముఖముగా కానిపించెను. తండ్రియయ్యు నతఁడు ధర్మైక పరాయణుఁడగు రాజుగాన కుమారుని కాలు సేతులు ఖండింపవలెనని యాజ్ఞ యొసంగెను.

న్యాయస్థాన రంగము రాజరాజు ధర్మనిష్ఠను మిక్కిలి స్పష్టముగా వ్యక్తము చేయుచున్నది. ఆతని మనస్సున పుత్త్రప్రేమకును, రాజధర్మమునకును తీవ్రమైన పోరాటము సంభవించెను. కాని చిత్రాంగి చెప్పిన వాక్యములందు దృఢమైన విశ్వాసము కలవాఁడగుటచే నాతఁడు సారంగధరుఁడు నిజ పక్షమున వాదించుకొనకపోవుటకును, సుబుద్ధికి పిచ్చి యెక్కుటకును గల అంతరమైన కారణము నూహింపఁజాలకపోయెను. తల్లిని పరాభవించినవాఁడు తనయుఁడయ్యును శిక్షార్హుఁడే యను ధర్మము నూతగాగైకొని సత్యమును గ్రహింపఁజాలక పోవుటచే నాతఁడు ధర్మము పేర నధర్మము నాచరించెను. యథార్థముగా సారంగధరుఁడు తల్లిని పరాభవించెనని తెలిసినచో నతనికి మరణ శిక్ష విధించుటలో నాతఁడు చేసిన యపరాధ మిసుమంతయును లేదు.

సదయుఁడు వాదించిన పిమ్మట సారంగధరుఁడు తన యపరాధము విషయమై యేమియును చెప్పకపోవుటచేతను, సాక్షులలో సారంగధరునికి మిక్కిలి సన్నిహితుఁడైన సుబుద్ధికి పిచ్చి యెక్కుటచేతను, ఆతని యపరాధ రాహిత్యమును, హార్దమైన నైర్మల్యమును ప్రకటించి సమర్థించుటకు వీలు లేకపోవుటచే కొలదిరోజులవఱకు దండనము నాపుచేయుట యుక్తమని సదయుఁడు నొక్కి వక్కాణించెను. కాని రాజరాజు తొందర

పడి యాతని మాటలు లెక్కసేయక సారంగధరుని కా దారుణ శిక్ష విధించెను. రాజరాజొనర్చిన దోష మిది తొందరపాటే. ఇదియే యాతని పశ్చాత్తాపమునకు హేతువయ్యెను. ఈ విషయము నెఱింగినవాఁడు కావుననే యాతఁ డుత్తర రంగమున "పాయక యీ బలు బన్నములెచ్చి నా యాతురంబెకా నన్నింతచేసె, త్వర యది కలుషంబు త్వరయది కీడు; త్వరయది శత్రువు. త్వరయది చేటు" అని ఘంటాఘోషగ చాటఁగల్గెను.

రాజరాజు చిత్రాంగి కల్లపల్కులు నమ్మి ధర్మ విచారణముచేసి పుత్త్రునికి దారుణ శిక్ష విధించినందుకు తరువాత మేరలేని పశ్చాత్తాపమునకు గుఱియయ్యెను. న్యాయస్థానమున నున్నప్పుడైనను గాంభీర్యమును నిలుపుకొనుటకై యాతఁడట్లు ధైర్యము వహించియుండెనే కాని 'పైకి గంభీరుడయ్యు లోలోన మఱఁగి నురుంగులు కట్టు' సముద్రునివలె లోపల విచార వహ్నిచే దహింపఁబడుచునే యుండెను. అతఁడు విచారణానంతరము రహస్య గృహమునకేగి మిక్కిలి విలపించెను కాని యప్పటికింకను సారంగధరుఁడు తప్పక దోషము నాచరించియే యుండెనను నమ్మక మాతనికుండుటచే తాను తండ్రి యయ్యు కుమారుఁడని దయ దలంపక ధర్మ పక్షపాతముచే నట్టి శిక్ష విధించి యన్య సామాన్యమైన ధర్మము నాచరించియుండెనని యాతఁడు తృప్తిపడుచునేయుండెను. కాని పుత్త్రి మరణమను పిడుగుపాటు తలఁచుకొనినంతనే యాతని గుండె యదాయద లగుచుండెను. అట్టి సమయములలో నాతఁడు చిత్రాంగియే తన యేకైక సుత మరణమునకు హేతువని యామెను దూషించుటకుఁ గూడ కడంగెను. కాని సారంగధరుఁ డొనర్చిన దోషముయొక్క నైశిత్యము వెంటనే సాక్షాత్కరించి యాతఁడా శిక్ష కర్హుడే యని తోఁపఁజేసి యాతనికి శాంతి చేకూర్చుచుండెను. చిత్రాంగి కుట్ర తెలిసిన తరువాతనే యాతని నిజమైన వ్యథ కాననగును. అతఁడు వెంటనే భటుని పిలిచి శిక్ష నాపుచేయుట కుత్తరు వొసంగెను. అతనికిఁ గడచిన ప్రతి క్షణమును నొక యుగమువలె నుండెను. శిక్ష యాగినదను సంతోష వార్త వినుటకై యాత్రపడుచున్న యాతనికి సుత దుర్మరణ వార్త వినవచ్చెను. కామాంధుఁడై, చిత్రాంగి మాయ మాటలు విశ్వసించి తా నాచరించిన మహా ఘోరమంతయు నాతని కొక్కసారిగా బొడసూపెను. అతఁడు భిన్నమైన హృదయముతో కంఠగతాసుఁడైన సుతునిఁ జేరి మిక్కిలి విలపించెను. రాజ వైద్యుఁడుఁవచ్చి యాతని బ్రదికింప బ్రయత్నించెను కాని లాభము లేకపోయెను.

ఈ నాటకమున రాజరాజు తెలిసియే (Consciously) సారంగధరునికి శిక్ష విధించినను, ఆతని యపరాధమునుగూర్చి చిత్రాంగి యసత్యమును సత్యముగా సంద

ర్పింపఁజేసి చెప్పి నమ్మించుటచే నిది యజ్ఞానకృత దోషముగానే పరిగణింపఁబడును. ఇట్టి దోషమును Aristotle సూచించెను. ఇది, యజ్ఞానాగతమైన దోషమని చెప్పుచు నాతఁడు దానికి Sophocles Oedipus నిదర్శనముగా చూపెను. ఇట్టజ్ఞాన కృత దోషుఁడైన నాయకుడు Othello లో తప్ప Shakespeare ఇతర నాటకములలో కానరాఁడు. కాని అతని తరువాత 17 వ శతాబ్దిలో వెలువడిన నాటక కర్తలు పెక్కురు గ్రీకు పద్ధతి ననుసరించి యిట్టి నాయకులను చిత్రించిరి. Othello Desedmona ను చంపుట మనఃపూర్వకముగానే యైనను, దానికి Iago చెప్పిన యసత్య కల్పనలే చాల వఱకు హేతువు లగుచున్నవి. ఇట్టి నాయకుని చిత్రించుటలో కవి మిక్కిలి శ్రద్ధ వహింపవలెను. దోషాచరణము తరువాత నాతఁడేదో యొక మిషచే నా దోషముచే నుద్రేకింపఁ జేయఁబడిన భయవిద్వేషములను (horror and detestation) స్పష్టముగా చిత్రింపవలెను. అట్లు చేయనిచో Seneca రచించిన Hippolytus అను నాటకము వలెను, Shelly యొక్క The Cenci అను నాటకము వలెను విషాద నాటకము మిక్కిలి లాఘవమును ప్రాపించును. ఏలయన విషాద నాటకము భయోద్వేగముచే కంపింపఁజేయుటయే కాక, గాంభీర్యముచే హృదయముల నుదాత్తముగా చేయుట కూడ మిక్కిలి యవసరము. (Tragedy must not only thrill with the sense of awe but also uplif with the sense of majesly) ఈ నాటకమున చివరి యంకములో రాజరాజు పొందిన యనుతాపము అతి మాత్రమే యయ్యును, అతఁడు కామాంధుఁడై కుమారునికై వెదకి తెప్పించిన చిత్రాంగిని తాను వివాహమాడె నను విషయము దానికి లాఘవము నాపాదించుచున్నది. రాజరాజెంత పశ్చాత్తాపమును సూచించినను, తాను మొదట నొనరించిన యా దుష్కార్యముచే నతను శోచనీయుఁడే యగును కాని. సానుభూతి పాత్రుఁడు కాఁడు.

ఈ నాటకమున సారంగధరునియందు కొంచెమైనను దోషము కానరాదు. అతఁడు తల్లియను విశ్వాసముతో తన ప్రాణమిత్రుఁడగు సుబుద్ధి యెంత చెప్పినను వినక పావురమును తెచ్చుకొనుటకై చిత్రాంగి యింటి కేగెను. ఆమె కామాంధురాలై యచ్చట నతని చాల బలాత్కరించెను. తల్లిని దైవకల్పురాలిఁగాఁ జూచు సారంగధరుని సామాన్య నీతి కామె చర్య మిక్కిలి హేయముగా కానిపించెను. అతఁడు తన శక్తివంచన లేకుండ నామెకు చెప్పవలసిన నీతులన్నియు బోధించెను. కాని యామె మోహము మితిమీఱి యుండుటచే నతఁడు దానిని వారింపలేకపోయెను. చివరి కాతఁ డెట్లో తప్పించుకొని బయటఁబడెను. రాజరాజు వెళ్ళిన తరువాత చిత్రాంగి లేనిపోని వన్నియు కల్పించి చెప్పి సారంగధరుని కారాగారమున పెట్టించెను. మఱునాఁడు

మంత్రుల సమక్షమున రాజరాజు ధర్మ విచారణ చేయ మొదలుపెట్టెను. అందు సాక్షు లందఱును పరీక్షింపఁబడిరి. సారంగధరుఁడు మాత్రము తన పక్షమున నేమియు వాదించి యుండలేదు. వాదించుట కాతఁడు వాంఛించినచో తల్లి చేసిన యా యసుర కృత్యమునంతను నాతఁడు పేరోలగమున వర్ణించుటకు పూనుకొనవలెను. తల్లిని దైవముగా భావించు సారంగధరున కట్లు చేయుట యసంభవ మనిపించెను. తల్లి కపకీర్తి వచ్చిన తనకు వచ్చినట్లే అను భావ మాతనికి పొడ కట్టెను. అందుచే నాతఁడు తాను చచ్చుటకైన నంగీకరించెను కాని, తన తల్లి దుశ్చర్య బాహిరించుటకు మాత్రము సాహసింపలేకపోయెను. సుబుద్ధి తన మిత్రుఁడగు సారంగధరుఁడు కారాగారమున నున్న కాలమున వచ్చి నెత్తి నోరు బాదుకొని చిత్రాంగి చేసిన నేరమును తాను దాసివలన నెఱింగియుండుటచే రాజునకు నివేదించెదనని చెప్పఁగా నట్లు చేయ వలదని సారంగధరుఁ డాతనిని వారించుచు నొట్టు పెట్టెను. ఈ కారణము చేతనే సుబుద్ధికి చిత్త చాంచల్యము కలిగెను.

సారంగధరుఁడు సభలో జరిగిన వృత్తాంతమంతయు యథావృత్తముగానే చెప్పియుండినచో నాతనికీ పాటు లేకుండియుండునా? అప్పుడు సైతము సభవారాతఁడు చెప్పిన మాటలను విశ్వసింతురో విశ్వసింపరో యను శంక మిగిలియే యున్నది. ఏలయన పురుషుఁడు స్త్రీని బలాత్కరించెననుటయే లోకమున విశ్వసనీయము కాని తద్భిన్నమట్లు కాదు. ఈ ధైర్యముతోడనే చిత్రాంగి యంత మాయా నాటకము నాడింపఁజాలెను. ఈ పరిస్థితు లన్నిటి నాలోచించియే సారంగధరుఁడు తన విషయమై యేమి చెప్పుకొనుటకును ప్రయత్నించి యుండలేదు. తల్లి దోషమెంత ఘోరమైన దైనను, వెలిపుచ్చుట పాపావహమను నాదర్శము (ideal)కై యాతఁడు తన ప్రాణముల బలి యొసంగెను.

సర్వసద్గుణ పుంజమగు నీ మహోదారుని మృత్యువు పాషాణములకు సైతము పరమ కరుణమును గలిగించితీరును. కార్చుటకు కన్నీరుండి ఎంత కార్చినను ఈ శోకము యొక్క తీవ్రత శేషించియే యుండును. కొందఱు (నాటక కర్తయే) సారంగధరుఁడు సుబుద్ధి మాట త్రోసిపుచ్చి చిత్రాంగి యింటికి వెడలుటయే యాతని దోష మనియు, నా దోషమునకు తగిన శిక్ష నాతఁ డనుభవించెననియు చెప్పుదురు. కాని యీ వాదము మిక్కిలి బలహీనముగా నున్నది. Romeo and Juliet లోనా దంపతులు పితరుల యాజ్ఞ వడయకుండ వివాహము చేసికొనుటలోనే వారి దోష మిమిడి యున్నదనుటలో నెంత సామంజస్యము కలదో దీనను నంతే. ఇది యెట్లయి

నను ఆయా పాత్రలయందు దోషమును చూపవలెనని చేసిన ప్రయత్నముగానే కని పించుచున్నదిగాని సహజముగా కానిపించుట లేదు. పైఁగా సారంగధరుని మృత్యువు వలన కావ్యనీతికి భంగము వాటిల్లుచున్నది. లోకమునఁ దప్పుచేసినవారు చివరికిఁ దత్ఫలితముగాఁ గష్టము లనుభవించుటయు, ఒప్పుచేసినవా రట్టి కష్టముల నతిక్ర మించి సుఖములఁ బడయుటయు సాధారణ నీతి. ఇచ్చట సుగుణరాశి యగు సారంగ ధరుఁ డన్యాయముగా కరపాద ఖండన శిక్ష ననుభవించుటవలన సజ్జనులకే కీడు కల్గునని చెప్పి కవి సామాజికులలో నైరాశ్యమును కలిగించుచున్నాఁడు. దీనివలన నీతి యభివృద్ధి యగుటకు మాఱు నాశనమగు ననుటలో నతిశయోక్తి యుండదు. 'లోకమున సజ్జనులు కూడ కష్టములు పొందుట కలదుకదా! స్వాభావికముగ నుండుటకై కావ్యములలో సైతము మన మట్లేల వర్ణింపరా' దని కవివాదము. కాని లోకములో సజ్జనులు కష్టముల ననుభవించుచున్నను చివరికి వానిని తరించి శుభముల బడయుటయే తఱుచు-నీతిని బోధింపఁదలఁచిన యే కవియు నట్లు నధర్మవిజయమును ధర్మ పరాజయమును ప్రదర్శించుట కానము. ఏలయన ధర్మ పరాజయము సామాజిక లలో నీతి విశ్వాసమును రూపుమాపునేకాని వృద్ధి పొందింపదు. నీతి బోధనమునకు విషాదాంత నాటకములు మోదాంతనాటకముల కంటె మిక్కిలి యుపకరించునని ఆచార్యులుగారి యూహ. దీనికి వారు చంద్రహాస నాటకములో దుష్టబుద్ధివలె, సారంగ ధర నాటకములో రాజరాజువలె, చివర గ్రుక్క త్రిప్పకుండ నీతుల నుపదేశించుట కవకాశము కలుగునని భావించి యుందురు. కాని నీతి శిష్ట దుష్ట కార్యముల ఫలిత ముల వలననే హృదయములలో బాగుగా నత్తుకొనును కాని కేవల మేక పాత్రయొక్క కథనము లేక ఉపన్యాసమువలన నట్లు కాఁజాలదు.

చిత్రాంగి పాత్ర సృష్టించుటలో కవి అనన్య సామాన్యమయిన కౌశలమును ప్రదర్శించియున్నాఁడు. ఆమె సారంగధరుని రూప గుణాదులను విని యాతనిపై వలపు వహించియుండెను. విభావసుఁడను బ్రాహ్మణుఁడు తమ యూరు వచ్చినప్పు డామె యాతనితో నీ యుదంతము నంతను తెలిపి సారంగధరుఁ డెట్లయిన తన్ను వరించునట్లు చేయుమని కోరెను. కాని విశ్వాసఘాతుకుఁ డగు నా బ్రాహ్మణుఁడు సారంగధరునితో నీ సంగతి చెప్పియుండలేదు. తరువాత రాజరా జీమె చిత్రపటమును గాంచి మోహించి యామె తండ్రి తనకు సామంతుఁ డగుటచే నధికారబలము వలన నామెను బలాత్కారముగా వివాహ మాడెను. ఆమె తండ్రి మాటను ధిక్కరింపలేక పోవుటచే తన దేహమును మాత్రము రాజరాజు నధీనము గావించెను. కాని మన స్సులో సర్వకాలములయందును తాను దొలుఁదొలుత ప్రేమించిన సారంగధరునే

వలచియుండెను పూర్వ రంగములోని యీ వృత్తాంతమే యామె శీలమును సమర్థిం చుటకు కొంత తోడ్పడుచున్నది. లేనిచో నామె దుశ్చారిత్రము కావ్యములో ప్రకటిం చుటకు కూడ నర్హము కాకపోయియుండును.

యౌవనస్థురాలయిన చిత్రాంగి తన భర్త ముదుసలియగుటచేతను, తాను తొలుఁ దొలుత మనఃపూర్వకముగా వలచిన వాఁడటుఁడు కాకపోవుటచేతను మిక్కిలి నిరాశ చెందెను. ఆమె మానసమున నవమన్మథాకారుఁడయిన సారంగధరుఁడే యెల్లవేళల యందును సాక్షాత్కరించుచుండెను. ఆమె అంతఃపురమున నుండుటచే సారంగధరుని నొక్కసారియైనను చూచుటకు వీలులేకపోయెను. ఆమె నిజముగా సారంగధరునే వలచియుండినను రాజరాజుపై కపట ప్రేమను గూడ చూపుచునేయుండెను. తానీ కపటాభినయమును చేయుచున్న ట్లామెకుఁగూడఁ దెలియును. "ఆహా! ఎంతటి కపట కృత్యము నభినయింపఁ దాల్చితి!" అను నామె వచనములలో నిది తార్కాణ పడుచున్నది.

కాముఁడు తన్నెంత వేధించుచుండినను ఆమె నీతి విషయమున విముఖురాలై ప్రవర్తింపలేదు. తొలుఁదొలుత తాను సారంగధరుని మనఃపూర్వకముగ ప్రేమించి నను తరువాతి పరిస్థితులలో నాతఁడు తన కుమారుఁడగుటచే నాతనియెడ తనకుఁ గల మోహమును మఱచిపోవుటకై యామె మిక్కిలి ప్రయత్నించెను. తల్లి కుమా రునిపై మరులుకొనుట సహింపరాని ఘోర పాపమని యామె యెఱుంగును. కాని యెంత ప్రయత్నించినను చిరరూఢమై యున్న యీ యనురాగము నామె యడంచు కొనఁజాలకపోయెను.* ఇట్టి సమయములో రాజరాజు వేఁట కేగుటయు పావురమును తీసికొనుట కొఱకు సారంగధరుఁ డామె యింటి కేతెంచుటయు సంభవించెను. రాజ రాజు వెడలిన తరువాత నెనిమిదిరోజులవఱకు నామె యొక్క గతి నేడ్చుచుండెను. మన్మథుని కుసుమశరముల దాడి కామె యోర్చుకొనలేక పోయెను. పైఁగా విభా వసుఁడు తన ప్రణయమును గూర్చి సారంగధరునితో తప్పక చెప్పియుండునని యామె యూహ. ఆ మాట వినిన తరువాత, రాజరాజు లేని సమయమున సారంగ ధరుఁడు తన యింటికి వచ్చెననఁగా నామెకు మహానందము కలిగెను. ఆమె సారంగ ధరుని యెడ తన నిర్మలానురాగమును వేయి విధముల ప్రకటించెను. కాని వశీ

---

* అయ్యో నేనెట్లు సహింతును! ఈ జగన్మోహన రూపము నా మనఃపీఠమున నెలకొని యున్నది కదా! అక్కటా యిట్టివాఁడు నాకు లభింపకపోయెఁగా....ఎట్లయినను ఈ మనోహరుని లోబఱచుకొన నుద్యమింతును. తమకింతును. యోచింతును. మహా ద్రోహమే. ఘోర పాపమే యని విలపింతును. మఱియు నుంకింతును. ఏమి చేయుదును.

కృతచిత్తుఁడయిన యా సారంగధరుఁ డెన్ని చెప్పినను వినక, ఎదుట నుండి తనంతఁ దా వలచి యాశ్లేషసుఖము నభ్యర్థించుచున్న సౌందర్యనిధానమును గాంచియు మరులు కొనక, యెన్నియో నీతులు బోధించెను. "ప్రాణేశా! నీ వేమన్నను ఎంత భీతి చెప్పినను నిన్ను విడువను. నీ పాదము లాన విడువను" అని వెళ్ళఁబోవుచున్న యాతని యుత్తరీయమును గ్రహించి యాపి "మనోహరా చచ్చిన పిమ్మట నేమగుట నెవ్వరెఱుంగుదురు? ఇపుడు పంచబాణుఁడు సతసుతాస్త్రిణుఁడై యారోహిత శుక కంఖాణుఁడై నా ప్రాణానిలముల పోకాడ్చుచున్నాఁడు. స్త్రీ హత్యా దోషమునకు నీవు ఓర్చుకొందువా" అని ఆతని మనమున జాలికలుగున ట్లుపన్యసించెను. సారంగధరుని మనస్సు చలింపలేదు ఆమె భరింపలేక యాతని నాలింగనము చేసికొన యత్నించెను. సారంగధరుఁడు "తల్లీ నీ మతము దుష్ట కీటకవిషముఁబోలె నంతకంత కెక్కుడగుచు వచ్చెను. ఇంక సైపఁజాలను" అని యామెను దూషించి వెడలిపోఁజూచెను. ఎంత వేఁడినను జాలి గొనక దూషింపఁబూనిన యా నిశ్చల హృదయుఁడయిన సారంగ ధరుని చూచి చిత్రాంగి వికారాకారమును దాల్చి "నా మనోధనమును గ్రహించితివి. దాని ననుభవింపకున్న నిన్ను దక్కనీయను సుమా" అని బెదరించెను.

వెంటనే యామె నిరాశాజనిత క్రోధము నడంచుకొని, నిజ స్వభావమును వెలి పుచ్చుచు "ఇది ప్రణయోన్ముఖ సంభాషణము కాని నిక్కంపు టలుకకాదు." ఏదీ.... ఏల సంశయించెదవు ఒకసారి నీ యాశ్లేష సుఖ మిచ్చిన మఱియొకసారి కొసరను రమ్మా" అని ప్రేమలోతుల చూఱ యొసంగెను సారంగధరుని కిది యంతయు మిక్కిలి హేయమనిపించెను. "పతి కెంత ప్రీతి నీపై నున్న నేమాయె న్యాయంబు పాలింపనరయఁడమ్మ.........అమ్మయట, బొంకునఁట, బొంకినంత నమ్ము వార లఁట....నమ్మినను చంపువారలంట.........చలిచీమ గతి నొరుల జంపింతునని పల్క శక్యమౌనె ధర్మసాక్షి లేదె" అని వచించుచు ధైర్యముతో నామె సదనమును వీడి యరిగెను. (పాపము సారంగధరుఁడు ధర్మసాక్షి తన మనోనైర్మల్యమును గ్రహించి ఒకవేళ చిత్రాంగి బొంకినను తన్ను రక్షింపఁ బూనునని నమ్మియుండెను. చిత్రాంగి బొంకెను కాని ధర్మసాక్షి యాతని సాహాయ్యమునకు రాలేదు. అందుచేతనే సారంగధరుని మరణముతో ధర్మ పరాజయము ద్వారా నీతి విధ్వస్తమయినదని చెప్పవలసి వచ్చినది.

చిత్రాంగి కేవలము వాచాటురాలు కాదు. చెప్పినంత పని చేయఁగల పట్టు దలయు ప్రతిభావిశేషమును ఆమెయెడఁ గలవు. నిర్మలమయిన ప్రేమతో దైవము

కంటె నెక్కుడుగ ధ్యానింపఁబడుచున్న సారంగధరుఁడు తన్ను త్రోసిపుచ్చుటలో నామెకు నైర్ఘృణ్యము చూపట్టెను. అందుచే కోపము వహించి యామె తన వశమున నున్న ముసలి రాజుద్వారా తన పూనిక నెరవేర్చుకొన ప్రయత్నించెను. తానంత యనురాగముతోఁ జూచిన సారంగధరుని నామె చంపఁబూనుట కొక ముఖ్య కారణము కలదు. సారంగధరుఁడు తనకు నీతులు బోధించుకాలమున "నన్ను నీ విట వేసార్చుట కాలాహివాలము త్రొక్కుట యగు. కడతేరఁజాలవు సాహసమున నీకు ప్రాణాపాయము నొసఁగింతును" అని చెప్పియుండెను. సారంగధరుఁ డామె దుశ్చారిత్రము వెలిపుచ్చునని ప్రతిజ్ఞ పట్టినను, దేశకాలముల ననుసరించి తా నన్న మాటకు విరుద్ధముగా నతఁడు తన ఆగ తనమును ప్రకటించునేమో యను భయ మామెకు లేకపోలేదు. ఆ మానభంగమునుండి తన్ను రక్షించుకొనుటకే యామె యీ ప్రతీకారవాంఛను వహించెను. ఆమె యసత్యదేవత నారాధించి రాజునకు సారంగ ధరుని యౌద్ధత్యమును మిక్కిలి నిపుణముగా వర్ణించి, చెప్పి, యతనికి కొమరునిపై నసహ్యము పుట్టించెను పూర్వ మామెకు సారంగధరునిపైఁ గల యనురాగమంతయు నిపు డాగ్రహముగా మాఱిపోయెను. దాసి వచ్చి సారంగధరుఁడు కానఁబడకపోవుటచే జాబియలేదని చెప్పినపుడు "సారంగధరుఁడు మండనీ, వాని పావురములును వాడును కాడు చేరనీ. ఈ బహుభాషణములేల జాబిమ్ము" అని పల్కుటలో నామె యాగ్రహము మూర్తీభవించియున్నది. రాజరాజు చిత్రాంగిచెప్పిన మాటలు నమ్మి న్యాయ విచారణము కావించి కాల విలంబనమున కోర్వక ఆతురపాటుతో నాతనికి మరణ శిక్ష విధించెను. తన వ్యూహమునకు ఫలముగా శత్రువు మడియ నున్నాఁడని విని చిత్రాంగి పరమానందము ననుభవించెను.*[1]

ఇంతలో సారంగధరుని పట్టమామె తిలకించె, జాలి వహించి "ఆహా సారంగ ధరా ! నా మాట వినవైతివి" అని విలపించెను. ఈ పటమును చూచిన తోడనే యామెకు అనురాగ పాత్రుఁడైన యా తొలుతటి సారంగధరుఁడు స్మృతి పథమున కెక్కెను. ఆమె భావములోని కోపమంతయు నిప్పు చెంత వెన్నవలె క్షణములో

* చిత్రాంగి మొదట మన్మధుని చేతి కీలుబొమ్మ. అటుపిమ్మట మహాకాళి. తుదివఱకు నీ రెండు లక్ష్యములను గవి యుద్ఘాటించుచునే యుండెను. వలచి తిరస్కరింపఁబడిన యువతి స్వరూపము నింత చక్కగాఁ జిత్రించిన కవి యింకొకఁడు లేఁడు.

1. "ఇఁక నైదు గడియలకు నా శత్రువు మడియఁగలఁడు. రత్నాంగివచ్చిన నీ ముదిరాజున కేమి బుద్ధిపుట్టునో యని బెగడువడి యుంటిని. ఇఁక నిరాటంకము. ఔ చిత్రాంగి! యింత కార్యము నీవు గాకెవ్వరు చేసియుందురు."

కరఁగి దయారసముగా మాఱిపోయెను. ఆమె పశ్చాత్తాపమునకు మేరయేలేదు. ఇప్పటి నుండి యామె తాఁజేసిన ఘోరకృత్యమును దలంచుకొని పొందిన మనోవ్యథయే యామెయెడ కొంతయైన సానుభూతి కలిగించుటకు తోడ్పడుచున్నది. "అంగజు బారి కోర్వక మహాఘము నూరక మోపి నిన్ను చంపంగ తెగించినట్టి ఘనపాప మదెంతని యెంతు. సత్కృపారంగన పొంగ దృష్టి నపరాధము ద్రోచి క్షమింపరావె సారంగ ధరా !- మా సారంగధరుని నెవరు రక్షించువారు. నా వేదన నెవ్వరు తీర్చువారు - దైవమా ! ఘోర పాపమా ! దుర్వేదనమా' అని యామె మూర్ఛిల్లినది. అట్టి మూర్ఛలో సైతము "సారంగధరా ! ఒక ముద్దిమ్మా" అని యామె కలవరించుట యామె ప్రేమ నైర్మల్యమును చెప్పక చెప్పుచున్నది. ఈ మాట వినినవారు చిత్రాంగి పూర్వ పాపమునంతను మఱచి రెండు కన్నీటి కణముల రాల్పకపోయినచో వారి హృదయము పాషాణ నిర్మితమన్న మాట.

సారంగధరునికి రాజు మరణదండన విధించెనని చెప్పఁగానే యామె సారంగ ధరుని శిక్ష తొలఁగించుటకు క్షమా పత్రమును బంపుమని రాజుతో చెప్పెను. మాదాడక యాతఁడట్లొనర్చినచో నేమయియుండునో ! కాని యాతఁడామెను దూషింప సాగెను. ఆమె మనస్సులోని యభిమానము మఱియొకసారి ప్రజ్వరిల్లెను. అందుచే నామె మరల రాజరాజునకు కోపము గలిగించెను. రాజు ఉత్తరమును* పావురమును జూచి యామెను ప్రశ్నింపఁబూనినప్పు డామె మరల దౌర్జన్య మార్గము నవలంబించెను. "ఆహా తెలిసెను. వెఱ్ఱిరాజా! ఇంతెఱుంగవా! ఇది యంతయు రత్నాంగి కృత్రిమము. నా దాసిని లోఁజేసికొని నేను నిదురించు కాలమున నా పడకపై దీని వేయించి వాని పావుర మిందుంచునట్లు చేసినది కదా !" అని చెప్పుచు నాతని భుజముపై చేయివైచి యాతనిని మోహింపఁజేయ యత్నించెను. కాని ఉత్తరములోని యాద్యంత వర్ణముల సంకేతము రాజునకు తెలిసినప్పు డామె యేమి చేయుటకును దోఁపక మూర్ఛనొందెను. రాజామెకు కఠినమైన మరణ దండన విధించెను. ఈ సంగతి వినినయంతనే యిది వఱకే సగము చచ్చియున్న యామె తన్నుకొనుచు సారంగధరుని మృతి వినుటతో ప్రాణములఁ బాసెను.

ఈ నాటకమున చిత్రాంగి యొనర్చిన పాపములు మూఁడు. తన్నగ్ని సాక్షిగా పెండ్లియాడిన భర్త ముదుసలియైనను, మూఢుఁడైనను, మాఱాడక పతి భక్తితో నుండవలసిన హిందూ స్త్రీ వేఱొకని వలచుట యొకటి. సారంగధరుఁడామె యింటికి వచ్చినప్పు డాతఁడు కుమారుఁడనియైన నెంచక, ఆతని నీతి బోధల నాలింపక,

పైఁబడి యాలింగనము చేసికొనఁబూనుట రెండవది. తన దోషమునకు లోఁబడక వశీకృత చిత్తుఁడగు సారంగధరుఁడు వెడలిపోవుటకు సంతోషింపక, అన్యాయముగా నాతని చంపించుట మూఁడవది. నిజము పరికించినచో నీ మూఁడు దోషములును ఒకదాని కొకటి తీసిపోనివి. ఇట్టి దోషము లొనరించిన చిత్రాంగిని శోచనీయగా నొనర్చుటలోనే కవి ప్రతిభాశక్తి సహస్ర ముఖముల గోచరించుచున్నది. ఆమెకు సారంగధరుని యెడఁ గల ప్రేమయొక్క నైర్మల్యమును స్పష్టముగా వర్ణించుటచేతను, చిత్రాంగి తొలుఁదొలుత సారంగధరునే వలచి యుండినను బలవంతముగా రాజును పెండ్లి చేసికొనవలసి వచ్చెనను మూల భిన్నకల్పనము చేతను, ఆమెకు అభిమానము నెడఁ గల మహాభినివేశమును, సారంగధరుని శిక్షను వినిన తరువాత నామె యనుభవించిన పశ్చాత్తాపమును, వేదనను విపులముగ వర్ణించుటచేతను, కవి యామెను వరుసగా నాపై దోషములనుండి రక్షింప ప్రయత్నించెను. అట్టి ఘోర దోషముల విస్మరింపఁ జేయు నాత్మ గాంభీర్యమును (nobility of the soul) మనస్వితను (highmindedness) వర్ణింపఁగల్గుట సామాన్య కవుల సామర్థ్యమున కందరాని శిల్పవిశేషము.

## VII

ఆచార్యులవారి విషాదాంత నాటకములలోని సామాన్య గుణములు: ఆంగ్ల నాటక కర్తలలో నగ్రేసరుఁడగు Shakespeare విషాద నాటకములలో స్త్రీ పాత్రలకు ప్రాముఖ్యము తక్కువ. అతఁడు స్త్రీ పాత్రలను ప్రవేశపెట్టినను, స్త్రీ సహజమైన లాలిత్యము లోపించుటచే వారు స్త్రీ రూపముననున్న పురుషులవలె గోచరింతురు. (Macbeth) నాటకములో Macbeth భార్య యిట్టిదే. Othello నాటకమున Desdemona స్త్రీ లాలిత్య నిధానమే యయ్యును ఆమె కందుతగిన ప్రాముఖ్యము లేదు. నాటక వస్తువిస్తృతి కామె యేవిధముగను తోడ్పడదు. ఆచార్యులవారి విషాద నాటకములలో ప్రధానములైన మూఁడింటిలో నట్లుగాక స్త్రీ పాత్రలకు మితిమీఱిన ప్రాధాన్యము కలదు. విషాద సారంగధరమునకు చిత్రాంగిపాత్రము ప్రాణమువలె నున్నది. ఆమె లేక పోయినచో నా నాటకమే లేదు. కైక వరము లడుగుట యను విషయము పాదుకా పట్టాభిషేకములోని శోకమునకు బీజమువంటిది. ఇట్లే చంద్రహాస నాటకములో విషయపాత్రకు చంద్రహాసునికంటె సైతము మిక్కిలి ప్రాధాన్యము కలదు. గాంభీర్య ప్రధానములైన విషాద నాటకములలోని వారే యయ్యును వీరు Macbeth సతివలె పుంజీకృత పుంభావములగు వనితాకారములు కారు. వీరిలో విషాద నాటకమునకు కావలసిన గాంభీర్యముతో పాటు స్త్రీ సహజమైన లాలిత్యము కూడ గోచరించుచున్నది. ఒకటి కొకటి పొసఁగని యీ వికట భావములను వీరిలో నిముడ్చుటలో నాచార్యులవారి

ప్రతిభ యపారము. సారంగధరునియెడ నిర్మలానురాగము చూపు చిత్రాంగి యందును, చంద్రహాసునిపైఁ గల ప్రేమచే తండ్రి మనోరథమునకుఁ గూడవ్యతిరేకముగా నాతని రక్షించు విషయ యందును, రామపట్టాభిషేకమును విని మిక్కిలి యానందించిన కైకయందును నీ లాలిత్యము విస్పష్టముగా గోచరించుచున్నది.

ప్రణయగాథ విషాద భావములకు సహజముగ ప్రతి యోగి. శృంగార రసము విప్రయోగము వినా కరుణ రసమునకు పోషకముకాఁజాలదు. అందుచేతనే యీప్రణయ మయ వస్తువులు విషాదాంత నాటకముయొక్క గాంభీర్యమును (Seriousness) కొంతవఱకు లఘూకరించునని విమర్శకుల తలంపు.) Romeo and Juliet లో నా భావము కొంతవఱకు కొఱతవడుట కీ ప్రణయవస్తు ప్రవేశనమే ఉత్తరవాది. ఆచార్యుల వారి నాటకములు మూఁడింటిలోను ప్రణయ విషయము కొంచెముగనో గొప్పగనో కానిపించుచునేయున్నది. విషాద సారంగధరములో ప్రణయమే కథ. చంద్రహాసలో మూఁడవ యంకము మొదలుకొని ప్రణయగాథ మూల వస్తువును మఱుగుపఱుచు నంత యధికముగా కలదు. పాదుకా పట్టాభిషేకములో నిదికొంత తక్కువ. అందు చేతనే కాఁబోలు నందలి శోకరసము పర్యాప్తముగా సిద్ధిని బొందినది.

Shakespeare విషాద నాటకములలో బహిరంతస్సంఘర్షములు (inner and outer conflicts) రెండునున్నను, అట్టి నాటకములకు వన్నె తెచ్చిన దాంతర సంఘర్షమే. సాధారణముగా నీ యాంతర సంఘర్షము ధర్మ్యమైన నాయకుని యంతరాత్మకును, మానవ సహజమైన కొందొక దౌర్బల్యమునకును నడుమ జరుగు టయు నందు అంతరాత్మ నతిక్రమించి యా దుష్టభావమే చెలరేగి నాయకుని నాశ నమునకు కారణమగుటయు కానిపించుచుండును. ఒక్కొక్కప్పు డిట్లుగాక నాయకుని హృదయమున భిన్నములైన రెండు భావములకు సంఘర్షము కలుగుటయు కలదు Macbeth లో నాయకుని హృదయమున రాజ్య తృష్ణకును సాధారణ రాజభక్తికిని సంఘర్షము కలిగెను, Othello లో అసూయకును భార్యపైఁ గల యనురాగము నకును సంఘర్షము కానిపించుచున్నది. ఎట్లయినను ఆ నాటకములలో ప్రేమ, నీతి, ధర్మము మొదలగు సద్భావముల నతికరించి యసూయాదులగు తీవ్రభావములే విజృం భించుట తఱుచు. అప్పుడే నాయకునిలో మానవ సహజ దౌర్బల్యమునఁ గలిగిన దోషమున కవకాశముండును. ఆచార్యులవారి నాటకములలోఁ గూడ నిట్టిది కలదు. కాని యిది నాయకులలోఁగంటె నాయకేతరములైన ప్రధాన పాత్రలలో హెచ్చుగా

కాననగును. కైక హృదయమున సాధారణ ధర్మమునకును మంధరా వాక్యగర్భితమైన హేతువాదమునకును సంఘర్షణము సంభవించెను. రెండవదియే విధి సహాయమున మొదటిదానికంటె బలీయమై యామెచే నా దోషమును చేయించెను. చిత్రాంగి హృదయమున సారంగధరునిపైఁ గల యనురాగమునకును నిరాకరణాదులను సహింపఁజాలని కోపసహితమైన పట్టుదలకును తీవ్ర వైరుధ్యము కలిగెను. అందు రెండవదే మొదటి దానిని జయింపఁగలిగెను. నాయకులలో నిట్లుగాక ధర్మ్యములైన రెండు భావములకే సంఘర్షము కలుగుటయు ఆ రెంటిలో నెక్కుడు ధర్మ్యమైన దాని నాతఁడొనర్చుచుండుటయే యాతని వేదనకు కారణమగుచుండుటయుఁ గానిపించును. దశరథుని హృదయమున సత్యపరిపాలనకును, పుత్త్రప్రేమకునువలె రాజరాజు హృదయమున ధర్మమునకు, పుత్త్రప్రేమకును తీవ్రమైన సంఘర్షము కానిపించును. ధీశాలులైన వారిరువురును ఆ రెంటిలో నెక్కువ యాదరణీయములైన సత్య ధర్మములనే యనుసరించిరి. ఈ దృష్టితో చూచినచో దశరథుఁడు రాము నరణ్యమునకు పంపుట యందును, రాజరాజు సారంగధరునికి మరణశిక్ష విధించుటయందును దోషమే కానరాదు. సత్యనిష్ఠగల్గి ధర్మానుసారముగా దాని నమసరింపఁగలిగిన దశరథుఁడును, ధర్మ పక్షపాతము గలిగి ప్రాడ్వివాకుల వచనము ననుసరింపఁ గలిగిన రాజరాజును తరువాత పశ్చాత్తాప పడవలసిన యక్కఱయే కానరాదు. దశరథుఁడు కైక క్రౌర్యము నెఱింగియు సమర్థించి సత్యము తప్పుట తన వంశమునకు కళంకము నాపాదించుట యని ప్రియ సుతుఁడైన రాముని నడవికి పంపవలసివచ్చెను. రాజరాజు చిత్రాంగి కాపట్యము నెఱుంగకుండుటచే నజ్ఞాతముగ సారంగధరునికి మరణ దండన విధించుట యను దోషము నాచరింపవలసి వచ్చెను. దశరథుఁడు గూడ దీనకొఱకై రాము నరణ్యమునకు పంపి యాతని రాజ్య భ్రంశమునకు కారణభూతుఁడగుటచే కొంత దోషమునకే గుఱియగుచున్నాఁడు. కాని ధర్మమూర్తులైన వారిరువురును ధర్మము ననుసరించుటకు ఫలమైన తప్పు కావించిన వారగుటచే మఱింత శోచనీయు లగుచున్నారు. చంద్రహాసునిలో నసలు దోషలేశమేనియు కానరాదు. ఆ నాటకమందలి కార్యమంతయు మంత్రియగు దుష్టబుద్ధిపైనే యాధారపడియున్నది. చంద్రహాసుఁడు తాను స్వయముగా చేయుటకంటె నితరులు చేసిన తంత్రములకు గుఱియగుటయే హెచ్చు. దుష్టబుద్ధి క్రౌర్యము అతి మాత్రమగుటచే నాతని హృదయములో చివరి భాగమున పుత్రికా ప్రేమకును రాజ్యతృష్ణకును గలిగిన సంఘర్షముయొక్క విలువయే పోయినది. ఆవార్యులవారి నాటకములలో భిన్న భిన్న పాత్రల మధ్య బహిః సంఘర్షము కూడ కానవచ్చుచున్నది. కాని యిది చాల అపురూపము. చంద్రహాసలో దుష్టబుద్ధి చంద్రహాసులకును, పాదుకా పట్టాభిషేకములో కైకా దశరథులకును, విషాద

సారంగధరమున రాజరాజు భార్య లిరువురికిని ఈ బహిస్సంఘట్టనము కలదని చెప్ప వచ్చును. కరుణ రసమునకుఁ బుత్త్రి మరణము కాని తద్వియోగము కాని మిక్కిలి పరిపోషకమైన యాలంబనమని యాచార్యులుగారి తలంపైయుండెను. ఏలయన నాయన విషాద నాటకములలోని కరుణమెల్లయెడలఁ బుత్త్రి సంబంధిగానే యున్నది.

Shakespeare విషాద నాటకములలో నాయకులు పశ్చాత్తాపము పొందుట యున్నదికాని, దుష్టపాత్త్రలు పశ్చాత్తాపపడుట యెచ్చటను కానరాదు. ఆ దుష్టపాత్ర (Villain) యే నాయకుఁడయినప్పుడు Macbeth లో వలె, నాతని హృదయమునఁ గూడ పశ్చాత్తాపము కలిగించుట యాతని కలవాటు Iago మొదలగు వారి హృదయములలో పశ్చాత్తాపము కలిగిన దనుటలో స్వాభావికత కొఱవడునని ఆ మహాకవి య ట్లొనరించి యుండలేదు. ఆచార్యుల వారు తమ విషాదనాటకములలో దుష్టపాత్రకు సైతము కించిత్పశ్చాత్తాపము కలిగించి, దానిని పరిపూతము కావించుట కాననగును. నిజము పరిశీలింపఁగా నాయన విషాద నాటకములలో పశ్చాత్తాప పరిపూతము కాని పాత్రమే లేదు. దోష మాచరించిన వాఁ డెంత కఠినుఁ డయ్యును పశ్చాత్తాపమునకు గుఱికాకపోఁడని యాయన యూహించి యుండనోపు. లేదా యా నెపమున సామాజికు లకు నీతి గఱపఁ దలఁచియుండనోపు. చంద్రహాసలో చివరికి దుష్టబుద్ధి పశ్చాత్తాపము కలిగి ఆత్మహత్య చేసికొనును. పాదుకా పట్టాభిషేకములో కైక యొక్కయు విషాద సారంగధరములో చిత్రాంగి యొక్కయు శీలమును సమర్థించుట కాయన చేసిన ప్రయత్నము స్పష్టముగనే కాననగుచున్నది. అన్నిటికంటె విచిత్రము పాదుకా పట్టాభిషేకములో మంధర సైతము ఆఱు రోజులు బాధపడి మరణించుచు తన యప రాధమును క్షమింపుమని రామునికి జాబు వ్రాయుట. మంధరా జీవితమున నిట్టి పశ్చాత్తాపము దురూహ్యము. ఇట్టిది పశ్చాత్తాపము చేసిన పాపముల తీవ్రతను తగ్గించి పాపుల పరిపూతులఁ గావింపఁ గలదను విషయమును సూచించుచున్నను మిక్కిలి అస్వాభావికముగా నున్నది. ఇట్టివానివలన నాటక గాంభీర్యము కొంత పలుచబడును. Shakespeare దుష్టపాత్త్రలకును, వీరి దుష్టపాత్రలకును మఱియొక ముఖ్య తారతమ్యము కలదు. ఆ కవిచే పోషింపఁబడిన దుష్టపాత్రలు సకల సద్గుణముల కిరవై యాదర్శప్రాయమయిన యొక వ్యక్తిని తమ దుర్బోధనలకు లోఁ జేసికొని పలువిధ ముల దురాశ గొల్పి తమ దుష్పథమున కా వ్యక్తి నీడ్చుట తఱుచు. ఈ కవిచే రచింపఁబడిన నాటకములలో నట్లుగాక యెన్ని దుర్బోధనలకుఁ జిక్కినను, ఎన్ని కపటోపాయముల పాలయినను వానికి లోనుగాక సహజ సౌశీల్య ప్రభావముచే వాని నన్నింటి నడఁగఁద్రొక్కి తమ సత్పథమును తప్పని మహాపురుషులుగా కానవచ్చు

చున్నారు. మచ్చునకుఁ గొన్నింటి నుదాహరింపవలెనన్న "అయాగో" అను దుష్టాత్ముని కపటోపాయములకులోనై ఒథెల్లో అను సత్పురుషుఁడు తన కత్యంత ప్రీతిపాత్రయై సుగుణమూర్తి యగు తన ప్రేయసిని చేతులార నిష్కారణముగ చంపినాఁడు. సారంగధరుఁడు చిత్రాంగి దౌరాత్మ్యమునకుఁ జిక్కి ఆమె కపట కృత్యములచే తన ప్రాణముల కెక్కు పెట్టినను ధర్మపథమునుండి తప్పక ప్రవర్తించుట చూచు చున్నాము. పాదుకాపట్టాభిషేకములో మంథర తన కపటోపాయములచే భరతుని వలలో వేసికొనుటకు ప్రయత్నించినను సద్గుణ ఖని యగు భరతుఁ డామె ప్రయత్నముల నన్నిటి తుచ్ఛముగాఁ జూచుచున్నాఁడు."

ఆంగ్ల నాటకములలో "Neo Classic drama" "Romantic drama" అని రెండు తెగలు కలవు. ఈ రెంటికిని అనేక విషయములలో భేదము లున్నవి. మొదటి రకపు నాటకములను వ్రాసిన వారు Seneca ను అనుకరించుచు Aristotle విషాదాంత నాటకమునుగూర్చి చెప్పిన సర్వ లక్షణములను పాటించిరి. రెండవరకము నకు చెందినవారు వానిని యథావకాశముగ మాత్రము పాటించిరి. అందు మొదటి తెగవారు కులీనులను మాత్రమే తమ నాటకములలో పాత్రలుగా ప్రవేశపెట్టిరి. రెండవ తెగవారు (Shakespeare ఈ తెగవారికి నాయకుఁడు) రాజులు అమాత్యులు మొదలగువారినే నాయకులుగా స్వీకరించినను వారికి సామాన్యులతోడి సంబంధము కల్పించిరి. ఆచార్యులుగారు నైతమీ విషయమున Romantic తెగవారినే అనుకరించిరి. ఈయన నాయకులందఱును రాజకుటుంబములోనివారే. కాని యీయన వారితోపాటు మంథరాదులగు సామాన్య పాత్రలకు కూడ నాటక కార్యమున ప్రాధాన్యము నొసంగెను. ఈయన విశ్వజనీనభావము (Universality) కొఱకు రాజకుటుంబములోని వారినే నాయకులుగా తీసికొనుటకాక మఱి రెండు పద్ధతులను అవలంబించు చుండును. అందొకటి దుష్టబుద్ధివంటి యొకానొక తెగకు ప్రతినిధులయిన పురుషుల సృష్టించి నాటకాంతమున వారిచే కొన్ని నీతి ధర్మముల నుద్ఘోషింపఁజేయుట. "నా దుశ్చరిత మంతయు వచించుటచే నా కేమియు ఫలము కలుగదు నిక్కువమే. అయినను ఈ జగమంతయు విన్నచెంతయు నుపయోగకరము. నా యట్టి దురాత్ము లెందరో యుందురుకదా! వారికెల్ల నా యట్టి ఫలప్రాప్తియే కలుగఁగలదు." అను దుష్టబుద్ధి వాక్యములందును, "ప్రణుత గౌరవమున రాజనై విభవ గతి మీరియున్న నా గతి యిట్టులైన నితరుల మాట యింకేల? లెక్కింప నోడకాడెద సింకనో చెలులార! యీడుగాని వివాహమెందును తగదు," అను రాజరాజు వాక్యములందును ఇది స్పష్టముగ గోచరించుచున్నది. రెండవది విధి ప్రభావమును ప్రదర్శించుట. దశరథుఁడు

తా నే దోష మాచరింపకపోయినను అంత వ్యథకు పాలగుటయు, కైక మంథరా వాక్యముల నంత నిశితముగ పరీక్షించియు నామె మాయా వాగురలఁ జిక్కుటయు, సారంగధరుని శిక్ష నాపుచేయుటకై పంపఁబడిన భటుఁడు దైవవశమున మార్గము తప్పుటచే నచ్చటి కాలస్యముగ చేరుటయు, దుష్టబుద్ధి యొనర్చిన మాయా తంత్రము లన్నియు భగ్నములై పోవుటయు, బలవత్తరమైన విధి ప్రభావమును మిక్కిలి స్పష్టముగా వ్యక్తము చేయుచున్నవి. ఎంతవాఁడైనను విధి ప్రభావమునుండి తప్పించుకొనలేఁడను తాత్త్విక భావము నీ పై విషయములన్నియు సమర్థించుచున్నవి. ఈ భావమునకుఁగల విశ్వజనీనత యింతింత యనుటకు వీలు కాదు.

Neo classical నాటక కర్తలు కొన్ని విషయములు రంగము మీఁద ప్రదర్శించుటకు తగనివని తోఁచుటచే వానిని కథన పూర్వకముగా వెలువరించిరి. అందుచే వారి నాటకములలో కార్యముకంటె (action) కథనమే (narration) హెచ్చు. Shakespeare మొదలగువా రే వివక్షయు లేక నాటక కార్యమునకు సంబంధించిన విషయములెంత ఘోరములైనను రంగముమీఁదనే సంవాద పూర్వకముగా నడపించిరి. అట్లే ఆచార్యులుగారును దృశ్యసూచ్య వస్తు విభేదము చేయక నాటకముతో సంబంధించిన యావ ద్వృత్తాంతమును రంగముమీఁద సంవాదరూపముగనే ప్రదర్శించిరి. దశరథుఁడు చిత్రాంగి మొదలగువారి మృతి రంగముమీఁదనే జరిగినది. కాలు సేతులు ఖండింపఁబడిన సారంగధరుఁడా ఉద్వేగావహమైన అవస్థలో పలువురితో సంభాషించుట కలదు. ఈ విధముగానే ప్రాచ్యలాక్షణికు లప్రదర్శనీయములని నిషేధించిన పెక్కు విషయముల నాచార్యులవారు రంగముమీఁదనే ప్రదర్శించుట గోచరించుచున్నది.

కరుణమునకును హాస్యమునకును పొందు పొసఁగదని ప్రాచ్యలాక్షణికుల మతము. Shakespeare కూడ తన విషాద నాటకములలో నీ హాస్యమును తన మోదాంత నాటకములలో వాడిన యంత విరివిగా వాడియుండలేదు. ఎక్కడనో యొకటి రెండుచోట్ల విషాద భావముయొక్క తీవ్రత్వము తగ్గించుటకై యిట్టి హాస్యరసమయములైన రంగములను ప్రదర్శించెను. ఆచార్యులుగారికి కూడ హాస్యరస పరిపోషణ మిష్టమే. కాని యీ విషాద నాటకములలో నాయన హాస్యమును వాడిన స్థలమే కానరాదు. కాని మంథర భరతుని వివాహమాడఁ దలంచుటలో కొంత హాస్యరసపు పోకడ కానవచ్చుచున్నది. అట్లే విషాద సారంగధరమున నున్మాద వైద్యశాలలోని పిచ్చివారి సంభాషణమునందును, చిత్రాంగి దాసితో సంభాషించు సందర్భమున

దాసి యన్న "తల వేతై పోవునుగదా. అప్పుడింకెట్లు మాటలాడుదును, భోజనమెట్లు చేయుదును" అను పలుకులయందును కొంత హాస్యరసపు ఛాయ గోచరించుచున్నది. ఆచార్యులవారు విషాద భావము నిష్ఫరము కావించుటకును, దోషముయొక్క నైశిత్య మును బాగుగా గోచరింపఁజేయుటకును కొన్ని ప్రత్యేక రంగములను విరచించు చుందురు. విషాద సారంగధరమున సుబుద్ధికి చిత్త చాంచల్యము కలుగుటయు, చిత్రాంగియు రాజును మాటాడుచుండగా రత్నాంగి యచ్చటికివచ్చి పుత్రభిక్ష నిమ్మని వేఁడుటయు, రాముఁడు కైక యాజ్ఞ స్వీకరించిన తరువాత కౌసల్యాదేవిని సీతను దర్శించుటయు నిట్టివే.

# VIII

ఐక్యత్రయము : (The Three unities)

ఆచార్యులుగారును Shakespeare మొదలగు (Romantic dramatists) నాటక కర్తల వలె గ్రీకువారును, Neo classical నాటక కర్తలును తప్పక యనుస రించిన దేశకాలైక్యములను పాటింపలేదు. ఒకవేళ అట్టివి పాటింపఁబడినట్లు కాన వచ్చినచో నది యాదృచ్ఛికమే కాని మనఃపూర్వకము కాదు. విషాద సారంగధరములో మొదటి యంకపు రెండు మూఁడు రంగముల మధ్య సుమారు వారము దినములు గడచెను. నాలుగైదంకముల నడుమ కొన్ని గంటల కాలమైనను గడవలేదు. పాదుకా పట్టాభిషేక మున నాలుగవ యంకము తుదివఱకును సుమారు పదునేను దినములు గడచియుండెను. నాలుగైదంకముల నడుమ కొన్ని దినముల వ్యవధానమైన నుండి తీరవలెను. ఈ కారణముచే ఆచార్యులుగారు కాలైక్యమును బాటింపలేదని చెప్పవచ్చును. పాదుకా పట్టాభిషేకమునందు తుది యంకములోని విషయము తప్ప తక్కినదంతయు నయోధ్యలోనే జరిగెను. విషాద సారంగధరమున సారంగధరుని హత్యతప్ప తక్కిన వన్నియు చిత్రాంగి నగరు, రాజరాజ నరేంద్రు నాస్థానము మొదలగు చోటులనే జరిగెను. చంద్రహాసలో రంగములు చందనావతికిని కుంతల నగరమునకును మాఱుట కానవచ్చును. మొదటి రెంటిలోను స్థలైక్యమున్నట్లు కానిపించుచున్నను మూఁడవ దానిలో నది భగ్నమగుటచే నాచార్యులుగారికి దానిని బాటించు పూనిక లేదని తెలియు చున్నది. వస్త్వైక్యము పాటింపవలెనని Neo-classical నాటక కర్తలును Romantic నాటక కర్తలును గూడ నంగీకరించిరి. కాని వస్త్వైక్యమును నిర్వ చించుటలో వారిరువురికిని భిన్నాభిప్రాయము కలదు. మొదటివారు కథ సూటిగా నుప కథలతో (Sub plots) కూడకుండ నుండుట యుక్తమనిరి. రెండవ తెగవా రుపకథ లున్నను నిర్వహణమున నేకఫల ప్రాప్తిలో నైక్యపడినఁ జాలుననిరి. అందుచే

షేక్స్పియరు మున్నగువారు తమ విషాద నాటకములలో యథేచ్ఛముగా నుపకథలను వాడిరి. అట్లే వారు ఖేద మోదములు రెంటిని కలగలిపిరి. ఆచార్యులుగారి విషాదాంత నాటకములలో నీ వస్తు వైవిధ్యము కానరాదు. కాని చంద్రహాసలో మూఁడవయంకము లోని పరిణయ వృత్తాంతము ప్రధాన వస్తువుకంటె భిన్నమైన యుపకథవలె నున్నది. ఆచార్యులుగారి విషాద నాటకములలో నొక్క చంద్రహాసలోఁ దక్క మఱెచ్చటను ఖేద మోద సమ్మేళనము కానరాదు. ముఖ్యమయిన రెండు విషాద నాటకములును నచ్చమయిన కరుణ రసమున కునికిపట్టులు.

---

# 4. ఆంధ్ర నాటక పితామహుని నాటకములలోని వస్తువులు

## I

నాటకాంగము లన్నిటిలో వస్తువు (Plot) మిక్కిలి ముఖ్యమయినదని ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులందఱు నేకగ్రీవముగా నుడివిరి. వస్తువు రసోచితమయినది లభించుచో, కవి వన్నెలు చిన్నెలు చేకూర్చి పాత్ర పోషణము ద్వారా దాని కొక సంపూర్ణమయిన యాకారము నొసంగును. అసలు వస్తువే లేనిదే కవి యెంత నిపుణుఁడైనను కావ్య మభిరుచిని గల్పింపఁజాలదు. పాత్ర పోషణమునకు ప్రాముఖ్యము నొసంగి, కేవల మనస్తత్త్వ నిరూపణము కొఱకు మాత్రమే వ్రాయఁబడిన నాటకములలో సైతము కొద్దిగనో గొప్పగనో యేదో యొక యాలంబన వస్తువుండి తీరును. అందును నాటకము రంగస్థలమున జన సామాన్యము కొఱ కుద్దేశింపఁబడిన దగుటచే నందు కథయొక్క విస్తృతియు (Kind) ఉత్తమత్వమును (Quality) గూడ నాశింపఁబడును. అదియునుగాక నాటకమున కార్యము (Action) ప్రాధాన్యము వహించి యుండును గాన తత్క్రమ వికాసమునకుఁ దగిన వస్తువుండుట చాల అవసరము. అసలు వస్తువను దేహమున్నచో కవి పాత్ర పోషణాది సాధన సంపత్తిచే ప్రాణ ప్రతిష్ఠాపన చేసి దానికి చైతన్య వికాసములు చేకూర్పఁగలఁడు.

వస్తు విస్తృతికిని పాత్ర పోషణమునకును పరస్పరాశ్రయత్వము కలదు. పాత్రల ద్వారా వస్తువు విస్తరింపఁబడును; వస్తువుయొక్క క్రమ పరిణామము ద్వారా పాత్రల శీల స్వభావములు వ్యక్తము లగును. కాని నాటకమున నవలలోవలె పాత్రల సంఖ్య యెక్కువగానున్న నది ప్రయోగాసాధ్యమై పోవుటయేకాక యతిక్లిష్టతచేఁ జదువునప్పుడు గూడ దురవగాహమగుట సంభవించును. అందుచే నాటక కవి పరిమితమయిన తన వస్తువున కవసరములయినట్టియు, నందుఁ బ్రవేశపెట్టుట కర్హము లయినట్టియు పాత్రలను మాత్రమే సృష్టింపవలెను. ఇట్లే యా పాత్రల గుణస్వభావ ప్రకటనమున కుపయోగపడని సన్నివేశములు కాని సంవాదములు కాని చొరకుండు నట్లుగా నతఁడు వస్తువును సమకూర్చుకొనవలెను.

వస్తు సంధానము చేయునపుడు నాటక కవి, రంగమును, తత్పరికరములను గూడ సాధారణముగా దృష్టి యందుంచుకొనవలెను. Shakespeare మొదలగు గొప్ప నాటక కవులు సామాజికుల నాకర్షించుటకు మాత్ర ముపయోగించు కొన్ని సన్నివేశములను నాటక వస్తువునఁ బ్రవేశపెట్టుట కానవచ్చుచున్నది. యశఃప్రార్థియగు నాటక కవి యెప్పుడును సామాజికుల దృక్పథమును దొలుఁదొలుత నాకర్షించునది రమ్యమయిన కథా సంవిధానమేయని యెఱింగి, దానిని గూర్చిన తరువాతనే కార్యము (mere action) కంటె నుదాత్తతరములయిన మానసిక తత్త్వ నిరూపణములకై ప్రయత్నించును. తాత్కాలికములయిన రంగ పరికరములను కవి విస్మరించినచో నతఁడెంతో నిపుణముగా రచించిన రంగమునైనను ప్రదర్శనాసాధ్యమగుటచే నటకులు నాటకమునుండి తొలగించివైచుట సంభవించును.

నవల రచయితకు దేశవస్తు కాలాదులలో నియమములేదు కాఁబట్టి యాతఁడు నవల నెంత దీర్ఘముగానయిన వ్రాయుటకు వీలు గలదు. నాటక కవి పరిమిత స్థలములో వీనియం దైక్యమును సంధానింపవలయును. కావున నంకమునకును నంక మునకును నడుమ కొంత వ్యవధానము తటస్థింపవచ్చును. ఈ వ్యవధానము మఱుగు పఱిచి యనుస్యూతముగా సానుబంధముగా వస్తువును గూర్చుటలోనే కవి శిల్ప నైపుణ్యమంతయు గోచరించును. ఈ వ్యవధాన గోపనమున కవి యే మాత్ర ముపేక్ష చేసినను నాటక వస్తు వతుకులు వడి సమష్టి సౌందర్యము (Beauty of the whole) ను గోల్పోవును. ఇట్లే యంకముల యందుండు భిన్నభిన్న రంగముల నడుమఁ గల యంతరములను గూడఁ గవి యెక్కువ నేర్పుతో నతుకుచుండ వలెను. లేనిచో నాటకమున నా రంగమునకుఁ గల సంబంధము ఖండితమై పోవుటచే నది యనవసర మనిపించును.

అరిష్టోటలు చెప్పినట్లు నాటక వస్తువు మిక్కిలి సంక్షేపముగా నొకేసారి కూర్చుండి చదువుటకుఁ గాని వినుటకుఁ గాని యనువుగా నుండవలెను. ప్రేక్షకుల యుపవేశనశక్తి (Sitting endurance) పరిమిత మగుటచేఁ గొంతకాలము గడచిన తరువాత వారు విసుగుదలచే నిఁక వెడలిపోవుటకుఁ బ్రయత్నింతురు. అట్టి సమయ ముల నెంత మహోత్కృష్ట రంగము లయినను వారి నాకర్షించుటకుఁ జాలియుండవు. ఈ కారణముచే నాటక కవి వస్తువును కుదించి, ప్రధాన విషయములను మాత్రమే గ్రహించి, వానిని విస్తరించుటయందే విశేషావధానముతో పనిచేయవలయును. అప్పుడు నాటక మాద్యంతము సామాజికుని దృష్టి నాకర్షించి రస సిద్ధిని గలిగించును.

ప్రాచ్యలాక్షణికులు సైతము నాయకునికిఁ గాని రసమునకుఁ గాని భంగకరములయిన విషయములను నాటకము నుండి తొలఁగింప వలెనని చెప్పియుండిరి. దీనికిఁ గూడ నిదియే హేతువై యుండును.

నాటక కవి కల్పిత కథను వస్తువుగా స్వీకరించి నప్పుడు సామాజికుల కది సరిక్రొత్తగా నుండును గాన వారు విశేషావధానముతో వినుచుందురు. కాని వస్తువు ప్రఖ్యాతమయినప్పుడు వారికి దానియం దంత శ్రద్ధ యుండదు. అందుచే నాటక కవి ప్రఖ్యాత వస్తువునే గ్రహించినను, అం దెడనెడ సామాజికుల దృష్టిని సమాకర్షించుటకుఁ గాను కొన్ని యపూర్వ కల్పనములు చేయుచుండుట యావశ్యకము గాకపోయినను, నాటకానురక్తికి మిక్కిలి తోడ్పడును. అట్లుగాక యున్న వస్తువునే యథాస్థితముగాఁ బ్రదర్శించినచో నది యంత యాదర పాత్రము కాఁజాలదు. ఏలయన పరిచిత వస్తువు నెడ సోపేక్షముగా సంచరించుట మానవుల స్వభావము. Shakespeareను దదితరాంగ్ల నాటక కర్తలు నీ పద్ధతిని నచ్చ టచ్చట నుపయోగించుకొనిరి. ప్రాచ్య నాటక కవులలోఁ గాళిదాసు భాసుఁడు మొదలయిన వా రందఱు కొలఁదిగనో గొప్పగనో తమ నాటకములలో నిట్టి నూత్న కల్పనలు కావించిన వారే.

మూలమునుండి వస్తువును స్వీకరించినప్పుడు కవి ప్రధాన విషయములలో దాని ననుసరించినచో నవాంతర విషయములలోఁ గొంత దూరముగాఁ బోయినను, అంత యనర్థము లేదు. ముఖ్య విషయములలో సైతము భేదములు కానిపించినచో సామాజికులు కవియెడ విశ్వాసమును గోల్పోయి యొక్కొక్కప్పుడు విముఖు లగుదురు. ఉత్తర రామచరిత్రలోఁ జివరకు సీతారాములకుఁ బునస్సంయోగము గల్గుట ముఖ్య విషయమునకు సంబంధించిన భిన్నత్వమే యయ్యును, కరుణావసానమును సహింపఁ జాలని హిందువుల మనస్తత్త్వమునకు సరిపడినదగుటచే నంతహాని లేకపోయినది. అదిగాక జైమిని భారతమునఁగూడ మోదాంత కల్పనము కానవచ్చుచున్నది. మూలముననే పునస్సంయోగ కల్పన యుండగా భవభూతి యే కావ్యన్యాయమునో పురస్కరించుకొని సీతారాముల వియోగమును ప్రదర్శించె ననుకొందము. అప్పు డది సామాజికులలో నెంతో వైముఖ్యము గలిగించి యుండును. ఇట్లే కైక వరము లడుగ లేదు, రాముఁ డడవి కేగలేదు, అని కవి రచించినచో సామాజికులకుఁ గవి విజ్ఞానము నెడ నభిమానము సన్నగిల్లుటచే వా రతని నజ్ఞునిగాఁ దలఁతురు. ఇఁక నముఖ్య విషయములను పాత్ర రసానుకూలముగఁ గవి యెట్లు మార్చి నట్లు మార్చవచ్చును. ఒక్కొక్కప్పుడు పాత్ర రసాదులకుఁ బుష్టి కల్గించుటకై అన్యథా (Deviation) కల్పనలతోపాటు

అపూర్వ కల్పనలు (inventions) గూడ కావింప వచ్చునని యిదివఱకే చెప్పఁబడినది.

పంచకార్యావస్థలో నారంభమును (Exposition) రచించునపుడు నాటక కవి మిక్కిలి శ్రద్ధ వహింపవలయును. ఏలయన నందు సామాజికుల నాటకావబోధమున కావశ్యకమయిన తత్పాత్ర సంబంధివిషయము సర్వమును కళాదృష్టితో(artistically) సమకూర్పఁబడవలెను. అర్హ విధముగా నీ యారంభమును రచించుట మిక్కిలి కష్టము. దీని యుత్తమత్వమును బట్టియే నాటక కవి శిల్పితనము నొరసి చూడవచ్చును. నాటక కార్య మారంభించుటకుఁ బూర్వ మందు ప్రధానస్థానము నాక్రమించు పాత్రల కొండొంటితో నెట్టి సంబంధము కలదో, వాని స్వభావ మెట్టిదియో, సామాజికుఁ డెఱుంగుట మిక్కిలి యావశ్యకము కావున నాటకముయొక్క యీ యారంభ మాతనికి కావలసినట్టి విషయమునంతను విప్పిచెప్పవలెను. నాటక వస్తువెంత సరళమయిన దయినను కవి యీ భాగమును రచించునప్పుడు మిక్కిలి క్లేశపడును. నాటక వస్తువుయొక్క క్లిష్టతను బట్టియు నందలి పాత్రల సంఖ్యను బట్టియు నీ క్లేశము మఱింత యధికమగుచుండును.

Euripides, Seneca యను పాశ్చాత్య కవులు నాటకావగాహనమునకుఁ దోడ్పడు నీ యారంభమును Prologue అను నొక ప్రత్యేక ప్రక్రియద్వారా వ్యక్తము చేసిరి. ఈ పద్ధతి చాల పూర్వికమయినది. ఆంగ్ల కవులెవ్వరు నా పద్ధతిని సంపూర్ణముగ ననుకరించియుండలేదు. Shakespeare నాటకములు కొన్నిటిలోని దీర్ఘములయిన యారంభ స్వగతములను (Rich. III లోని గ్లష్టరు స్వగతము వంటి వానిని) ఆ పద్ధతియొక్క పరిశిష్ట చిహ్నము లనవచ్చును. Elizabeth కాలములోని కవులు పెక్కురీ యారంభమును సంవాద రూపముననే రచించినను, అందొక పాత్ర చేతనే నాటక కార్యమున కుపోద్ఘాత మనఁదగిన యీ పూర్వగాథా ప్రసంగముల నుపన్యసింపఁ జేయుచుందురు. ఈ పద్ధతి Shakespeare, Tempest, Hamlet మొదలగు నాటకములలోఁ గానవచ్చుచున్నది. కాని కథన రూపమయిన యీ యారంభము నాటక గౌరవమునకుఁ జాలినది కాదు. Dryden సామాజికు లిట్టి దీర్ఘోపన్యాసముల నసలు వినరని చెప్పుటలోఁ గొంత యతిశయోక్తి యున్నను సత్యము లేకపోలేదు.

సంవాద రూపమున నీ యారంభము సాగించుటయే యుత్తమమయిన పద్ధతి. ఇది కథన రూపముననున్నచో సామాజికులకు విసుగు కలుగఁజేయును. Shakespeare

తన Othello నాటకమున నారంభమును సంవాద రూపమున మిక్కిలి నిపుణముగాఁ జిత్రించెను. అది కార్యారంభముతోఁ గలసిపోయినట్లే యుండి మొదటినుండియు సామాజికులలో నాత్రమును, అవధానమును జనింపఁజేయును. ఎట్లయిన కవి యీ భాగమున సమగ్రత్వసిద్ధి (perfection) పొందఁగల్గుట దుర్లభము. ఏలయన నతఁడు సామాజికుల భావముల (emotions) రంజింపఁ జేయుచునే వారి బుద్ధికి (entellect) నీ పూర్వగాథా పరిజ్ఞానికను స్పష్టముగా, సంక్షేపముగా విశదపఱచు చుండవలెను. దీనికి తోడీ యారంభము నాటక కార్యారంభమునకు ద్వారమువలె నుండి సామాజికుల నందుఁ బ్రవేశింపఁ జేయునదిగా నుండవలెను.

దీనినిబట్టి యీ యారంభముననే నాటకస్థ పాత్రలన్నియుఁ బ్రవేశించు ననియు, దాని వలననే నాటక విషయము సంపూర్ణముగాఁ దెలియఁబడు ననియు నను కొనరాదు. ఇందన్ని పాత్రలను బ్రవేశించుట యసంభవము. కాని యందుఁ బ్రధాన పాత్రల నామములు సూచింపఁ బడుటయేకాక, వారికిఁ దదితర పాత్రలతోఁ గల సంబంధము సైతము కొంతవఱకు సూచింపఁ బడును. ఈ విషయమును గూర్చి Pirre Cornielli ఇట్లు చెప్పుచున్నాఁడు. "I desire the first act to contain the basis of all the episodes and shut the door to everything else that might otherwise have been introduced. Frequently this 1st. act does not provide all the necessary information for the entire understanding of the subject and all the characters do not appear in it; but it is sufficient that they are mentioned or that those on the stage are made to go in search of them. An actor ......should......give information to the listener, through the passion which moves him and not by mere narration."

ఒండొంటితో నంత సన్నిహిత సంబంధము లేని ప్రత్యేక విషయములు (detached incidents) కొన్ని, నాయకుఁ డను సూత్రముచే నను సంధింపఁబడుట కొండొకచోఁ గానవచ్చును. ఈ విషయములు నాయకునితో సంబంధము కలిగి యున్నను నాటక కార్యమున కే విధముగను తోడ్పడవు. ఉపసంహృతి వీని యన్నిటి సాహాయ్యమున క్రమముగాఁ బరిణమింపకపోవుటచే బీజముతో సంబంధము లేని వేఱు ఫలముగాఁ గానవచ్చును. ఇట్టిది సాధారణముగా నొకే వ్యక్తియొక్క వివిధాను భవములను వర్ణించునప్పుడు సంభవించును. ఆరంభమునుండి ఫలాగమము వఱకుఁ గ్రమాభివృద్ధి కలిగియుండని యిట్టి వస్తువు లైక్య విహీనములై చరిత్రవలె వేఱు

వేఱు సన్నివేశముల సంకలనము వలె కానవచ్చును. ఇట్లు గాక యారంభమున సారంభమై, ప్రయత్నాదులలోఁ గ్రమముగా నభివృద్ధిఁ గాంచుచు, ఫలాగమమున ఫలించు వస్తువు నాటకమునకు మిక్కిలి యనుకూలముగా నుండును. ఇందలి వివిధాంగము లైక్యముతో విలసిల్లుచు నంగి యొక్క పుష్టికి మిక్కిలి తోడ్పడును. ఇందలి వివిధ సన్నివేశములు - ఎచ్చటనో పుట్టి, వివిధ స్థలములలోఁ బ్రవహించి, చివరికి సముద్రమునఁ గలియు నదులవలె-నుపసంహృతిలోఁ గూడుకొని యేకైక ఫలమును సూచించుచుండును. నాటక కార్యముతోడి సంబంధమును వీడి యివి యొక్కింత యైనను దూరముగఁ బోవు. ఇట్టి నిబిడమయిన వస్తువు (organic plot) నాటక సౌందర్యమునకు వేయి విధముల పుష్టిని గలిగించును.

నాటక వస్త్వైక్యము విషయమున పాశ్చాత్యులలో Neo-classic తెగవారికిని Romantic తెగవారికిని అభిప్రాయ భేదము కలదు. మొదటివారు అరిష్టోటలు ననుసరించి నాటక వస్తువున ఖేద మోద విషయముల పరిమేళనము గాని వివిధములయిన యుప కథల (Episodes) కూర్పు తోడి క్లిష్టత కాని యుండఁగూడదని నుడివిరి. Aristotle నాటక నిర్మాణ మితిహాస పద్ధతి ననుసరించి యుండఁగూడ దని నుడివెను. (ఇతిహాస పద్ధతి యనఁగా గథ యితిహాసములోవలె భిన్నము లయిన యుపాఖ్యానములతోఁగూడి యుండుట.)* అతఁ డీ మాటను సరళమయిన (simple) కథా సంవిధానముతోఁగూడిన గ్రీకు నాటకములఁ బురస్కరించుకొని చెప్పియుండును. కాని రెండవతెగవా రీ వస్త్వైక్య విషయమునఁ గొంత విశాల దృక్పథము గలిగి యుండిరి. వారి యభిప్రాయము ప్రకారము ఖేద మోద విషయము లొకే నాటకమునఁ గూడి యున్నను, ప్రధాన కథకు పోషకములుగా నున్న యుపకథలందు రచింపఁబడినను, ఎట్టి దోషమును లేదు. కాని యీ యుపకథ లన్నియుఁ బ్రధాన కథకుఁ బోషకములయియే యుండవలెనను విషయమును మొదటి తెగవారివలె వీరును గమనించిరి. Shakespeare తన నాటకములలో ఖేద మోద విషయముల నొకే వస్తువున సంఘటించుటయుఁ బ్రధాన కథకుఁ బోషకములుగ నుండు విధమున నుపకథల రచించుటయుఁ బెక్కుచోట్ల కానవచ్చుచున్నది.

Mathew Arnold కావ్యవస్తువు మిక్కిలి యుదాత్తముగా నుండవలెనని (Sound Subject matter) చెప్పెను. ప్రాచ్యలాక్షణికులు సైత మది 'మధురో

---

* A playwright should not attempt to construct a tragedy upon epic plan. ie., a Fable composed of many fables as if any one for instance should [take the entire fable of the Illiad for the subject of a tragedy.

దాత్త రస భావ నిరంతరముగా నుండవలె' ననిరి. అందుచే నాటకమున నీరస వస్తువును సాధ్యమైనంతవఱకుఁ బరిహరించవలెను. ఒకవేళ అది కథా విధానమున నపరిహార్యమయినచో సూచ్య మాత్రము కావలెను. అందుకొఱకే ప్రాచ్య లాక్షణికులు విష్కంభాద్యర్థోపక్షేపకముల విధించిరి. పాశ్చాత్యు లిట్టి ప్రక్రియను కల్పింపక పోయి నను నీరసములును దుష్ప్రదర్శములునగు విషయములను కథనపూర్వకముగా (narration) వ్యక్తము సేయవచ్చునని నుడివిరి. కవి యెంత నిపుణుఁ డయినను వస్తువు నీరసమయినచో కంఠ మాధుర్యము లేని సంగీత శాస్త్రజ్ఞుని వలె తన సృష్టికి సౌందర్యముఁ జేకూర్పలేఁడు. అందుచే నాటకమును వ్రాయఁ బూనుటకు ముందే యర్హ వస్తు సంగ్రహణమునకుఁ గవి ప్రయత్నించవలయును. నీరస వస్తువుపైఁ గావింపఁబడిన పాత్రపోషణాద్యలంకారములు శోభావహత్వమున నూషర క్షేత్ర పర్యుప్తములయిన బీజములతో సమానములు.

నాటకము పరాశ్రయ కావ్యములలో (Objective) నుత్తమ మయినది. నవల రచయిత వలె నాటక కవి తన కావ్యమున తానుగా నేది పల్కుటకును వీలులేదు. అతఁడు సర్వమును బాత్రల ద్వారా అనిపించు చుండవలెను. ఈ పాత్రల సంవాదమే నాటకమునకుఁ బ్రాణము వంటిది. కవి తన యభిప్రాయము లేవైన వ్యక్తము చేసి కొనఁ దలఁచినచోఁ దా నొక పాత్రలో లీనమై వానిని సందర్భోచితముగా కథతో నతికి పల్కుచుండవలెను. నవలలో సంవాదాఖ్యాన వర్ణన పద్ధతులు మూఁడు నుండుట కవకాశము కలదు. నాటకమున సంవాద శైలి తప్ప మఱేదియు ననుకూలముగా నుండదు. ఈ సంవాద మెంత రమ్యముగా నున్న నాటక శోభ యంత యధికముగాఁ గానిపించును. పూర్వము రంగపరికరములు (Scenery Etc.) సరిగా లేని కాలమున విషయములఁ గూర్చి సామాజికులకు సంపూర్ణ జ్ఞానము గలుగుటకై కొంత వర్ణనము కూడఁ జేయుట యావశ్యకమై యుండెను. కాని యట్టి వర్ణన భాగమును రంగ పరికరములే పూరించుచుండఁగా దాని యావశ్యక మంతగా లేదని యాధునికులు దానిని విడిచివైతురు. కథన శైలి నాటకమునకు నీరసత్వము నాపాదించును. అందుచే నాటక కవి కథన పద్ధతిని చాలవఱకు తగ్గింపవలెను.

నాట్య ధర్మాపేక్షితంబగు వస్తువు ముచ్విధము లని ధనంజయుఁడు చెప్పెను. అందు సర్వశ్రావ్యము పాత్రల సంవాదము సాహాయ్యమున నందఱును వినఁదగినది. ఇతరులు వినఁదగనిది స్వగతము. ఈ స్వగతము వలన నన్యథా దురవగాహములయిన పాత్రల గుణ స్వభావాదులు స్పష్టముగా బోధపడుచుండును. నియత శ్రావ్యము

జనాంతిక మనియు నపవారిత మనియు రెండు విధములు. పాశ్చాత్యులలో సర్వ శ్రావ్య స్వగతములు కలవు కాని నియత శ్రావ్యము కానఁబడదు. కాని పాత్రలు సంవాదము చేయునప్పుడు (to Horatius) అనియు (turning to Macbeth) అనియుఁ గొన్ని సూచనలు కానఁబడును. ఇట్టి వానిలో నా నియత శ్రావ్య పద్ధతి కొంతవఱకుఁ గలదనవచ్చును.

## II

మూల భిన్న కల్పనలు : వాని ప్రయోజనములు :

Deviations and their Purpose :

ముద్రితములయిన యాచార్యుల గారి నాటకము లందలి కథ లన్నియు నొక్క ముక్తావళిలోఁ దప్ప ప్రఖ్యాతములుగాఁ గాని మిశ్రములుగాఁ గాని కానవచ్చుచున్నవి. ముక్తావళి కథకుఁగూడ నెం దేని మూల మున్న దేమో తెలియుట లేదు. అది సర్వ విధములఁ గల్పితము వోలెఁ గానవచ్చుచున్నది. పాత్రల శీల రసాదులకు భంగము గలిగించు విషయము లేవైన మూలమున నున్న నాటక కవి వానిని దొలఁగింపవచ్చును, లేదా వాని కన్యథా కల్పనము గావింపవచ్చును - అను లక్షణము ననుసరించి యాచార్యులుగారు తమ నాటకము లన్నింటియందును వస్తు సంఘటనమున నెక్కుడు స్వాతంత్ర్యము నవలంబించిరి. కొన్ని యెడల మూల కథకును నాటక కథకు నంత సన్నిహిత సంబంధము లేనట్లే కాన్పించును. అందు మూలకథా విషయము బీజప్రాయముగా నున్నను, ఆయన కావించిన కల్పనమే హెచ్చు. ప్రమీలార్జునీయము నందును, చిరకారి యందును నీ కల్పన మతిమాత్ర మగుటచే నవి కవి స్వయముగాఁ గల్పించిన సాంఘిక నాటకములవలెఁ బరిణమించినవి. జైమిని భారతమున నర్జునుఁడు యజ్ఞాశ్వముతోఁ బోవుచు స్త్రీ మండలమును సమీపింప నచ్చటి స్త్రీలచే నా హయము కట్టఁబడెననియు నంతఁ బ్రమీలార్జును లా హయము కొఱకై యుద్ధము సేయుట కారంభింపఁగా నాకాశవాణి "కొన్ని వేల యేండ్లకు గాని యీ మెను జయించుట యసాధ్యము. అందుచే నీమె కోర్కె ననుసరించి యీమెఁ బరిణయంబాడి హయమును విడిపించుకొని పొమ్ము" అని యర్జునునకుఁ దెల్ప నాతఁడట్లే చేసినట్లును గలదు. నాటకమునం దర్జునునకుఁ బాత్రము పోవునప్పుడు తప్ప స్త్రీలతోఁ బోరాడనను సమయముండుటచేఁ బ్రమీలార్జునులు యుద్ధము చేయుట గాని యాకాశవాణి యుపాయము చెప్పుటగాని లేనేలేదు. కనకలత, చారుమతి మొదలగు యువతులు

యజ్ఞాశ్వమును బంధింపఁగా వృషకేతుఁడు మేఘనాధుఁడు ప్రద్యుమ్నుఁడు మొదలగు నర్జునానుచరు లగు యోధు లర్జునుని యనుమతిపై వారితో యుద్ధము చేయనేగి వారి సౌందర్యాతిశయముచే మోహితులై యోడిపోయి కారాగారమున నుంపఁబడిరి. ఇంతలో నర్జునుని పరాక్రమాదులఁ గూర్చి వినిన ప్రమీల కతనిని జూచు వేడుక పుట్టెను. చారుమతి కారాగారమున బంధితుఁడైన సుయోధుని రావించి యెట్లయిన ప్రమీల యర్జునునిఁ గాంచునట్లు చేయుమనియు, నచటి రహస్యములన్నియుఁ దమకుఁ జెప్పుచుండుమనియు నియోగించెను. తన యనుచరు లందఱును పట్టువడుట విని యర్జునుఁడా పట్టణమునంతను నొకసారి పరిశీలించుటకై యతి వేషముఁ దాల్చి సుయోగునితో నేగెను. పట్టణమున దారి తప్పి యటు నిటు తిరుగుచున్న యర్జున సుయోగులఁ గాంచి మలయవతి యర్జునుని నిజమైన యతిగా భావించినట్లు నటించి సత్కార్యముల నొనరించుటకై తన యింటికిఁ గొంపోయెను. ఇంతలో ప్రమీలకు మదన వేదన యెక్కువగుటచే మలయవతి మిషపెట్టి యర్జును నచ్చటికి తీసికొని పోయెను. ప్రమీలార్జునుల కేకాంత సమావేశము కుదిరెను. ప్రమీల తాను ప్రమీల పరిచారికనని చెప్పి యర్జునునిఁ గవయగోరెను. యతియైన తన కట్టి ప్రణయ వ్యాపారము విరుద్ధమగుటచే నర్జునుఁడామెను ప్రేమించుట కీయకొనలేదు. మాఱువేషమున నున్న సుయోగుని గుర్తించి కనక లతాదులు యతి రూపముననున్న యాతఁడర్జునుఁడే యగుననియు, నాతనిని బరీక్షించినచో సత్యము తెలియుననియు, నచ్చటికి సుయోగు నీడ్చుకొని వచ్చుచుండఁగా నర్జునుఁడా ప్రదేశమునుండి పరుగెత్తికొని పోయెను. ప్రమీల తరువాత తన చెలికత్తియల సలహా ననుసరించి గంధర్వ స్త్రీ వేషము వైచికొని యర్జునుని శిబిరమున కేగెను. అచ్చట గాన విద్యా విశారదత్వముచే నాతని నలరించి తన్ను వరింపుమని ప్రార్థించెను. అర్జునుఁడామె ప్రమీల యని యెఱింగిన తరువాత నన్న దీక్షితుఁడై యుండఁ దానట్లు సేయుట పాడికాదని నివారించుచుండఁ ప్రద్యుమ్నాదులందఱును కనక లతాదుల యాదేశముచే నచ్చటికి వచ్చి యామెను దప్పక వరింపుమని మొఱపెట్టుకొనిరి. అర్జునుఁడు తప్పనిసరి యగుటచే నట్లు చేయ వలసి వచ్చెను. ఈ విధముగా మూలమునందలి కథ నాటకమున వేఱు రూపమును దాల్చినది. స్త్రీలకుఁ గూడఁ గొంత స్వాతంత్ర్య ముండవలెననియు, నప్పుడే దేశ మున్నతిఁ జెందుననియుఁ, బురుషులు స్త్రీలకు సులభముగా వశులగుదురనియు బోధించుటకై కవి యీ మార్పును గావించెను. మూలమున నున్నట్లు ప్రమీల నోడించుట కష్టమగుటచే నర్జునుఁడామెను వివాహమాడె ననుట యాతని వీరత్వమునకు లాఘవము నాపాదించును. నాటకమునఁ బ్రమీలయే యర్జునుని వలచుట యను మిషచేఁ గవి యాతని భ్రాతృ భక్తియును, దీక్షయును గూడ వెల్లడించెను. మూల

మున నతి స్వల్పముగా నున్న కథా భాగమునకుఁ గవి సంఘ సంస్కరణాభిలాషచేఁ గావించిన మార్పు ఎంతో యుత్కర్ష నాపాదించు చున్నది.

చిరకారి నాటకమునఁ గూడ నిట్లే మూల కథకును నాటక కథకును విశేష తారతమ్యము కలదు. శాంతి పర్వమున మేధాతిథి యను ఋషి తన భార్య చేసిన యొక దోషమునకుఁ గుపితుఁడై యే కార్యముల నయిన చిరకాల మాలోచించి కాని చేయని తన కుమారు నామెను ఖండింపఁ బంపెను. అతఁడు మాతృ హనన దోష మునకుఁ బాల్పడుటా? లేక పితృాజ్ఞోల్లంఘన దోషమునకుఁ బాల్పడుటా యని యాందోళిత మానసుఁడై యాలోచించుచుండఁ దన క్రౌర్యము నెఱింగిన మేధాతిథి యచ్చటి కరుదెంచి చిరకారిత్వముచేఁ దన సుతుఁడింకను తన భార్యను జంపకుండుటకు సంతోషించి యాతనికి చిరకారి యను సార్థకనామ మొసంగెను. ఈ కథలో మేధాతిథి తన భార్య నేల చంపుమని యాజ్ఞ నొసంగెనో స్పష్టముగా లేదు. పైఁగా వీత మోహుఁడై యుండవలసిన యా ఋషి భార్యా పుత్త్రిలతో సంసార మొనర్చుటయు, నట్లు కించిద్దోషమునకుఁ గుపితుఁడై భార్యను జంపుమనుటయు నాతని సంయమిత్వముతోఁ బొంది యుండలేదు. ఆ కారణముచే నాటకమున కవి మేధాతిథిని రాజుగాఁ జేసెను. అతఁడు కాయసిద్ధిఁ బడయనెంచి యొక సిద్ధుని యాదేశముచే మొదట సంసారమును బరిత్యజించినను దరువాత వాన ప్రస్థాశ్రమమును స్వీకరించి యరణ్యమున వసించుచుండెను. అతఁడు రాజ్యమును తన తమ్ముఁడగు శ్వేతకేతుని యధీనము కావించి సిద్ధునితోఁ బోయినప్పు డాతని భార్య, యాపన్న సత్త్వ, శ్వేతకేతుని బాధ పడలేక పుత్త్రిడగు కళానిధి తోడను తిలక యను పరిచారికతోడను తన సోదరుఁడగు మంత్రవర్మ నగరికేగఁ బయనమయ్యెను. దారిలో నామె యొక స్త్రీ శిశువుం గనెను. ఆమె పుట్టిన కొలది రోజులలోనే మరణించినట్లు కన్పింపఁగాఁ తిలక యామెను శ్మశానమునకుఁ గొంపోయి ఖననము సేయుచు వ్యాఘ్రము యొక్క భీకర ధ్వని విని యా శిశువు నక్కడనే విడిచి వెడలిపోయెను. ఇంతలో నా శిశువు పునర్జీవితురాలై యేడ్చెను. తిలక కీ యేడుపు వినిపించెను గాని యామె వెంటనే తిరిగి రాలేదు. కాటిపాపలు కొండ ఱా శిశువును జూచి, తీసికొనిపోయి నగరమునందలి మల్లికాసాని కమ్మివైచిరి. తిలక శిశువును గాంచక తిరిగి వచ్చుచుండఁగా మీసాల పుల్లిగాని భార్య నారకక్క యొక మగ శిశువు నమ్మకమునకు పట్టుకొని వచ్చెను. తిలక యామెకుఁ దన చేతి కంకణము నిచ్చి యా శిశువును గొని విస్మృతావస్థ యందున్న చంద్రలేఖ కడకుఁ దీసికొని వచ్చి శ్రద్ధతోఁ బెంచ చుండెను. ఆ శిశువు రాజ్యభ్రష్టుఁడై తన సోదరిని చూచుట కరుదెంచుచున్న మంత్రి

వర్మ భార్య యరణ్యమున మరణింపఁగా నామె పత్రిక్కనుండి దొంగలచేఁ దీసికొని పోఁబడెను. ఈ విషయము తిలకకుఁ దెలియదు. కొన్ని రోజులకు చంద్రలేఖకు స్మృతి రాఁగాఁ దిలక యామెకుఁ గుమారుఁడే పుట్టెననియు నతఁడు పుట్టిన మూఁడు నెలలకే మెడ నిల్చి రెండు సంవత్సరముల వాఁడుగా నుండెననియుఁ జెప్పినమ్మించెను. ఇట్లుం డఁగా మేధాతిథి మరల రాజ్యమునకు వచ్చిన వెంటనే మంత్రికుమారుఁడు పుష్కరాగ్రహారమునుండి వారిని పిలిపించెను. శ్వేతకేతుఁడు తాను చేసిన యపరాధమునకు పశ్చాత్తప్తుఁడై క్షమింపుమని చంద్రలేఖను బ్రార్థించెను. మేధాతిథి శ్వేతకేతుని పూర్వ దౌష్ట్యమునుండి రక్షింపఁబడిన కళానిధిని, రెండవ కుమారుఁడగు విశారదుని, చంద్రలేఖను, తిలకను దీసికొని రాజ్యమును మరల శ్వేతకేతున కప్పగించి యరణ్యమున కేగెను. మల్లికాసాని కాటిపాపలయొద్దఁ గొనిన చంద్రలేఖ బిడ్డ యౌవనవంతు రాలయ్యెను. మల్లికాసాని యామెకు సార్థకముగా మోహిని యను నామ మిడి తన వేశ్యావృత్తియందే నియోగించి ధనమును గడింపఁజూచెను. కాని కులీనయగు మోహిని కా వృత్తి యేమాత్రము రుచింపలేదు. ఆమె ప్రాణమును విసర్జించుటకైన నొప్పుకొనెను గాని తుచ్ఛమైన వేశ్యావృత్తి కొడంబడలేదు. మల్లికాసానికి రొక్కమిచ్చి తనతో భోగింపవచ్చిన మనోహరున కామె వేదాంతము నుపదేశించి పంపివైచెను. చివరి కామె యెట్లో మల్లికాసాని గృహమునుండి తప్పించుకొని వచ్చుచుండఁగా దారిలో నామెను దొంగ లడ్డగించిరి. వేఁటకని యరణ్యమున కేగిన విశారదుఁ డామెను వారి బారినుండి రక్షించి, యింటికిఁ దోడ్కొని వచ్చెను. చంద్రలేఖ యామెను కన్నబిడ్డవోలె ప్రేమతోఁ జూచుచుండెను. మేధాతిథి మోహినీ పూర్వ వృత్తమును, దల్లి దండ్రులను నెఱుంగుటకై బ్రాహ్మణులను దేశ దేశములకుఁ బంపెను. మంత్రివర్మ యింతలోఁ దన రాజ్యమును దాను మరల సంపాదించెను. కళానిధి జయసేను లిరువురును మోహినిని వలచిరి కాని, మోహినికి జయసేనుని మీఁదనే మోహము కుదిరెను. ఆమె చంద్రలేఖ యొద్దఁ జనువుగాఁ బెరుఁగుచు నామెను దల్లివలెనే భావించుచుండెను. చమత్కారమునకై యొకనాఁ డామె పురుష వేషమును వైచికొని చంద్రలేఖను గవయఁగోరెను. కాని చంద్రలేఖ మహా పతివ్రత యగుటచే నతనిని మిక్కిలి నిందించెను. అప్పుడు మోహిని తన వేషము సంగతి చెప్పి చంద్రలేఖను సమీపించెను. చంద్రలేఖ యానందముతో నామెను ముద్దాడుచుండఁగాఁ గార్యాంతరమున నచ్చటి కరుదెంచిన మేధాతిథి చూచి కుపితుఁడై చంద్రలేఖను నఱకుమని కళానిధి కాజ్ఞాపించెను. ఇంతలో మోహిని యా మగవేషముతోనే తన తండ్రియొద్ద కరుదెంచెను. మొదట నాతనికిఁ గోపము గలిగినను సత్యవిషయము తెలిసిన తరువాత నమితమైన విచారము గలిగెను. ఇంతలో సిద్ధుఁడు గూడ వచ్చి

యట్లు భార్యను చంప నాజ్ఞాపించుట యన్యాయమనియు, నంత కోపము కలవారు కాయసిద్ధిఁ బడయుట కనర్హులనియు చెప్పెను. మేధాతిథి తొందరగా వధ్యస్థలమున కేగి కళానిధి యింకను నాలోచింపుచు తల్లిని జంపకుండుటఁ జూచి సంతోషించి యాతనికిఁ జిరకారినామ మొసఁగెను. తరువాత సతఁడు మోహినీ కళానిధుల వివాహము నుపపాదించెను. మోహిని తానానాఁడు శ్మశానమున విడిచిన చంద్రిలేఖ కూఁతురే యని యెఱుఁగుటచేఁ దిలక జరిగిన సంగతి నంతను జెప్పి, దాని నివారించెను. మంత్రగుప్తాదులు గూడ నీ సమయమున కచ్చటి కరుదెంచిరి. అతఁడు విశారదుని రూపమును జూచి యాతఁడు తన కుమారుఁడేమో యనుకొనుచుండఁ దిలక చెప్పిన సంగతులును, ఆతని దగ్గఱనున్న రక్షయు నా సందేహమును స్థిరపఱిచెను అందఱు తిలక పడిన శ్రమ కామెను మిక్కిలి ప్రశంసించిరి. మోహినీ జయసేనులకు వివాహమాయెను. మేధాతిథి భార్యను జంపుమనుటకుఁగల కారణమును జూపుటకై కవి యింత గాథను గల్పించెను. ఈ నాటకమున మూఁడవ యంకము నందలి వేశ్యానిట ప్రసంగము సాంఘిక నాటకోచితమయి యున్నది. దానికి మోహిని శీలమును సమర్థించుటతోఁ దక్కుఁ గథతో నంతగా సన్నిహిత సంబంధము నైతము లేదు. ఇందుఁ గవి మూలమునుండి గ్రహించినది తక్కువ; తాను గల్పించినది యెక్కువ.

ఆచార్యులు గారు రచించిన నాటకములలోఁ జారిత్రిక నాటక మొక్కటియే. అది రోషనారా శివాజి. ఇందు రోషనార యొక మహారాష్ట్ర బ్రాహ్మణుని కూఁతురనియు నౌరంగజే బామె తల్లిని బలాత్కారము చేయుటచే నెనిమిది నెలల శిశువగు రోషనారను విడిచి యామె మరణించె ననియు, తరువాత నౌరంగజేబు రోషనారను మాయోపాయముచేఁ దెప్పించి తన కన్నకూఁతురు వలెఁ బెంచె ననియు వర్ణింపఁ బడియున్నది. చరిత్రను బట్టి రోషనార యౌరంగజేబు సోదరి. స్వచ్ఛమయిన హిందువుఁ డగు శివాజీ మహమ్మదీయాంగన యగు రోషనారను బెండ్లియాడె నను విషయము నందలి మత సాంకర్యము నచ్చకపోవుటచే నాచార్యులుగా రీ కల్పనఁ గావించియుందురు. రాజకీయముగాఁ గూడ రోషనారను బందీకృతఁ గావించినచో ఔరంగజేబు తనకు వశుఁ డగునను తలంపుతో శివాజీ యామెను సేవకులచేఁ బట్టించెను. కాని నిజమైన హిందువుఁడు వలె నాతఁ డామె పాతివ్రత్యమున కెట్టి భంగమును గలిగించి యుండలేదు. ఆమె తన్ను వలచిన తరువాతనే యాతఁ డామెను వివాహ మాడెను. పైకి మహమ్మదీయ యువతి వలె నున్నను సహజముగా హిందూ స్త్రీ యైన రోషనార పాతివ్రత్య మిందుఁ జక్కఁగ వర్ణింపఁబడినది. ఔరంగజేబు

మతావేశము, శివాజీ ధైర్య సాహసములు, అతని భార్యల యౌదార్యము ఈ నాటకమునకు వన్నె చేకూర్చుచున్నవి. ఇందు శేఖర్జీ గాథయు, హసనల్లీఖాను గాథయుఁ గవి కల్పితములు. శివాజీ శేఖర్జీ పాత్రల శీలముల యందలి తారతమ్యమును గవి ప్రతియోగముచే స్పష్టముగాఁ జిత్రించెను.

ఇట్లే యాచార్యులుగారు తమ యితర నాటకములలోఁ గూడ మూలభిన్నములయిన కల్పనలను లెక్కింటి నొనర్చిరి. అందు నాటకస్థములయిన పాత్రల శీలములను బాగుపఱిచి వానిని సమర్థించుటకై చేయు విపర్యాస మొక విధము (Deviation to improve character). విషాద సారంగధరకు మూలములు రెండు. అందు ద్విపద కావ్యమున రాజరాజ నరేంద్రుఁడు సారంగధరునకై కన్యల నన్వేషించుచుఁ జిత్రాంగి రూపపటమును దెప్పించినట్లును, ఆయమ రూపమునకు భ్రమసి తానే యామెను బరిణయ మాడినట్లును కలదు. రెండవది యగు పద్య కావ్యమున నాతఁడు చిత్రాంగిని వివాహ మాడిన తరువాతనే యాతనికి సారంగధరుఁ డుదయించినట్లు చెప్పఁబడినది. ఇందు మొదటి దాని ననుసరించి కొడుకునకై నిర్దేశింపఁబడిన కన్నియ రూపవతిగా నున్నంత మాత్రమున రాజరాజామెను తానే వివాహ మాడుటచే నాతని కామాంధతయు, దౌరాత్మ్యమును వెల్లడి యగుచున్నవి. రెండవ దాని ననుసరించి చిత్రాంగి తన కన్నులముందు పుట్టిన వానిని— అందును గుమారుని - కామించుటచే నామె దుష్ట స్వభావము గోచరించుచున్నది. ఈ రెండు విపర్యాసములను పర్యాలోచించి కవి వారిరువురి శీలములను బోషించుటకై యొక వింతమార్గమును బట్టెను. సారంగధరుని వివాహము కొఱకు రాకన్నియలఁ జూచి వారి రూప పటములఁ గొనివచ్చుటకు దేశదేశములకు బ్రాహ్మణుల రాజు పంపుటయు, హిరణ్యకుఁడును విభావసుఁడును క్రమముగాఁ జంద్రికల యొక్కయు చిత్రాంగి యొక్కయుఁ బటములఁ దెచ్చుటయు, నా రెండురూపముల సౌందర్యాతిశయమునఁ దారతమ్యము విమర్శింప రాక యా యిరువురును తన యింట నుండుటకై సారంగధరునకుఁ జంద్రకళను వివాహము చేసి, చిత్రాంగిని రాజు తానే పెండ్లి యాడుటయు, చిత్రాంగి సారంగధరుని మోహించి యుండియు రాజున కాంతరితుఁడయిన తన తండ్రిమాట మీఱఁజాలక రాజరాజును బరిణయ మాడుటయు దాన విశదమగును. చిత్రాంగి మోహము విభావసుఁ డెఱింగియు రాజరాజునకుఁ గాని సారంగధరునకుఁ గాని యా వార్త నెఱింగింపకుండుట వలన మహానర్థము ప్రాప్తించుట విస్పష్టమగును. ఈ కథ వలన చిత్రాంగి దుర్మోహమున కించుక క్షమాపణ గల్గుచున్నది. ఇట్లే వాల్మీకి రామాయణమున కైక మొట్టమొదట సుస్వభావము గలదియే యయ్యును మంథరా దుర్బోధము వినిన తరువాత మిక్కిలి

క్రూరముగాఁ బ్రివర్తించెను. నాటకమున నామె మంథర మాటలు వినిన తరువాత సైతము తన భర్త యపారానురాగమును సందేహింప లేకపోయెను. 'నూతఁగాక పోయిన నీ యిష్టము వచ్చిన చోటఁ బడుము పొమ్ము' అని దశరథుఁ డన్న తరు వాతనే యామె యాతని ప్రేమను శంకించుటకు మొదలుపెట్టెను. అప్పుడైన నామె సహజముగా మృదుస్వభావురా లగుటచే భర్త దీనాలాపములు విన్నప్పుడును కౌస ల్యాదులు విలపించునప్పుడును కొంచెము మెత్తపడుచు వచ్చెను. భర్తృ మరణా నంతరము కైక వెలిపుచ్చిన పశ్చాత్తాపము మూలమునందుఁ గానరాదు. రాముని నడవులకుఁ బంపుటయందలి కైక వెనుబాటును. ఈ పశ్చాత్తాపమును, ఆమె కావిం చిన పాపమునకుఁ జాలవఱకు క్షమాపణఁ గల్గించు చున్నవి. మూలమునందు దురాశా పరురాలై మంథరచేతి కీలుబొమ్మగా నుండిన కైక నాటకమునఁ గొంత సత్యాన్వేషణ పరురాలుగను మానవత్వ (Humanity) శోభితురాలుగను వర్ణింపఁబడినది— పాండవుల పక్షమునకుఁ గృష్ణుఁ డెంతటి పెట్టని కోటయో కౌరవపక్షమునకు శకుని యంత. పాండవ పక్షమునకుఁ గృష్ణుఁడు భాగ్యాదిదేవత. కౌరవ పక్షమునకు శకుని యభాగ్యదేవత. ఇరువురి ప్రజ్ఞలును బల్కుబడులును సమాన బలముగలవిగానే యుండును. ద్యూతకాలము నందలి యక్ష విద్యా కౌశలము తప్ప భారతమున నితని మఱి యే యితర శక్తియు నంతగా వర్ణింపఁబడలేదు. ఆచార్యులు గారు పాంచాలీ స్వయంవరమునను బృహన్నల యందును నీతనికిఁ గౌరవ పక్షమునఁ గల పల్కు బడిని చతురోపాయ పారీణతను జక్కగా వర్ణించిరి. ఇట్లే పైని పేర్కొనఁబడిన ప్రమీలార్జునీయము నందలి నూత్న కల్పన మట్టునని శీలమునకును, చిరకారి యందలి మూఁడవ యంకము మోహినీ శీలమునకును జక్కగా వన్నె పెట్టుచున్నవి.

మూల కథలోని వివిధ సన్నివేశములలోఁ గార్యకారణ సంబంధము గాని, యైక్యముగాని కొఱతవడియున్నప్పు డాచార్యుల వారు దానిని సరిచేయుటకై మూల భిన్నమయిన కల్పనలు కావించుట (Deviation for the sake of argument and unity) రెండవ పద్ధతి. జైమిని భారతమున చంద్రహాసుఁడు బాల్యమున దుష్ట బుద్ధి యోలగమునకు రాఁగా నచటి మునులాతని భాగధేయమును బ్రశంసించుటచే దుష్టబుద్ధి యాతనిఁ జంపుటకుఁ బ్రయత్నించినట్లు గలదు. ఇందుఁ జంద్రహాసు నాతఁడు చంపింపఁ బూనుటకుఁ బరోన్నతి సహింపలేమియే కారణముగాఁ జెప్పఁ బడినది. పైఁగా నిందుఁ జంద్రహాసునకును గుంతల రాజునకుమ నెట్టి సంబంధమును లేదు. దుర్నిమిత్తములు పొడగాంచఁగనే కుంతల రాజు విషయను బెండ్లియాడిన చంద్రహాసునకే తన కూఁతురగు చంపకమాలినిఁ గూడ నీయ నేల ప్రయత్నింపవలెనో

యిందు స్పష్టముగా లేదు. ఆచార్యులుగారీ లోపము లన్నింటిని సవరించుటకై చంద్రహాసుఁడు (మణిమంతుఁడు) కుంతల రాజునకు భాగినేయుఁడనియుఁ, బుత్త్రహీనుఁడయిన కుంతలరాజు తన కూఁతురగు చంపకమాలినిని మొదట మదనుని కిచ్చెదనని చెప్పినను తరువాత మణిమంతునికే యీయఁ దలపోసెననియుఁ, జంపకమాలినిని మదనున కిప్పించి యా రాజ్యమునంతను తన సొంతముగా నొనరించుటకై దుష్టబుద్ధి యాతనిఁ జంపింప నఘోరుని నియమించెననియు, చంద్రహాసుఁడు దుష్టబుద్ధి మాయోపాయముచేఁ బ్రతారితుఁడయి కుంతలమున కరుదెంచునప్పు డుద్యానవనమున విషయయే కాక చంపకమాలిని కూడ నాతనిని మోహించియుండుటచే విషయా వివాహానంతరము దుశ్శకునములఁ గాంచిన కుంతలరాజు తన కూఁతును సైతము చంద్రహాసునకే యీయ నిశ్చయించెననియు యుక్తి యుక్తముగా వర్ణించియున్నారు. ఇట్లే రాముని పట్టాభిషేక సమయమునకు దశరథుడు భరత శత్రుఘ్నుల రప్పింప కుండుట కాచార్యులుగారు మంచి కారణమును సూచించిరి. దశరథునికి భరత శత్రుఘ్నులు మేన మామ యింటికి వెళ్ళిన పది దినములలోనే మృత్యుసూచకమయిన దుస్స్వప్నము గలిగెను. అందుచే నతఁడు తన యగ్రసుతుఁడయిన రామునకుఁ బట్టాభిషేకము చేయఁ దలపెట్టెను. ఇది విదియా భానువారమునాఁడు జరిగెను. వశిష్ఠునితో నీ సంగతిఁ జెప్పి సుముహూర్తము నిర్ణయింపుమనఁగా నాతఁడు చైత్ర శుద్ధ పంచమినాఁటి ముహూర్తము దాఁటిన యెడల మూఁడు సంవత్సరముల లోపుగా రాముని యభిషేకోత్సవము నిర్వర్తింప నవకాశము లేదని చెప్పెను. ఏలయన చైత్ర శుద్ధ షష్ఠి నాటికిఁ బదునెనిమిదియవ యేడు వచ్చును. ఆ సంవత్సరమున నభిషేకము చేయరాదని యార్యులందురు. తరువాతి సంవత్సరమున చైత్రమాసమున గురు మూఢము వచ్చును. తరువాత చాతుర్మాస్యల నొనర్పరాదు. మరల మాఘ మాసమున శుక్ర మూఢము వచ్చి చైత్రమాసమువఱకు నుండును. ఇంతలో రామునకు నిరువదియవ సంవత్సరము వచ్చును. ఆ సంవత్సర మంతయు సరిపడదు, ఇట్లు మూఁడేండ్లు గడచిపోవును. కలిగిన దుస్స్వప్నము ఘోరమును రాజ మరణ పిశునము నగుట వశిష్ఠుఁడు నొక్కి వక్కాణించెను. కావున తనకే కీడును రాకపూర్వమే దశరథుఁడు రాముని పట్టాభిషేకము సేయఁ దలఁచెను. సమీపములో చైత్ర శుద్ధ పంచమి తప్ప మఱియొకటి సరియయినది లభింపలేదు. భరత శత్రుఘ్నులఁ బిలువకుండనే పట్టాభిషేకము చేయవలయునను తలంపాతనికి లేదు. కాని యయోధ్యనుండి గిరివ్రజ పురమునకుఁ బోవుటకు మూఁడు దినములు పట్టును. విదియా భానువారమునాఁడు భరతుని కొఱకు దూతను బంపినచో నతఁడెంత వేఘములమీఁద వచ్చినను నవమినాఁటి యుదయమునకుఁ గాని రాలేఁడు. అప్పటికి పట్టాభిషేక మెట్లయినను జరిగిపోవును.

అయినను చైత్రశుద్ధ చతుర్థినాఁడు దశరథుఁడు భరతుని కడకు దూతను పంపక యుండలేదు. భరతుడు మేనమామ గారింటికి వెళ్ళకపూర్వము రామునికి పట్టాభిషేకము గావించు తలంపే దశరథునకు లేదు. అది తత్కాలాపతితమయిన దుస్స్వప్నముయొక్క యవ్యవహిత ఫలము. మూలమున దశరథుఁడు రాముని పట్టాభిషేకమును భరతుని పరోక్షమునందే జరుపుటకు మిక్కిలి వేగిరపడెను. ఏలయన నతఁడు కేకయ రాజునకు రాజ్యమునే శుల్కముగా నొసంగి కైకను పెండ్లాడెను. * అందుచే భరతుఁడు వచ్చినచో రాజ్యము వానికె యీయవలసి యుండుననని యాతని భయము. అతఁడు రాముని వేగమే యభిషేకము చేసికొనుమని తొందరపెట్టుచు 'భవంతి బహు విఘ్నాని కార్యాణ్యేవం విధాని హి' అని చెప్పుటలో నాతని భయము సూచింపఁబడుచున్నది. భరతుఁడే యీ యభిషేకోత్సవమున కొక యనివార్యమైన విఘ్నహేతువని యాతఁడనుకొనెను. ఆ యుద్దేశముతోడనే దూరస్థితి యను మిషఁ గల్పించి కేకయ రాజునకుఁ గాని, తన్మూలమున భరత శత్రుఘ్నులకుఁ గాని యభిషేక వృత్తాంతమును దెలుపక మిన్నకుండెను. దీనినిబట్టి చూడ భరత శత్రుఘ్నుల నభిషేక కాలమునకు రప్పించకుండుటకు దశరథుని దురాలోచనమును, ఆంతరమయిన భీతియుఁ గారణము లయినట్లు స్పష్టపడుచున్నది. కవి నాటకమున నాతని యందలి యీ కృత్రిమత్వమును దొలఁగించెను.

మోహినీ రుక్మాంగదలో మూలమున రుక్మాంగదుని యేకాదశీవ్రత మాహాత్మ్యముచే జీవాత్మలు వైకుంఠముననే కాని నరకమున కేగకుండుటచే యముఁడు నారదునితోఁ గన్నులకు నీళ్ళుపెట్టుకొని యేడ్చినది చాలక బ్రహ్మతో మొరపెట్టుకొని తన యమాధికారమునకు రాజీనామా యిచ్చెదనని గోడు చెప్పికోఁగా బ్రహ్మ మిక్కిలి వ్యసనపడి యా వ్రతమును భంగము సేయుటకు మోహిని యను కన్యకను సృష్టించి వ్రతము చెఱుపఁ బ్రయత్నించెనని కథ గలదు. నరకమునకు జీవులు రాకపోయి నంతనే కన్నీరు మున్నీరుగా నేడ్వవలసినంత యముని క్షేత్ర లార్జించిన గంటేమి పోయినదో. యముఁడు మొత్తుకొన్నంతనే నిష్పక్షపాత సృష్టికర్తయగు బ్రహ్మకు రుక్మాంగదుని సద్వ్రతము చెఱుపవలసినంత కార్పణ్యము పుట్టుటకుఁ గారణమేమో.

---

* విప్రోషితశ్చ భరతోయావ దేవపురాదితః
తావ దేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతోమమ
పురాభ్రాతః పితా న స్స మాతరంతు సముద్వహన్
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్.

—107 సర్గ, అయోధ్యా కాండము.

అందుకొక స్త్రీ పుట్టి రుక్మాంగదుని యెడల మోహములేక మోహించి, మోసగించి కూరకృత్యములఁజేయింప నుద్యమించుటకు గతమేమో యీ కథవలన స్పష్టపడుట లేదు. ఆచార్యుల వారు జీవాత్మలు నరకమునకు రాకుండుటచేఁ గలిగిన తీరుబాటునకు యముఁడు సంతోషించెననియు, జీవాత్మలు వైకుంఠమున కేగునప్పు డప్సరోనృత్య మావశ్యకమగుటచే నచ్చర లెడలేని యీ కార్యమును జేయలేక కొందలమంది బ్రహ్మతోఁ జెప్పికొని చివరికి రుక్మాంగదుని వ్రతమునకు భంగము గలిగింప మోహినిని బంపిరనియు యుక్తి యుక్తముగాఁ గథను గల్పించిరి.

భారతమున విరాటుఁ డుత్తర నర్జునున కీఁబోఁగా నతఁడు తా నామెకు గురువగుటచే లోకులు శంకింతు రను భీతిచే నామెను తన సుతుఁడగు నభిమన్యున కిమ్మన విరటుం డందుల కంగీకరించి వివాహ మహోత్సవము నొనరించెనని కలదు. నాటకమునఁ గవి యుత్తరాభిమన్యుల యనురాగము యొక్క క్రమ పరిణామమును సూచించి, విరాటుఁ డుత్తర నర్జునున కీఁ గథంగుట యను వృత్తాంతమును తీసివైచెను. ఈ మార్పు యుక్తియుక్తముగ నుండుటయే కాక యభిమన్యుఁడు విరటు నగరమునకు ముందే వచ్చుటచే నతనికిఁ దండ్రుల యెడఁ గల భక్త్యనురాగములను, పాండవు లభిమన్యుని చూచియు సంచలింప కుండుటచే వారి మనోనైశ్చల్యమును గూడఁ బ్రదర్శించుచున్నది. ఉత్తరాభిమన్యుల ప్రణయ కథ సహితము కొంత యుండుటచే నర్జునుని శాపముతో నారంభించిన కథ వారి వివాహముతో ముగియుటలోఁ గొంత వఱకైనను సహజత్వము గోచరించు చున్నది.

పెద్దన మనుచరిత్రమున కథైక్యము లేదని పలువురు విమర్శకులు తలంచు చున్నారు. దానికి మొదటి మూఁ డాశ్వాసముల కథకును తరువాత స్వరోచి వృత్తాంతమునకును నంతగా సంబంధము లేకుండుటయే కారణము ఆచార్యులు గారు కథలో నైక్యము కూర్చుటకై వరూథినీ వీరసేనుల శాపమునకుఁ గారణమయిన వీరసేనుని ప్రణయ సంభాషణతోఁ గథ నారంభించి, త చ్ఛాప విముక్తికి హేతువైన స్వరోచి వృత్తాంతముతోఁ గథ ముగియున ట్లొనరించిరి. అదిగాక నాటకమునకు మనుచరిత్ర యని గాక వరూథిని యను నామ మిడుట కూడ నీ యైక్యానుసంధానమునకుఁ గొంత వఱకుఁ దోడ్పడుచున్నది. మనుచరిత్రమున వరూథినీ వీరసేనుల శాపము గాని స్వరోచి దానికి విముక్తి కలిగించుట గాని లేనేలేదు. అతఁడు మనోరమను బెండ్లి యాడుట కేవలము యాదృచ్ఛికము. ఆచార్యులుగా రిందీవరాక్ష గంధర్వుఁడు వరూథిని సోదరుఁ డనియు వా రిరువురు నంతకు పూర్వమే తమ బిడ్డలగు మనోరమా స్వరో

చులకు వివాహము చేయవలెనని తలపోయుచుండిరనియు నొక చక్కని సంబంధము కల్పించిరి. నాటకముతో నంతగా సంబంధము లేని స్వరోచి యితర ప్రభావములు పూర్ణముగ నిందు విడువఁబడినవి. పైని పేర్కొనఁబడిన 'చిరకారి' నాటకమున మేధాతిథి చంద్రరేఖను గుమారునిచేఁ జంపించుటకుఁ గల కారణమును సయుక్తికముగఁ గల్పించి కథలో సడలిన బిగువును కవి మరల చేకూర్చుట స్పష్టముగానే గోచరించుచున్నది.

ప్రబంధ పురాణములందు బీజప్రాయములుగా నున్న వస్తువులను కొంచెము విపుల తరములుగా నొనరించుట చేతను, అందు గోచరింపకపోయినను నాటకమున నావశ్యకము లనిపించు కొన్ని రంగములను సృష్టించుట చేతను, సామాజికుల యభిరుచికి దోహదము గల్పించుటకు నాచార్యులుగారు మూలభిన్నము లయిన కల్పనల (Deviation for the sake of stage suitability and audience) నొనరించుట మూఁడవ పద్ధతి. పాంచాలీ స్వయంవరము నందలి దశరూప కుంభకారుల వృత్తాంతము, 'బృహన్నల' యందలి యభిమన్యు వృత్తాంతము, సావిత్రీ చిత్రాశ్వమున యముఁడు విప్రరూపధారియై వచ్చు విషయము, ప్రమీలార్జునీయము నందలి కనకలతాదుల విజృంభణము మొదలగునట్టివి మూలమున పలుచగానున్న కథకుఁగొంత నిబిడత్వమును గూర్చుచున్నవి. ఉద్యానవనమందుఁ దరుణ దంపతులు ప్రప్రథమముగఁ గలసికొనుట సావిత్రి చిత్రాశ్వము, బృహన్నల, చంద్రహాస, ముక్తావళి అను నాటకములందు కలదు. ఈ రంగములు మూలమున లేకున్నను సామాజికుల యనురక్తికిఁ బుష్టి కలిగించుటకై నాటక కవిచే స్వయముగా సృష్టింపఁబడినవి. రుక్మాంగద యందలి రంభాదుల నృత్యములును, 'ప్రహ్లాద' యందు హిరణ్యకశిపుఁడు కుమారుని జంపించుటకుఁ గావించిన వివిధ ప్రయత్నములును, ప్రమీలార్జునీయము నందును, ఇతర నాటకము లందును గల యుద్ధ రంగములును, కేవలము సామాజికుల ననురంజింపఁ జేయుటకై సృష్టింపఁబడినట్టివే.

పురాణ ప్రబంధములలోని కథలకుఁ గావ్య న్యాయమును బురస్కరించుకొని భిన్నకల్పనముచేయుట యాచార్యులగారి విపర్యాస సంవిధానమున నాల్గవ పద్ధతి. జైమిని భారతమున రాజు చంద్రహాసుఁడు దేవాలయమున కేగుచుండఁగా నాతని, బిలిపించి తన కుమార్తె నిచ్చి వివాహము చేయుటచే మదనుఁ డతనికి బదులుగా దేవాలయమున కేగి యచ్చట దుష్టబుద్ధిచే నియమింపఁబడిన ఘాతుకులచేఁ గ్రూరముగా (జంపఁబడెను. తరువాత దుష్టబుద్ధి యీ మోసము నెఱింగి దేవాలయమున కేగి

మృతుఁడయిన పుత్త్రినిఁ జూచినంతనే విచారాతిశయముచేఁ దానుగూడ మరణించెను. చంద్రహాసుఁడు మామయు బావయు నిట్లు మృతులయినప్పు డూరకుండినచో జను లాడిపోయుదురని శక్తికిఁ దన శరీరము వ్రేల్చుచుండఁగా నామె ప్రత్యక్షమై యాతనికి దత్త్వోపదేశము చేసి యాతని కోరిక ననుసరించి దుష్టబుద్ధిని, మదనుని పునర్జీవి తులఁ గావించెను. కావ్య న్యాయము ననుసరించి యవ్యాజముగఁ జంద్రహాసునిపైఁ బగఁబూని యాతని సంహరింప నెంచిన దుష్టాత్ముఁ డగు దుష్టబుద్ధి పుత్త్రిశోక వ్యథా దోదూయమాన మానసుఁడై మరణించుటయే యతనికిఁ దగిన శిక్ష. ఆచార్యులు గా రీ యుద్దేశము తోడనే మదనుఁడు బిందోజీ విషాపసారణ మంత్ర ప్రభావముచే జీవించినను దుష్టబుద్ధి తన దుష్టత్వము తనకే యసహ్యము కాఁగఁ బొడుచుకొని మర ణించునట్లు వ్రాసిరి.

వరూధిని నాటకమున వరూధిని క్రిందు మీఁదులు గుర్తింపక పర్వతమును జూడ నరుదెంచిన యా వైదిక బ్రాహ్మణుని మదనోన్మాదముచేఁ గవయఁ గోరుట స్వైరిణియైన యచ్చరయే యైనను, ఆమె దౌరాత్మ్యమును జాటుచున్నది. వీరసేనుఁడు తన్ను వలవని కాంతను మాయోపాయముచే మోసగించి, కామాంధుఁడై ప్రవర్తిం చుట యాతని దుష్టత్వమును జెప్పక చెప్పుచున్నది. పెద్దన వీ రిరువురి దోషములకును దగిన శిక్ష విధింపక యట్లే విడిచిపెట్టెను. ఆచార్యులు గారు వరూధిని తన్ను గవసిన వాఁడు ప్రవర వేషము వేసికొన్న వీరసేనుఁడని యెఱింగి పాషాణము కమ్మని యాతనిని శపించె ననియు, వీరసేనుఁడును ఆమెను పాషాణాకృతి వహించి తన యందే లీనమై యుండు మని ప్రతిశాప మొసంగె ననియు రచించిరి. వా రిరువురు నెండ కెండుచు వానకుఁ దడియుచు నా శాపఫలమును పదునాఱేం డ్లనుభవించిరి. ఈ యనుభవముచే వారి పాపము పటాపంచలు గాఁగ వారు పూతులై సుఖ జీవితమును గడుపుట కవకాశము గల్గెను. సచ్చరిత్రుఁడగు సారంగధరుఁడు నిహతుఁ డగుట కావ్య న్యాయమునకును నీతికిని భంగకర మయ్యు నతఁడు చనిపోయిన తరువాత సిద్ధుఁడు వచ్చి యాతని కర చరణము లంటించి మరల బ్రతికించె ననుట యసహ జముగా నుండునని యాచార్యులు గారు నాటకమును విషాదాంతముగానే ముగించిరి. చనిపోయిన తరువాత నాకాశవాణి సారంగధరుని సత్స్వభావమును గూర్చి చెప్పుట వలన నే లాభమును లేదని యాయన యా వృత్తాంతమును దొలఁగించి చిత్రాంగి కౌటిల్యమును రాజరా జెఱుంగుటకు వేఱొక మార్గమును గల్పించిరి. చిత్రాంగి రాజ రాజుచేఁ జంపింపఁబడుటకంటె సారంగధరుని మృతివిషయమును విని వెంటనే తన్నుకొని చచ్చెననుట మిక్కిలి సమంజసముగా నున్నది.) ప్రమీ లార్జునీయమున

నాకాశవాణి యర్జునునితోఁ జెప్పిన పల్కులను సైతమాచార్యుల వారు తొలఁగించి, దాని కన్యథా కల్పనము చేయుట గూడ నసహజత్వమును దొలఁగించుటకే యయి యుండును. ఇట్లని యాచార్యులుగారు తమ నాటకము లన్నిటిలో నిట్టి యసహజ విషయములను తొలఁగించియుండలేదు. ప్రహ్లాదుఁడు పర్వతము నుండి పడినను, విషమును పానము చేసినను, ఏనుఁగులచేఁ ద్రొక్కఁబడినను మృతుఁడు గాకుండుట యసహజమే కదా !

ఆచార్యులు గారు హాస్యము కొఱకును గథ ప్రకృతికి సన్నిహితముగా నుండుటకును విషాదాదు లయిన కొన్ని భావముల కుత్కర్షాపకర్షలు గల్గించుటకును మూలమున లేని కొన్ని రంగములఁ గల్పించుట అయిదవ పద్ధతి. సావిత్రి చిత్రాశ్వమున సుమాలి బ్రాహ్మణ వేషమును ధరించి సత్యవంతుని పరిహసించుటయు, వరూథిని లోని శతానంద కంధర మందర సరస్వత చక్రవంతుల సంభాషణములును, ప్రమీలార్జునీయము నందలి సుయోగుని యుదంతమును, చిత్రనళీయమున సుదేవ పర్ణాదులు కలిసికొనుటయు, బృహన్నల యందలి హలాయుధుని మూగతనమును, చిరకారిలోని చెవిటివారి ఘోషయుఁ గేవల హాస్యమునకయి కల్పింపఁబడిన నూతన కల్పనలు. ఇట్లే విషాద సారంగధరము నందలి న్యాయస్థాన రంగమును, చిరకారి యందలి మూఁడవ యంకమును నాటక కథ ప్రకృతికి దగ్గఱగా నుండి సామాజికుల నాకర్షించుటకయి కల్పింపఁబడినవి. చంద్రహాస నాటకమున సదాచార నాగరకులు చంద్రహాసుని సుగుణములను బ్రస్తుతించుట దుష్టబుద్ది దౌష్ట్యమునకును, సారంగధరుఁడు తన పక్షమున వాదింప కుండుటయుఁ జిత్రాంగీ రాజరాజులు సంభాషించు తఱి రత్నాంగి పుత్రభిక్షకయి వచ్చుటయు నచ్చట విషాద భావమునకును, పంచాపకేశ ప్రణతార్తి హరులు సత్రముకడ సేవకులతోఁ గావించిన సంభాషణము రుక్మాంగదుని వ్రతనిష్ఠకును నుత్కర్షఁ గల్గించు చున్నవి.

ఆచార్యులుగారు నాటకస్థము లయిన పాత్రల వివిధ భావములు సామాజికులకుఁ దెలియుటకై కొన్ని నూతన రంగములను గల్పించుట యాఱవ పద్ధతి. ఇట్టివి యన్ని నాటకములలో నున్నను బృహన్నల యందలిది మఱింత తేటతెల్లముగా నున్నది. కీచకుఁడు ద్రౌపదిని దనకుఁ గూర్పు మని బృహన్నల కాళ్ళపైఁ బడుట యిట్టిది. బృహన్నల తనకు సంభవించిన నపుంసకత్వమున కంతగా నెన్నఁడును విచారించి యుండలేదు. అతఁ డిచ్చట వెలువరించిన భావములు మిక్కిలి యుదారములయి యతని యాభిజాత్యమునకుఁ దగియున్నవి. ఈ నూతన సన్నివేశము లేనిచో నర్జునుని హృదంతర భావములు సామాజికులకుఁ దెలియుట దుర్లభము.

ఈ విధముగా నాచార్యులుగారు తమ నాటక వస్తువులలోఁ గావించిన మూల భిన్న కల్పనలు ఏదోయొక విధముగఁ గథకు వన్నె చేకూర్చునట్టివిగనే యున్నవి. చిత్రనళీయ నాటకమున నాచార్యులుగారు హంస దౌత్యమును విడిచిపెట్టిరి. ఆ నాటకము పూర్వభాగమున శృంగార నైషధాను సరణము నుత్తర భాగమున భారతాను సరణమును గానవచ్చుచున్నవి. మొత్తము మీఁద నాటకమున మూలమున సూచిత మాత్రము లయిన కొన్ని సన్నివేశములు విపులీకృతము లగుట తప్ప కథా సంబంధు లయిన విపర్యాసము లంతగాఁ గాన్పింపవు.

# III

వస్తు నిర్మాణము (Structure of his plays ) :

( పాశ్చాత్యుల పంచకార్యావస్థలకును సంస్కృత లాక్షణికుల పంచకార్యావస్థలకును మిక్కలి దగ్గఱ సంబంధము గలదు. వానిలో మొదటి కార్యావస్థకు ముందు ప్రవేశకము (Exposition) అను కొంచెొక యవస్థ నాటకారంభమునకు ద్వారము వంటిది యుండుట కలదు. ఈ ప్రవేశకమును incident అను ప్రథమ కార్యావస్థమును గలిపి మనలోని యారంభముతో సమానములు. వానిలోని growth అనఁబడు ద్వితీయ కార్యావస్థలోఁ గొంతభాగము మన ప్రయత్నమునకు మఱికొంత భాగము ప్రాప్త్యాశకును సరిగా నుండును. వానిలో climax, denoument అనఁబడు తృతీయ చతుర్థ కార్యావస్థలు రెండును మనలోని నియతి ప్రాప్తితో సమానముగ నుండును. వారి యుపసంహృతికిని మన ఫలాగమమునకును భేదమే లేదు. సంస్కృత నాటకములలోఁ గాని పాశ్చాత్య నాటకములలోఁ గాని యీ కార్యావస్థ లందలి యంకముల ననుసరించి యుండుట కాని వేఱువేఱుగ విడఁదీసి చూచుటకు వీ లగునంత స్పష్టముగ నుండుట గాని కానరాదు. నాటకములలో నవి తప్పక యుండునను విశ్వాసము కలవా రెట్లో కృత్రిమముగాఁ గథయందీ యైదింటికిని సమన్వయము గల్పింతురు. సంస్కృత లాక్షణికుల సంధ్యర్థ ప్రకృతుల వినియోగము గూడ నింతే. పైఁగా నీ యర్థ ప్రకృతు లొక్కొక్కటి నాటకమున నిట్టిచోట నింతమేర నాక్రమించియుండవలెనను నియమము లేదు. కవులు గ్రహించిన కథను బట్టి యివి యెచ్చటనో యొకయెడ క్రమవిరహితముగాఁ గానిపించుట కవకాశము గలదు గాన వానిని నిరూపించుటకై ప్రయత్నించుట వృథాశ్రమ యగును.

ఆచార్యులు గారి నాటకములలో నీ కార్యావస్థ లన్నియు యథాశాస్త్రముగా లేక పోవుటచే వానిని కనుఁగొనుట చాల కష్టము. ప్రహ్లాద, బృహన్నల నాటకములు

రెండును సన్నివేశముల పట్టీల వలె నున్నవి. దానియందుఁ గార్యముల యొక్క యవస్థలు నిశ్చితములుగా నున్న వనుకొనుటకే యవకాశము లేదు. ప్రహ్లాద నాటకమున హిరణ్యకశిపుని నాశనమును కార్య మని గ్రహించినచో నతని తపశ్చరణము, వరలాభముచే గర్వించి యతఁడు విష్ణులోకముపై దాడి వెడలుట, ప్రహ్లాదుని విష్ణుభక్తి సహింపనేరక యతని కనేక బాధలు గల్గించుట, ప్రహ్లాదుఁడు విష్ణువు స్తంభమునఁ గలఁ డనుట, నరసింహుఁ డావిర్భవించి హిరణ్యకశిపుని దునుముట యను విషయములందు పంచావస్థలును గోచరించును. బృహన్నలలో నభిమన్యుని వివాహమే కార్యమగుచో నారంభ మభిమన్యుఁ డుత్తర నుద్యానవనమున మొదటఁ జూచుటయం దుండును. లేనిచో నాటకమున నీ యవస్థల నిరూపించుట యసంభవము. ఏలయన నందు బృహన్నల వివిధానుభవములు సూచింపఁబడినవేకాని యొకే యనుభవము యొక్క పరిణామావస్థలు చిత్రింపఁబడియుండలేదు. పాంచాలీ స్వయంవరమున నా నామమునకు కావలసిన కథ మిక్కిలి తక్కువ. అది పాండవులు కుమ్మరి గుండప్ప యింటఁ బ్రవేశించి నప్పటి నుండి యారంభించును. చిరకారి నాటకమున నారంభము మోహిని పురుష వేషమును వేసికొని చంద్రరేఖను గవయఁ గోరుట యందుఁ బ్రారంభించుచున్నది. అస లీ నాటకమున రెండుకథ లతుకఁబడినవి. మేధానిధి చంద్రలేఖ మోహిని మొదలగు వారంచఱు నొకచోటఁ గలిసికొనుట యొకటి, తరువాతఁ గళానిధికిఁ జిరకారి యను నామము వచ్చుట మఱియొకటి. ఇతర నాటకములలోని పంచావస్థ లీ పయి వానికంటె కొంచె మెక్కువ విశదముగా నున్నవి. వాని నీ క్రింది పట్టికలో సూచింతును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | పాదుకా పట్టాభిషేకము | మంధర కైకకు దుర్బోధ చేయుట | కైక దశరథుని వరము లిమ్మని నిర్బంధించుట | దశరథుని మరణము | భరతుఁడు వచ్చి కైకను దూషించుట | పాదుకా పట్టాభిషేకము |
| 2 | సావిత్రి | సావిత్రి సత్యవంతు నుద్యానవనమునఁ జూచుట | సావిత్రీ సత్యవంతుల వివాహము | యముఁడు సత్యవంతుని ప్రాణములు తీసికొని యేగుట | సావిత్రి యతనిని వెంబడించుట | సత్యవంతుడు పునర్జీవితుఁడగుట |
| 3 | ముక్తావళి | ముక్తావళి విలాసకుని నుద్యానవనమున మోహించుట | పినతండ్రి సాహాయ్యముచే నాతని చెరనుండి విడిపించుట | వారి వియోగము | జీవారి రసమును మ్రింగిన ముక్తావళీ సోమశేఖరులు బ్రదుకుట | వివాహము ఈ కథలో కళావతీ ముక్తావళుల ప్రణయ ముపకథ |
| 4 | రుక్మాంగద | అజామిళుని చరిత్ర విని రుక్మాంగదుఁడు ఏకాదశీ వ్రతము నారంభించుట | వ్రతము దేశమందంతటను వ్యాపించుటచే జీవులు వైకుంఠమునకే పోవుట | రుక్మాంగదుఁడు మోహినిని మోహించుట | రుక్మాంగదుఁడు కుమారుని చంపుటకైన నొడంబడుట | విష్ణువు ప్రత్యక్షమగుట |
| 5 | సారంగధర | సారంగధరుఁడు పావురముల యాట యాడఁబోవుట | సారంగధరుఁడు చిత్రాంగి యింటి కరుగుట | అతఁడు చిత్రాంగి కామమును నిరాకరించుట | సారంగధరుఁడు తన పక్షమున వాదించు కొనకపోవుటచే రాజరాజు మరణశిక్ష విధించుట | సారంగధరుని మరణము |
| 6 | ప్రమీల | యజ్ఞాశ్వమును కనకలతాదులు బంధించుట | మేఘనాథాదులు బంధింపఁబడుట | అర్జునుఁడు సన్యాసియై గుర్తింపఁబడుట | ప్రమీల గంధర్వ స్త్రీయై వచ్చి వరింపుమనుట | వివాహము |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 7 | వరూధిని | వీరసేనుఁడు వరూధినిని మోహించుట | మాయా ప్రవరుని వేషమున నామెను కూడుట | శాపమున వారిరువురు పాషాణము లగుట | స్వరోచి యచ్చటి దీనాలాపము విని వృత్తాంతము నెఱుంగుట | ప్రవరుఁడు శాప విమోచనమును గావించుట |
| 8 | చిత్రనళీయము | దమయంతి దేవతల వీడి నలుని వివాహ మాడుట | కలికోపము; పుష్కరుని తోడి జూదము | రాజ్య బహిష్కృతుఁ డగుట | సుదేవుఁ డాతనిని గుర్తించి రెండవ స్వయంవరము కావించుట | నలదమయంతీ సమాగమము |
| 9 | చంద్రహాస | చంద్రహాసుఁడు కుంతలరాజునకు కానుక లంపుట | అతని చంపుటకై దుష్టబుద్ధి చందనావతి కరుగుట | ఉత్తరము వ్రాసి చంద్రహాసుని కుంతలమునకు పంపుట | విషయ యుత్తరము నందలిపదములు మార్చి వేయుట | చంపకమాలను గూడ చంద్రహాసుఁడువివాహ మాడుట; దుష్టబుద్ధి మరణము |
| 10 | రోషనార | శివాజీ రోషనారను బందిచేయుట | వారిరువుర సమాగమము | శేఖర్జీ మాయోపాయముచే శివాజీ ఓడింపఁబడుట | రోషనార యుపాయముచే శివాజీ చెఱసాల నుండి బయటపడుట | శివాజీ హసనల్లీతో కలిసికొని సుఖముగా నుండుట |

ఈ పై కార్యావస్థలు ప్రయత్నించి కృత్రిమముగాఁ గల్పించినవే కాని కవి యీ నాటకములను వ్రాయుచో నీ యవస్థల నిట్లే నిర్ణయించుకొని వానిని వ్రాసెనని మాత్రము చెప్పలేము.

ఆచార్యులుగా రాంగ్ల నాటక సంప్రదాయము ననుసరించి ప్రవేశమును (Exposition) రచించుట కొన్ని నాటకములలోఁ గానవచ్చుచున్నది. మోహినీ రుక్మాంగద, పాదుకా పట్టాభిషేకము, వరూథిని మొదలగునవి సూటిగా కథతోడనే యారంభించును. తక్కిన నాటకములలో నాటక కథారంభమునకు ముందు సామాజికుల యవబోధమునకు సహాయపడు నుపోద్ఘాతము వంటి వివరణ రంగములు కొన్ని కలవు. విషాద సారంగధరమున రాజరాజు వేఁటకు వెళ్ళుట, చిత్రాంగి యనుమతిని గ్రహించుట మొదలగు మొదటి మూఁడు నాలుగు రంగములు నిట్టివే. సావిత్రి చిత్రాశ్వమువ ఘటకేతువు ద్యుమత్సేనుని నగరము ముట్టడించుటయు సుమాలి సత్యవంతున కొల కరుగుటయు నిట్టివే. ఇట్లే యితర నాటకములలో సైత మీ ప్రవేశకము (Exposition) యథావసరముగా నొకటి రెండు రంగముల నాక్రమించి యున్నది.



# 5. నాటక పితామహుని నాటక నిర్మాణము

## ( DRAMATIC DESIGN )

## I

**సమానాంతరత్వము Parallelism :**

పాశ్చాత్యులు తమ నాటకములలో వస్తు సంవిధానమున సమానాంతరములయిన (Parallel) సన్నివేశములను కాని రంగములను గాని కొన్నిటిని గూర్చుచుందురు. ఇవి తఱచు కథయందలి ప్రధానాశయముల యామ్రేడిత రూపములవలె కానవచ్చును. Shakespeare ఇట్టి సమానాంతర సన్నివేశములను పెక్కింటిని రచించెను. అందు King Lear లోని 'గ్లస్టర్' చరిత్ర యందిది మిక్కిలి స్పష్టముగా గానవచ్చుచున్నది. ఆతఁడొక్కొక్కప్పుడు కథను విపులముగను క్లిష్టముగను నొనరించు నుద్దేశముతోఁ గూడ నిట్టి సమానాంతర సన్నివేశములను గూర్చుచుండెను. Comedy of Errorsలో నతఁడిట్టి రంగములను సృష్టించి కథకు మూలమున లేని క్లిష్టతను చేకూర్చెను. Much Ado About Nothing అను నాటకమునందు వలె నీతఁడు కథలో సంకీర్ణములయిన వివిధ సన్నివేశములకు పరస్పర సంబంధమును చేకూర్చి దాని సమష్టి సౌందర్యమును బెంపొందింపఁ జేయుటకుఁ గూడ నీ ప్రక్రియ నుపయోగించును. 17 వ శతాబ్దియందలి 'స్పెయిన్' దేశపు నాటకముల లోనిది కథాంతర్గత ప్రధానోద్దేశమునకు పరిహాస రూపమైన పౌనరుక్త్యము కలిగించుటకయి యుపయోగించుట తఱచు. విదూషకుఁడు నాయకుని చర్యలను, పలుకులను, స్వయముగా ననుకరింపఁ బ్రయత్నించుటవలన నిది యేర్పడుచుండెను Shakespeare సైతమిట్టి పరిహాస రూపసమానాంతర సన్నివేశములను (Burlesque parallelisms), As you like it మొదలగు నాటకములలో నుపయోగించెను.

ఆచార్యులుగారి నాటకములలోఁ గూడ నిట్టి సమానాంతరత్వము కొన్ని చోట్లఁ గాన్పించుచున్నది. ప్రమీలార్జునీయమున నాయన ప్రదర్శింపఁదలఁచిన ముఖ్యవిషయము స్త్రీలకుఁ గూడ స్వాతంత్ర్య మొసంగినచో వారు పురుషులవలె (నొక్కొక్కప్పుడు వారి కంటె నధికముగా సైతము) దేశ స్వాతంత్ర్యమునకును సౌభాగ్యమునకును తోడ్పడఁగల్గుదురని. ఆ నాటకమున తృతీయాంకము నందలి ప్రథమ రంగమున కాదంబిని మేఘనాథునితో యుద్ధమాచరించి యాతని నోడించి స్త్రీకి సయితము

యుద్ధాచరణ రాజ్యపాలనాది సామర్థ్యములు కలవని నిరూపించెను. ఆ రంగమునందు కనక లతాదులు సాత్యకి మొదలైన యితర వీరుల నిర్జించి వశపఱచుకొనుట యీ పై విషయమునే దృఢీకరించుచున్నది. ఈ యుద్దేశము తోడనే యాచార్యులు గారీ రంగము నంత విపులముగ రచించియుందురు. ఈ నాటకముననే కామ మోహముల ప్రభావమును పౌనరుక్త్యముచే స్పష్టీకరించు విషయము మఱొండు కలదు. మేఘ నాథాదులు కాదంబినీ కనక లతాదులయెడఁ గల మోహముచే నిర్జింపఁబడి తమ పరాక్రమమునకు లాఘవమును కల్పించుకొనిరి. ప్రమీల తన కర్జునునిపైఁ గల వలపుచే శక్తి చూపుటకు బదులు యుక్తికై పాల్పడవలసి వచ్చినది. యువతీ యువకుల కొండొరులపైఁ గల యత్యంతానురాగము వారి సహజ శక్తి సామర్థ్యములకుఁ గలుగు లాఘవమును నయిత మొక్కొక్కయెడ గమనింపదు గదా! ఆచార్యులుగారు కథా వైపుల్యముచే సామాజికుల రంజింపఁజేయు నుద్దేశముతోఁ గల్పించిన సమానాంతరత్వము ముక్తావళియందును, కథలోని వివిధ సన్నివేశములకు సంబంధమును గల్పించి సమష్టి సౌందర్యమును పెంపొందించుటకుఁ గావించిన సమానాంతరత్వము చిరకారియందును, గానవచ్చుచున్నది. ముక్తావళి తనకు పతియెడఁ గల భక్తిచే నెన్ని కష్టములకయిన నోర్చి, ధైర్యముతో కాలముఁ బుచ్చి, చివరికు పతి సమాగమమును బడసెను. కళావతి పురుష వేషమున నున్న ముక్తావళిని వలచి యామె స్త్రీయే యని యెఱింగియును, తన ప్రాణములకు హాని సంభవించునప్పుడు కూడ నామె యెడ భక్తిని చూపుట మానలేదు. అందుచే చివరికామె పునర్జీవితురాలయి యవ్యయమయిన యానందమును బడయఁగల్గెను. పాతివ్రత్యము యొక్క ప్రభావమును స్పష్టముగ జూపు నీ సమానాంతరత్వము కథా వైపుల్యమునకయి సృష్టింపఁబడియుండును. చిరకారిలో మోహిని శిశువుగా నున్నప్పుడు కాటిసాపలచేతను, విశారదుఁడు శిశువుగా నున్నప్పుడు దొంగలచేతను నెత్తుకొని పోఁబడిరి. వారు యౌవన కాలమున కొక్క యెడనే తిరుగ సమావేశమైరి. విశారదుఁడే మోహినిని దొంగలనుండి రక్షించెను ఆమెయే చంద్రలేఖకు మేధాతిథి శిక్ష విధించుటకును, చిరకారికా నామము వచ్చుటకును కారణము. మోహినీ పాత్రను కవి సృష్టింపకపోయినచో, కథలో నైక్యమేయుండదు కవి కావించిన యీ సమానాంతరత్వ కల్పనము కథయొక్క సమష్టి సౌందర్యమున కెంతయో తోడ్పడుచున్నది. ఈ నాటకమున మోహిని మనోహరుని ధిక్కరించి తన శీలమును కాపాడుకొనుటయే కాక యాతనికి వేదాంతోపదేశము నొనర్చుటయు, చంద్రలేఖ పురుష వేషమున నున్న మోహినిని తిరస్కరించి తన పాతివ్రత్యమునకు కళంకము రాకుండ కాపాడుకొనుటయు, సమానాంతరములుగ నున్నవి. పరిహాస రూపకమయిన సమానాంతరత్వ మాచార్యులుగారి వరూధిని నాటకములో బీజ ప్రాయ

ముగ నున్నది. అందలి ప్రథమాంక చతుర్థ రంగమున వీరసేనుఁ డెల్లయెడల వరూథినినే కాంచుచుఁ గావించు దీనాలాపములను శతానందుఁడు (విదూషకుఁడు) మహిషిని జూచి యుచ్చరించుట వలపుయొక్క గ్రుడ్డితనము నెంతయో స్పష్టముగాఁ దెల్పుచున్నది. ఈ విదూషకుని చర్యలే వేఱొక రంగమున కొంచెము విపులతరముగ వర్ణింపఁబడి యున్నచో నిక్కడి పరిహాస రూపక సమానాంతరత్వము (Burlesque Parllelism) Spanish నాటకముల యందలి దానివలె నుండెడిది.

## II

పృతియోగము Contrast :

పాశ్చాత్యులు సమానాంతరత్వమునువలె ప్రతియోగమును కూడ నాటకములందుపయోగించి యందలి వస్తువులకుఁ బుష్టి కలిగించుట కానవచ్చుచున్నది. ఈ ప్రతియోగము తఱుచు కథా సన్నివేశములందును, నాటకస్థ పాత్రల శీల స్వభావములందును, గోచరించుచుండును. ఆచార్యులు గారిట్టి ప్రతియోగములను తమ నాటకములలో నంతటను వాడియున్నారు. (ఆయన విషాద సారంగధరమున రెండవ యంకమున సారంగధరుని మనో నిగ్రహమును, నైతిక స్వభావమును సమగ్రముగా వర్ణించియున్నారు. మూఁడవ యంకమున తన ప్రాణములకే యెసరు వెట్టిన పయినను తల్లియగు చిత్రాంగి దుష్ట స్వభావమును సభలో వెల్లడించుటకుఁ దానుగా నొడఁబడమియే కాక సుబుద్ధిని సయిత మట్లు చేయకుండ వారించుటలో నాతని సాత్త్విక స్వభావము కోటి కెక్కియున్నది. ఇంత శుద్ధసత్త్వమూర్తి చివరి యంకమున నన్యాయముగ వధింపఁబడుట యచ్చటి విషాద తత్త్వమున కెంతో యుత్కర్ష కలిగించుచున్నది. సారంగధరుని నయోత్కర్షకును శిక్ష యందలి కాఠిన్యమునకును గల ప్రతియోగమే దానికి ప్రధాన కారణము. ఇట్లే గంభీరమయిన విషయమున నడుమ తేలికయయిన పరిహాస రంగములను ప్రవేశపెట్టుట కూడ నొకవిధమగు ప్రతియోగ సంఘటనమే. సారంగధర నాటకమునందు పిచ్చివారితో నిండిన యా చిన్న రంగ మిట్టిదే. కాని యాచార్యులుగారి విషాద నాటకములలో కంటె నితర నాటకములలో నిట్టి ప్రతియోగము లెక్కువగాఁ గానిపించును. నాటకములోని వివిధ పాత్రల శీలములందును, స్వభావోద్దేశములయందును నొక విధమయిన ప్రతియోగము (Contrast) గాన్పించుట సహజము. అసలు సద సద్విషయములకు సంఘర్షము (Conflict) లేనిదే కథయే యంత రమ్యముగ నుండదు. శీల సంబంధియయిన యిట్టి ప్రతియోగమాచార్యులుగారి నాటకములందెల్లెడల గోచరించును. ప్రహ్లాద హిరణ్యకశిపులకును. చిత్రాంగీ సారంగదరులకును. చంద్రహాస దుష్టబుద్ధులకును, కైకా మంథరలకును

శీల స్వభావాదులలో నిట్టి ప్రతియోగము కలదు. ఇట్టి ప్రతియోగమును నీతిబోధకై యుపయోగించిన సందర్భము బృహన్నల యందును, రుక్మాంగద నాటకమునందును గోచరించుచున్నది. అర్జునుఁ డూర్వశీ ప్రణయమును విహతము గావించి తన మనో నిగ్రహమును బ్రకటించుటయే కాక తత్ఫలముగ నజ్ఞాతవాసమునకు పరమోపకారి యగు నేక సంవత్సర మాత్రానుభోగ్యమయిన శాప రూపవరమును పొందెను. కీచకుఁడు ద్రౌపదిని వెంట నంటుటచే తన కామాంధతను ప్రకటించుటయే కాక భీమునిచేత నీచమయిన చావు చచ్చెను. అర్జునుని మనో నిశ్చలత్వమునకును కీచకుని నీచత్వమునకును గల ప్రతియోగముచే కవి యర్జునుని శీలము నెంతో రమ్యముగఁ బోషించెను. కాని యిచ్చట నీ రంగము బృహన్నల యను నామము గల యీ నాటకముయొక్క వస్త్వైక్యమునకు భంగకరముగ నున్నది. ప్రతియోగములు నాటక సౌందర్యమునకుఁ దోడ్పడునట్టివే యయినను కథైక్యమునకు (Harmony of the plot) మాత్రము భంగకరములుగా నుండరాదు. రుక్మాంగదుఁడు మోహినిని వలచుట సవతుల కీర్ష్య గల్గించినను సంధ్యావళికి మాత్రము ప్రియముగనే యుండెను, ఇదియే కాదు భర్త యేమొనరించినను ఆమెకుఁ బ్రియమే. దానికి ప్రతిఫలముగ నామె ప్రతిష్ఠతో పాటు పుత్ర పునర్జీవన భాగ్యమును సయితము పడసెను. ఈర్ష్యాళువు లయిన యామె సపతులకుఁ బ్రతిష్ఠయు లేదు పాతివ్రత్యమును లేదు. ఇచ్చటి ప్రతి యోగము సంధ్యావళి పాతివ్రత్యమున కెంతయో వన్నె చేకూర్చుచున్నది. ప్రతి యోగ మున్నప్పుడే మంచి చెడ్డల తారతమ్యము విస్పష్టమగుట కెక్కువ యవ కాశము కలదు.

ప్రతియోగములో Dramatic Irony అనునది మఱియొక రకము. ఇందొకే వస్తువుయొక్క రెండు భావములకు ప్రతియోగము గాన్పించును. ఈ ప్రతియోగము సద్యఃకాలముననే కాని తర్వాతఁ గాలక్రమముగాఁ గాని వ్యక్తము గావచ్చును. నాటక విమర్శలో రంగముపై జరుగు చర్యలకుఁ గాని పల్కులకుఁ గాని కల యర్థము పాత్రలచే నొక విధముగను సామాజికులచే మఱియొక విధముగను భావింప బడునప్పుడే Dramatic irony యున్నదని చెప్పఁబడును. పాత్రసామాజికుల యవబోధనము నందీ తారతమ్యము తఱుచు సామాజికులచే నధిగత పూర్వములయిన వస్తువిషయముల జ్ఞానము పాత్రలకు లేనప్పుడు సంభవించును. ఈ తారతమ్య ము స్త్యభినయములపై నాధారపడి యుండును గాన తదాశ్రయమయిన Dramatic irony కూడ ప్రధానముగా రెండు విధములుగా నుండును. 1. వస్తు సంబంధి (Irony of incident) 2. వాక్య సంబంధి (Verbal Irony). సాహిత్య దర్పణ

కారుడు భరతు ననుసరించి పాశ్చాత్యుల Dramatic Irony కి సరియయిన "పతాకా స్థానక"మును చతుర్విధముగా విభజించెను. * ఇదియును సన్నివేశమునకుఁ (situation) గాని, సంభాషణమునకుఁ (speech) గాని సంబంధించియుండును. ఇట్టి పతాకా స్థానకములు సంస్కృత నాటకములలో పెక్కుచోట్లఁ గలవు. ఇవి ఇట్టి స్థలములయందే యుండవలయునను నియమ మెచ్చటను లేదు. ఎవరో యొక రీ నాల్గు విధములను క్రమముగా ముఖ సంధి మొదలుకొని నాలుగు సంధులలో మాత్రమే యుండవలె ననిరి. కాని విశ్వనాథుఁడిది "కావ్యకర్తు రిచ్ఛావశాత్ భూయో భూయోఁ సర్వ సంధిషు భవన్తి" అని చెప్పియుండెను.

ఆచార్యులు గారీ Dramatic Irony ని తమ నాటకములలో పెక్కు చోట్ల విరివిగా నుపయోగించిరి. అందు ప్రధానములయిన యుదాహరణములను మాత్రమే యిట సూచింతును. విషాద సారంగ ధరమున రాజు, చిత్రాంగి నిద్రలోఁ బల్కిన పల్కులను బట్టియు నామె యొద్దఁ గన్పించిన సారంగధర చిత్ర పటమును బట్టియు నామెయే సారంగధరుని మోహించి యింత క్రూర కృత్యము నొనరించి యుండెనని తెలిసికొనెను. చిత్రాంగి లేచి తన పన్నాగ మింకను రహస్యముగనే యుండెనని తలంచి కమల సత్యమును చెప్పిన తరువాత కూడ చిత్రాంగి లంచమిచ్చి కమలచే నట్లు చెప్పించెను గాని నిజముగా రాజేమియు నెఱుఁగనని రాజరాజును మోసముచేయఁ జూచుటయందు సన్నివేశ సంబంధియయిన Irony గోచరించుచున్నది. ఇట్లే చండ వర్మ భటులు మీననాథునే విలాసకుఁడని భ్రమించుచునెడను, కళావతి ముక్తావళి పురుషుఁడే యని భ్రమియించుచోటను, దమయంతి, నలుని దేవదూతగానే తలంచుట యందును, రోషనార శంకరజీని శివాజీ యని గుర్తింపకుండుట యందును, సన్యాసి వేషమున నున్న అర్జునుఁడు, భారుమతి నిజముగాఁ దన్ను గుర్తించినను, తన గుట్టు బయటపడలేదని యట్లే ప్రవర్తించుటయందును, స్త్రీ వేషధారి యయిన భీముని కీచకుఁడు ద్రౌపదియే యని భావించుటయందును నిట్టి Irony గలదు. సన్నివేశ సంబంధి యయిన ఈ Irony మఱియొక విధముగా గూడ నుండవచ్చును. చిత్రాంగి తనకు రానున్న దురవస్థ నెఱుఁగక సారంగధరుని కట్టి శిక్ష విధింపఁజేసిన తన బుద్ధి నైపుణ్యమును పొగడుకొనుటయందును, ఉత్తరుఁడు కౌరవ సేనను జూచి కాలికి

---

* (1) సహసైవార్థ సంపత్తిః గుణవత్యుపచారతః
(2) వచఃసాతిశయ క్లిష్టం నానాబంధ సమాశ్రయమ్
(3) అర్థోపక్షేపకం యత్తు లీనం సవినయం భవేత్:- శ్లిష్ట ప్రత్యుత్తరోపేతః
(4) ద్వ్యర్థోవచన విన్యాసః; సంశ్లిష్టః కావ్యయోజితః-ప్రధానార్థాంతరాక్షేపీ.

బుద్ధి చెప్పఁగల వీరుఁడే యయ్యు దాని నెఱుంగక మున్ముందు ప్రగల్భములు పల్కుట యందును నీ రెండవ రకపు Irony గోచరించుచున్నది. ఇందు పాత్రలు తమకు కలుగనున్న ప్రమాదమును గాని, నైచ్యమును గాని యెఱుఁగక సురక్షితుల వోలె నుదారులవోలె ప్రవర్తించుచుందురు.

పాత్రలు చర్చించు పలుకు లక్కడి సన్నివేశమున కొక విధముగా సరిపడియే యున్నను సామాజికులకు భిన్నార్థ స్ఫురణము గలిగించుటయం దుక్తి సంబంధమయిన Irony గోచరించును. ఈ భిన్నార్థము వక్తకుఁ గాని, సంబోధితునకుఁ గాని, తెలియకుండనే యుండును. గ్రీకు నాటకములలోని కథలు తఱచు కల్పితములు గాకుండుటచే సామాజికుల కంచలి సన్నివేశము లన్నియు కొంచె మించు మించుగా ముందే తెలిసి యుండును అట్టియెడ నిట్టి Irony కి అవకాశము పెక్కు విధముల కలుగుచుండును. ప్రమీలార్జునీయమున యతి యయిన అర్జునునకును, మలయవతికిని జరిగిన సంభాషణమును, వరూధినిలో శతానందునకును తిలోత్తమకును జరిగిన సంభాషణమును (ద్వితీయాంక ద్వితీయ దృశ్యము) దీనికి చక్కని నిదర్శనములు. చిత్రనళీయమున బాహుకుఁడు, ఋతుపర్ణుని యాస్థానమున ప్రవేశించినపుడు, భారతీ బాహుకుల సంభాషణమునందు నిట్టి వాక్య సంబంధమయిన Irony మిక్కిలి స్పష్టముగా గోచరించుచున్నది. ఇట్టి Irony అంగములు రంగములు ఆక్రమింప నవసరము లేదు. ఒక మాటకు కూడ సందర్భమునుబట్టి దీనిని కలిగించు శక్తి గలదు. చంద్రహాస నాటకమున చంద్రహాసుఁడు దుష్టబుద్ధిని, ఆతని సత్య స్వభావమును నెఱుంగక "అమాత్య పుంగవా! కరుణాగుణ భూషణుఁడగు నీయట్టి విజ్ఞశిరోమణి" యని పొగడుట యందును, చిరకారి నాటకమున విశారదుఁడు కళానిధితో జనని పిలుచుచున్న దన్నప్పు డతఁడు "మన జననియా, మన జనని కాదా" యను నప్పుడును నిట్టి Irony కలదు. ఆచార్యులుగారి నాటకములలో వాక్య సంబంధి Irony అనేక స్థలములలోఁ గలదు. స్త్రీలు పురుష వేషమును ధరించి ప్రవర్తించు రంగములలో నిది మిక్కిలి స్పష్టముగా గోచరించును. అది యిచ్చట హాస్యముతోఁ గూడ మిశ్రితమయి యుండును. ఉక్తి సంబంధియగు Irony యొక్కొక్కప్పుడు శ్లేషాశ్రయమయి యుండుటయుఁ గలదు. రాముడు అరణ్యమున కేగునప్పుడు వశిష్ఠునకు నమస్కరింపగాఁ నతడు "నిష్టరామోద విభూతియు, శాత్రవ పంక్తి కంధర మారణ విఖ్యాతియు సిద్ధించును గాక" యని అనుటలో పంక్తి కంధర శబ్దము రావణుని గూడ స్ఫురింపఁ జేయుచున్నది. ఇట్టి దానికి పాశ్చాత్యులు (prophetic Irony) భావి సూచకమయిన Irony అందురు. దీని యర్థమును, సత్యమును నెఱుంగుటకు

కథాంతము వఱకు మనము వేచియుండవలెను. ముక్తావళి నాటకమున నిద్రించుచున్న సోమశేఖరునిఁ గాంచి ప్రవాళవల్లి "ఇతఁడు వేషధారి కాకున్న నీ రూపమున కీ తేజమా" యనుటలోని సత్యము నాటకాంతమున బోధపడును. ప్రహ్లాద నాటకమున బ్రహ్మ హిరణ్య కశిపునకు "నీ తను వమానుషభేద్యము, నజంతుతరుచ్ఛేద్యము, నలోహాది విభేద్యము, నఖరాయుధ భేద్యమునగుఁగాక" యనుమాట కూడ నిట్టిదే. మొదట నన్నమాట లోకవిధముగా జరిగినను, నాటకస్థమయిన పాత్రిలనుకొన్నట్లు జరుగక తద్విరుద్ధముగా జరుగు టిందు మఱియొక విధము. Macabeth లో గాలిదయ్యముల జోస్యము యథార్థమయినను Macabeth అనుకొన్నట్లు జరుగలేదు. చంద్రిహాస నాటకమున దుష్టబుద్ధి చంద్రహాసునకు దివ్యసుఖము (చావు) నిప్పింపఁ దలఁచి తన నగరమునకుఁ బంపెను. ఆతనికి నిజముగా విషయా పాణిగ్రిహణమున దివ్యసుఖమే చేకూరెను గాని యా దివ్య సుఖము దుష్టబుద్ధి దివ్య సుఖమునకు కేవలము విరుద్ధ మయినది.

## III

కొందఱు నాటక కర్తలు కథలోని ప్రధానాంశముల నారంభముననే చెప్పక చివరిదాఁక గూఢముగ నుంతురు. దీని వలన కథయందు సామాజికుల కాత్రము (anxiety) ననురక్తియు మెండుగఁ గలుగు నని వారి యుద్దేశము. ఇట్లు కథ యందలి కొన్ని విషయముల కప్పి పుచ్చి సామాజికుల కాశ్చర్యమును కలిగించుట నాటకమున సమంజసమే యయ్యు నెక్కువ యుద్రేకకారి (Sensational) యగుటచే నీ పద్ధతిని వినియోగించునపుడు కవి మిక్కిలి జాగరూకత వహింప వలయును. మఱి కొందఱు మొట్టమొదట నుండియు సామాజికులకు కథలోని క్లిష్టాంశముల విప్పి చెప్పుచుందురు. ఇట్లు చేయుట వలన సామాజికులు నాటక పాత్రల శీల స్వభావములను మొదటి నుండియు సమగ్రిముగ గ్రహించి నాటకమును మెచ్చుకొనఁ గల్గుట కవకాశ ముండును Shakespeare తన నాటకములలో వాని యందలి పాత్రిల శీలముల నారంభము నుండియు సామాజికులకు వారి సంభాషణముల ద్వారా తెలియఁ బఱుచుచునే యుండును. విషాద నాటకములలోని దుష్టపాత్రి లితరులతో మాటాడు నప్పుడు తమ సహజ స్వభావమును కప్పి పుచ్చుట యున్నను, వాని స్వగతములు వాని నెఱుంగుటకుఁ దోడ్పడుచునే యుండును. ఆచార్యులుగారు తమ నాటకముల లోని ప్రధాన విషయములను గూఢముగా నుంచు టచ్చ టచ్చటఁ గానవచ్చును. అర్జునుఁడు యతి వేషము వైచికొనుట, వీరసేనుఁడు మాయా పరివ్రాజ్యుఁ డగుట మొదలగు విషయములు మనకు వా రంతకుముందు నాటకస్థము లగు నితర పాత్రిలతోఁ గావించు సంభాషణము వలననే తెలియుచున్నవి. కాని నీలకేతుఁడు ముక్తా

వళియే యను విషయమును. సావిత్రియందు సత్యవంతుని పరిహసించిన ముసలి బ్రాహ్మణుఁడు సుమాలియే యనియు, చంద్రరేఖను మోహించిన నూతన పురుషుఁడు మోహినియే యనియు సామాజికులకుఁ దెలియుటకు కొంతకాల మయినను పట్టును. మోహిని చంద్రరేఖా మేధానిధుల కూఁతురే యనియు, విశారదుఁడు మంత్రగుప్తుని కుమారుఁ డగు జయసేనుఁడే యనియు, జగంధరుఁడే నాగర కేతుఁ డనియు, హసనల్లీ ఖాను రోషనార పుత్త్రుఁడే యనియు మన కా నాటకముల యంతమునందుఁ గాని తెలిసికొనుట కొంచెము కష్టము. ఆచార్యులు గారు స్త్రీలు పురుష వేషమును వేసికొను పద్ధతిని పెక్కు నాటకములలో నుపయోగించిరి. ఇట్టిచోట్ల కథను పూర్తిగ గ్రహించుట కథా తత్పరులయినవారికిఁ గొందఱకుఁ దప్ప మిగిలిన వారికి కష్టసాధ్యము. కథల విషయమున నీ మాత్రపు గూఢత్వమును పరిగ్రహించినను శీలముల విషయమున నాచార్యులు గా రీ పద్ధతి నవలంబించి యుండలేదు. దుష్టబుద్ధి, మంధర మొదలగు వారి దుష్టత్వ మారంభము నుండియు వారి స్వగతముల వలన తెలియుచునేయుండును.

అర్థ ప్రకృతులు, సంధులు, కార్యావస్థలు మొదలగున వాచార్యుల వారి నాటకములలో యథా లక్షణముగా నున్న వని చెప్పుట కాని వానిని నిరూపించుట కాని కష్ట మని యిదివఱకే చెప్పియుంటిని. అట్లే భరతుఁడు సంధ్యంతరము లని చెప్పినట్టివియు, నితరు లంతరసంధు లని చెప్పినట్టివియు, లేఖా స్వప్నాదుల నాచార్యులు గారు తమ నాటకములలో నంతగా నుపయోగించి యుండలేదు. అందులో లేఖలచే నాటక కార్యమునకు సంబంధించిన ప్రధాన విషయములఁ దెల్పుట మాత్రము కొన్ని నాటకములలోఁ గలదు. చంద్రహాస నాటకమున నుత్తర కథ యంతయు విషయ యుత్తరము నందలి పదములు మార్చుట పైనే యాధారపడి యున్నది. చిరకారి నాటకమున మూఁడు నా లుత్తరములు కలవు. వీనియందు నాటక కథ కొంతవఱకు నవలలో వలె కథనపూర్వకముగఁ జెప్పఁబడినది. విషాద సారంగధరమున చిత్రాంగి వ్రాసిన యుత్తరము చమత్కార గర్భితమై యుండుటయే కాక నాటక కథలోఁగూడ కొంత ప్రాధాన్యము వహించియున్నది. ఇట్లే పాదుకా పట్టాభిషేకమున, ప్రమీ లార్జునీయమున, సావిత్రీ చిత్రాశ్వమున, ముక్తావళి యందు వస్తు వివరణమున కాచార్యులు గా రీ యుత్తరముల నుపయోగించిరి. మొత్తము మీఁద నొకటి రెండు దప్ప నుత్తరముల ప్రసక్తి లేని నాటకములే లేవు. ఈ యుత్తరములు దీర్ఘములై విషయ బాహుళ్యము గలిగియున్నచో నాటకము నవలగా మాఱుట సంభవించుటయే కాక సామాజికులకు విసుగు కూడ కలుగును. చిరకారి నాటకమున నీ పద్ధతి త ద్గౌరవమునకు భంగకరముగ నున్నది.

అన్యథా నాటక కథను నడుపుటకు వీలులేనిచోట్లఁ దప్ప నతిమానుషములయిన విషయములు నాటకములందుఁ బ్రవేశింపఁ జేయుట వానిని ప్రకృతికి దూరము గావించును. ఆచార్యులు గారు సారంగధర నాటకాదులయందు సిద్ధ ప్రవేశము నాకాశ వాణి సంభాషణము మొదలగు వాని నుద్దేశ పూర్వకముగఁ దొలఁగించివైచిరి. కాని ప్రహ్లాద, బృహన్నల, సావిత్రి, చిత్రాశ్వము, వరూధిని మొదలగు నాటకములలో వాని వినియోగము తప్పినది కాదు. ఆయా కథల స్వభావమే యట్టి విషయముల నపరిహార్యముగాఁ గావించియున్నవి. వరూధినిలో వీరసేనుడు మాయా ప్రవరాఖ్యుడు గానిచో కథయే లేదు. ముక్తావళి నాటకమున మీననాథుఁ డుపయోగించిన మత్తు మందును, జీవారి రసమును కొంచెము లోకాతీతములుగనె యున్నవి. ఇట్టి వెంత యెక్కువగ నున్న నాటక మంత కృత్రిమముగ నుండును.

ఆచార్యుల వారి నాటకములు పెక్కింటిలో నంతమున కథ యుండవలసినంత విపులముగా లేదు. కొన్ని కథ లచ్చటచ్చట హఠాత్తుగ ముగిసినట్లు కన్పించును. పాదుకా పట్టాభిషేకము, మోహినీ రుక్మాంగద, రోషనార, పాంచాలీ స్వయంవరము మొదలగు నాటకములలో నీ దోషము కలదు. సంస్కృత లాక్షణికులు నాటకముల యంతములం దద్భుత రస ముండవలె నందురు. ముక్తావళి, సావిత్రి, రుక్మాంగద, రోషనార యను నాటకములందు మాత్రమే యంతమున నద్భుత రసము కానవచ్చు చున్నది. ఇదియైన నాచార్యులవారు మనః పూర్వకముగాఁ గావించిన దనలేము. అందు రెండు నాటకముల కా కథా సందర్భముల చివర నా రసము వచ్చుట కవకాశ ములు మూలములందే కలవు.

నాటక రచనయం దాచార్యుల వారు స్వతంత్రించిన వారే కాని ప్రాచ్యలక్షణము లను గాని, పాశ్చాత్య లక్షణములను గాని యథా నియమముగ ననుసరించిన వారు కారు. ఆయన ప్రాచ్య లాక్షణికులు సూచ్యము లని నుడివిన పెక్కు కథా భాగములను తమ నాటకములలో దృశ్యములుగానే రచియించిరి. అంకములను రంగములుగా విభ జించుట యందును, నాటకములను విషాదాంతములుగా చేయుటయందును, కొన్ని నాటకములలో మూఁడంకములను మాత్రమే రచించుటయందును, నాందీ భరత వాక్యా దుల పరిహరించుట యందును నాయన స్వాతంత్ర్యము సర్వతోముఖముగఁ గాన్పించును. ఆయన నాటకములలో సర్వశ్రావ్యము స్వగతము తప్ప, జనాంతికము, అప వారితము మొదలగు నియత శ్రావ్యము లెచ్చటను గానరావు.

---

# 6. పూర్వ రంగాదులు

## I

ఆచార్యులుగారు నాటక నిర్మాణమున పాశ్చాత్య లక్షణములనే చాలవఱకు అనుకరించినను నాందీ ప్రస్తావనాదులగు ప్రాచ్య పద్ధతులను సంపూర్ణముగా విసర్జించియుండలేదు. వారు తొలుఁదొలుత రచించిన కొన్ని నాటకములలో యథావిధిగా నాంద్యంతమున నటీ సూత్రధారుల ప్రవేశపెట్టి ప్రస్తావనను సాగించిరి. మఱి కొన్ని నాటకములలో నాందీ ప్రస్తావనా నామముల తోడనే యొక్కొక్క నమస్క్రియా పూర్వకమయిన పద్యమును వ్రాసి నాటకము నారంభించిరి. పెక్కు నాటకములలో దీర్ఘమయినది గాని యేక పద్య మాత్ర పరిమితమయినది గాని యగు ప్రస్తావనను వ్రాయకయే కథ నారంభించిరి. అసలాచార్యులుగారు నాందీ ప్రస్తావనల కెట్టి భేదమును పాటించియుండలేదు. సంస్కృత లాక్షణికుల యభిప్రాయము ప్రకారము నాంది పూర్వరంగమునకు చేరినది. నాంద్యంతమున స్థాపకుఁ డనఁబడు రెండవ సూత్రధారుఁడు ప్రవేశించి వస్త్వాదుల సూచించుచు మారిష నటీ విదూషకాదులలో నొకరితోఁ గావించు సంభాషణము ప్రస్తావన యనఁబడును. ఆచార్యులుగారు బృహన్నల, ప్రమీలార్జునీయము అను రెండు నాటకములలో నాటకము మొదట నమస్క్రియా పూర్వకమయిన యొక పద్యమును వ్రాసి దానికి ప్రస్తావన యని పేరిడిరి. ఇట్లే ముక్తావళిలో నొక్క పద్యమునే వ్రాసియుంచినను దానిని నాంది యనిరి. కాని యీ రెంటికిని సుంత భేదము గోచరించుచున్నది. మొదటి రెండు నాటకములలో సమానముగ నున్న యా యారంభ పద్యములలో వానిలో ప్రధాన పాత్ర యగు నర్జునునికి సంబంధించి యున్న 'పాండవేయ మహదార్తిం బాపి; బృహన్నలాదులకు కష్టాజ్ఞాత సంవత్సరంపు విభ్రాంతియు లేకయుండఁ దగ మాయించెన్' అను పదములు కలవు. ముక్తావళిలోని పద్యములో కథావస్తువుయొక్క కాని పాత్రలయొక్క కాని సూచన యీషత్తైనను లేదు. పోనీ కథా సూచన యున్నచో ప్రస్తావన యనియు లేనిచో మంగళమను నర్థము గల నాంది యనియు వ్యవహరించి రనుకొందమన్న సావిత్రీ చిత్రాశ్వము, పాదుకా పట్టాభిషేకము మొదలగు నాటకములలో నాందీ సహితమయిన సూత్రధార నటీ సంభాషణకు మొదటనే ప్రస్తావన యను పేరు కలదు. ఒక సావిత్రీ చిత్రాశ్వమునఁ దక్క నాందీ పద్యము తరువాత 'నాంద్యంతమున సూత్రధారుఁడు' మొదలగు సూచన సయితము లేదు. ఇందు మొదటి దానిలో నేక గేయాంతరితమయిన స్తుతి పద్యద్వయము కలదు. కాని దీనిలో నా నాటక కథకు సంబంధించిన సూచన యేదియును లేదు. పాదుకా పట్టాభిషేకము మొదటఁ గల పద్యములో రామ లక్ష్మణుల ప్రశంస కలదు.

విషాద సారంగధరములో 'సారంగావనుఁడను' సమాసములో సారంగధరుని నామము సూచింపఁ బడుచున్నది. చిత్రనళీయములో ననుసరింపఁబడిన పద్ధతియే వేఱు. మొత్తము మీఁద ఆచార్యులుగారు నాందీ ప్రస్తావనలతో నారంభించిన నాటకముల కంటె వానిని పరిహరించి కేవల కథతో ప్రారంభించిన నాటకముల సంఖ్యయే హెచ్చు. అవి వ్రాయఁబడిన ఒకటి రెండు నాటకములలో సయితము సంస్కృత లాక్షణికులు నిర్దేశించిన క్రమము సమగ్రముగా కానరాదు. పైఁగా దానిని మనఃపూర్వకముగా నుల్లంఘించి స్వతంత్రించిన చోట్లు కూడ పెక్కు కలవు. నాందీ పద్యముల లోను ప్రస్తావనలోను నాటక వస్తు సూచనాదులు లేకపోవుట యటుండ, సంస్కృత లాక్షణికు లుండవలెనని చెప్పిన ఋతువర్ణనమును గూడ వీరు విడిచివైచిరి. ఒక్క సావిత్రీ చిత్రాశ్వములో ఋతువర్ణనము కలదు. కాని రసానుగుణముగా శరద్వసంతములలో నొకదాని వర్ణన యుండవలెనని లాక్షణికులు చెప్ప నిందు హేమంతఋతువు వర్ణింపఁబడినది. విషాద సారంగధరములో నటి పూర్వ పరిచయమును పరిత్యజింపలేక 'ఏ ఋతువును గూర్చి గానము చేయుదునని' సూత్రధారు నడుగ నాతఁడు 'ఏ ఋతువును గూర్చియు వలదు. మన కిప్పుడు ప్రస్తుతమయి యున్న రాజ నరేంద్రుని సభను వర్ణింపుమ'ని చెప్పెను. ఇందు నాటక పాత్ర ప్రవేశ సూచనముతో పాటు, ఋతువర్ణ నాదికమయిన ప్రాచీనాచారోల్లంఘనము కూడ స్పష్టముగా గోచరించుచున్నది. ఇది లాక్షణిక మతము నన్యాపదేశముగా నధిక్షేపించుట యన్నను దప్పులేదు*

---

* "ఎంత శుష్కములైనను నాందీ ప్రస్తావనలకుఁ బ్రయోజనములు లేకపోలేదు. మొదటిది గ్రంథకర్తయొక్కయు నాటక కథ యొక్కయుఁ బరిచయము కలిగించి రాఁబోవు పాత్రముల స్వరూపమును సభ్యులకుఁ దెల్పుట. ఈ పని యిప్పుడు ప్రత్యేకముగాఁ గర పత్రముల మూలమునను గథాసారాంశముల మూలమునను గొంత జరుగుచున్నది. ఇంతకంటెను ముఖ్యమగు ఫలమేమన వచ్చి కూర్చున్న సభ్యుల మనోధర్మములకుఁ గొంత నెమ్మది కలిగించి కుదురుగా నుండఁ జేయుట, నాటకమును జూడవచ్చిన వారి చిత్తవృత్తి యొక్కొక్కరి దొక్కొక్క విధముగా నుండును...ఇట్టి వివిధ మనోవృత్తులు గల సభ్యులు నిర్ణీతమైన కాలమునకు సరిగా గంట వాగి తెర యెత్తగానే నాటకమందలి కథా ప్రవాహమును గ్రహించి తన్మయులై చప్పుడు చేయక గంభీరముగా నుండుట సాధ్యము కాదనుట తెలియని విషయము కాదు. ఇట్టి స్థితిలో కొన్ని పద్యములు పాటలు మాటలు గల్గి కాలుగంట ప్రొద్దు కాలక్షేపము చేయుటకుఁ బనికివచ్చు ప్రస్తావన సభ్యులను గొంత స్వాధీనమునకుఁ దెచ్చుకొని వారి చిత్తవృత్తులను నాటకాభిముఖముగాఁ జేయఁగలదు. మన కవి ప్రస్తావనను వదలెను గాని పై ప్రస్తావన కార్యమును నిర్వహించు మఱియే కార్యమును గాని యాశ్రయించినట్లు తోఁపదు" శ్రీ రా. అ. కృ. శర్మగారి నాటకోపన్యాసములు పుట 80 ఇట్లే సామాజికులకు నాటక కాలమును రసమును దెలియుటకై లాక్షణికులు ప్రస్తావనలో ఋతువర్ణనము విధించియుందురు. నిజమున కందాక్షేపణీయాంశ మేదియు లేదు.

కవి ప్రశంసయు కావ్య ప్రశంసయు కొలఁదిగనో గొప్పగనో సప్రస్తావనకములయిన వీరి నాటకములం దన్నిటను గోచరించుచున్నది. ప్రస్తావనలో సూత్రధారుఁడు నటీనట విదూషక పారిపార్శ్వకాదులలో నొక్కనితో సంభాషించుచు కవి ప్రశంసయు, కావ్య వస్తు సూచనయు, ఋతువర్ణనయు, పాత్ర ప్రవేశ సూచనయుఁ గావింపవలయు నని సంస్కృత నాటక లక్షణము చెప్పుచున్నది. ఆచార్యులుగారు తమ ప్రథమ నాటక మయిన చిత్రనళీయములో ప్రస్తావనను రచించినను, లక్షణానుసారముగా సూత్ర ధారునిఁ గాని నటీ విదూషకాదులను గాని ప్రవేశపెట్టక జయ విజయులను పౌరుల సంభాషణతో దానిని కొనసాగించిరి. ఈ పౌరుల సంభాషణమున నాంధ్రము గూడ నాటక రచనానుకూలమయిన భాషయే యనియు, పూర్వాంధ్ర కవులు దృశ్య కావ్య రచనకుఁ గడంగక పోవుటకు భాషాన ర్హతయే కారణము గాదనియు, వేడుక కొఱ కును నీతి బోధనము కొఱకును నాటక ఖేలన మొనరించువారు సంఘ బాహ్యులు కారనియు, ప్రజాభిరుచి ననుసరించి నాటకములలో వృత్త వాక్యములతోపాటు గీత ములు కూడ వ్రాయవలసి వచ్చెననియు సూచించి కవి తమ యాంధ్ర నాటక నటనోద్య మమునకు బలవంతమయిన పునాది యేర్పఱుచుకొనిరి. ఇందు కవి ప్రశంసయే కాక నాటక ఘంటా నినాదశ్రవణముతో నాటకారంభము కూడ సూచింపఁబడినది. ఇది సంస్కృత లక్షణమును ధిక్కరించి యేగిన క్రొత్తపోకడయే యయినను సర్వధా నటీ సూత్రధారుల సంభాషణము యొక్క ప్రయోజనమునే సాధించుచున్నది. ఇంక ఋతువర్ణనాదుల యభావము ఆచార్యులవారి నాటకము లన్నిటను సమానమే.

సావిత్రి చిత్రాశ్వ మాచార్యుల వారి నాటకములలో రెండవది. ఇందుమాత్రము నాందీ ప్రస్తావనలు కొలఁదిపాటి మార్పుతో సంస్కృత లక్షణము ననుసరించుచున్నవి. నమస్క్రియా పూర్వకములయినట్టి రెండు పద్యముల తరువాత నటీ సూత్రధారులు ప్రవేశించి ప్రస్తావన నారంభింతురు. ఇందు కవి ప్రశంసయు నున్మఖీకరణ మని చెప్పఁదగిన రసాది చర్చయు కలదు. ఋతువర్ణనము కలదు కాని యిందు హేమం తము వర్ణింపఁబడినది. "ఇహిహీ యనఁ జేసె విదూషకుండనన్" అను ఋతువర్ణ నాంతము నందలి వాక్యముచే నాటకమున విదూషకుఁ డయిన సుమాలి ప్రవేశము సూచింపఁబడినది. ఆచార్యులుగారు తమ తొలితటి నాటకములయందే యీ నాందీ ప్రస్తా వనల రచించుటయు క్రమముగా వాని నుజ్జగించుటయు చూడ మొట్టమొదటనే వీని నుల్లంఘించుట ప్రజాదరణఁ బడయుట కాటంక మగునేమో యని యెంచి వానిని రచించియు, తమ నాటకములు సుప్రసిద్ధము లయిన తరువాత రచింపఁబడిన నాటకము లలో వానిని సర్వయముగా పరిహరించిరని చెప్పవచ్చును. అదియుఁ గాక ప్రదర్శ

నాపేక్షయే ప్రధానోద్దేశముగాఁ గల నాటకములలో నీ నాందీ ప్రస్తావనల కంత గౌరవము లేదు. ఏలయన తఱుచు నాటక ప్రదర్శన సమయమున కవి యెంత దీర్ఘమైన ప్రస్తావనను వ్రాసినను దానిని విడుచుటయే నటకుల యలవాటు.

## II

పూర్వ రంగము :

ఆచార్యులు గారు తమ నాటకములు రెంటిలో పూర్వరంగ మను నొక ప్రక్రియను వాడిరి. కాని ఈ పూర్వరంగమునకును సంస్కృత నాటక లక్షణమునందలి పూర్వ రంగమునకును విశేష తారతమ్యము కలదు. అస లీ రెంటికిని నామైక్యము వినా యెట్టి సంబంధమును లేదు. సంస్కృత లక్షణము నందలి పూర్వరంగము నేపథ్యమున నిర్విఘ్నముగా నాట్య ప్రదర్శనము జరుగుటకై రూపకాది యందు చేయఁదగిన కృత్య విశేషము. దీనికి ప్రత్యాహారాదికము లయిన యంగములు పెక్కు కలవు. వీనిలో నితరముల మాట యెట్లున్నను నాంది యను నంగము విఘ్నోప శాంతికొఱకై యవశ్యముగాఁ జేయఁదగినది. భరతుఁడు నాట్యశాస్త్రములో నీ పూర్వ రంగమును గూర్చి మిక్కిలి విస్తరించి వ్రాసెను. కాని తరువాత ధనంజయుఁడు గాని విశ్వనాథుఁడు గాని దీని వివరములు చెప్పుటకై ప్రయత్నించి యుండలేదు. పైఁగా విశ్వనాథుఁడు తన నాఁటికి పూర్వరంగమును ప్రదర్శించు నాచారము లేదని స్పష్టముగా చెప్పివైచెను. లభ్యము లయిన సంస్కృత నాటకములు పెక్కింటిలో నీ పూర్వ రంగమునకు ముఖ్యాంగ మయిన నాంది తప్పఁ దదితరాంగము లేవియు కానరావు. ఆశీరాది పూర్వక మయిన యా యారంభశ్లోకము పూర్వ రంగములోనిదా లేక ప్రస్తావన లోనిదా యను విషయమున నభిప్రాయ భేదములు కలవు. భాసుని నాటకములలో "నాంద్యంతే సూత్రధారః ప్రవిశ్య" అను సూచన నాటకారంభమునందే యుండుటయు దాని తరువాతనే యీ మంగళ శ్లోకము వ్రాయఁబడి యుండుటయు నీ భేదాభిప్రాయ మునకు హేతువులు. కాని పెక్కు నాటకములలో నీ మంగళ శ్లోకము తరువాతనే సూత్రధారుఁడు ప్రవేశించి ప్రస్తావనను సాగించుటచేతను, సాహిత్య దర్పణాదులలో నాంది పూర్వ రంగాంగమే యని స్పష్టముగా చెప్పఁబడి యుండుటచేతను, ఈ భేదమును మన మంతగా పాటింప నవసరము లేదు. ఎట్లయినను సంస్కృత లాక్షణికులు సూచించిన యీ పూర్వ రంగము సూత్రధారాది కుశీలవ బృందముచే రంగ విఘ్నోప శాంతికై యొనర్పఁబడు నొక క్రియా విశేష మంతియ కాని యిది నాటక వృత్తమునం దొక భాగము కాదు. కాఁగా నాచార్యులుగారు సారంగధర పాదుకా పట్టాభిషేక నాటకములలో వాడియున్న పూర్వ రంగమునకును దీనికిని నెట్టి పోలికయు లేదని చెప్పవచ్చును.

విషాద సారంగధర నాటకములోని పూర్వరంగ మొకచే ప్రకరణముగను, పాదుకా పట్టాభిషేకములోని పూర్వ రంగము రెండు ప్రకరణములుగను వ్రాయఁబడి సంవాద రూపమున (in dialogue form) నున్నవి. మొదటి నాటకములోని పూర్వ రంగము ప్రస్తావనకు పూర్వమే వ్రాయఁబడి యున్నది. రెండవ దానిలో నది ప్రస్తావనకు తరువాత నున్నది. ఈ రెండు పూర్వ రంగము లందలి కథయు నా యా నాటకములలోని ప్రధాన పాత్రల శీలములలో కవి గావించిన మార్పుతో సంబంధించి యున్నవి. సారంగధరలో హిరణ్య విభావసులను నా యిరువురు బ్రాహ్మణులు దేశ దేశములఁ ద్రిమ్మరి యొకడు చిత్రాంగి పటమును, రెండవ యతఁడు చంద్రకలాదేవి పటమును దెచ్చిరి. అంతదనుక నున్న భార్యలతోనే తృప్తుఁడయిన రాజరాజు చిత్రాంగి యపూర్వ సౌందర్యము నీక్షించి యామెను తాను వివాహమాడుటకును, చంద్రకళను సారంగధరుఁడు వివాహమాడుటకును నిశ్చయించి విభావసుని బంపెను. చిత్రాంగి సారంగధరుని రూప గుణాదులఁ గూర్చి యదివఱకే వినియుండుటచే నాతని వలచి హిరణ్యుఁడు తమ యూరు వచ్చినప్పుడు తనకు సారంగధరునిపైఁ గల ప్రేమోత్కర్ష నాతనికిఁ దెలిపి తన్ను వివాహమాడునట్లుగాఁ జేయుమని ప్రార్థించి యుండెను. విశ్వాస ఘాతుకుఁడయిన యా బ్రాహ్మణుఁ డట్లు చేయకపోవుటయే కాక రాజరాజు నానతి ప్రకార మామె నతఁడే వివాహమాడునట్లు నిశ్చయము చేయుటకై యరిగెను. చిత్రాంగి తండ్రి రాజరాజున కాతంరితుఁడును సామంతుఁడును నగుటచే నాతని యాజ్ఞ నుల్లంఘింపలేక యాతఁడు వృద్ధుఁడయినను తన కుమార్తె నాతని కిచ్చి వివాహము చేయుట కంగీకరించెను. తండ్రి మాట కెదురాడఁజాలని చిత్రాంగి నిష్కృవముగా తన వలపంతయు సారంగధరునిపైనే యున్నను, ముదుసలియగు రాజ రాజును పెండ్లియాడవలసి వచ్చెను. ఆమె శరీరము మాత్రము బలవంతముగా రాజ రాజు నధీనమయ్యెను. కాని ఆమె హృదయము సారంగధరునందే యనురక్తి గల్గి యుండెను. ఇట్టి పరిస్థితులలో నామె సారంగధరునికి వరుసకు తల్లియే యయ్యును నాతఁడు తన యింటికి కరుదెంచిన సమయమున, నంగజాకేళికై బలాత్కరించుటలో దోషమేమియు లేదని చూపుటకై యాచార్యులుగారు ప్రయత్నించిరి. మానవ ధర్మము ప్రకారము తల్లి యెట్టి పరిస్థితులలో నయినను కుమారుని వలచుట నీచాతి నీచమనుట నిర్వివాదమే యయినను తా మనఃపూర్వకముగ వలచిన సారంగధరునిచే కాక ముదుసలి యయిన రాజరాజుచే బలవంతముగా పరిణయింపఁబడిన యువతి చిత్రాంగి. సారంగధరునిపై మరులుకొనుట కీ పూర్వ రంగము కొంచెము తావొసంగుచున్నది. ఈ పూర్వ రంగమే లేనిచో చిత్రాంగి చర్యను సమర్థించుట దుస్సాధ్యము.

ఇట్లే పాదుకా పట్టాభిషేకములోని పూర్వ రంగము కైకేయి శీలమును, గొంత వఱకు సమర్థించుచున్నది. రామాయణమున నామె రాముని నరణ్యమునకుఁ బంపుటకు రాజ్యలోభమే ప్రధాన కారణము. మంథరా వాక్యములు విని యందామె పట్టుదలతో నిర్దయముగా నా క్రూర కార్యమును సాధించెను. నాటకమునఁ గైక సహజ మృదుల హృదయగాఁ జిత్రింపఁబడినది. ఆమె యందా క్రూరకృత్యము నొనరించుటకు దశరథునికి ముని దంపతు లొసంగిన శాపమును రాముని యందలి యత్యనురాగముచే దశరథుఁడు చూపిన యనురాగ హైన్యమును ముఖ్య కారణములు. ఈ విధముగాఁ బూర్వ రంగము నందలి శాపకథ కైకేయీ శీల సమర్థనమునకుఁ గొంతవఱకుఁ దోడ్పడుచున్నది. మూలమునఁ గూడ నీ శాపవృత్తాంతము కలదు కాని దానికింత ప్రాధాన్యము లేదు. దీనికిఁ దోడు కవియెడ నెడఁ గైకేయి మృదు స్వభావమును జాల చక్కఁగా వర్ణించెను. ఈ రెండును గలసి యామెను పూతురాలిగా నొనర్చి సామాజికుల సానుభూతి నామెయెడకుఁ ద్రిప్పఁజాలినవి.

ఒక్కొక్కప్పుడు విష్కంభ ప్రవేశ కాదులలోని యితివృత్తమును ఇట్లే నాటకస్థములయిన కొన్ని పాత్రల శీలములను సమర్థించుట కుపయుక్తమగుచుండును. శాకుంతలములో నాలుగవ యంకమునకు మొట్టమొదట నున్న విష్కంభ సూచితమయిన దుర్వాసశ్శాపము భారతములో నవద్యముగా నున్న దుష్యంతుని శీలమును నిరవద్యముగా నొనర్చుచున్నది అట్లే యీ పూర్వ రంగములలోని వృత్తమును గూడ నాటకము మొదటనే విష్కంభము ద్వారా యేల తెలియఁజేయరాదు ? దీనికి ముఖ్యమయిన కారణ మొండు గలదు. విష్కంభాదులలోని వృత్తము సాధారణముగా నాటక కథ యావరించిన కాలమునందే యిమిడి యుండును. లేదా దానికి నవ్యవహిత పూర్వమై యుండవలయును. కాని యందలి కాలము నాటక కాలమునకు పూర్వము దవీయముగా నుండరాదు. అట్లున్నచో నీ విష్కంభమునకును నాటకము నందలి అంకమునకును నడుమ వ్యవధాన మేర్పడుటచే. నాటకమునందలి సంవిధానములు విచ్ఛిన్నములయి అతుకని యట్లు కానిపించును. విష్కంభములో చెప్పఁబడు కథా కాలము ఒకవేళ నంకారంభ కాలమునకు పూర్వమై యుండుట కవకాశమున్నను ఆ పాత్ర లా కాలమునకే చెందిన వారుగా నుండవలెను. సంస్కృత నాటకములలోని విష్కంభాదులన్నియు నీ విషయమునకు దృష్టాంతములుగానే యుండును. పాదుకా పట్టాభిషేకములోని పూర్వ రంగములోని కాలము దశరథుఁ డనపత్యుడయి యున్న నాఁటిది. అందలి కథకును నాటక కథ యయిన కైకేయి శీలమునకును కొంత సంబంధమున్నను అప్పటి కాలమునకును నాటకారంభ కాలమునకును కొన్ని యేండ్ల

ధము కల్పింపఁబడినది. కాని యది కేవల హాస్య రసమునకే కాని కథా విస్తృతికి పనికిరాదు. దాని యునికి కొక్కటే హేతువు కానవచ్చుచున్నది. అర్జునుఁడు తనంతఁ దా వలచి వచ్చిన దేవ వేశ్య నూర్వశిని విసర్జించెను. కీచకుఁడు కామాంధుఁడై పతివ్రత యయిన పాంచాలి నాశించెను. అర్జునుఁడు తన సత్ప్రవర్తనకు ఫలితముగా నజ్ఞాతవాసమున కుపరించు నా రూపమును గాంచెను. కీచకుఁడు భీముని ముష్టి ఘాతముల కెరయయి మృతుఁడయ్యెను. ప్రతియోగముచే (contrast) నర్జున కీచకుల శీలముల తారతమ్యమును జూపి అర్జునుని సత్ప్రవర్తనము ననుమతింపఁ జేయుటకై కవి దీనిని ప్రవేశపెట్టియుండును. అభిమన్యుఁ డుత్తరను వివాహమాడు సూచన భారతమున మొదట కానరాదు. అది యా సమయమున యాదృచ్ఛికముగా సంభవించెను. నాటక కవి వారి యనురాగ వృద్ధిని కూడ క్రమముగా ప్రదర్శించుట సహజముగ నున్నది కాని అర్జునుని శాపముతో నారంభించిన యీ నాటక మా శాప విమోచనముతో ముగియుట లెస్స కాని ఉత్తరాభిమన్యుల వివాహముతో ముగియుటలో నంత శిల్ప గరిమ గోచరించుట లేదు.

మోద భేద విషయ పరిమేళనమును, ఉప కథా రచనయు నట్లుండ కవి అనవసరముగా నాటకములలో ప్రవేశపెట్టిన భాగములు కొన్ని కలవు. పాంచాలీ స్వయంవరమున భీమ బకాసురుల యుద్ధమును, ప్రమీలార్జునీయమున కర్ణ వధ విషయమైన విచారమును, బృహన్నల నాటకమున హలాయుధుని వ్యాపారమును, చిరకారిలో రెండవ యంకమునందలి విట ప్రసంగమును నిట్టివే. ఇవి లేకపోయినచో నా నాటకముల గౌరవమునకు ఎట్టి భంగమును వాటిల్ల దనుట నిజము. వీనిలో తుది రెండును కవి కల్పితములే కాని మొదటి రెండును మూలమునుండి తెచ్చుకొనినవే. మూలమున కానవచ్చు నా విషయములను సంపూర్ణముగా తొలఁగించు నిచ్ఛ లేక కవి వానిని కూడ ప్రదర్శించి యుండును.

కవి తాను నాటకములు వ్రాయుటయే కాక తానే ప్రధాన పాత్రల ధరించు నలవాటు కలవాఁడు. ఆ కారణముచే నీయన నాటకములో కేవలము ప్రజాభిరుచికై రచింపఁబడిన రంగములును పద్ధతులును కొన్ని కలవు. కవి 'ధీర నాటకములలో పాటలకు తావు లేదని తా నొప్పుకొనినను ఆ ప్రాంతములవారు సంగీతాభి రుచి కలవారగుటచే వానిని తప్పక చేర్పవలసి వచ్చె' నని చిత్రనళీయ నాటక ప్రస్తావనలో తెల్పెను. Shakespeare నాటకములలోని బహు యుద్ధ రంగము లా నాఁటి పామర జనుల యభిరుచి ననుసరించి వ్రాయఁబడినవే యని విమర్శకు లనుచున్నారు. నిజ

ముగా నాటకముయొక్క ప్రసిద్ధిని, వ్యాప్తిని వాంఛించు కవి కేవలము సారస్వత దృష్టినే కాక యిట్టి ప్రయోగ దృష్టిని కూడ కలిగియుండవలెను. లేకున్నచో నా నాటకము కొందఱకు మాత్రమే రుచించును. కాని విమర్శకుఁడు నాటకమును శిల్పదృష్టితోఁ బరీక్షించును గాన నట్టి దోషములను దోషములుగానే యుద్ఘాటించును. ఆచార్యులు గా రీ యుక్తి నెఱింగిన వారగుటచే సామాన్య జనుల సంతోషార్థము మాత్ర ముపకరించు కొన్ని రంగముల తమ నాటకములలో చేర్చిరి. మోహినీ రుక్మాంగద నాటకములో రంభాదులు బ్రహ్మ సభలో నాట్యము చేయవలసి వచ్చుటయు, ప్రహ్లాదుని పర్వతాదుల నుండి పడవేయుటయు, ప్రమీలార్జునీయములోని యువతులతోడి ప్రద్యుమ్నాదుల పోరాటముయొక్క వర్ణనమును నిట్టివే.

నాటక వస్తువు సూచ్యమని దృశ్యమని ప్రాచ్య లాక్షణికులు రెండు నియమములు కావించి అనుచితములును, నీరసములును, ఉద్వేగకారులునైన విషయములు విష్కంభాద్యర్థోపక్షేపకములచే సూచింపఁబడవలయునే కాని ప్రదర్శింపఁబడ రాదని నిషేధించిరి. పాశ్చాత్యులలో కూడ Horace, Dryden మొదలగు వా రిట్టి నిషేధముల కొన్ని కావించిరి కాని కవు లెవ్వరును వానిని పాటించియుండలేదు. Shakespeare వధాదులను రంగము మీఁదనే ప్రదర్శించెను. ఆచార్యులుగారు నిట్లే ఆలింగన చుంబనాదులను, వధను రంగము మీఁదనే ప్రదర్శించిరి. ఇట్టి వాని కాయన యే నాటకమైనను దృష్టాంతమే.

పాశ్చాత్యులలో నంకము లిన్ని యుండవలెనను నియమము లేదు కాని పంచ కార్యావస్థల నిర్ణయముచే పూర్వమునుండియు నా నాటకములలో నైదంకములే యుండుట కానవచ్చుచున్నది. ఇప్పటి కొన్ని నాటకములలో నాలుగంకములును మూఁడంకములును కూడఁ గలవు. Shakespeare నాటకములలో సర్వత్ర యైదంకములే కలవు. ప్రాచ్య లాక్షణికులును నాటకములో నైదు మొదలు పది యంకముల వఱకు నుండవచ్చునని నియమించిరి. కాశీనాథు లీ నియమమును పాటించియే యున్నారు. అంకము లైదింటికి తక్కువగా నున్న రూపకములు కూడ నందు కలవు కాని అవి నాటికాది ప్రభేదములు. ఆచార్యులవారి నాటకములన్నియు సాధారణముగా నైదంకములు కలవియే. ఒక్క వరూధినీ సావిత్రీ నాటకములలో మాత్రము మూఁడే యంకములు కలవు. ఈ విధముగా అయిదంకముల రచించుటందుఁ గూడ నాచార్యులుగారు పాశ్చాత్య పద్ధతినే యనుసరించి రనవచ్చును. ఏలయన యీయన యే నాటకమునను అయిదంకములకంటె నెక్కువగా రచించియుండలేదు.



# 8. ఆంధ్ర నాటక పితామహుని పాత్ర పరిపోషణము

## I

నాటకాంగములలో పాత్ర చిత్రణము మిక్కిలి ముఖ్యమయినది. నాటకమున శిల్ప కౌశలము సర్వతోముఖముగాఁ గానిపించుచున్నను, సన్నివేశములు మిక్కిలి మనోహరములుగ నున్నను, పాత్రలు సుస్పష్ట రేఖలతో చిత్రింపఁ బడనిచో నా నాటకము పాఠకుల హృదయముల నాకర్షింపఁ జాలదు. ఒకవేళ అది కథా సన్నివేశముల యపూర్వ రామణీయకముచే వారికిఁ దాత్కాలి కాభిరుచి కలిగించినను, చిరకాలము వారి హృదయములలో నిలువఁ జాలదు. ఏలయన నీ సన్నివేశ సంఘట చాతుర్యము రచనా రామణీయకము లోనగునవి శ్రవ్య దృశ్య కావ్య సాధారణ గుణములే.

నాటకము యొక్క యౌచిత్య సంపుష్టికిఁ బాత్రస్వభావముల పరిణామ చిత్రణమే మూల హేతువు. ఒకపాత్ర సద్గుణ గరిష్ఠమై యుండియుండి యాకస్మికముగాఁ గొన్ని దౌర్మార్గ్య చిహ్నములు ప్రదర్శించుట కాని యాది నుండి దుష్టముగా నుండి హఠాత్తుగా శిష్టముగా మాఱుట కాని మిక్కిలి యసహజముగా నుండును.* అందుచే నాటక కవి మొట్టమొదటనే పాత్రల దుష్ట శిష్ట స్వభావములు నిర్ణయించి వారి యా గుణములనే తుదిదాఁకఁ బరిపోషించుచు రావలెను. దానికి వైరుధ్యము సంభవించినచో నాటకము యొక్క సమష్టి సౌందర్యము విహతమై దాని యనురంజకత్వమునకు భంగము కలుగఁజేయును.

కొందఱు నాటకమున కార్యమున (action) కున్నంత ప్రాధాన్యము పాత్ర పోషణమునకు లే దందురు. Henry Arthur Jones చెప్పినట్లు సామాజికులు తొలుఁదొలుత నాటకమున నపేక్షించునది కథా రమ్యతయే. కాని కథా సన్నివేశాదులు పాత్ర చిత్రణముతో సంబద్ధములై యుండకపోయినచోఁ గేవల బాలోచితములై తేలికగా కానిపించును. నిజము పరిశీలింప నవి పాత్రల క్రమాభివృద్ధి యొక్క రెండవ ముఖముగా నుండవలెను. మానవ స్వభావమును గాని పాత్ర పోషణ కౌశల

*కాని కొందఱు దుష్ట శిష్ట భావములు రెంటికి నాకరము లగు ద్వంద్వ ప్రకృతులుండుట కలదనియు వానిలో హఠాత్పరిణామము కొన్నియెడలఁ గలుగవచ్చు ననియుఁ జెప్పుదురు. అట్టిది కల్గిన ఘట్టమున నాశ్చర్య మాహిల్ల కుండుటకై మొదటి నుండియుఁ గవి దానికిఁ దగిన యుపపత్తిని బ్రతిపాదించు కొనవలయును.

మును గాని ప్రదర్శింపని వట్టి కథా నిర్వహణము నిస్సారమై విసుగుదలను పుట్టించునే కాని రక్తి కలిగింప నేరదు. ఆంగ్ల వాఙ్మయమున Shakespeare నాటకముల కట్టి యగ్రస్థాన ముండుట కాతఁడు వానిలో కావించిన స్త్రీ పురుష వ్యక్తుల భిన్న భిన్న స్వభావముల నిశితమైన చిత్రణమే కారణము. నాటకము యొక్క ప్రసిద్ధియు, చిరస్థాయిత్వమును, నీపాత్ర చిత్రణ నైపుణము మీఁదనే చాలవఱ కాధారపడి యుండును.

నాటకమున కథలో వలెనే పాత్రచిత్రణమునఁ గూడ సంక్షేపము (brevity) మూల సూత్రముగా నుండవలెను. నవల రచయితకు కాల దేశాద్యైక్యములతో నంత పనిలేదు. అతఁడు తన యిచ్ఛవచ్చినట్లు స్వల్పముగనో యధికముగనో పాత్రల శీల స్వభావాదులను చిత్రించును. కాని నాటక కర్త కట్టి స్వాతంత్ర్యము లేదు. అతఁడు సంక్షిప్త స్థలములోనే వివిధ పాత్రల విస్పష్ట రేఖల చిత్రణము కావింపవలెను. మఱియు నాటకమున కార్య వియుక్తమయిన పాత్ర చిత్రణమునకు స్థానమే లేదు. నాటక కర్త పాత్ర శీల చిత్రణ కాలమున కథా సన్నివేశాదులతో వానికిఁ గల సంబంధమును గూడ దృష్టిపథమునం దుంచుకొనవలెను. Shakespeare రచించిన నాటకముల లోనికెల్ల Macbeth సంక్షిప్త కార్య నిర్వహణమునకు ఆదర్శముగా నున్న దని పలువురు విమర్శకుల తలంపు. ఇట్లే ఆ నాటకము సంక్షిప్త పాత్ర చిత్రణమునకు (condensed treatment of character) కూడ మంచి నిదర్శనము. Macbeth దంపతుల నాతిదీర్ఘ సంభాషణములలోనే నాటక కార్యమున కావశ్యకములయిన వారి స్వభావములు సుస్పష్టముగా వివరింపఁబడినవి. Macbeth నాటకమువలెనే Shakespeare ఇతర నాటకములు గూడ నీ విషయమున నాదర్శప్రాయములే. నాటకమున మనకు రక్తి కలిగింపవలసినది యీ సంక్షేప భావమే కాని పాత్రాభినయ (part) కాలము యొక్క దైర్ఘ్యము మాత్రము కాదు.

నాటక పాత్రల ప్రకృతిలో గుణదోషములు బహుళములుగా నుండవచ్చును. కాని నాటక కవి యా గుణదోషముల నన్నింటిని తన నాటకమునఁ బ్రదర్శింప వలెనను నియమము లేదు. అతఁడు నాటక కార్యముతో సంబంధించి దాని గమనమునకు తోడ్పడు గుణ దోషములను మాత్రము చిత్రించినఁ జాలును. నాటకమున నే పాత్ర యే మాట మాటాడినను నాటకము యొక్క సమష్టి (whole) నిర్మాణముతో సంబంధించియే యుండవలెను.* పాత్ర చిత్రణమున కతి ప్రాధాన్యము నొసంగు కొందఱు

*Prof Tolman says "Dramatic criticism is inclined to insist that only those characteristics of the hero—or indeed of any important personage- should be made prominent which really influence the course of the action and these characteristics should be unmistakable.

నాటక కర్తలు నాయకాదుల గుణము లన్నిటిని-అవి నాటక కార్యముతో సంబంధించి యున్నను లేకున్నను - ప్రదర్శించుట కలదు. ఇట్టి యతి చిత్రణము (Over - characterisition) సంస్కృత నాటకములలో నెక్కువగాఁ గానిపించును. వారికి లాక్షణికులు చెప్పిన నాయకాది గుణ శీలములపైనే దృష్టికాని యవి యెంతవఱకు నాటక కార్యమున కావశ్యకములను విషయముపై శ్రద్ధ యున్నట్లు తోఁపదు. ఇట్లే Shakespeare Hamlet నాటకములో నాయకుని పాత్ర నాటక వస్తు విస్తృతి యావశ్యకము నతిక్రమించి చిత్రింపఁ బడినదని విమర్శకులు తలంచుచున్నారు.

నవల రచయిత వలె నాటక కర్త యప్పు డప్పుడు తానై పాత్రల గుణ శీలాదులపై వ్యాఖ్యానము గావించుటకు వీలులేదు. అతఁడు కథాచలనము ద్వారా, నాటక పాత్రల సంభాషణము ద్వారా, మాత్రమే తన నాటకములో స్త్రీ పురుష వ్యక్తుల స్వభావములను వ్యక్తము చేయవలెను. కథా కార్యము పాత్రపోషణమున కేవిధముగను తోడ్పడఁ జాల దను వాదము నిలుచునట్టిది కాదు. ఏలయన Hudson చెప్పినట్లు కార్య మనుటలో పాత్రపోషణము కూడ నంతర్భూతమైయే యుండును.* సమ, విషమ, పరిస్థితులలో కథ సాగుటలోనే నాటకస్థము లయిన పాత్రల నైతిక గుణ శీలాదులు వ్యక్తములై సామాజికుల హృదయముల నాకర్షించు చుండును. ఇట్లని నాటక కార్య మొక్కటే పాత్రల గుణ శీల వ్యక్తీకరణమునకు చాలు నని యను కొనరాదు. కేవల మభినయము మూగ నాటకములలో వలె పాత్ర శీల ప్రకాశనమున కంతగా తోడ్పడఁ జాలదు. నాటకమున కార్యము సంవాద మూలమున ముందుకు సాగుచుండును. ఈ సంవాదము లేకపోయినచో నాటక కార్యమే లేదు.

సంవాద మూలమున పాత్ర స్వభావముల వ్యక్తీకరించుట రెండు విధములు. నాయకాది పాత్ర లితరులతో సంభాషించు తటి వారి పల్కుల ననుసరించియే వారి స్వభావములు సైతము వెలువడుచుండును. లేక యే రెండు పాత్రలు సంభాషించు సమయమున నయినను వా రితరులను గూర్చి చేయు ప్రసంగము ద్వారా నాటకస్థము లయిన యితర పాత్రల స్వభావములు వ్యక్తము లగుచుండును. ఈ రెండు పద్ధతుల లోను సంభాషణము వినినంత మాత్రమున పాత్రల శీల స్వభావాదు లిట్టి వని నిర్ణ యించుకొనరాదు. దాని యాథార్థ్యమును నాటకము యొక్క సామాన్యావరణమును నిక షమున నొరసి చూడవలెను. ఆ సామాన్య కథాగమనము సైతము అట్టి నిశ్చయము నకే తా వొసంగినచో దాని యాథార్థ్యమును నిరాటంకముగా విశ్వసింపవచ్చును.

*Action connotes character and implies it.

అంతేకాని పరిసర పరిస్థితుల గమనింపకయే కేవల పాత్రల సంభాషణమును బురస్కరించుకొని నాటక వ్యక్తి స్వభావములను నిర్ణయింప రాదు. ఏలయన పాత్రలుతా మితరులతో మాటాడు నప్పుడు తమ సహజ ప్రకృతిని మఱుగు పుచ్చవచ్చును. సాధారణముగ విషాద నాటకములలో దుష్టపాత్ర (Villians) లిట్లే చేయుచుండును. లేక నాటకస్థ పాత్ర లా నాటకము నందలి యితర పాత్రలనుగూర్చి ప్రసంగించు నప్పుడు పూర్వ ద్వేష రాగాదుల ప్రభావము నడఁచుకొనలేక నిర్నిమిత్తముగా కొందఱను గూర్చి ఎక్కువ చెడ్డగాఁ గాని, ఎక్కువ మంచిగాఁ గాని ప్రసంగింప వచ్చును. నాటక కర్త సాధారణముగా తన నాటకములో రాఁబోవు పాత్రల వివిధ స్వభావముల నాదియందే యవగాహన చేసికొని యుండును గావున, వాని మంచి చెడ్డల సన్నలను నాట కాదియందే కొంచెము గోచరింపఁ జేయుచుండును. ఒక్కొక్కప్పు డన్య పాత్రల సంవాదము ద్వారా నాటక కవి యొక చక్కని ప్రయోజనమును సాధించు చుండును. నాటకములోని సత్పాత్రల గుణముల నీ యన్య పాత్రలచే సప్రసక్తికముగా నభివర్ణింపఁ జేసి వారికి హాని చేయఁబోవు దుష్టపాత్రల దుష్టత్వమున కుత్కర్ష నాపాదించు చుండును. ఈ పద్ధతిని Shakespeare తన నాటకములలో పెక్కుచోట్ల నుపయోగించెను. "Merchant of Venice" లో "Shylock" దుష్టత్వమును ద్విగుణీకృతముగ చూపుటకై Antonio సద్భావము నాతఁడు నాటకస్థేతర పాత్రల సంభాషణము ద్వారా మిక్కిలిగా వర్ణించి యుండెను.

నాటకములలో నొక్కొక్కప్పు డొక్కొక్క పాత్ర యితర పాత్రలకంటె భిన్నమయిన స్థితిలో నుండి, ఎక్కువ ప్రత్యయాస్పదముగ మాటాడు చున్నట్లు కానిపించును. గ్రీకు నాటకములలోని chorus వలెనే యీ పాత్రయును నాటక పాత్ర స్వభావావగాహనమునకు మిక్కిలిగా తోడ్పడు చుండుటచే స్థూలముగా నిట్టి వానిని నాటక సూత్రధారుఁ డని (chorus of the play) పిలువ వచ్చును. సాధారణముగ నీతనిలో కవి లీనమై తన యభిప్రాయములనే వ్యక్తము చేయుచుండును. అందుచే నిట్టివానిని నిర్వివాదముగా విశ్వసించి పాత్ర స్వభావాదులను గూర్చి తగిన విధముగ నిర్ణయము చేసికొనవచ్చును. Shakespeare రచించిన Antony and cleopatra లో Enobarbus పాత్ర యిట్టి దఁట.

పాత్ర శీల ప్రకాశనమునకు పైనిచెప్పిన పద్ధతు లన్నిటికంటె నుత్కృష్టమైనది మఱియొకటి కలదు ఇది స్వగతము ఇట్టి సమయములలో పాత్ర తన యంత తానాలోచించుచుండును గాన తన సహజ ప్రకృతిని మఱుగుపుచ్చుట కవకాశము కాని,

యావశ్యకము గాని లేదు. ఆ కారణముచే నిట్టి స్వగతములఁ బురస్కరించుకొని పాత్రల సత్య స్వభావము నెఱుంగుట మిక్కిలి సులభము. మానవులు పిచ్చివారు తప్ప బుద్ధిశాలులు తమలో దాము మాటాడుకొనరు. కాఁబట్టి యిట్టి స్వగతము లసహజము లని కొందఱందురు. కాని Congreve అను నతఁడు ఈ స్వగతములలో పాత్రలు సంభాషించుట తమలో తాము ఆలోచించుటయే కాని పిచ్చివారివలె మాటాడుట కాదనియు, సామాజికులు తమ మాటలను వినుచున్న సంగతి వారెఱుంగనే యెఱుఁగ రనియు చెప్పుచున్నాఁడు. 19 వ శతాబ్దిలోని పరాసు నాటకములలోను, ఇతర దేశ నాటకములలోను, ఈ స్వగతములు సామాజికులకే సంబోధింపఁబడినట్లు కలదు. మొన్న మొన్న విక్టోరియారాణి కాలము వఱకును ఈ స్వగత ప్రయోగము విరివిగ నుండెను. కాని యాధునికులు దానిని బూర్తిగా పరిహరించిరనియే చెప్పవచ్చును. యథార్థ మాలోచింపఁగా నీ స్వగతములు నాటకోచితములు కావు (Non-dramatic) నాటక కర్త సాధ్యమైనంతవఱకు వానిని దగ్గింపవలెను. మఱియు పాత్రల సంవాదము ద్వారా (dialogue) వ్యక్తము చేయుటకు వీలయిన విషయములనే స్వగతముల ద్వారా వ్యక్తము చేయు పద్ధతి తప్పక పరిహరింపఁ దగినది.

Shakespeare ఇట్టి స్వగతములను తన నాటకములలోఁ బెక్కుచోట్ల వాడెను. అతని నాటకములలోని ప్రధాన పాత్రలీ స్వగతముల ద్వారా తమ యథార్థ స్వభావములను సామాజికులకు స్పష్టము చేయుచుందురు. క్లిష్టములయిన విషాద నాటకములలో పాత్రల యుద్దేశములు, ఆశయములు సులభముగా నెఱుంగుట కష్టసాధ్యమగుటచే నతఁడీ ప్రత్యేక పద్ధతి నవలంబించెను. Shakespeare నాటకములలోని యంతరార్థము నెఱుంగుట కీ స్వగతములు మిక్కిలి తోడ్పడును. అతఁడు సాధారణముగ ప్రధాన పాత్రల శీలమును మొదటి స్వగతమునందే వ్యక్తముచేయుచుండును. గ్రీకు నాటకములలో నిట్టి స్వగతములు విరివిగ లేవు కాని నర్మసఖుఁ డుండెడివాడు. నాయకులు వానికి తమ హృదయమును విప్పి చెప్పుట కవకాశము కలదు. గ్రీకు నాటకములనుండి Seneca కును, అతనినుండి విద్యోదయము (Renaissance) నాఁటి కవులకును ఈ పద్ధతి కొంత మార్పుతో వ్యాపించెను. అధునాతనులు సైతమీ వయస్యుని ప్రవేశమున కంగీకరింతురు కాని యతనికి నాటక కార్యములలో నపరిహార్యమయిన సంబంధ ముండవలె నందురు. సంస్కృత నాటకములలో సైతమీ స్వగతముల సంఖ్య తక్కువే. వారి నాటకములలోని విదూషకపాత్ర కొంచె మించుమించుగా గ్రీకు నాటకములలోని నర్మసఖుని వంటిదే. నాయకుఁడు తన విషయముల నన్నిటిని (శృంగార ప్రణయ విషయముల సైతము) వానితో యథాతథముగఁ జెప్పుకొను

చుండును. కాని సంస్కృత నాటకములలోని విదూషక పాత్రము పెక్కు చోట్ల నాటక కార్యముతో నంతగా సంబంధములేని యప్రధాన పాత్రమే.

## II

ఆచార్యులవారు పాత్ర పరిపోషణమునం దారితేరినవారు. అందును పాత్రల మానసిక తత్త్వమును సమగ్రముగ ప్రదర్శించుటలో నపరిమాన మయిన శక్తి కల వారు. దాని కీయన విషాదాంత నాటకములు మూఁడును మంచి నిదర్శనములు. చిత్రాంగి, మంథర, కైక, దుష్టబుద్ధి మొదలగువారి మనస్తత్వ నిరూపణము చదివిన వారికెల్ల నచ్చెరువు కలిగించును. Hudson చెప్పినట్లు పాత్ర పోషణమనఁగా మన స్తత్త్వ నిరూపణమే (psychological element) యను నంశమును బాగుగా గుర్తించినవారగుటచే నాచార్యులుగారు తమ నాటకముల కీ ప్రశస్త మైన గుణోత్కర్ష కల్గింప ప్రయత్నించి యందు కృతార్థులయిరి. ఆచార్యులుగారు పాత్రలు తా మితర పాత్రలతో చేయు సంభాషణముల వలనను, నాటకస్థములయిన కొన్ని పాత్రలు నాయ కాదులను గుఱించి సందర్భోచితముగాఁ గావించుచుండు ప్రసంగముల వలనను, స్వగతముల వలనను తమ నాటకములలోని వివిధ పాత్రల శీల స్వభావములను సువ్యక్తము చేయుచుందురు. ఇందు మొదటి పద్ధతి యన్ని నాటకముల యందును, తఱుచుగా గానవచ్చుచున్నది. కైకా మంథరల సంభాషణము వలన కైక సహజముగ రామునియందు మిక్కిలి ప్రేమ కలదనియు, నామె కాతనియందు ద్వేషభావమును కలిగించినది మంథరయే యనియు స్పష్టముగ గోచరించుచున్నది. కైక తాఁజేసిన యపరాధమును గుర్తించిన తరువాత మంథరను గొంచెము దూషించుటయు, మర ణోన్ముఖుఁడయిన దశరథుని చెంత కేగి తన పశ్చాత్తాపమును వెలిపుచ్చుటయు నామె సహజ సుస్వభావమునకు నిదర్శనములుగా నున్నవి. భరతుఁడు కౌసల్యతో నాడిన పల్కు లాతని యమలమయిన సౌభ్రాత్రమును చెప్పక చెప్పుచున్నవి. చిత్రాంగి యింటికిఁ బోవుటకు ముందు సుబుద్ధి, సారంగధరులు కావించిన సంభాషణము వలన సారంగధరునికి తల్లి యెడఁ గల మహా విశ్వాసమును, చిత్రాంగీ సారంగధరుల సంభా షణము వలన నతని మనశ్శుద్ధియును, సారంగధరుఁడు తన పక్షమున నేమియు వాదించుకొనక సుబుద్ధిని చిత్రాంగి దుశ్చర్యను వెల్లడి చేయకుండుటకై ప్రార్థించుట వలన నాతని యపూర్వ మాతృ భక్తియును వెల్లడి యగుచున్నవి. చంద్రహాస కుళిందకులు కుంభీనసుని సత్కరించి యాతనితోఁ గావించు మనఃపూర్వక సంభాషణ పద్ధతి వారి యమాయికత్వమును వేనోళ్ళఁ జాటుచున్నది. ముక్తావళీ కళావతుల సంభా

షణము వారి యనురాగోత్కర్షను, వరూధినీ ప్రవరుల సంభాషణము వరుసగా వారి యందలి కాముకత్వ మనోనైశ్చల్యములను, సంధ్యావళి తన సవతుల తోడను మోహిని తోడను కావించు సంభాషణ మామె యపూర్వమయిన పాతివ్రత్యమును వెల్లడించు చున్నది. ఇట్లే యీయన నాటకములం దెల్లెడల నాయా పాత్రల సంభాషణములు వారి శీల స్వభావములను కొలదిగనో గొప్పగనో వ్యక్తము చేయుచునే యుండును.

నాటక పాత్రల సంభాషణముల వలన వారి శీల స్వభావములే కాక నాటకము సంబంధించిన యితర పాత్రల గుణాగుణములును ద్యోతితము లగుచుండును. ఒక్కొక్కప్పు డా పాత్రలు తమ కితరులయెడఁ గల యతి ప్రేమచే వారి నెక్కువగా పొగడుట కాని, యతి ద్వేషముచే నకారణముగ మితిమీఱి దూషించుట కాని సంభవించు చుండును. ఈ దూషణ భూషణముల విన్నంత మాత్రము చేతనే విశ్వసించి యా పాత్రల గుణ స్వభావముల గుఱించి నిశ్చితమయిన యభిప్రాయము నేర్పఱుచు కొనుటకు ముందు నాటకము యొక్క సాధారణ తత్త్వము (General spirit) ననుసరించి వాని యాథార్థ్యమును గొంత పరీక్ష చేయుట మిక్కిలి యావశ్యకము. ఈ విధముగ మంథర రాముని దూషించుటను కాని, యమాయికులయిన చంద్రహాస కుళిందకులు దుంభీనసుని యౌదార్యమును పొగడుట కాని విని నిజముగా వా రట్టి వారే యని తలంచుచో మన మా నాటకముల నవగాహనము చేసికొనుటయే కష్టము. ఇట్లుకాక తటస్థులయిన పాత్రలు తమ మాటలలో నితరుల శీల స్వభావములను గూర్చి చేయు సూచనలను మన మెక్కువగా నమ్మవచ్చును. ఆచార్యులు గారు తమ నాటకములలో నీ పద్ధతిని సైతము పెక్కు స్థలముల నుపయోగించి యున్నారు. మంథరా దుర్బోధము వలన నట్లు చేసెను కాని కైక మంచి స్వభావము కలదే యని కౌసల్య భరతునితో ననుట యందును, చంద్రలేఖా మేధానిధులు రహస్య సంభాషణమున మోహిని గుణ శీలములను ప్రశంసించుట యందును, సేవకులును మోహినియు రుక్మాంగదుని భక్తి నిష్ఠను మెచ్చుకొనుట యందును విశ్వసనీయమయిన సత్య మెంతయో కలదు.

ఒక్కొక్కప్పు డాచార్యులు గారు పాత్రల దుష్ట శిష్ట స్వభావముల కుత్కర్ష కల్గించుటకై కొన్ని రంగములను ప్రత్యేకముగ విరచించు చుందురు. చంద్రహాస నాటకమున సదాచార నాగరకుల సంభాషణమున చంద్రహాసుని సద్గుణము లన్నియుఁ జక్కగా వర్ణింపఁబడినవి. కుంభీనసుఁడు సద్గుణ గరిష్ఠుఁడైన యట్టి చంద్రహాసుని సంహరించుట యాతని దుష్టత్వమును ద్విగుణముగా వ్యక్తము చేయుచున్నది.

ఆ సంభాషణము లేనిచో నది యంత బహిరంగముగా మనకు గోచరింపదు. రాముఁడడవి కేగునపుడు ప్రజ లుద్రిక్తులై కైక యింటిని ధ్వంసము చేయఁబూనుట, యామె యా వరము లడుగుట యందలి కాఠిన్యము నెంతగనో విశదము గావించు చున్నది. ఇట్టి సంభాషణములు పాత్రల దౌష్ట్యమునే కాక సుస్వభావమును గూడ వ్యక్తము చేయుట కలదు. మోహినీ రుక్మాంగదమున పంచాపకేశ పత్నిణతార్తిహరుల సంభాషణము రుక్మాంగదుని భక్తి నిష్ఠ కెంతో వన్నె చేకూర్చు చున్నది. ప్రహ్లాదుని శిక్షింపఁ బంపఁబడిన కాలనాభాదుల యొక్కయు ప్రహ్లాదుని సహపాఠుల యొక్కయు సంభాషణము ఆతని దైవ భక్తిని మిక్కిలి విపులముగా విశదీకరించు చున్నది.

(స్వగతముల ద్వారా పాత్రల శీలమును వ్యక్తము చేయుట ఆచార్యులుగారి నాటకములలో పెక్కుచోట్ల కానిపించును. ఈ స్వగతములు మోదాంత నాటకములలో కంటె విషాదాంత నాటకములలో పాత్రల శీల స్వభావ నిరూపణము ద్వారా తదవబోధమున కెక్కువగా తోడ్పడును. Shakespeare సైత మీ స్వగతములను క్లిష్టములయిన స్థలముల పాత్రల మనోభావములను స్పష్టముగా సామాజికులకుఁ దెలుపుటకై వినియోగించు చుండును.) చంద్రహాస నాటకమున దుష్టబుద్ధి యితరులతో మాటాడునపుడు పై కొకటి యనుచుండును; లోపల మఱేదియో కుటిలముగ నాలోచించు చుండును. ఇతని కుటి లాలోచనముల నెఱింగి కథను సమగ్రముగా బోధపఱుచుకొనుట కీతని స్వగతములు మిక్కిలిగా తోడ్పడును.(విషాద సారంగధరమున చిత్రాంగి రాజరాజ నరేంద్రునితోఁ బ్రిసంగించునపుడు చూపు ననురాగ మంతయు నటన. ఆమెకు సారంగధరునిపైఁ గల యనురాగాతిశయమును, అభిమానావేశములతోఁ గూడిన యామె మనస్తత్త్వమును బాగుగా నెఱుంగుట కామె స్వగతములు మిక్కిలి సహాయపడును.) మంధర యాంతరమయిన యాలోచనలను ఆమె యితరులతో మాటాడు నప్పటికంటె తనలో తాను సంభాషించుకొనునప్పుడు ఎక్కువగా గుర్తింపవచ్చును.

ఆచార్యులుగారి స్వగతములకు విషాదాంత నాటకములలో నిట్టి యుపయోగము కలదు. ఆయన మోదాంత నాటకములలోఁ గూడ స్వగతముల నెక్కువగా వ్రాయుదురు. కాని యివి పెక్కు అనావశ్యకములయి యతి దీర్ఘములయి యున్నవి. కొన్ని యా యా సన్నివేశములయందు నచ్చటి పాత్రల మనోభావములను జక్కగా వర్ణించుచున్నవి. అర్జునుఁడు కర్ణుని చంపినందులకై పశ్చాత్తాపపడు స్వగతమును, కీచకుఁడు ద్రౌపదిని కూర్చుటకై యతని కాళ్ళపైఁ బడ్డ యప్పటి స్వగతమును,

ముక్తావళి తన మనోరథములన్నియు భగ్నములయ్యె ననుకొని 'ఇది ఫలమా' అని పూర్వానుభవముల నెపుఁ దలంచి విచారించుచు స్వగతమును, కొంచెము దీర్ఘము లైనను భావపూరితములై యున్నవి. పాంచాలీ స్వయంవరము నందలి శకుని దశ రూపుల స్వగతములు కథావగతి కెంతయో తోడ్పడును. సత్యవంతుఁ డడవికేగి తన దీనావస్థను తలంచుకొను స్వగతమును, ద్వితీయ స్వయంవరము మాట వినిన తరు వాత నలుఁడు దానికిఁ గల కారణముల నూహించు నప్పటి దీర్ఘ స్వగతమును, వా రనుభవించు శారీరిక మానసిక కృచ్ఛ్రముల తేటతెల్లము గావించి జాలిఁ గలిగించు చున్నవి. ఈ స్వగతములన్నియుఁ దగిన చోట యథార్థ్యముగా సరికూర్పఁబడినను, దీర్ఘోపన్యాసముల వైఖరిని వహించి కథన మార్గమునఁ బోవుచున్నవి.

ఈ పై మూఁడు పద్ధతులచేతనే కాక నాటక పాత్రలు చేయు కార్యములఁబట్టి సైతము వారి శీలములను గ్రహింపవచ్చును. మానవుల యాలోచనల మంచి చెడ్డల గుర్తించుటకు స్వగతములెంత తోడ్పడునో వారి సాధారణ స్వభావమును గుర్తించుట కీ నాటక కార్యమంత తోడ్పడును. సావిత్రి పతి ప్రాణములకై నరకమునకు సైతము యముని వెంట నంటుటయు, సంధ్యావళి రుక్మాంగదుఁడు చేయు పనుల కడ్డు పలుక కుండుటయు, సానంద భర్తృ గ్రుడ్డితనముసు జూచి తన కనులకుఁ గూడ గుడ్డ కట్టు కొనుటయు, రోషనార శివాజీ విమోచనమునకై మిక్కిలి పాటు పడుటయు వారి పాతివ్రత్యమునకుఁ దగిన నిదర్శనములుగా నున్నవి. దుర్యోధనాదుల యొక్కయు, దుష్టబుద్ధి యొక్కయు, పుష్కర దేవలులయొక్కయు చేఁతలలో వారి దౌష్ట్యము మూర్తమై యున్నది. ఈ విధముగా పాత్రల దుష్ట శిష్టాచరణములను బట్టి వారి మంచి చెడ్డ స్వభావముల గుర్తించుట మిక్కిలి సులభము.

పాత్రలను కేవలము మంచిగాఁ గాని కేవలము చెడ్డగాఁ గాని వర్ణించుట సంస్కృత నాటక కవుల పద్ధతి. పాశ్చాత్యు లిట్లుగాక పాత్రల శీలములలో గుణా గుణములను కొంచె కొంచెముగా మేళవింతురు. దుష్ట పాత్రలలో కొంత మంచిని శిష్ట పాత్రలలోఁ గొంత చెడ్డను వారు ప్రదర్శించుచుందురు. ఆచార్యులుగారు సత్పాత్ర చిత్రణమునఁ బ్రాచ్య పద్ధతిని దుష్ట పాత్ర చిత్రణమున పాశ్చాత్య పద్ధతిని అనుక రించిరని చెప్పవచ్చును. సారంగధరుఁడు, రాముఁడు, రుక్మాంగదుఁడు, చంద్ర హాసుఁడు, ప్రహ్లాదుఁడు మొదలగు నాయక పాత్రలలో నెర నొక్కటియైనను కాన రాదు. వారంద ఱును సత్త్వముయొక్క ముద్దలుగాఁ జేయఁబడిరి. పాశ్చాత్యులలో నొక తెగవారు పాత్రలలో గుణ దోషములలో నేదోయొకటి మాత్రమే యుండుట యసం

భవమనియు, వారిలో తన్మిశ్రణమును బ్రదర్శించుట సహజముగా నుండుననియు నందురు. ప్రాచ్యు లట్లుగాక సామాజికులకు నీతి సూటిగా బోధపడుటకై సద్గుణ పుంజము లగుటచే నాదర్శ భూతములయిన పాత్రల సృష్టించుట యావశ్యకమని యందురు. ఆచార్యులుగారు కొంచె మించుమించుగా నీ పద్ధతినే యవలంబించిరి.

దుష్ట పాత్ర చిత్రణమున నాచార్యులుగారిది వింత మార్గము. ఎంత దుష్టు డయినను తుదకు తన దోషము నెఱింగి పశ్చాత్తాప పరిపూతుఁడు కాకపోఁడని యాయన యూహయై యుండును. నిర్దయా కౌటిల్యములు విగ్రహముదాల్చిన దుష్టబుద్ధికి నాటకము నందలి యాతని స్వభావమునుబట్టి చూడ నెంతటి శోచనీయమయిన యవస్థ యందయినను పశ్చాత్తాపము పుట్టుట యసంభవము. అయినను ఆచార్యులుగారు ఆతనికి చివర పశ్చాత్తాపమును గలిగించి సానుభూతి పాత్రముగా నొనరింపఁ బ్రయత్నించిరి. కాని యాతని దౌష్ట్యము మేర మీఱినది యగుటచే నందు కృతకృత్యులు కాలేకపోయిరి. ఇట్లే చిరకారి యందలి శ్వేతకేతువునకును, పాదుకా పట్టాభిషేకము నందలి మంథరకును కవి కలిగించిన పశ్చాత్తాపము వారి శీలములతో పొందక మిక్కిలి యసహజముగా నున్నది. సహజ పరిణామములేని ఈ మార్పు లతుకులుగానే ఉండును.

శిష్టులకు నంతమున సుఖమును దుష్టులకు చివర దుఃఖమును కలిగించుట యాచార్యులగారి నాటకములలో సర్వత్ర కానిపించుచున్నది. ఒక్క సారంగధరుని పాత్రలో మాత్రము శిష్టత్వమునకు మరణము విధింపఁబడినది. మిగిలిన శిష్టపాత్రలు తమ శీల సామర్ధ్యముచే నెన్ని కష్టములు కలిగినను వాని నుత్తరింపఁ గల్గుటయే కానిపించు చున్నది కీచకాది దుష్టపాత్రలకు కావ్య న్యాయము ననుసరించి యంత్యమున పరాజయమే ఫలముగా విధింపఁ బడినది.

Shakespeare మొదలగు గొప్ప నాటక కవులు తమ నాటకముల యందలి యేదో యొక పాత్రతో తాము లీనులై వారి పల్కుల ద్వారా తమ యనుభవములను అభిప్రాయములను వ్యక్తము చేయుట కలదు. సంస్కృత నాటకములలో నిట్టి పద్ధతి యరుదు. ఆచార్యులుగారు సైతము తమ పాత్రలలో లీనమగుట యంతగా కానిపించుట లేదు కాని న్యాయస్థానము నందలి న్యాయవాది, న్యాయాధిపుల పల్కులను, పాంచాలీ స్వయంవరము నందలి జరాయువు శాస్త్రవాదమును, కామసుందరుని వేశ్యా దూషణమును ఆచార్యులుగారు స్వయముగా పల్కుచున్నట్లున్నవి. విషాద సారంగ

ధరమున వారు న్యాయస్థాన రంగమును గల్పించుట తమ న్యాయవాది తనమును బ్రదర్శించుటకే. ఆయనకుఁగల సాంఘిక మత రాజకీయాంశముల నాయన వ్యక్తముచేయు చోట్లు పెక్కువిధముగనే యున్నవి.

ఆచార్యులుగారి విషాదాంత నాటకములలో నాయకుని దోషాచరణము యొక్క ప్రత్యక్ష ఫలము ననుభవించు పాత్ర లన్నియు మిక్కిలి కార్యశూన్యములుగా నున్నవి. ఆ పాత్రల కా నాటకములలో చలనమే కానరాదు. వారు కష్ట పరంపరలను కిమ్మనకుండ ననుభవించుటకు మాత్రమే యందుఁ బ్రవేశపెట్టఁబడిన వారివలె నున్నారు. రాముఁడు, సారంగధరుఁడు, చంద్రహాసుఁడు మొదలగువా రిట్టివారే. మోదాంతములలో నయినను, నాయికల కున్నంత ప్రాధాన్యము నాయకులకు లేదు. సత్యవంతుడు, సోమశేఖరుఁడు, అర్జునుఁడు మొదలగు పాత్రల కా యా నాటకములలో నాయకత్వము నామమాత్రముగా నున్నది. తరుణ దంపతుల ప్రథమ దర్శన మీయన నాటకములన్నిటిలో నొక్క మాదిరిగానే యున్నది. అందు నాయకుఁడు కార్యవశమునఁ బోపుచు నుద్యానవనమందు తత్పరిహారికలతో విహరించు చున్న నాయికను గాంచుటయు, నతఁడు నాయికకు హఠాత్తుగా నచ్చుట సంభవించిన యాపదను తొలఁగించుటయు, నామె యాతని యెడ మోహమును వెలిపుచ్చుటయుఁ బ్రధాన విషయములు. ఆచార్యులుగారు స్త్రీ స్వాతంత్ర్య వాదు లగుటచే కాఁబోలు నీ నాయికలకు తల్లిదండ్రుల అడ్డు ఆకలతో సంబంధము లేకుండనే ప్రణయ వ్యాపారముల పొసగించిరి.

సంస్కృత నాటకములందు కానవచ్చు విదూషకునిఁ బోలిన పాత్ర లాచార్యులుగారి నాటకములలో మూఁడు కానవచ్చు చున్నవి.—సుమాలి, సుయోగుఁడు, శతానందుఁడు. వీరిలో సుయోగుఁడు విదూషకుఁడు కాకపోయినను ఆ నాటకమున విదూషక కృత్యమును మాత్రి మొనరించెను. సంస్కృత నాటకము లందలి విదూషకులవలెనే వీరును నాయకు నెడఁబాయక సంచరించుచు, మధ్య మధ్య హాస్య ప్రసంగముల నొనరించుచు నాయికా నాయక సమాగమమునకు తోడ్పడుచుందురు. వీరిలో నొక సుమాలిలోఁ దప్ప తిండిపోతుతన మంతగాఁ గాన్పించదు. సుమాలియం దయినను అది తక్కువే వీరు ముప్వురును నాయకునికిఁ దగిన యాలోచనము నొసంగుటకంటె నతనిని అన్యాపదేశముగా హేళనము చేయుట హెచ్చు. వీరు అచ్చటచ్చట హాస్యరసమునకు పోషకులుగానే యున్నను మాళవికాగ్ని మిత్రము నందలి విదూషకులవలె నంత యుపాయశాలులు కారు.

ఆచార్యులు గారి నాటకములలోని స్త్రీ పాత్రలు మూఁడు విధములు. అందు కంచు కాగడాతో వెదకినను కళంకము కానిపింపని పాతివ్రత్యముతో విలసిల్లు కులీన లగు స్త్రీలు మొదటి రకమునకు చేరుదురు. సావిత్రి, చంద్రలేఖ, కళావతి, ముక్తావళి, రోషనార, సంధ్యావళి, మోహిని మొదలగువా రిట్టి వారు. ఆచార్యులు గారు పాతి వ్రత్యమును బ్రవర్ణించుటలో మిక్కిలి నైపుణ్యము చూపిరి. స్వయముగాఁ బాతి వ్రత్యమునందుఁ గల యత్యభినివేశముచే నాచార్యులు గారు వీరి పతిభక్తిని సవిస్త రముగా వర్ణించి స్త్రీ లోకమున కాదర్శభూతలుగా నొనరించిరి. మంధర, మల్లికాసాని తిలక మున్నగువారు రెండవ రకమునకుఁ జెందినవారు. వీరు కులము తక్కువ వారే యయ్యు గడుసుఁదనమును గార్య నిర్వహణ శక్తియుఁ గలవారు. మల్లికాసాని వేశ్య మాతల కెల్లఁ బ్రతినిధి. తిలకా మంధరలు స్వామినీహిత పరాయణులయిన పరిచారి కలు. అందు మంధర దుష్టములగు మాయోపాయములకుఁ బుట్టినిల్లు. ఆమె మానవ మన స్తత్త్వమును బహు నిపుణముగా గుర్తింపఁ గలదు. అందుచేతనే కేవల దాసి యయ్యుఁ గథా గమనమునఁ బ్రధానస్థానము నాక్రమించినది. తిలక సైత ముపా యము కలదే కాని స్వభావమున వా రిరువురికిని మిక్కిలి తారతమ్యము గలదు. ఈమె తన మతి ప్రతిభను సత్కార్యమునకై వినియోగింపఁగా మంధర దానిని దుష్కా ర్యమునకై వినియోగించెను. చిత్రాంగి, కైక, మోహిని మున్నగువారు మూఁడవ రక మునకుఁ జెందిన వారు. వీరు సహజముగా సత్స్వభావము గలవారే యయ్యుఁ బరి స్థితులను బట్టి దుష్టముగాఁ బ్రవర్తింప వలసివచ్చినది. చిత్రాంగికి సారంగధరు నందును, మోహినికి రుక్మాంగదుని యందును, కైకకు దశరథుని యందును నిర్మల మయిన యనురాగము కలదు కాని యది కారణాంతరములచేఁ గళంకితమును అప్ర శస్తమును నయిపోయినది. ప్రమీ లార్జునీయము నందలి స్త్రీ పాత్ర లన్నియు సౌంద ర్యము చేతనే కాక పరాక్రమముచే సైతము పురుషులను జయించి వశపఱుచు కొను టకుఁ దగిన శక్తి సామర్థ్యములు గలవారు. స్త్రీ స్వాతంత్ర్యము ముదిరి ముదిరి తుద కిట్టి వారిని దయారు చేయును గాఁబోలును!

ఆచార్యులుగారి నాటకములలోఁ బురుషులకంటె స్త్రీలకుఁ బ్రాధాన్యము హెచ్చు. కొంచె మించుమించుగా నాటకము లన్నియు వా రొనరించు కార్యములపైనే యాధార పడి యున్నవి. వీరిలో స్త్రీ సహజమయిన లాలిత్యమునకుఁ గొంత కొఱఁత యున్న

దని చెప్పవచ్చును.) ఆచార్యులు గారు స్త్రీ మనస్తత్త్వమును బోలెఁ బురుషుల మానసిక తత్త్వమును దమ నాటకములలో విరివిగాఁ బ్రదర్శించి యుండలేదు. చిరకారిపాదుకా పట్టాభిషేకములలో తిలకా మంధరల కతిమాత్రమయిన ప్రాధాన్యము గలదు కుమ్మరి గుండప్ప, అఘోరుఁడు, బిందోజీ మొదలగు నీచ పాత్రలలో నప్పటి కథా నిర్వాహమునకును గొంచెము హాస్యమునకును గలిగిన తోడ్పాటు తప్ప మఱే విశేషమును లేదు. మొత్తము మీఁద నాచార్యులు గారు దుష్ట శిష్ట పాత్రలను సుస్పష్ట రేఖలతోఁ జిత్రించుటలో నసామాన్య ప్రతిభ గలవారు. (ఈయన చిత్రాంగి, సావిత్రి, దుష్టబుద్ధి మొదలగు పాత్రలు సామాజికుల హృదయముల నంటి చిరకాలము వఱకు స్థిరముగా నిల్చియుండు ననుట నిర్వివాదము.



# 9. ఆంధ్ర నాటక పితామహుని కవిత్వము

## I

నాటకమున వస్తు పాత్ర పోషణాదుల కెంత ప్రాముఖ్యము కలదో కవిత్వమునకుఁ గూడ నంతే. కవిత్వ మనఁగా నిచ్చట పద్యములని మాత్రమేకాక రసాత్మక మయిన వాక్య సంచయమని యర్థము. ఏలయన పద్యముల విడిచి కేవలము వచనములో రచింపఁబడిన నాటకములలోఁ గూడ రసవంతము లయినవి పెక్కు గలవు. కాని సంస్కృత నాటకములలో గద్య పద్య మయములయినవే తప్ప కేవల వచనమయము లయినవి కానఁబడవు. సంస్కృత నాటక కర్తలు వచనమును కథా గమనము కొఱకును పద్యమును రసభావ వ్యక్తీకరణమునకును వర్ణనాదులకును నుపయోగించిరి. వారి నాటకములలో కథా పరిణామమునకుఁ దోడ్పడు పద్యము లరుదు. అందలి పద్యముల నన్నింటినిఁ దొలగించి వానిని చదివినచో కథ కెట్టి వికారమును కలుగదు. కాని యవి యప్పుడు యంత్రపీడితమయిన యిక్షు కాండమువలె నీరసమై యాస్వాదింప నెంచు వారికి నోటి జాలి మాత్రము కలిగించును.

అసలే వాఙ్మయమున నయినను భావోద్రేకము కలిగినప్పుడు ఛందోమయము లయిన వాక్యములే వెలువడుట సహజము. నిరక్షరాస్యులయిన యాటవికులు సైతము ద్రిక్తు లయినప్పుడు ఛందోమయము లయిన వాక్యములనే యుచ్చరించుట మన మచ్చటచ్చటఁ జూచుచునే యుందుము. ఈ సూత్రము సంస్కృత నాటకములలో మఱింత యధికముగ తార్కాణమునకు వచ్చును. వారు పాత్రలు గావించు సంవాదము ద్వారా రసమయములయిన సన్నివేశమున కాలంబనము కల్పించి యా సన్నివేశము రాఁగానే యచ్చటి పాత్రలచే ఛందోమయమై రసదోహలమయిన పద్యము ననిపింతురు. ఇట్లే యుదాత్తములయిన భావములు వ్యక్తము చేయవలసి వచ్చునప్పుడు తప్ప నీరసమైన సాధారణ విషయమునకై వారు పద్యములు వాడనే వాడరు. వారి నాటకములలోని యుత్తమ మధ్యమ నీచ పాత్రలు పయోగించు భాషా సంప్రదాయమును పురస్కరించుకొని చూచినచో నీ విషయము విస్పష్టమగును. నీచులలో నుదాత్తము లయిన భావము లుదయించుటరుదు. ఉత్తములలో నెట్టి పరిస్థితుల యందును నీచ భావము లుదయింపవు. ఈ కారణముచేతనే సంస్కృత నాటకములలో పద్యము లన్నియు సాధారణముగ నుత్తమ పాత్రలు

ప్రయోజితములైయే యుండును గాని నీచ పాత్రోదితములై యుండవు. ఇట్లని సంస్కృత నాటకములలో భావోద్రేక వ్యక్తీకరణమునకు మాత్రమే పద్యము లుప యోగింపఁ బడునని యనుకొనరాదు. అవి యితర ప్రయోజనములకుఁ గూడ నుప యోగింపఁబడును. కాని వానిలో నీ పై పద్ధతియే హెచ్చు. భాసుని నాటకములలో కథా గమనమునకు సైతము తోడ్పడు పద్యములు గూడ నెడనెడఁ గాన్పించును.

నాటకము ప్రకృతికి ప్రతిబింబమై యుండవలె ననువారు వానిలో నెట్టి పరి స్థితులలో నయినను పద్యములను వాడుటయే యసహజ మందురు. కాని యది తప్పు టూహ. యథార్థముగ జరిగినది జరిగినట్లు రచింపఁ బడినచో నది రక్తి కలిగించుటకు మాఱు పేలవమై యసహ్య భావము గలిగించును. ఇరువురు కయ్యము లాడుకొను నప్పుడు కవి సమీపముననే యుండి వారి నోటి నుండి వెలువడిన ప్రత్యక్షరమును వ్రాసికొని నాటకమున నా మాటలనే వాడినచో దాని నొకసారి చూచిన వారు మఱి చూచుటకు రారు. ఒకసారి చదివిన వారు మఱల దాని ముఖము చూడరు. అందు కనియే నాటకము ప్రకృతి కంటె కొంచె మున్నతముగ (Elevated) నుండుట మిక్కిలి యవసరము. పద్య రచన కొంతవఱ కందుకు తోడ్పడును.

ఆంగ్లేయులలో సైత మీ పద్య గద్య ప్రయోగమునకు నిశ్చితమయిన నియ మము లేదు. వారిలో నాటకములు ప్రధానముగా రెండు విధములు. అందు మోదాంత నాటకములు (Comedies) కేవలము వచనములో కాకపోయిన, నున్నత భావ విహీ నమును (Devid of Rich Imagery), సాధారణ పద సంగతమునునై వచన మునకు సన్నిహితమయిన పద్యములో రచింపబడునవియు, విషాద నాటకములు (Trag dies) భావరంజకములు కాఁబట్టి యున్నతమైనట్టియు, లయాన్వితమైనట్టియు, భాషలో వ్రాయఁబడునవియు విమర్శకులు తలంతురు. (From Early times it has been recognised that Comedy tends to find fitting medium of expression, if not actually in prose, at any rate in a kind of verse which is akin to prose in its eschewing of which imagery and in its common-place use of words, where as tragedy, no doubt because of the appeal there-in made to the emotions, tends towards higher poetic expression and richer flights of rhythmic language). ఇట్లనుటచే విషాదాంత నాటకమున వచనముండ రాదనియు మోదాంత నాటకమున భావ నిర్భరమయిన పద్య ముండరాదనియు తలంపరాదు. అవసరావశ్య

కములఁబట్టి మోదాంత నాటక కర్త పద్యములను విషాద నాటకకర్త వచనమును వాడవచ్చును. * Shakespeare నాటకములలో గద్య పద్యముల కిట్టి ప్రయోగము పెక్కు చోట్ల కలదు. Merry Wives of Windsor లో నాటకములయొక్క సాధారణ తత్త్వము (spirit) గద్యోచితమయినదే కాని ప్రతియోగమునకై (Contrast) కవి ప్రియుల సంభాషణమునకు పద్యమును వాడెను. అట్లే Hamlet నాటకము విషాదమయమగుటచే పద్యోచితమేయయ్యు నందెడనెడ వచన రంగములు కన్పించుచున్నవి. ఈ భేదము Shakespeare చే మనఃపూర్వకముగఁ జేయఁబడినదే కాని యజ్ఞాతముగఁ జేయఁబడినది కాదు.

విషాద నాటకము పద్యోచితమగుట నిజమే కాని యందలి భాష మిక్కిలి లయాన్వితమగుచో నది ప్రకృతికి దూరతరమగుట సంభవించును. అందుచే నంనయిన ను లయాధిక్యముగల పద్యముల విరివిగా వాడు టొక్కొక్కప్పు డనర్థకారియగును Shelly చే రచింపఁబడిన Prometheus Unbound అను నాటకము మిక్కిలి రమ్యమైనదే కాని యందలి ఛందస్సుత్కృష్ట లయాన్వితమై యుండుటచే Macbeth, Hamlet మొదలగువానివలె సామాజికుల నాశ్చర్యచకితులఁ గావింపలేదని Prof. A. Nicoll అనుచున్నాఁడు. గ్రీకు నాటకములలో నిట్టి లయాన్వితములగు పద్యములే హెచ్చు. కాని రానురాను Shakespeare కాలము నాఁటికి విషాద నాటకములు Blank Verse అను నొక విధమైన నిప్రాస వృత్తములో రచింపఁబడు టారంభమాయెను. ఈ Blank Verse విచిత్రమయిన వృత్తము. ఇందు లయ కలదు ఇది కవిత్వోచితములయిన యుదాత్తభావముల (Poetic thoughts) వ్యక్తము చేయుట కనువుగ నుండును. అయ్యును అది నిర్మాణమునందలి వైచిత్ర్యముచే సాధారణ జీవితమున కతి సన్నిహితముగ నుండును. విషాద నాటక ముదాత్తముగను ప్రకృతిక సన్నిహితముగను కూడ నుండవలెననినఁ దద్రచన కీ Blank Verse ఒక్కటే మిక్కిలి తగియుండును.

Shakespeare తన మోదాంత నాటకములో సైతమీ Blank Verse నే విరివిగ వాడెను. కాని యందలి భాష ప్రకృతికి సన్నిహితముగా నుండుటకై యా వృత్తమున ననుప్రాసయమకాదుల యభావముచే లయను తగ్గించివైచెను. విషాద

*Daniello says "The Tragic poet certainly has the liberty to lower his style when he wishes, so as to approach humble speech, so as to weep and lament-similarly the comic author has the liberty to employ occasionally some of the grand eloquence of the tragic poet."

నాటకములలో సైతమీ లయాధిక్యమును గల్పించు టాతని నాటక రచ నారంభకాలముననే కానవచ్చుచున్నది. కాని తరువాత నతఁడు క్రమక్రమముగ Blank Verse లో నిముడుటకు తగిన లయనుమాత్రమే కల్పించెను. తరువాత బయలుదేఱిన యాంగ్లేయ కవులు పెక్కురు Blank Verse నే కారణముచేతనో విసర్జించివైచిరి. కొందఱు విషాద నాటకములను వృత్త గంధి గద్యములో (Poetic Prose) విరచించిరి. కాని యీ వచనమైనను కొంచె మించు మించుగ Blank Verse తో సమానమయినదే. ఆధునికులు తమ నాటకములను మోదాంతములనైనను విషాదాంతములనైనను వచనములోనే వ్రాయుచున్నారు.

Blank Verse తో సమానమయిన మఱియొక ప్రక్రియను గల్పించుకొనకుండనే యాంగ్ల నాటక కర్తలు దానిని పరిహరించుట వారి నాటకముల కొకవిధమయిన లాఘవము గల్పించినదనుటలో నసత్యములేదు. అసలు విషాద నాటకములలో లయాన్విత వృత్తము లుండుటకుఁ దగిన యావశ్యకము కలదు. ఛందస్సహితమైన భాష నాటకముయొక్క విశ్వజనీనతకు (Universality) తోడ్పడునని యిదివఱకే చెప్పఁబడినది. ఈ కారణము చేతనే వైదేశికములయిన ఛందస్సహిత పద్యములు చదువఁబడినప్పు డర్థము తెలియకపోయినను మన మానందము ననుభవింతుము. రెండవది విషాద నాటకములలో విషాద భావము కోటి కెక్కినప్పుడు (reaches its zenith) తదుత్కర్షను భయంకరత్వమును (Horror) లఘూకరించుటకై యీ ఛందస్సహిత భాష మిక్కిలి యుపకరించును. లయాన్విత భాషయొక్క యీ యుపయోగమును గ్రీకు నాటక కర్తలఁ దొట్టి Shakespeare వఱకుఁ గల నాటక కవులందఱు నెఱింగి యవసరమునుబట్టి యందందు వాడుకొనుట స్పష్టముగాఁ గాన్పించుచున్నది.

సంస్కృతమున మోదాంత విషాదాంత భేదము లేకుండుటచే గద్య పద్య ప్రయోగము విషయమయిన వాదోపవాదము లంతగా లేవు. భావ గౌరవము లేనప్పుడు వచనమును వాడుటయు, భావ నిర్భరత కలచోట పద్యమును వాడుటయు వారి సామాన్య పద్ధతి. సాహిత్య దర్పణమున నంకలక్షణమున "క్షుద్ర, చూర్ణక, సంయుతః" అని యొకచోటను "నాతి ప్రచుర పద్యవాన్" అని మఱియొక చోటను కలదు. క్షుద్రమనఁగా స్వల్పము. దానినిబట్టి యంకమున పద్యములును గద్యమును గూడ పరిమితముగనే యుండవలెనని తేటపడుచున్నది. ఇది ప్రయోగ దృష్టితోఁ జెప్పఁబడిన దనుటకు దీని కాధారభూతమయిన "బహు చూర్ణ పాదవృత్తం జనయతి ఖేదం ప్రయోగస్య" అను నష్టమాధ్యాయములోని మహర్షి వాక్యమే ప్రమాణము.

# II

ఆచార్యులుగా రాంగ్ల సంప్రదాయము ననుసరించి మోదాంత విషాదాంత నాటకముల రెండిటిని రచించిరి. కాని యాంగ్లేయులో వలె మోదాంతమున కేవల వచనము, విషాదాంతమున కేవల పద్యమును మాత్రమే వ్రాసియుండలేదు. వారు సంస్కృత నాటక సంప్రదాయము ననుసరించి పద్య గద్య మయముగనె తమ నాటకముల వెలయించిరి.

ఆచార్యులుగారి నాటకములు ముద్రితము లయిన వన్నియు పద్య గద్య గేయ రూపమున నున్నవి. ముద్రితము కాని యజామిళ చరిత్రము మాత్రము సంపూర్ణముగా గద్యరూపమున నున్న దని యొకా నొక పీఠికలో నున్నది. ముద్రితములయిన నాటకములఁ బరిశీలించినచో నాయన మొట్టమొదట చిత్రనళీయము సావిత్రీ చిత్రాశ్వము మొదలగు వానిలో పద్య గద్యములను సమముగనే వాడినను తరువాత క్రమ క్రమముగ పద్యముల సంఖ్య తగ్గించుట కానవచ్చు చున్నది. ఆస లాచార్యులుగారికి గద్య రూపముననే నాటకము నంతను వ్రాయు టిష్ట మని పైని పేర్కొనఁబడిన యా పీఠికాకారుఁడు వ్రాసెను. కాని యిందలి సత్యము సందేహాస్పదమై యున్నది.

ఈ నాటకములలో పద్యముల స్థితి మిక్కిలి వింతగా నున్నది. పద్యమునకుఁ బూర్వ మున్న గద్య భాగములో సాధారణముగ నిందలి యర్థమే యుండుట సర్వత్ర గోచరించుచున్నది. ఒక్కొక్కప్పుడు పద్యములోని యర్థము దాని తరువాత వ్రాయఁబడిన వచనములో వ్యక్తము చేయఁబడుటయు కలదు. దీనికి తోడీ భావముతోనె నిండియున్న పాట యొకటి పద్య గద్యముల నడుమ ననుబంధముగా నుండును. మొత్తము మీఁద నొకే భావము పద్యములోను, వచనములోను, పాటలోను కూడ కానిపించుట యధికము. ఈ పద్ధతి యాచార్యులు గారు తొలుఁదొల్త నాటకములను గద్య రూపముననె వ్రాసి తరువాత తమ కుచితమని తోఁచిన చోటుల నీ పద్య గేయములఁ జొప్పించి యుండిరను నభిప్రాయమునకు తా వొసఁగు చున్నది. ఆయన యిట్లు వ్రాయుటకుఁ గల కారణము తమ నాటకములు ప్రయోగింపఁ బడుటలోఁ గల యత్యభిలాషయే. ఏలయన ని ట్లొకే భావమునకు పద్య గద్య గేయములు మూఁడును కూడ నున్నచో నటు లాయా పాత్రల ధరించు వ్యక్తుల సంగీత సామర్థ్యము ననుసరించి గద్యమునో, పద్యమునో, పాటనో గ్రహించుట మిక్కిలి సులభము. ఈ యభిప్రాయము కేవల మూహ కల్పితమే కాని యాచార్యులగా రట్టి వికల్పము నెయ్యెడను

సూచించి యుండలేదు. గేయము లనుబంధములుగా వేఱే ముద్రింపఁబడి యుండు టచే నాయన పద్య గేయముల కట్టి వికల్పము కల్పింపఁ దలఁచి యుండి రనుట కవకాశము కలదు. కాని పద్య గద్యముల విషయమై యి ట్లనుకొనుటకుఁ గూడ వీలు లేదు. ఆచార్యులుగా రీ పౌనరుక్త్య దోషమును బుద్ధి పూర్వకముగనే యొనరించి యుండవలయును. వచనము కాని పాట కాని లేకుండ అర్థమును కేవల మొక్క పద్యములో మాత్రమే వెలువరించిన చోట్లు కూడఁ గొన్ని కలవు. (సావిత్రీ చిత్రాశ్వము) అందుచే నాచార్యులు గారికి వచనములోనే నాటకములు వ్రాయుట యిష్టము కాదనియే చెప్పవచ్చును.

ఇ ట్లొకే భావమును పలు విధములుగా వ్యక్తము చేయు టీయన నాటకములకు తీరని కళంకముగా నున్నది. అసలు నాటకమునకు సంక్షేపము (Brevity) మూల సూత్రము. ఆ నాటకములో నా భావపౌనరుక్త్యము వలన నీ మూలసూత్రమే యుల్లంఘింపఁబడినది. సాహిత్య దృష్టితోఁ జూచినను, ప్రయోగ దృష్టితోఁ జూచినను నిది యనర్థకముగనే గన్పించు చున్నది. నాటకమును చదువు నప్పు డీ ద్విరుక్తత వలన మిక్కిలి విసుగు జనించుటయే కాక యా భావములలోని తీవ్రతా గాంభీర్యములు చెడిపోవును. అందుచే నాటకము రససిద్ధి గల్గించుటకు సమర్థము గాక నిస్సారమై పోవును. ప్రయోగించు సమయమున నటుఁడు తన బుద్ధి పాటవము నుపయోగించి తనముం దుంచఁబడిన యీ పద్య గద్య గేయములలో నేదో యొక దానిని మాత్రమే గ్రహించినచో నే చిక్కును లేదు. అసలు సంగీతము నంతగా పాడలేని వాఁడైనచో నొక్క వచనమును మాత్రము స్వీకరించి పద్య గేయములను విడిచివైచును. పాడఁగల నటుఁ డయినచో నా పద్యములను విడువఁడు. పద్యములు చదివినప్పు డీ పూర్వ పరభాగము లందలి వచనము లనవసర మను వివేక మాతని కుండదు. ఆ కారణముచే భిన్న భిన్న రూపముల వ్యక్తపఱుపఁబడిన యా భావము నతఁడు పఠించునప్పుడు సామాజికులలో మొదటిదానిమీఁద నున్నంత రుచి రెండవదానిమీఁద నుండదు. రెండవ దానిమీఁద నున్నంత మూఁడవ దానిమీఁద నుండదు. కాఁగా నానందమును కలిగించి యైహిక ప్రపంచమును మఱపింపవలసిన యీ నాటక మసహ్యభావమును కలిగించి వారిని విముఖులుగాఁ జేయును. ఆంధ్రీకృతములయిన శాకుంతలాది నాటకములను ప్రయోగించు తఱిని కొందఱు నటులు సంస్కృతాంధ్ర పద్యముల రెంటిని గూడ చదువుట గలదు. ఆ సంస్కృత శ్లోకము నందలి యర్థ మిప్పటి సామాజికులలో నూటికి తొంబది మందికి తెలియక పోవుటచేతను, ఆ నటుని సంగీ

తము కొంత శ్రుతిపేయముగ నుండుటచేతను, నా పఠనము వలన నంత నష్టము కలుగుట లేదు. కాని కళాదృష్టితోఁ జూచువారి కది రోఁతగనే యుండును. నాటకమున నటుని సంగీతము బాగుగా నుండుటచేతనో, అభినయము బాగుగా నుండుటచేతనో సామాజికులలో నొకరు once-more అనగా వినయము గల నటుఁడు ఆ పద్యమును మఱల చదువునప్పుడే నాటకము నందలి భావముల యావేగమునకు ఆటంకము కలుగు నన ఒకే భావమును మూఁడు ప్రక్రియల ద్వారా చెప్పిన దానిని మాటిమాటికి చెప్పుచున్న నాటకము రోఁత కలిగించు ననుటలో నాశ్చర్య మేమి ?

ఆచార్యులు గారికి సంగీతమునందు మేరమీఱిన యభినివేశ ముండి యుండును. ఈయనయే కాక "సరస వినోదినీ సభ"లో నటించు నటు లందఱును కొద్దియో గొప్పయో సంగీతము నెఱింగిన వారుగా నుండి తీరవలె ననుట కీయన నాటకములలో నుత్తమ మధ్య మాధమ భేదము లేకుండ సర్వ పాత్రలకును పద్యములను రచించుటయే తార్కాణము. ఏదో యొక సందర్భమున పద్యమో పాటయో, పాడ నవసరము లేని పాత్రయే యీయన నాటకములలో నరుదు. పైఁగా నా కాలపువారు సహితము, సంగీతము నెడ మిక్కిలి యాదరము గలవా రగుటచే సామాజికుల పెక్కుర నాకర్షించుటకై యాచార్యులగా రీ పద్యముల తమ నాటకములలో సంగీతము వచ్చిన ప్రతి నటుని భాగమునం దెడనెడ రచించి యుందురు. ఈ విషయము చిత్ర నళీయ ప్రస్తావనము వలన తెలియుచున్నది.* దీనివలన వీరి నాటకముల కొక విధమయిన యనౌచిత్యము సంభవించు చున్నది. నీచపాత్ర భావ నిర్భరమైన పద్యమునే పఠించు నప్పుడయిన నొక విధమైన సమేతరత్వము గోచరించును. ఉత్తమ పాత్ర· పేలవమయిన పద్యములు చదువునప్పుడును నింతే. ఈ విధము నాటకపాత్రల నప హాస్యత్వము పొందించునే కాని నాటక గాంభీర్యమున (Grandeur) కు తోడ్ప డదు. ప్రకృతి వర్ణనము లెప్పుడయిన నుత్తమ పాత్రలచేతనే చెప్పించుట లెస్స. ఏలయన నప్పుడు గంభీరమయిన ప్రకృతికిని, గంభీరమయిన యుత్తమ పాత్ర స్థితి

---

* ఈ ప్రాంతము వా రదేమి కారణమో నాటకములఁ జూచునప్పు డందలి సంవిధాన చమత్కారకమును నర్థ వైశద్యమును కవితా చమత్కృతియు నంత సరకు చేయక సంగీతమున మాత్ర మెక్కువగా నభిలాష గలవా రగుటచే వారి సంతోషమునకై వచన సరణికిని పద్య సరణికిని కొఱఁత లేకుండఁ జేసినను, నందందు పాటల నైతము నెలకొల్పవలసి వచ్చెను.

కిని నానుగుణ్యము కుదిరి యుండును. ఇంతేకాని స్థిత్యనుగుణము కాని పద్య ప్రయోగము నాటక గౌరవమును ధ్వంసము చేయును.*[1]

సందర్భోచితముగ రసమయము లయిన చోట్ల పద్యముల రచించుటలో నెట్టి దోషమును లేదు. కాని నీరసవిషయమునకు సైతము పద్యమునే వాడినచో నందు పద్య రచనా కృచ్ఛ్రమే తప్ప రస పరిపోషణపాటవము కానఁబడదు. మఱియు సన్నివేశము యొక్క రామణీయకమును బట్టి పద్యమునకు గాంభీర్యమును బిగువును కలుగును. పద్యము యొక్క రస నిర్భరత్వమును బట్టి సన్నివేశము యొక్క మనోజ్ఞత్వ మధికము చేయఁబడును. పద్య సన్నివేశము లీ రెండును నితరేతరాశ్రయములు, అన్యోన్య పోషకములును. ఈ రెండును నీ విధముగా రచింపఁబడు నప్పుడే నాటకమునకు సౌందర్యమును చేకూర్పఁ గలవు. అంతేకాని నీ వెప్పుడు వచ్చితివి. నీ వారంపులును కుశలముగా నున్నారా" మొదలగు సాధారణ విషయములకుఁ గూడ పద్యము నుపయోగించుట పద్యమునకు లాఘవమును కల్పించుటయే. ఆచార్యులు గారి నాటక పద్యములలో నిట్టి నీరసములయిన పద్యములు పెక్కు గాన్పించును.*[2]

---

[1]* ఈ విషయములో A. Nicoll ఇట్లు చెప్పుచున్నాఁడు. "Let us suppose that three peasents are conversing and that the playwright has given to his Scene this abstract of what might have been heard in a real cottage; Let us then suppose that one of them asks the time and another answers. "Look the morn in Sun set mantle clad, walks over the dew of yon high East ward hill" and immediatley every audience would burst into roars of laughter. Yet the same audience would never dream of laughing at these very same words as spoken by Horatio because of the fact, that Shakespeare has chosen a certain conventional utterance for the characters in Hamlet with which the two lines are in complete harmony.

[2]* అనృతము కాని దంతయు
వినిపించితి నాదు సేవ ప్రియమైనను న
న్ననిచి కొనుము నీ డెందం
బున ననుమానించితేని పోయెద నధిపా.

చిత్రనళీయము - 69

బాహు: నీ వెవరు ?

భారతి: కూరిమి గల యంతఃపుర
చారిణి నీ భీమరాజ జంభారికి నీ

ఆంగ్ల నాటకములలో సాధారణముగా పాత్ర లన్నియు నొకే వృత్తములో (blank verse) సంవాదము చేయుచుండును. కావున నొక పాత్ర యొక పాదము యొక్క నడుమ తన సంభాషణము ముగింపఁగా రెండవ పాత్ర యందుకొని దానిని కొనసాగించుటలో నెట్టి వింతయును గానరాదు. కాని యాద్యంతము పద్య గద్య మిశ్రితము లయిన మన నాటకములలో నొక పద్యములో కొన్ని పాద ములు గాని, యొక పాదములో కొన్ని పదములు గాని, యొక పాత్రి పాడిన యనంతరము, రెండవ పాత్ర వానిని గొనసాగించుట వికృతముగా నుండును*. మఱియు ప్రయోగ దృష్టితో చూచినపుడు సైత మీ పద్ధతి యసహ్యముగానే యుండును. సంస్కృతిక లాక్షణికులు 'వాక్కేళి' యను నొక యంగమును సూచిం చిరి గాని యది యొక పాత్రయే పాదము నడుమ నాగి మరలఁ దానే దానిని కొనసా గించుటకుఁ గాని ఉక్తి ప్రత్యుక్తులకుఁ గాని యేర్పడి నట్టివి. ఆచార్యులు గారి నాట కములలో సీస, మత్తకోకి లాది మాలికలతో నిట్టి యుక్తి ప్రత్యుక్తులు పెక్కుచోట్లఁ గాన్పించును. కాని యీ ఉక్తి ప్రత్యుక్తుల కిట్టి పద్యములలో కంటె వచనములో నెక్కువ శోభ కనిపించును. ఏలయన నిట్టివి తఱుచు సాధారణ భావ సంగతములై యుండునే కాని పద్యోచితమయిన నిర్భర భావముతోఁ గూడి యుండవు. ఇట్లే ఆచార్యుల వా రిరువురు ముగ్గు రొకే ప్రయోజనముతో మాటాడునపుడు వారికి పద్య పాదములను కొంచె మెక్కువ తక్కువగా పంచిపెట్టుదురు. ఇట్టి వాయన మొట్ట మొదటి నాటకములలో హెచ్చు. మచ్చునకు చిత్రనళీయములో పౌరులు నలునితోపుష్క రుని దురాచారములు తెలుపు సందర్భము నందలి యొకపద్య మిట సూచింపఁ దగును.

---

కూరుచు సఖి దమయంతికి
భారతి యను ధాన, సరసపాక నిధానా !

చిత్రనళీయము — 104

నారదుఁడు :

కుసుమషట్పది.

శుభమె యశ్వపతి మీ
కుభయులకుఁ బుత్త్రికిని
సభవారి కెల్లరకు సంతోషమే
ఇభ హయ భటాదులకు
విభవంబులకు నెల్ల
నభయంబె ప్రజ కెల్ల నానందమే !

సావిత్రి — 35.

* ఆ రెండు పాత్రలు నా పద్య భాగముల నొకే రాగమున నొకే శ్రుతిలోఁ బాడలేక పోవుట తటస్థించినచో నది మఱియు వికృతముగా నుండును.

పౌరులు : భూప ఏమని మా పరితాప భంగి విన్నవించెదము.

నలుఁడు : అది యేమి యన్నలార !

పౌరులు : అధిప మీ పుష్కరుని దాడి.

నలుఁడు : అక్కటా విశారద ! ఎందు మొరయిడు వార కాదే.

ఇట్టి చిత్రములు, చిత్రనళీయములో నెన్నియో కలవు. దీనిని వచనములో రచింపఁగా వచ్చిన నష్ట మేమో, ఇట్లు పద్యముల వ్రాయుటలోఁ గల విశేష మేమో, యెంత యాలోచించినను నర్థము గాని విషయములలో నొకటి.

ఆచార్యులు గారి నాటములు రూపాంతరము దాల్చిన ప్రబంధములు. అందును వారి మొట్టమొదటి నాటకము లీ వాక్యమునకు మఱియును సరియైన నిదర్శనములు. వాని యందు ప్రబంధ లక్షణము లన్నియు కానిపించుచున్న వనవచ్చును. చిత్ర నళీయములో పురవర్ణన, వియోగ వర్ణన, చంద్ర మన్మథాద్యు పాలంభనము, శీతలోప చారములు మొదలగు ప్రబంధ సామాన్య లక్షణములు స్పష్టముగా గోచరించుచున్నవి కాని రాను రాను తరువాతి నాటకములలో నీ పద్ధతి కొంతవఱకు మాఱినది. ఈ మార్పే తొలుతటి నాటకములలో నున్నన్ని పద్యములు తరువాతి వానిలో నుండకుండుటకు కారణము. 18 వ శతాబ్ది యందును 19 వ శతాబ్ది పూర్వభాగము నందును నాంధ్ర కవులు వ్రాసిన ప్రబంధములు కేవల శబ్దార్థాలంకారమయములై మిక్కిలి క్షీణదశలో నున్నవి. పెద్దనాదుల ప్రబంధములలోని లక్షణముల ననుసరించి యూహా పూర్ణము లయిన (Fancy) యతిశయోక్త్యాదులలో శృంగారమును వర్ణించుట వానిలో సార్వత్రికముగఁ గన్పించు చున్నది. ఈ ప్రబంధ యుగము తరువాతనే యాంధ్రమున నాటకములు వెలయు టారంభమాయెను. అట్లు నాటకములను వ్రాయ నారంభించిన వారిలో నాచార్యులుగా రొకరు. అందుచే వీరి నాటకములలో నాంధ్ర వాఙ్మయ వాహిని ప్రబంధ పర్వతము నుండి నాటక సమప్రదేశమునకు వేగముగాఁ బ్రవహించు సంధి లక్షణములు (Characteristics of the transition period) కానిపించుటలో నాశ్చర్యము లేదు.

ఆచార్యులుగారు పురాణ ప్రబంధములలోని కథలనే మూలములుగ గ్రహించి యచ్చటచ్చట కొన్ని మార్పులఁ గావించుచు తమ నాటక వస్తువులను ప్రపంచించిరి. ముక్తావళికథ యొకటి మాత్రము స్వకల్పితముగఁ గానవచ్చుచున్నది. ఈయన్ని నాట

కములలో నాయన పద్యములను తాము స్వయముగనె రచించిరి. కాని వరూధిని, ప్రహ్లాద, రుక్మాంగద చరిత్రమను నీ మూఁడు నాటకములలో స్వరచిత పద్యములతో పాటు మూల గ్రంథములోని పద్యములను గూడ సందర్భోచితముగఁ బ్రవేశపెట్టిరి. వరూధినిలోని యన్ని పద్యములును కొంచెము మించు మించుగ మనుచరిత్రము లోనివే. ఆ పద్యములు మూల గ్రంథములలోనె నాటకోచిత శైలిని వ్రాయఁబడి యుండుటయు నా సందర్భములో నంతకంటె రసవత్తరములయిన పద్యములను రచించుట మిక్కిలి దుర్లభమగుటయు తలపోసి యాచార్యులుగా రీ పద్ధతి నవలంబించియుందురు. కాని మూల గ్రంథ పద్యములకును ఆచార్యులుగారి సొంత పద్యములకును నెక్కడను బోలికయే లేకుండుటచే నా రెండును గలుపఁబడినప్పుడు కొంత యసమత్వము కాని పించును. వచనమును మాత్రము స్వయముగ రచించి సందర్భోచితములయిన పద్యములను ప్రసిద్ధములయిన పురాణ ప్రబంధములనుండి గైకొను నాచారము యక్షగానముల యారంభదశలోఁ గానవచ్చుచున్నది. ఆ కాలమున పండితకవు లెవ్వరును యక్షగాన రచనకుఁ గడంగకపోవుటచే నంత పండితులు కాకపోయినను నాటక పద్ధతి నెఱింగిన యక్షగాన భాగవతు లెట్లో వచనమును కూర్చుకొని పద్యముల నీ పూర్వ గ్రంథములనుండి గ్రహించుచుండెడివారు. తరువాత విద్వత్కవులు గూడ నీ యక్షగాన రచనమునకుఁ బూనుకొని పద్య గద్యముల రెంటిని తామే వ్రాసిరి. వీధి నాటకములలోను నాగరక నాటక ప్రదర్శనములోను ఇప్పుడు సైతము సందర్భోచితముగ నొకే పాట పెక్కు నాటకములలో పాడఁబడుట, కానవచ్చుచున్నది.

సంస్కృత నాటకము లందువలె భావ తీవ్రత గల చోటనే యాచార్యులవారు పద్యముల వ్రాసియుండిరని చెప్పలేము. ఈయన యిట్టి సన్నివేశములలో పద్యముల వ్రాయుదురని చెప్పుటయు కష్టము. ఈయన మొట్టమొదటి నాటకమైన చిత్రనళీయములో నీ భావము – ఆ భావము అను వేఱుపాటులేక సర్వ భావములకు నవి తీవ్రములయినను మృదువులయినను పద్యములే కానవచ్చుచున్నవి. అసలీ నాటకమున వచనముకంటె పద్యములు హెచ్చు. పౌనరుక్త్య దోష నివారణమునకై వచనము నచ్చటచ్చట తగ్గించుచుఁ బోయినచో మొత్తము నాటకమంతయు కొంచెము మించు మించుగ పద్యమయమేయగుట సంభవించును. ఆచార్యులుగారి నాటకములలో ప్రబంధరూప మింతగా నచ్చుకొనిన నాటక మింకొకటి లేదు. రెండవదియైన సావిత్రీ చిత్రాశ్వమునఁ గూడ పద్యములు హెచ్చుగ నున్నను చిత్రనళీయమునందువలె మితిమీరి నన్ని లేవు. ఇతర నాటకములలో పద్యము లచ్చటచ్చటఁ గాన్పించును. చిరకారిలో మొత్తము పద్యముల సంఖ్య యిరువదికి మించదు.

సామాన్య భావముల వ్యక్తీకరణమునకే పద్యముల వాడు నలవాటు గల యాచార్యులుగారు భావ తీవ్రత గల చోట పద్యమును వ్రాయక యుండలేరు. * పద్యములేనిచో నట్టిచోట తాళ లయాన్వితమయిన పాటనైన వ్రాయుదురు. భరతుఁడు తన నిరపరాధిత్వమును వాదించువేళ భావములు తీక్ష్ణములే యయ్యు వచన రూపమునే తాల్చినవి గాని యిట్టివి నాటకములలో నెన్నో లేవు. ఇట్లే కోపము విచారము ఆనందము మొదలగు భావముల కుత్కర్ష సంభవించినప్పు డాయన పద్యములనే వ్రాయుచుండును. అందును శోకముయొక్క తీవ్రత్వమును వ్యక్తముచేయునప్పు డాయన పద్యమునో కీర్తననో వ్రాసి తీరును. కాని యాయన యీ పద్యములకు ముందుగ నా భావములనే వచనములో వ్యక్తము చేయుచుండును గాన చదువునప్పుడు వాని తీవ్రత్వము కొంత తగ్గినట్లు కాన్పించును. అందుచేతనే యాయన నాటకముల కాద్విరుక్తి గొప్ప కళంకముగా నున్నదని చెప్పవలసి వచ్చినది. ఆచార్యులుగారు తీవ్రభావములను వర్ణించునప్పుడువలెనె సామాన్య వస్తువులను, రూపములను వర్ణించునప్పుడు సైతము పద్యములను వ్రాయుదురు. ఈ పద్యములన్నియు ప్రబంధ పద్యములకు మిక్కిలి సన్నిహితముగా నుండును*. ఆంగ్ల నాటక కర్తలు పెక్కురు రంగ పరికరములు సరిగా లేనప్పు డా లోపమును కప్పిపుచ్చుటకై నాటకములలో వర్ణనములఁ గావించెడివారు. కాని తరువాత రంగ పరికరములు తగినన్నియున్నప్పుడు వానిని వ్రాయుట మానివైచిరి. సంస్కృత నాటక కవులలో కాళిదాసుకంటె భవభూతి యీ వర్ణనముల నెక్కుడుగాఁ గావించెను. అందుచేతనే దృశ్యకావ్యముగ శాకుంతలమున కున్నంత ప్రథ యుత్తర రామచరిత్రకు లేదు. మొత్తముమీఁద నీ వర్ణన బాహుళ్యము శ్రవ్య కావ్యమందువలె దృశ్యకావ్యముల నింపు నింపదు.

నాటకములలో పూర్వ కథను పాత్రచే చెప్పింపవలసిన యావశ్యకము కలిగినప్పుడు దానిని వచనములో సంక్షేపముగఁ జెప్పివైచుట యుక్తము. అట్టి కథనమునకు సైతము పద్యము నుపయోగించుట నాటకోచితము కాదు. ఒక విషయము

* (1) దశరథుఁడు రాము డడవి కేగువేళ విచారించు ఘట్టము. (2) విషాద సారంగధరమున రత్నాంగి పద్యములు (3) సుదేవుఁడు బాహుకుఁడు నలుఁడని యెఱుంగు ఘట్టము.

* 1. సారంగధరుఁడు పావురములను వర్ణించుట. 2. రుక్మాంగదుఁడు మోహినిని, నలుఁడు దమయంతిని వర్ణించుట. 3. నాయకులు నాయికల వర్ణించు పెక్కుచోట్లు. 4. నలుని వియోగ వర్ణనము. 5. చిత్రనళీయము, సావిత్రి మొదలగువానిలోని యుద్యానవన పుర వర్ణనలు. 6. ప్రమీలార్జునీయములో నర్జునుఁడు నగరము ప్రవేశించునప్పటి పురవర్ణనము మొ. 7. భారతి రాజును వర్ణించుట, సత్యవంతుని చీఁకటి వర్ణనము.

దాని నిసర్గ గౌరవముచే మొదటిసారి పద్యములోఁ జెప్పుట కర్తవ్యమైనను రెండవసారి చెప్పవలసినపుడు దాని గాంభీర్యము చాలవఱకు తగ్గియుండును. కాన పద్యోచితము కానేరదు. అందుచే నట్టివానిని సాధ్యమైనంతవఱకు వచనములోనే చెప్పవలయును. ఆచార్యులుగారి నాటకములలో నిట్టి కథన పద్యము లచ్చటచ్చటఁ గలవు. (సత్యవంతుడు తల్లి దండ్రులఁ జూచుట.) ఆయన వానిని సాధారణముగ పూర్వ కథ మఱల చెప్పవలసి వచ్చినప్పుడును శాస్త్ర వివాదము చేయవలసి వచ్చినప్పుడును సీస పద్యములలో చెప్పుచుందురు. పాంచాలీస్వయంవరము (బ్రాహ్మణుని యువతీ వివాహ ప్రసంగము.) సంస్కృత నాటకములలో కథాగమనమునకుఁ దోడ్పడు పద్యములు చాల తక్కువ. భాసుని నాటకములలో మాత్రి మట్టివి కొన్ని గలవని Keith పండితుఁడు నుడివెను. ఆచార్యులుగారి పద్యములలో కథాగమనమునకు సహాయకారు లగునట్టి పద్యములు గూడ కొన్ని గలవు. (దూతయైన నలుఁడు దమయంతితో సంభాషించుట.) భావ తీవ్రతగల పద్యములును కేవల వర్ణన పద్యములును తప్ప నాయన నాటకములలోఁ దక్కినవన్నియు నిట్టివే.

ఆచార్యులుగారు సంవాదమును పద్యములలోను పాటంలోను నడుపుట పెక్కునాటకములలో కానిపించుచున్నది. చిత్రనళీయమున నిట్టి వెన్నో కలవు. (పౌరులు పుష్కరుని దుశ్చేష్టలు చెప్పుట; నల దమయంతుల సంభాషణము; ఋతుపర్ణుని యాస్థానమున శాస్త్ర వాదము) ఈయన నాటకములలోని పెక్కు సీసమాలిక లీ ప్రయోజనము కొఱకే రచింపఁబడినవి. (వధ్యస్థలమున సారంగధరుఁడు - రత్నాంగి, ప్రహ్లాదుఁడు - హిరణ్యకశిపుఁడు - సానంద - సావిత్రి) కీర్తనలలో నిట్టివి లెక్కలేనన్ని (ఘటకేతుద్యుమత్సేనులు) - ఉక్తి ప్రత్యుక్తులను మత్తకోకిలాది గమనవేగము గల వృత్తములలో వెలయించు టీయన యలవాటు. (రత్నాంగి - చిత్రాంగి). ఏదయిన నొక విషయము నుద్ఘోషింపవలసినప్పు డీయన తఱుచు పద్యమునే వాడుచుండును. ప్రమీలార్జునీయమున గుఱ్ఱపు మెడకుఁ గట్టిన పద్యమును, ద్రుపదుఁడు స్వయంవర సభలో తన మత్స్య యంత్ర నియమమును గూర్చి చెప్పిన పద్యములు నిట్టివే.

## III

ఛందస్సు (His metres) :

లక్షణ గ్రంథములలో లక్ష్యము కొఱకు వ్రాయఁబడి నప్పుడు తప్ప నాంధ్ర వాఙ్మయములో నెచ్చటను గానిపించని యపూర్వ వృత్తము లాచార్యుల వారి నాటకములలో పెక్కు కాన్పించును. అవి గేయ ప్రాయములు గాన పాడుట కనువుగా

నుండునని సంతోషించెద మన్న నావల నసలైన పాటలే యుండఁగా వీనికా ప్రయోజ నమును లేదు. మొట్టమొదట పాటలుగ వ్రాయఁబడి తరువాత వృత్తరూపము దాల్చిన పద్యములు కూడ నైదాఱు కలవు. వీని కాచార్యులు గారు తమ యిచ్ఛవచ్చిన రీతి నామ కరణము గావింతురు. బాల కోకిల, చంద్రానంద, రాజహంస, సురానంద మొదలగు వృత్తము లిట్టివే. ఆచార్యులు గారు మొత్తము మీఁద తమ నాటకములలో సుమారు 45 విధముల వృత్తములు వాడిరి. కాని యీ వృత్తములు తమ యభిధాన పదముల యర్థ భావముల కనుగుణము లైన సన్నివేశములందె వాడఁబడిన వని చెప్పలేము. యాదృచ్ఛి కముగఁ దప్ప నిట్టి సంయోగము వానికి లభింపదు. తిక్కనాది కవుల రచనములలోఁ గూడ నిట్టి యర్థానుసారివృత్త ప్రయోగము కానరాదు. అట్లే యాచార్యులుగారును శార్దూల మత్తేభములను శృంగార రస సందర్భములందును, చంప కోత్పలమాలలను కోప సమ యము లందును వాడుట కలదు ఈయనకు సీస పద్యములు వ్రాయుట మిక్కిలి యిష్టము. ఈయన వ్రాసిన 750 పద్యములలో సీసములు సుమారు రెండు వందలు కలవు. తీవ్రమైన భావమును విస్తరముగా వర్ణింపవలసి వచ్చినప్పుడు కాని, నగరా రామ, రమణీ వర్ణనములందుఁగాని యీయన సీస పద్యములనే వాడుచుండును. సీస మాలికల నీయన సంవాదమునకై యుపయోగించు చుండును. ఈయన నాటకముల లోని సీస మాలిక లన్నియు "ద్విపదలాగు" రూపమున నున్నవి.

ఈయన వాడిన కంద పద్యముల సంఖ్య మొత్తము పద్యములలో నైదవవంతు నకుఁ జేరువగా నుండును. ఈ కందము లిట్టి సందర్భములో వ్రాయఁబడె నని నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు. ఈ పద్యములలో రసవంతములయినవి నూటికి పదియైన నుండవు. వీనిలో పెక్కు అస్థానపతితము లగుటచే మిక్కిలి పేలవముగ నున్నవి. వృత్తములలో నీయన యుత్పలమాలలను విరివిగా వాడెను. మత్తేభ శార్దూల ములు రెండును కొంచెె మించుగా సమానముగా నున్నవి. కోపమును గాని మఱి యే తీవ్ర భావమును గాని వ్యక్తము చేయవలసి వచ్చినప్పుడీయన తఱచుగా నీ వృత్త ముల వాడుచుండును.* మత్తకోకిలల నాయన సంవాదమునకై యుపయోగించును. (విషా). ఈయనకు తేటగీతిపై నున్నంత యభిమాన మాటవెలఁదిపై లేదు. సీసములందు సైత మీయన తేటగీతినే వాడుచుండును. ఈయన చిత్రనళీయమునఁ దప్ప నితర నాట కములలో చివర నున్న యుత్తర రంగములందుఁ గాక మఱి యెచ్చటను ద్విపదలను వాడి యుండలేదు. చిత్రనళీయమునఁ గల ద్విపదలు రెంటిలో నొకటి సంవాద రూప మున నున్నది. ఈ నాటకముననే భారతి దమయంతికి వేర్వేఱు రాజులను నిరూపించు నప్పుడు వృత్త వైవిధ్యము గలదు. నలునిఁ గూర్చి చెప్పిన పద్యము మత్తకోకిలలో

* ప్రమీ. 16. 18-26. చంద్రి. 58. సారంగ. 68. ముక్తావళి 24. చిత్ర 85.

నున్నది. దమయంతి నలేతరులయిన రాజుల నొల్లకుండుటకు కుంటువడిన గమనము గల యా యపరిచిత వృత్త ప్రయోగము కూడ కొంత తోడ్పడియుండును. ఈయన లయగ్రాహి, కవిరాజ విరాజితము, మానిని, సుగంధి, క్రౌంచపదము, మేఘవిస్ఫూర్జితము, ద్రుతవిలంబితము, సురానంద మొదలగు నితర వృత్తముల నెన్నిటినో వాడెను. సావిత్రి చిత్రాశ్వము నందు త్రివిధములయిన షట్పదులను రచించెను. అవి కీర్తనలకు సన్నిహితమైన గమనము కలిగియున్నవి.

ప్రబంధ కవులు తఱచుగ నుద్యాన వనమున నాయిక చెలికత్తెలతో పుష్పాపచయము చేయు సందర్భమున రగడలను వాడుదురు. వీనిలో యతి ప్రాసములతోపాటాంగ్లము నందలి "రైమును" బోలిన యంత్య ప్రాసము లుండును. ఇట్టి రగడల నాంధ్ర నాటకములలో నీయన తప్ప మఱెవ్వరును వాడియుండలే దనుకొందును. ఈ రగడ లాచార్యులు గారికి ప్రబంధములపైఁ గల యాదరమునకును, వారి నాటకములపై ప్రబంధములకుఁ గల ప్రభావమునకును దార్కాణములు. చిత్రనళీయమున నలుఁడు గావించిన పుర వర్ణనము హరిణ గతి రగడలో నున్నది. ప్రథమాంకమున నల దమయంతుల యుద్యానవన విహార సందర్భమునఁ గల వృషభ గతి రగడ సంవాద రూపమున నున్నది. సావిత్రిలో సావిత్రి వన విహార సందర్భము నందలి మధుర గతి రగడ సైత మిట్లే సంవాద రూపమున నున్నది. ఆచార్యుల వారి నాటకములలోని ప్రబంధ లక్షణముల కీ రగడలు మంచి నిదర్శనములు.

కష్టపడి ప్రయత్నించి యనేక విధముల వృత్తములను వ్రాయవచ్చును. కాని వానిలో సాధారణముగ మన ముపయోగించుట కలవడిన చంపక మాలాదులలోని ధార యగపడదు. అపరిచిత వృత్తములు మహాకవి వ్రాసినను వాని గమనము కుంటువడి రససిద్ధి కాటంకము గల్గించును. అందును నాటకములలో వివిధ వృత్త ప్రయోగము కవి వృత్త పరిజ్ఞానమునకుఁ దార్కాణముగ నుండునేమో కాని రససిద్ధి కే విధమున దోడ్పడదు. తిక్కన స్త్రీ పర్వములో వివిధ వృత్తములను వాడెను. అచట దానికి కొంత ప్రయోజనము కలదు. అది కరుణ రసమయమైన పర్వము. ఈ రసము గీతములలో వ్యక్తము చేయఁబడినచో మిక్కిలి సహజముగను నుండును. అందుచే తిక్కన యా పర్వమున గీతికా ప్రాయములయిన యా వృత్తముల వాడెను. అది యచ్చట రసానుగుణముగనే యున్నది గాని తద్వ్యంజకముగ లేదు. ఆచార్యుల వారి వివిధ వృత్త ప్రయోగమున కిట్టి కళా సంబంధి ప్రయోజన మేదియు లేదు. వచ్చిన లక్షణ జ్ఞానము నూరక పోనీ నేల యని యాయన వాని నెడనెడ వాడియుండును. అనావశ్యకముగాఁ బ్రయోగింపఁబడిన యీ వివిధ వృత్తము లాయన

నాటకములలోఁ బద్యములకు సహజముగ నుండవలసిన మాధుర్యమునకు కొఱఁతఁ గలుగఁ జేసినవి అస లాచార్యుల వారి నాటక పద్యములలో భావగాంభీర్యము తక్కువ. వానికి భావ పౌనరుక్త్యమును నపరిచిత వృత్త ప్రయోగమును మఱింత లాఘవమును గల్పించినవి.

## IV

### కీర్తనలు :

ఆచార్యులుగారి నాటకము లన్నిటిలోను చివర ననుబంధముగాఁ గీర్తనలు గలవు. * మొట్టమొదట నాయన యీ కీర్తనలను నాటక శరీరముననే సందర్భోచితముగ రచించెను గాని నాటకములలో గేయము లుండు టాక్షేపణీయమని యెంచుటచే మధ్య మధ్య ననుబంధములచే సూచించుచు వీని నన్నిటిని జివర వేఱుగా ముద్రించిరి. "ధీర నాటకములకు పాటలు ముఖ్యములు కావనియు, మీఁదు మిక్కిలి పాటల వలన నెప్పటికిని భావ ప్రకటనము సురుచిరముగాఁ గలుగఁజాలదనియు, నాటకములను గేయ భూయిష్ఠములుగ ముద్రించుటకు సాధ్యములేవనియు" నాయనయే చిత్రనళీయ ప్రస్తావనయందును విషాద సారంగధర పీఠికయందును నుడివియు నా ప్రాంతములవారి సంగీతాభిలాష కనుగుణముగ సంవిధాన సందర్భము ననుసరించి వచన సరణికిని, పద్యసరణికిని గొఱఁత లేకుండ నందందు పాటల సైతము నెలకొల్పిరి. కాని చిత్రనళీయమున రెండును, విషాద సారంగధరమున రెండును, గ్రంథాంతరస్థములుగనె కన్పించుచున్నవి. మొత్తము మీఁద నాచార్యులుగా రీ కీర్తనలు ప్రజల యభిరుచిఁ బోషించుట కొఱకే వ్రాసిరనియు, స్వయముగా వానిని నాటకములఁ బ్రవేశపెట్టుట కాయన కిష్టము లేదనియు స్పష్టపడుచున్నది. ఆయన తమ సమాజము వారికై నాటకముల రూపమును ముందెట్లు కూర్చినను వానిని లోకసాధారణముగా నిచ్చునప్పుడు మాత్రము నిర్దుష్ట రూపముగనే యర్పింపవలయునుగదా !

సాహిత్య దర్పణమున గేయపదాది దశవిధ లాస్యాంగములు సూచింపఁబడినవి. తంత్రీ భాండమును పురస్కరించుకొని కూర్చుండి పాడఁబడు శుష్కమయిన గానము గేయపదము. నాగానందమున మలయవతి గౌరీ గృహమున వీణను వాయించుచుఁ బాడిన "ఉత్ఫుల్లేత్యాది" శ్లోక మిట్టిదే. నిలుచుండి మదనోత్తాపితయైన కాంత ప్రాకృతము నాశ్రయించి పాడు గానము స్థితపాఠ్యము అభినవ గుప్తాదుల యభిప్రాయము ప్రకారము క్రోధోద్భ్రాంతయైన స్త్రీ చేయు ప్రాకృత పఠనము సైతము

* ఒక్క యజామీళ చరిత్రమున మాత్ర మిట్టి కీర్తనలు లేవు.

స్థితపాఠ్యమే. శోకాన్విత యగుటచే నపరిసాధితాంగియైన స్త్రీ కూర్చుండి యాతోద్య విరహితముగ పాడు పాట యాసీనము. స్త్రీపుం విపర్యాస చేష్టా సహితమై యాతోద్య మిశ్రితముగ వివిధ చ్ఛందముల నాశ్రయించి పాడఁబడు గేయము పుష్ప గండిక. పతి నన్యాసక్తుఁడుగాఁ దలఁచి ప్రేమ విచ్ఛేదమన్యునయిన కాంత వీణా పురస్సరముగ పాడు గానము ప్రచ్ఛేదకము. స్త్రీ వేషధారులైన పురుషుల శ్లక్ష్ణమై నాట్యము త్రిగూఢకము. సంకేత స్థలమునకు నాయకుఁడు రాక ప్రతారింపఁగా నాయిక వీణాది క్రియా సహితముగాఁ బ్రాకృతము నాశ్రయించి పాడు గానము సైంధవము. చతురస్ర పదమును ముఖ ప్రతిముఖాన్వితము నగు గీతము ద్విగూఢము. కోప ప్రసాదజమును హావహేలాన్వితమునై రసోత్తరముగ పాడఁబడునది యుత్తమకము. సోపాలంభమును నుక్తిప్రత్యుక్తి సంయుక్తమునై విలాసముతోఁ గూడియుండు గీతార్థ ముక్తిప్రత్యుక్తము (సా. ద.) నృత్తము గానమని ఆతోద్యమని రెండు విధములు. ఈ పై గీతములన్నియు నా గానాతోద్యముల సన్నివేశములవలన కలిగినవే కాని పాత్రల యభినయమునకు నిసర్గముగ సహాయపడునట్టివి గావు. సంస్కృత లాక్షణికులు నాటకముల లోని సంగీతములను గూర్చి యంతగా నుడివియుండలేదు. కాని యొక్కొక్క రస భావమున కొక్కొక్క రాగమే యనుగుణముగ నుండుననియు, నొక్కొక్క యభినయ విశేషమున కొక్కొక్క యాతోద్యమే (accompaniment) సరిపడుననియుఁ దలంచుట మాత్రము స్పష్టము. ఈ విధముగ విషాదాన్వితములైన పాత్రలకు ద్విపాదికలును, సామాజికులకు నూత్న పాత్ర ప్రవేశమును వెంటనే తెలుపుటకు ధ్రువలును నిర్ణయింపఁబడినవి.

సంస్కృత నాటకములలో గీతగోవిందములో నున్న పాటలవంటి పాట లెచ్చటను గనరావు (శ్రీ.రా.అ.9.) రత్నావళిలో ద్విపద ఖండము, చర్చరి మున్నగు నొకటి రెండు గీత ఖండములున్నను అవి పాత్రల యభినయమునకు సహజముగాఁ దోడు పడు నట్టివి కావు. తుదకు త్ర్యస్రగతిలోనో చతురస్రగతిలోనో తాళమార్గము ననుసరించి విధింపఁబడిన నాందిని గూడ సంస్కృత నాటక కర్తలు ఒక వృత్తముగా మార్చుకొనిరి. కొన్ని నాటకములలో నాతోద్యసహితముగా పాడఁబడు శ్లోకములు కానవచ్చుచున్నవి. అవి యచ్చటి భావముయొక్క నైశిత్యమును బట్టి గీతికాప్రాయములైనట్టి వృత్తములే కాని గేయములు కావు శాకుంతలములో నైదవ యంకమునందలి హంస పదికగానమును, ప్రస్తావనలోని నటి వసంతవర్ణనమును, విక్రమోర్వశీయములోని నాల్గవ యంకమునందలి గేయప్రాయములయిన శ్లోకములును నిట్టివే. వీని ముందు "గీయతే" అని కవి గావించిన సూచన యుండుట కలదు. ఇవి సాధా

రణముగా స్త్రీ పాత్రల చేతనే పఠింపఁబడుచుండును. శాకుంతలమున సూత్రధారుఁడు నటి గానమయిన తరువాత "తవాస్మి గీతరాగేణ" అను శ్లోకమున దానిని గీతమని నుడివెను. కాని యది ఆర్యావృత్తమునందే యున్నది.

ఆంగ్ల నాటకములలో నచ్చటచ్చట కీర్తన లుండుట కలదు పాటయే వారి విషాద నాటకములకు మూలము. గ్రీకు నాటకములలో నిట్టి పాటలు (songs) విరివిగా కలవు. Shakespeare మొదలగువారు, తమ నాటకములలో (blank verse) ను వాడుటచే నీ పాటలను కొంతవఱకు తగ్గించిరి. కాని అసలు వాడకుండలేదు. ఇంతే కాక ఆంగ్లమున నాద్యంతము పాటలతో నిండియున్న "opera" లనఁబడు నాటకములు గలవఁట.

పద్యములలో యతి ప్రాసముల మూలమునను, ఛందస్సు మూలమునను, లయాధిక్యము కలుగుచుండును. కీర్తనలలో తాళము కూడ నుండుటచే నది మఱింత యధికముగ నుండును. అందుచే నివి సాధారణముగ పద్యముల వలెనే భావ తీవ్రత గల చోట వాడఁబడుచుండును. భావ తీవ్రత యున్నను అన్ని రసములకు నవి యుపయోగ పడవు. మఱియు తీవ్రత లేకపోయినను రామణీయక మున్నచో కీర్తన సొగసుగానే యుండును. ఆచార్యులు గారు శోక తీవ్రత కలచోటను, భక్త్యావేశము కల చోటను సాధారణముగా కీర్తనలను వాడుచుందురు. ప్రకృతి వర్ణనమునకును వ్యక్తి వర్ణనమునకును గూడ నాయన వీని నుపయోగించుట కలదు. రంగము మీఁదికి పాత్ర ప్రథమమున ప్రవేశింపఁగనే సమయానుకూలముగ నొక కీర్తన రచించు టాయన యలవాటు. ప్రణయ సంవాదములను పెక్కింటి నాయన కీర్తనలలోనే రచించెను. అందును ప్రణయులలో నొకరికోరికను మఱియొక రుల్లంఘించు సమయము నందలి ఉక్తి ప్రత్యుక్తుల నాయన తప్పక కీర్తన రూపముననే వ్రాయును. (విషాద సారంగధర) మఱియు నుక్తి ప్రత్యుక్తులు పెక్కులు ప్రణయ సంబంధులు కాకపోయినను, Dialogue రూపముననే యుండును*. (ద్యుమ. ఘటకేతుఁడు; సుబుద్ధి, సారంగధరుఁడు) పదిమంది చేరి యొకే కార్యమును చేయునపుడు వారందఱును కలిసి పాడుట కాయనకీర్తనసేరచించును. చిరకారిలో దొంగలు; సారంగధరుని పావురముల యాట) ఆయన కీర్తనలు సంవాద రూపమున నున్నవి తప్ప తక్కిన వన్నియు భావ సంగ్రహము కలిగియుండును. వానిలోని భావము వానికి పూర్వముననో పరముననో కానఁబడు వచనమునందో పద్యమునందో వ్యక్తము చేయఁబడుట, సర్వత్ర కానఁబడు

* ద్యుమత్సేన ఘట కేతుల యొక్కయు, సుబుద్ధి సార గధరుల యొక్కయు సంవాదములు.

చున్నది. ఆచార్యులు గారీ కీర్తనలను, సామాజికుల యభిరుచి పోషణను కొఱకును, నటుల యానుకూల్యము కొఱకును మాత్రమే రచించుటచే వీనిని తొలగించినను నాటక కథాగమనమున కాటంకము కలుగదు. ప్రదర్శన సమయమున నివి నాటకముల కందమును చేకూర్చుట వానిని జూచిన వారి కెల్ల విదితమే.

ఆచార్యులుగారి నాటకములలో పద్యముల కంటెను గేయముల కంటెను శక్తిమంతమయినది వచనము. ఈయన తొలుఁదొలుతటి నాటకములలో పద్యములను బహుళముగా వాడినను, క్రమక్రమముగా వానిని తగ్గించి వచనమునకే ఎక్కుడు ప్రాధాన్య మొసంగిరి. అన లీయన పెక్కు నాటకముల మొట్టమొదట వచనములోనే వ్రాసి తరువాత సందర్భోచితముగా నీ పద్య గేయముల ప్రవేశపెట్టి యుందు రని యిదివఱకే సూచింపఁబడినది. ముందు వచనములో వ్యక్తము చేయఁబడిన భావమే తరువాత పద్యములో వ్యక్తము చేయఁబడుటయే దీనికి బలవంతమయిన నిదర్శనముగా నున్నది. భావమును పద్యములో కంటె వచనములో ధారాళముగను సవిస్తరముగను వెలువరించుట కెక్కువ యవకాశము కలదు. యతి ప్రాసాది నియమముల యాటంక మిందు లేకుండుటచే భావ వ్యక్తీకరణమున కవి కొంచెమయినను క్లేశ పడఁడు. కాని పద్యములలో యతి ప్రాసాదులు రచనా సమయమున కొంత క్లేశ కారులే యయ్యు పఠన సమయమున లయాధిక్యమును గలిగించుటచే, నిచ్చిన కష్టమునకు రెండింతలుగా ఫలించును. ఆచార్యుల గారి పద్య రచనలో నంత పాటవము కానిపించదు గాని, యాయన వచనములలో మాత్ర మపారమయిన శక్తితోపాటు మార్దవ సౌందర్యములు గూడ రూపొందియున్నవి.

నాటకమునకు సంవాదము (dialogue) ప్రాణము వంటిది. ఈ సంవాదమునకు వచనము వలె పద్య మంతగా పుష్టి నొసగలేదు. ఆచార్యులు గారు కొన్ని సంవాదములను పద్య గేయ రూపమునఁ గూడ వెలయించి యున్నను పెక్కింటిని వచనముననే వ్రాసియుంచిరి. ఈయన పాశ్చాత్య నాటక ఫక్కి ననుసరించి తమ నాటకములలో పెక్కు స్వగతములను రచించిరి. ఇవి తఱుచుగా నా యా పాత్రల యథార్థ శీల ప్రదర్శనము ద్వారా నాటక కథాగమనమున కెంతయో తోడ్పడును. ఇట్టి వానిని పద్యములలో సైతము వ్రాయుటకు వీలున్నను ఆచార్యులు గారు సాధారణముగ వచనముననే వ్రాయుచుందురు. (చిత్రాంగి, నీలకేతుఁడు, నలుఁడు, కుంభీనసుఁడు, మొదలగువారి స్వగతములు) ఇట్టి వీయన నాటకములలోఁ గొంచెము దీర్ఘము లయినను రస పోషకములుగా నున్నవి.

ఆచార్యులు గారు వస్తు నిర్మాణమున నుత్తరముల సాహాయ్యమును గైకొనుట పెక్కు నాటకములలో కానిపించును. (చిరకారి, విషాద సారంగధరము, చంద్రహాస, పాదుకా పట్టాభిషేకము). ఇవియును నాటక కథా ప్రకాశనమునకే యుద్దేశింపఁబడనవి కావున సర్వత్ర వచనముననే వ్రాయఁబడి యున్నవి. ఇట్లే యాచార్యులు గారు శాస్త్ర ప్రసంగములు వచ్చినపుడును, పాత్రల యంతః క్షోభమును వర్ణింపవలసి వచ్చినపుడును వచనమునే యుపయోగించుచుందురు. ఆయన పద్యములను పాత్రల తారతమ్యముల నెంచకుండఁగనే యథేచ్ఛముగ నుపయోగింతురని చెప్పుటకేదో విధముగ పాటయో పద్యమో పాడవలసిన యక్కఱలేని పాత్ర మాయన నాటకములలో లేదని చెప్పఁబడినది. కాని యీయన నీచ పాత్రలకు తఱుచు వచనమునే వాడుచుండును. (దొంగలు, చిరకారిలో, రాక్షసులు, ప్రహ్లాదలో - చెలికత్తెలు, దాసీ వాండ్రు.)

ఈయన నాటకములలోని వస్తువులు కొంచె మించు మించుగా నన్నియు ప్రఖ్యాతములగుటచే వానిలోని జీవితము తఱచు రాజప్రాసాదములకు సంబంధించినదే కాని సాధారణమైనది గాదు. కాని యీయన నాటకములలో నెడనెడ సందర్భోచితముగా కొన్ని సామాన్య జీవిత ప్రదర్శకములగు రంగములను సృష్టించుచుందురు. ఆ రంగములు సాంఘిక నాటకములలోని రంగములవలె నుండును. పాంచాలీ స్వయంవరమునను, చిరకారి నాటకమునను, విషాద సారంగధరమునను నిట్టి రంగము లొకటి రెండు కాన్పించుచున్నవి. విషాద సారంగధరము నందలి న్యాయస్థాన రంగమునను, చిరకారి నాటకములోని మూఁడవ యంకమునందలి కొన్ని రంగములలోను, పద్య ప్రయోగము మిక్కిలి రసభంజకముగా నుండును. అవి సాధారణ జీవితము నందలి కొన్ని సన్నివేశములకు ప్రతిబింబములు. ఆచార్యులుగారు బాగుగా నాలోచించి వానిని వచనములోనే రచించుట యా రంగముల కెంతో సౌందర్యమును కలిగించుచున్నది. ఈ విధముగనే యాచార్యులుగారు హాస్యరస పోషకములైన రంగముల నన్నిటిని వచనమున వ్రాయుటలో నౌచిత్యము కలదు. అసలు మన వారిలో కావ్యముల నయమైన హాస్యమును బ్రదర్శించువారే యరుదు. అందును యతిప్రాస నిబద్ధమైన వృత్తములలో నా రసమునకు సమగ్ర పుష్టిని చేకూర్చుట ఎంతటి మహాకవులకైనను దుర్లభమే. అదిగాక హాస్యమునకును నుదాత్తత్వమునకును చాల దూరమని Gold smith చెప్పిన విధముగా నది పెక్కుచోట్ల నీచ మధ్యమ పాత్ర ప్రయోజితమయియే యుండును. పద్యములకంటె వచనమే యిట్టి వారి భావ వ్యంజనమున కెక్కువ సహజమయిన సాధనము.

శై లి :

సామాన్య లక్షణములలో కంటె రచనలో నాచార్యులుగారి నాటకములు ప్రబంధములకు సమీపతరములుగా నుండును. ఆయనకు పురాణ కవుల భాషా రచనముపై కంటె ప్రబంధ కవుల శైలిపై నభిమాన మెక్కువ. ఈ యభిమాన మీయన నాటకములలో గద్య పద్య గేయములు మూఁడింటియందును కానిపించుచున్నది. ఈయన ప్రబంధ కవులవలెనే భావమునకంటె శబ్దమున కెక్కుడు ప్రాధాన్యము నొసఁగును. వారివలెనే ఈయనకు శబ్ద చిత్రముపై నాదర మెక్కువ. శబ్దాలంకారముల నీయన ప్రియత్నించి వాడుచుండును. శ్రవ్య కావ్యములలోనే శబ్దాలంకారమయమయిన చిత్రకవిత్వమునకు మర్యాద తక్కువ. అట్టియెడ దానికి నాటకమున నడుగుపెట్టుటకే యవకాశము లేదు. శబ్దాలంకారములకు భావమును మఱుగుపఱుచు గుణము గూడఁ గలదు. దీర్ఘ సమాసములవలెనే యివిగూడ నాటకమున తప్పక పరిహరింపఁదగినవి. అవి సామాజికునకు పద్యార్థమును సరిగా బోధపడనీయక నాటకమువలన నాతఁడు పొందఁదగిన రసానందమునకు విచ్ఛిత్తి కలిగించును. ఆచార్యులుగారికి ప్రబంధ పద్ధతి బాగుగ నలవడినది. (సీసములందును కందములందును; కందములకంటె సీసములం దెక్కువ.) ఆయన సీస పద్యములు భావమునందును నడకయందును, శబ్ద రచనయందును ప్రబంధ పద్ధతిని పూర్ణముగ ననుకరించుచున్నవి. పెక్కు సీసపద్యములలో ననుప్రాసములును యమకములును విస్తారముగ కానిపించును. వీనిలో నీయన ప్రతి నాటకమునందు నెక్కడనో యొకచోట రాగముల నామములను కష్టపడి చొప్పించుచుండును. ఆ పద్య పాదములను నటుఁడు పఠించునపు డా యా పాదములను తదారంభగతమైన రాగమునందే పాడవలెనని యీయన యూహయై యుండును. * వృత్తాదులయందును, ఇతర పద్యములందును నిట్టి శబ్ద చిత్రములు తక్కువ. ఇట్టి

---

* ఈ పద్యములలోఁ దఱుచుగా నీయన ప్రాసయతినే వాడుచుండురు.

సరస వినోదినీ సభలోని నటకులు పలువురు విద్యావంతులు. రాగమునం దంతయో యింతయో పరిశ్రమ గలవారు. ఆచార్యులుగారీ రాగ ముద్రిత పద్యములను తఱచుగా సంగీతము వచ్చిన నటుని భాగమునందే వ్రాయుచుండుదు వారు తామే యభినయించు నాటకములలో తమ భాగమునందే (Portion) వీనిని వ్రాసియుండిరి.

ఈ పద్యములం దీ రాగములు కొన్ని యచటి రసమున కనుకూలముగా లేవని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, నాటకోపన్యాసములలో వ్రాసిరి. అనుగుణముగ నున్నను అవి భావముల పోషించు ననుటకు వీలులేదు.

యను ప్రాసాది కృత్రి మాలంకారము లున్నయెడ తప్ప నీయన పద్యములలో క్లిష్టత్వము లేదు. దీర్ఘ సమాసముల సంఖ్య తక్కువయే కాని యున్నచోట నవి పేలవముగా కూర్పఁబడినవి. భాషా విషయమున నీయన పద్యములఁ గూర్చి చెప్పఁదగిన విశేష మేదియు లేదు. అవి యన్నియు ప్రాఁత పద్ధతివే.

"ఆచార్యులు గారి కీర్తనలు త్యాగరాజ కృతుల మచ్చులో మొదలై కడకు పార్శీ మట్ల క్రిందికి దిగినవి. ఈ మెట్లను కల్పించుటలో నా కాల మందలి గొల్లప్ప యను నట్టువ ఫిడేల్ పండితుఁడు చాల సహాయపడినాఁ డని వినికి. కృష్ణమాచార్యులకు సంగీత మం దభిరుచియే గాని పరిశ్రమము చాలదని నా యాశయము. ఈ యభిరుచిని గూడ నభినేతల యానుకూల్యమును గమనించి, యాయన క్రిందికి దించుకొనును. మెట్ల వరుసలోని క్రొత్తఁదనముదప్ప భాషా భావాదులలో మొత్తము మీఁద వానియం దే విశేషమును కనరాదు. వీ లయినచోట్ల వీనిలో సైత మీయన యనుప్రాసాదుల నుపయోగించుచునే యుండును." నీచులు పాడుకీర్తనలు పెక్కు గ్రామ్యములో నున్నవి. (చిరకారి దొంగలు—పాంచాలీ స్వయంవరము, కుమ్మరి గుండప్ప, అతని భార్య). ఈయన నాటకము యొక్క ఆద్యంత మంగళ గేయముల నాత్మ నామాంకితములుగా నొనర్చు చుండును. పద్యములయందు వలెనే కీర్తనలయందు సైతము భావ గాంభీర్యము తక్కువ. సంగీతము రాకపోవుటచే వానిని చదువు పద్ధతి, తెలియనివాఁడ నగుటచేఁ గాఁబోలు నా కీ కీర్తనల గమనము, మిగుల కుంటు గలదివోలె కానిపించెను. కాని సంగీతము బాగుగా తెలిసిన శ్రీ శర్మగా రాచార్యులుగారి కీర్తి కాయన పద్యము లెంత కారణమో పాటలు సైత మంతే కారణ మని నుడివి యుండుటచే నా యభిప్రాయమునే స్వీకరింతును.

ఒక్క చిరకారిలోఁదప్ప తక్కిన అన్ని నాటకములందు నుత్తమ మధ్యమ పాత్రలకు సంబంధించిన వచనముసైతము గ్రాంధిక భాషలోనే వ్రాయఁబడినది. అఘోరుఁడు, కుమ్మరి గుండప్ప, దొంగలు మొదలగు నీచపాత్రల కన్ని నాటకములలో గ్రామ్యమునే వాడిరి. చిరకారిలో నా విటుల ప్రసంగములయం దచ్చ టచ్చట నాంగ్ల పద ప్రయోగము గూడఁ గాన్పించు చున్నది. ఆచార్యులుగా రీ యొక్క నాటకమునందు నొక్క యంకమునందు మాత్రమే యిట్టి మిశ్రభాష నేల యుపయోగించిరో తెలియదు. వారు బళ్ళారి జిల్లా వా రగుటచే నాయన వాక్య యోజనలో నాకు వింతఁదనము గాన్పించినది. అందును గ్రామ్యభాష (అచ్చటి నీచుల వాడుక భాషగాఁబోలు). నాకు ప్రయత్నము మీఁదఁగాని యర్థమేగాలేదు. దానికి ఆ పదము లందలి యెక్కుడు

వైరూప్యమే కారణమై యుండును. ఆచార్యులుగారు వచనములో దీర్ఘ సమాసములు వాడుటయు నవకాశము గలచోట్ల సంబోధనాదుల యం దనుప్రాసాదులు వాడుటయుఁ గలదు. (దశరథుఁడు కైకను సంబోధించుట—భరతుఁడు పాదుకలఁ గూర్చి పలుకుట). ఈయన రచనము రసవంతమై మృదులమై నాట కోచితముగా నున్నది. కాని యీయన పాత్రల నోట పలికించిన వచనములు పెక్కు సంవాదరూపమున (dialogue) లేక పెద్ద పెద్ద యుపన్యాసముల వలె నుండును. అందుచే నాచార్యులు గారు, వాని దైర్ఘ్యమును పెక్కుచోట్ల తగ్గించి యుండవలసినది. (ప్రమీలా, సారంగధర, చంద్రహాస, పాదుకా, ముక్తావళీత్యాదులు).

---

# 10. ఆంధ్ర నాటక పితామహుని జీవతత్త్వ వ్యాఖ్యానము-సాంఘిక రాజకీయాద్యాశయములు

## I

నాటకము ప్రాణికోటి సుఖ దుఃఖములతో, జయ పరాజయములతో, ఉచ్చనీచ దశలతో, ఇంతయేల తజ్జీవితముతో, మిక్కిలి సన్నిహితమైన సంబంధము గలది. కాన మానవ జీవిత ప్రతిబింబమే నాటకమనఁదగును. నాటక వస్తువు సర్వసాధారణముగా బహుముఖమైన యీ మానవ జీవితముయొక్క యేదో యొక యంశమును ప్రతిపాదించుచుండును. అందుచే నాటక కర్త మనఃపూర్వకముగా జీవిత ధర్మమును గూర్చి కొన్ని యభిప్రాయములను వెలిపుచ్చుటకు ప్రయత్నింపక పోయినను అతని నాటకమున తద్గతములయిన పాత్ర సన్నివేశముల నావరించుకొని స్వల్పములైనవో యుత్కృష్టములైనవో కొన్ని జీవతత్త్వ సూత్రములు వ్యక్తము లగుచునే యుండును. కొంద ఱూహ కల్పితములైన నాటకాది గ్రంథములకు సంతోషముగా కాలముపుచ్చుట తప్ప మఱియే యితర ప్రయోజనమును లేదని యందురు. స్థూలదృష్టి కిది సత్యముగానే గోచరించును గాని నిజమారయఁగా నందేదో జీవతత్త్వ రహస్య మిమిడి యుండకపోదు. అది సువ్యక్తము కాకపోవుట కది యందు తగినంత నిశితముగా, శక్తిమంతముగా వ్యక్తము చేయఁబడకుండుటయే హేతువు గాని తదభావము కాదు. ఉత్తమ నాటక కర్త జీవితమును బాగుగాఁ బరిశీలించి దానిని గూర్చి గాఢముగ నాలోచించును. అతనికిఁ గల వివిధ వ్యక్తి శీల వివేకమును, వివిధ భావ పరిజ్ఞానమును, వివిధ సమస్యల యందలి విశేషానుభవమును అతని ప్రపంచ దృష్టికి నైతికమైన ప్రాముఖ్యము నొసంగును. ఉత్తమమైన నాటకములో నీ జీవతత్త్వ వ్యాఖ్యాన మెంత ప్రముఖముగా నుండునన నా నాటకమును గూర్చి వాదోపవాదము లొనర్చునప్పు డది సామాన్య మానవ జీవితమును గూర్చిన వివాదమే యగుచుండును.

దీనినిబట్టి నాటక కర్త యేదో యొక తత్త్వ విషయమును నిర్ణయించుటకే నాటకమును వ్రాయఁగడంగు ననుకొనరాదు. అట్లు తలంచుట ప్రతిభాసంపన్నమయిన యాతని శిల్పితనమునకు గొప్ప లాఘవము చేకూర్చుటయే. నాటకమునకు కొంత తాత్త్వికమైన (philosophical) ప్రాముఖ్య ముండుటకు నాటక కర్త మనస్సులో

నట్టి తత్త్వమునకు సంబంధించిన ప్రయోజన ముండక తప్పదనుట పొరపాటు. అది యున్నను లేకున్నను నాతనికి జీవితమునెడఁగల యభిప్రాయము జ్ఞాతముగనో యజ్ఞాతముగనో నాటకము నందలి వస్తు పాత్రాదికమును వర్ణించునప్పుడు ద్యోతితమగుచునే యుండును. అతఁడు తన నాటకమున జీవితమును సహజ రేఖలతో వర్ణించి తద్ద్వారా దానిపై వ్యాఖ్యానము గావించును. అతఁడు మానవ జీవితమునుండి తన కిష్టములైన యంశములను సేకరించికొని వానిని సరికూర్చుటలో కొన్నిటిని మఱుగుపుచ్చుచుఁ గొన్నిటిని బాగుగా ప్రకాశింపఁజేయుచుఁ దాఁ జేకొనిన యితివృత్తము ద్వారా వివిధ మానవానుభవములకు నైతిక సమత్వమును (moral balance) చేకూర్చును. Moulton Shakespeare నాటకములను గూర్చి 'Every play of Shakespeare critically examined turns out to be a microcosm of which the author is the creator and the plot its providential scheme' అని నుడివియున్నాఁడు. వస్తువును గ్రహించుటలోను, దానిని కూర్చుటలోను, శీలములను చిత్రించుటలోను కథాభాగమును క్రమముగా ప్రపంచించుటలోను కవికి జీవితమునెడఁగల యభిప్రాయము లనేక విధములుగా బహిర్గతము లగుచుండును.

కావ్యములో మన మాశింపవలసిన సత్యమునకును శాస్త్రములం దభిలషింపవలసిన సత్యమునకును మిక్కిలి తారతమ్యము గలదు. Plato రెంటి తత్త్వమును గ్రహించుటలో కొంత పొరపాటు పడెను. కల్పిత కావ్యములు ప్రకృతిని యథా స్థితముగా చూపలేవు కాన కల్పిత కావ్యము లన్నియు బూటకములని యాతఁ డభిప్రాయపడెను. అతని బుద్ధికి Homer కవిత్వము కల్లలకెల్ల నునికిపట్టు. కాని Aristotle, Plato పొరపాటు కనిపెట్టి చరిత్రములలో కానఁబడు సత్యము కంటె కావ్యములలోని సత్యము (poetic truth) మిక్కిలి విశాలమును గంభీరమును అని నుడివెను. చరిత్రములో సత్యమనఁగా భూత వర్తమానార్థముల యథా సంగ్రహణము. కావ్యములలో సత్యమనఁగా సర్వకాల స్థేయములగు సుదాత్త విషయముల సంభావనము. కావ్యసత్యము లాకల్పాంతనిత్యములు. ప్రళయము వచ్చినను వానికి చెక్కు చెదరులేదు. శాస్త్రములలోని సత్య నిరూపణము అసమగ్రము. అందుచేతనే శాస్త్ర విషయములలో ప్రతి శతాబ్దికైన నొక నూతన గ్రంథము వ్రాయఁబడుచునే యుండవలెను. అట్లు చేసిన కాని ఆ శాస్త్ర సత్యమప్పటికి సంపూర్ణము కాదు. కావ్య సత్యము సంపూర్ణముగా నొకేసారి తీర్చి దిద్దఁబడునది. దానికి మార్పు కాని మార్చు కలుగవలసిన యావశ్యకము కాని యుండనే యుండదు.

* In the one case truth means fidelity to what was or is, in the other to what may be.

# II

ఆచార్యులు గారి నాటకములలో వారికి మానవ జీవితము నెడఁ గల యభిప్రాయము లెడ నెడ సూక్ష్మాతి సూక్ష్మముగ గానిపించు చున్నవి. నిజమైన కళాభిజ్ఞుని వలె నాయన నాటకము యొక్క కళా సౌందర్యమును దిద్దుటకే ప్రయత్నించెను గాని గంభీరములయిన జీవ తత్త్వ రహస్యముల నుద్ఘాటించుటకు ప్రయత్నమే చేసి యుండలేదు. కాని యజ్ఞాతముగ నాయన నాటకములలో కథల కూర్పునందును, పాత్రల శీల చిత్రణము నందును ప్రవేశించిన జీవి తాభిప్రాయములు సుంత గమనింప వలసి యున్నది. ఆచార్యులు గారికి విధి ప్రాబల్యమునందు ప్రత్యయము మెండు. మానవు లెంత విశిష్ట మేధా సంపన్ను లయినను అనిర్వాచ్యమయిన యా శక్తికి వశులై ప్రవర్తింప వలసినదే. ఆయన విషాద నాటకములలో నా తత్త్వము సుస్పష్టముగా గోచరించు చున్నది.) దుష్టబుద్ధి మానవ బుద్ధికి అందరాని మతి వికాసము గలవాఁడు. విధి యన్నవోలె నాతఁడు తనతో సంబంధము గల ఇతర మానవులను ఎటు తలఁచిన నటు త్రిప్పఁ గల సమర్థుఁడు. అతఁడు చంద్రహాసుని చంపి, మదనునికి చంపక మాలినిని వివాహము చేసి, విషయ నెనుబది యేండ్లు దాఁటినను రాజ్యమున కధిపతియైన యొక వృద్ధ రాజునకు భార్యగా నిచ్చి, యైహికమయిన మహాభోగము ననుభవింపఁ జూచెను. కాని విధి యాతని ప్రయత్నముల ననుక్షణమును భగ్నము గావించు చుండుటచే తుది కాతఁడు ఐహిక స్వర్గమునకు బదులు నరకము ననుభవించెను. అల్పము లయిన మానవ మాయలు బలీయమయిన విధిని ప్రతారింపఁ గల యంత సామర్థ్యము కలవి కాకపోవుటచే నతని కుచ్చితము బయలుపడి మృత్యువునకు హేతువయ్యెను.

(విధి నిరంకుశమయిన దన్నమాటే కాని యది సర్వదా సత్యధర్మ పథమునే యనుగమించునని చెప్పలేము. తన యిచ్ఛ వచ్చినట్లు మానవాదృష్టములను మార్చుటలో నది నిరంకుశుఁ డయిన నరపతి వంటిది. దానికి శిక్షితుల ధర్మాధర్మములతో పనిలేదు. సారంగధరుఁడు లాసు చిత్రాంగి సాహసము నెటిఁగిన వాఁడే యయ్యును ధర్మ్యమయిన విధిమీఁది విశ్వాసముచే నామె మాయా నాటకము సాగదని సంపూర్ణముగా నమ్మియుండెను.) జితేంద్రియుఁడును పవిత్రమూర్తియు నగు సారంగధరుఁడు దైవముపై నుంచిన నమ్మిక వమ్మయ్యెను. అతఁడు ధర్మాధర్మ విచక్షణ చేసి తన్ను రక్షించు నని నమ్మిన విధియే గుడ్డిదై యాతనికి ఘోర దండనము విధింపఁ జేసెను.

కైక సద్భావము గలదై రామాభిషేక వార్తా శ్రవణముచే పరమానందము నొందెను. మంధరా దుర్బోధ వినిన తరువాత సైత మామె యా దుష్కార్యాచరణమునకు వెనుకంజ వేయుచునే యుండెను. కాని దుష్టమైన విధి యామె మతి భ్రమింపఁజేసి రామాదుల వనవాసములో తన పూనిక నెఱవేర్చుకొనెను. అర్జునుఁడు మాతృ భావముచే నూర్వశీ ప్రణయమును విహతము కావించెను. ఆ జితేంద్రియత్వమునకు ప్రతి ఫలముగా నాతఁ డేక సంవత్సరాను భోగ్యమయిన నపుంసకత్వమును స్వీకరింపవలసి వచ్చెను.

విధి యనతి క్రమణీయము. దానికి అడ్డు ఆక లేని నిరంకుశత్వమే కాని ధర్మాధర్మ విచక్షణ లేదని కూడ ఒక్కొక్క యెడ తోఁచు చుండును. కాని తీక్ష్ణముగా పరిశీలించినచో సద్యః క్షణమున నన్యాయముగా గోచరించిన విధి చైదము తరువాతి ఫలితములలో తన ధర్మభావమును ప్రకటించు చుండును. పైని నుడివిన విధి చర్య లన్నియు నీ విషయమును చాటుచునే యున్నవి. కైక అంత పట్టుదలతో నా వరముల నడుగుటకు అవశ్యాపతితవ్యమయిన ఋషి శాపము మూలహేతువు. ఈ వరముల ద్వారా దానికి సిద్ధి చేకుఱి యుండకపోయినచో దాని ఫలితము తరువాత మఱింత తీవ్రముగా సంభవించి యుండును. అర్జునునికి శాపము కలిగెనను మాటయే కాని యాతని నది యజ్ఞాతవాస వత్సరమున పెట్టని కోటగా సంరక్షించెను. సారంగధరుని విషయమున నీ సూత్రమును సమన్వయింప లేము. సారంగధరునికి ఆ మరణము వలనఁ గలిగిన అఖండ యశస్సు తప్ప మఱి యే సత్ఫలమును దానికి అవ్యవహితముగా గాని వ్యవహితముగాఁ గాని కానరాదు.

సంస్కృత నాటక కర్తలలో నగేసరులయిన కాళిదాస భవభూతులు తమ నాటకములలో జీవులకు జననాంతర విషయములతోఁ గల సంబంధమును, తమవంటి యితర జీవులతోఁ గల సంబంధమును అద్భుతముగా సూచించిరి. కవుల గ్రంథ వియత్తలములలో జీవతత్త్వపు చీఁకటి లోతుల నుద్దీపింపఁజేయు నిట్టి యపూర్వ విద్యుత్తు లున్నప్పుడే వాని ప్రఖ్యాతి యాకల్పాంత స్థాయిగా నుండును. ఆచార్యులుగారి నీ విషయమున నప్రతిమానులయిన యా సంస్కృత కవులతో పోల్చలేము కాని, వీరు రెండు నాటకములలో వ్యక్తము చేసిన కొన్ని యభిప్రాయము లుదాత్తతలో వారి భావములకు సన్నికృష్టముగా సంచరించుచున్నవి. చిరకారిలో మంత్రగుప్తుఁడు విశారదుని తొలుఁదొలుత చూచినప్పు డాతని హృదయ మేలొకో ద్రవీభూత మాయెను. ఆత డాత్రమును కుదించుకొనలేక 'కుమారా! నీ పోలిక యెక్కడనో చూచినట్లున్నది.

నీ విందుండు వాఁడవా లేక యెక్కడినుండియైన వచ్చినవాఁడవా?' అని యడిగెను. అతనిమీఁద చూచి చూడ కుండఁగనే యంత ప్రేమ యేల యుదయింపవలెనో యాతని కర్థము కాలేదు. తరువాత నతఁడు కొడుకని యెఱుఁగక పోయినను 'నా మేనల్లుఁడవా! అందునకే నీ రూపము గుర్తించితిని' అని కన్నీరు కాలువలై పాఱుచుండఁగా నాతనిఁ గౌఁగిలించుకొనెను. ఈ విషయము రోషనార శివాజీలో మఱింత విశదముగా కన్పట్టుచున్నది. శివాజీ హసనల్లీఖాను తన యాత్మజుఁ డని యెఱుంగఁడు. పైఁగా నతఁడు సైన్యముల భిన్న భిన్న మొనరించి తన కపరిమి తాపకార మొనరించెను. అయినను ఆతని చూచిన తోడనే శివాజీ 'వీఁడు ధీరోత్తం సుఁడుగా నున్నాఁడు. నాకు సంతసము నద్భుతము జనించుచున్నది' అని స్వబలము నెఱింగిన వాఁడు కాన నాతఁడు నిహతుఁ డగు నేమో యని యుద్ధము నుండి నివా రింపఁ దలంచెను. కాని అత డా వాక్యములు వినక పోవుటచే వా రిరువురకును యుద్ధము సంభవించెను. క్షతుఁ డయిన హసనల్లీఖానుపై శివాజీ కేలొకో దయగల్గెను. అతఁ డాతని నింటికిఁ గొనిపోయి ప్రాణాపాయము రాకుండఁ గాపాడెను. ఆతని యౌద్ధత్యము మేర మీరుట చేతను, యుద్ధాహ్వానమునకు సిద్ధపడక పోవుట వీరత్వ మునకు కళంక మగుటచేతను అతఁ డాతనితో యుద్ధము చేసెను గాని నిజముగా నాతనికి మహమ్మదీయ వేషమున నున్నను మహారాష్ట్రుఁడుగా కానిపించిన హస నల్లీఖానుతో యుద్ధము చేయవలయు ననియే లేదు. ఇట్లే మోహినిని విశారదుఁడు తీసికొని వచ్చినప్పటి నుండియు చంద్రరేఖా మేధాతిథుల కామె యందవ్యాజమయిన యనురాగము కలిగెను. మోహిని సౌందర్యమును చూచి కళానిధి విశారదు లిరువు రును మోహ పడిరి. కాని మోహినికి కళానిధి పెద్దయైనను విశారదుని పైనే మనస్సు చిక్కెను. ఆమెకు కళానిధిపై ననురాగమే జనింపలేదు. నిజమున కాతఁ డామెకు నన్న. విశారదుఁడు బావ. 'వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే' అని చెప్పిన యా మహాకవి యెంత యను భవశాలియో కదా!

విశారదుఁడు తన్ను చూచి అట్లు కన్నీరు కార్చుచున్న మంత్రగుప్తుని విచార మునకు కారణ మడిగెను. అతడు చిన్నతనమునందే తప్పిపోయిన తన కుమారుఁడగు జయసేనుని వృత్తాంతమును తెల్పెను. విశారదున కా జయసేన నామ మెచ్చటనో విన్నట్లే తోఁచెను. నిజమున కతఁడే యా జయసేనుఁడు. ఇట్లె చంద్రహాసునికి మణి మంతుఁడను పేరు వినినప్పుడది పరిచిత పూర్వము వలెనే కానిపించెను. బాల్యమున

తన తల్లిదండ్రులు తన కిడిన నామ మదియే యని యాతఁడెఱుంగఁడు. ఈ విశారద చంద్రహాసుల కా నామములు బాల్యకాలము నాఁటివి. విశారదుఁడు తిలక హస్తమునను చంద్రహాసుఁడు చందనావతి రాజు హస్తమునను పడిన తరువాత ఆ నామములనే విని యెఱుంగరు. వారు పెరిఁగి పెద్దవారైన పిమ్మట (అనగా సుమారు పదునైదేండ్ల తరువాత) ఆ నామములు విన్నప్పుడు వారి కవి అస్పష్టముగా జ్ఞాపకము వచ్చెను. జననాంతరము నందలి సౌహృదముల వలెనే అవస్థాంతరము నందలి విషయములు సైతము భావ స్థిరములై వినఁబడినప్పుడు జీవులను పర్యుత్సుకీకరించును కాఁబోలును!

ఏదో యొక ప్రబలమైన కారణముచే తప్పు చేయుట మానవ స్వభావము. ఈ స్వభావమే లేకపోయినచో మానవులు దేవతాతుల్యులే. ఆధ్యాత్మికముగా చూచినచో నీ తప్పునకు వారికి లోకాంతరమున తగిన శిక్ష తప్పక విధింపఁబడును. ఆ శిక్ష నీ లోకముననే యనుభవించినప్పుడు సైతము వా రా పాపమునుండి విముక్తు లగుదురని కవి యూహ. తీవ్రమైన పశ్చాత్తాపము సైత మా పాప పంకిలమును శోషింపఁ జేయుటకు సమర్థమే. వరూధిని నాటకములో నామె దేవ వేశ్యయే యైనను నిత్యాగ్ని హోతృఁడయిన ప్రవరుని మోహించుట యామె దోషము. వీరసేనుఁడు మాయా ప్రభావముచే తన్ను వలవని వరూధినిని గవయు టాతనియం దంతకంటెను తీవ్రమైన దోషము. ఈ దోషములచే పరస్పర శాపోపహతులై వారు పాషాణాకృతులు దాల్చి పదునాలేండ్లు పరమ కష్టము లనుభవించిరి. ఇహ లోకముననే యైనను వా రీ శిక్ష ననుభవించుటచే తా మాచరించిన పాపమునుండి రక్షింపఁబడి పరిపూతులై పశ్చాజ్జీవితమును సుఖమయముగఁ గడపిరి. ఇట్లే పశ్చాత్తాపముచేఁగూడ మానవుఁడు పూతుఁడై పాపమునుండి పరిరక్షింపఁబడును. విషాదాంత నాటకము లిందుకు నిదర్శనములు. రాజరాజ నరేంద్రుఁడును, దశరథుఁడును తా మనుభవించిన పశ్చాత్తాప వేదనచే పారిషదుల యనుకంపకు పాత్రులైరి. మంథరవంటి కూృరురాలు సైతము తన యపరాధము నొప్పుకొని పశ్చాత్తాప పడుటచే పవిత్రురాలాయెను.

కుల శీలాదులచే నుత్తములైన వా రెన్నఁడును నికృష్ట భావములకు చోటీయరు. నీచులు తా మెంత యుత్తమాధికారమున నియోగింపఁబడినను తమ నైచ్యమును పరిత్యజింపరు. మోహిని మల్లికాసాని యెంత బోధించినను చిన్నప్పటినుండియు తాను వేశ్యా గృహముననే పెరుఁగుచుండినను, వ్యభిచారమున కంగీకరింపలేదు. ఆమె మృతి పొందుటకైనను, చివరికి మనోహరుని వివాహమాడుటకైన నొడంబడెను గాని తుచ్ఛ కామమునకై తన శీలమును మంటఁగలుప నంగీకరింపలేదు. రోషనార యథార్థ

మునకు మహారాష్ట్రి బ్రాహ్మణుని కూఁతురు. ఆమె ఔరంగజేబుచే బాల్యమునుండియు పెంచఁబడినను, హిందూమత వైశాల్యము నెఱుంగకపోయినను, పవిత్రమయిన హైందవ రక్తము తనయందు ప్రవహించుటచే శివాజీని మోహించెను. మోహించిన దాదిగా నెన్ని యిడుమలఁ గుడిచినను తన పాతివ్రత్యమునకు భంగము రాకుండ జీవితమును గడపెను. కుంతి రాజమాత యగుటచే నేక చక్రపురమున నా బ్రాహ్మణుని యాపదను జూచి యోర్వలేకపోయెను. ఉదారముగా నా రాక్షసుని కొఱకు తన యైదు గురు పుత్త్రిలలో నొకనిని పంపుటకు ప్రయత్నించి తుద కట్లే చేసెను. ఇట్లుత్తమ స్వభావము గలవారు తా మెట్టి స్థితిలో నున్నను తమ సహజౌదార్యమును మాత్రము పరిత్యజింపరు. రోషనారలో శేఖర్జీ మొట్టమొదట రోషనారను వలచి తగిన ప్రీతి ఫలము ననుభవించెను. తరువాత శివాజీ దయ తలఁచి యతనికి మఱల తన కొలువున ప్రవేశ మొసంగెను. సహజముగ దుష్టుఁడైన యా తులువ మఱల నౌరంగజేబు సేనానులతో కుట్ర చేసి శివాజీని ససైన్యముగా పట్టించెను. మంథర తా నెంత రాణి దాసి యైనను తన నైచ్యమును మాత్రము విడిచినది కాదు. సహజముగా పాపాచరణ మునకు జంకు కైకకు కాఠిన్యమును బోధించి యామెచే ఘోరమైన పాపమును చేయించెను. హిరణ్యకశిపుఁడు బ్రహ్మచే నట్టి మహా వరములఁ బడసి వాని బలముచే లోకావనపరులైన దేవతలను, మునులను బాధింప మొదలిడెను. ఈ విధముగా దుష్టులు తామే స్థితిలో నున్నను తమ సహజమైన దౌష్ట్యమును విడువఁజాలరు.

ధర్మానుసారియైన సత్యవస్తువు కడగండ్లఁ గడచి యఖండమైన విజయమును గాంచుట ధ్రువము. ధర్మ నైర్మల్యము లెన్నఁడు నొంటొంటి విడువవు. అవి పరస్ప రాశ్రయములు. నైర్మల్యముతోడి పొత్తులేని ధర్మము విజయము నందుట కవకాశము కలదు కాని ధర్మహీనమైన నైర్మల్యము సిద్ధిని పొందఁ జాలదు. చిత్రాంగి యనురాగ మున నైర్మల్యము రూపొందియున్నది కాని ధర్మము కొఱవడియున్నది. ఆ కార ణముచే నామె కోరిక సిద్ధి నొందలేదు. దమయంతి, సావిత్రి, రోషనార, ముక్తావళి, చంద్రరేఖ మున్నగువారి యనురాగము ధర్మ నైర్మల్యములు రెంటికి నాటపట్టు. ఆ హేతువు చేతనే వారి యనురాగములు వియోగ విఘ్నములచేఁ గొంత యొడుదొడుకు పోకపోయినను చివరికి సుస్థిరమయిన రాచబాటలోఁ బడెను. సత్య ప్రణయము అంత్యమున సుఖ సంపూర్ణమైన యఖండ సిద్ధిని బొందితీరును.

సుఖ దుఃఖములు కలిమి లేముల వలెనే కావడి కుండలు. సర్వకాల సర్వా వస్థలయందును సుఖమునే యనుభవించు వా రరుదు. దుష్టులు తొలుఁదొలుత సౌఖ్య

ములఁ బడసినట్లు కానిపించినను అంత్యమున నాలుగింతల దుఃఖము ననుభవింతురు. సావిత్రి, ప్రహ్లాదుఁడు, రోషనార, సారంగధరుఁడు, నలదమయంతులు మొదలగువారు పెక్కు కష్టముల ననుభవించినను చివరికి మేరలేని సౌఖ్యములను బడయఁగల్గిరి. దానికి కారణము వారు తా ముత్తమములని నమ్మిన కార్యములందు దీక్షతో కష్ట సుఖముల తారతమ్యమును గుర్తింపక పని చేయుటయే. దుష్టబుద్ధి, పుష్కరుఁడు, దుర్యోధనుఁడు మొదలగువారి ప్రయత్నము లారంభదశలో ఫలోన్ముఖములుగా కానిపించినను తుదకు నాశ కారణములగుట తేటతెల్లమే. శీల సంపన్నులయిన నలాదు లట్లు అష్ట కష్టములు పడుట కాంచి మనము నైరాశ్యపూరితులమై జీవితమునందు విముఖత్వము సూచింపరాదు. వారి ధైర్యము, ఓర్పు, ఔదార్యము మొదలగు సద్గుణముల పరిశీలించి అవియే వారి విజయమునకు హేతువులగుటచే నెట్టి కష్టములయినను నా గుణముల సాహాయ్యముచేఁ గడతేఱఁ జాలునని ధైర్యము నవలంబింపవలయును.

దేవతలు తమ పవిత్రతా మహిమచే నరిషడ్వర్గవశులయిన మానవుల చర్మచక్షువులకు గోచరింపరు. వారు మానవులకంటె సర్వ విధముల ఉన్నతమైన పదము నందున్నారు. వారితో సమానమయిన స్థితిని సంపాదించుట సామాన్య మానవులకు దుర్లభము. పవిత్రత్వమున వారిని అతిక్రమించినఁ గాని వారికిఁ గల మహిమాతిశయముల సంపాదింప నలవి కాదు. ఇట్టి శక్తి గతానుగతికమయిన లోకమునఁబడి కేవలము భౌతికాభివృద్ధి కొఱకే ప్రయత్నించు నల్ప మానవులకు దుస్సాధ్యము. అది యలవడెనా వారు భూతల స్పర్శ మాత్ర భిన్నులయిన దేవతలే. వారు దేవతలతో సామాన్య మానవులలోవలె సంచరింపఁ గల్గుదురు. సావిత్రి కట్టి పావిత్ర్యమును తద్ద్వారా సంపాదితమయిన మహిమయును గలవు. ఆ కారణము చేతనే ఆమె దండధరుని సైతము ఆశ్చర్యచకితునిఁ జేసి భర్తృ పునర్జీవన ప్రయత్నమున విజయము కాంచఁగల్గెను.

## III

సాంఘికాశయములు :

ఆచార్యులుగారు తమ నాటకములలో సందర్భముఁ గల్పించుకొని సాంఘిక రాజకీయాది సమస్యలఁ గొన్నింటిని చర్చించిరి. ఆ సమస్య లిప్పటికిని నిశ్చితములు గాక యాయన కాలమునందువలెనే సంస్కర్తల దృష్టి నాకర్షించుచున్నవి. సాంఘికాచారముల విషయమున నాచార్యులుగారు గావించిన వాదోప వాదములు పరిశీ

లించినచో నాయన యీ విషయమున ముందంజ వేసిన వారిలో నొకరని తోఁపక మానదు ఆయన సంఘ రాజకీయ పరిస్థితులలో తమకు తోఁచిన యన్యాయములను, అనాచారములను తమ నాటకములద్వారా సామాన్య ప్రజల కుద్బోధించి దేశము నభివృద్ధి చేయుటకై ప్రయత్నించియుందురు. ఉత్తరరం గోపన్యాసములలో నా నటుని ముఖమున నాయన తమ యభిప్రాయముల నుపదేశ పూర్వకముగ నుద్ఘాటించుచునే యుందురు.

వివాహముల విషయమున నాయన యాశయము మిక్కిలి విశాలముగా నున్నది. అనువుగాని వివాహ మన్ని విధముల ననర్థదాయియని యాయన నిశ్చితమైన యభిప్రాయము. దుష్టబుద్ధి విషయ నొక ముదుసలివాని కిచ్చి వివాహము చేయ నిశ్చయించుట యందలి నైచ్యము నాయన స్పష్టముగా వ్యక్తీకరించెను. విషయ కొంత స్వతంత్ర బుద్ధి కలది గావున ప్రాణము పోయినను రాను వయసు మీఱిన వానిని వివాహమాడనని నొక్కివక్కాణించెను. రాజరాజ నరేంద్రుఁడు సారంగధరుని మరణానంతరము తన దోషము నెఱింగి యా యాపద కంతకును నీడు గాని వివాహమే కారణమగుటచే నట్టివి యవశ్యము పరిహరణీయములని యుపదేశించెను. కైక తన దౌర్మార్గ్యమే వైధవ్యమునకు కారణమయ్యెనని దుఃఖించుచుండఁగా మంథర 'కైకా దుఃఖింపకుము. ఏమి చేసినను దశరథునిఁ బడయఁగలవా! వయస్సు చెల్లినవారి! పెండ్లియాడిన కాంతల కంతయు రాఁదగిన గతియే నీకుఁ గలిగెను. నీవేమి లోకమున కరుదా!" అని యూఱడించెను. వయస్సు చెల్లినవారిని పెండ్లియాడిన యువతుల కిహ పర సౌఖ్యముల రెంటను వెలితియే.

ఇట్లే భర్త యుండఁగాఁ గాని, యాతని యునికి తెలియకపోయినప్పుడు గాని స్త్రీ రెండవ వివాహమాడుట ఆమె శీలమునకు కళంకము నాపాదించును. దమయంతి రెండవ స్వయంవరము మాట వినినప్పుడు నలుఁడు మిక్కిలి యుత్తలపాటుఁ జెందెను. ఆతనికి పుత్త్రిని, భార్యను విడిచి పోవునప్పుడు గాని, అరణ్యమున పాము కఱచినప్పుడు గాని, ఋతుపర్ణునియొద్ద నీచపుఁ గొలువు చేయవలసి వచ్చినప్పుడు గాని యంత విచార ముదయించలేదు." "పురుషుని కిలలోన పొలుపారు భక్తి, తిరముగాఁ గొల్చు సతీమణి యున్న, వాని భాగ్యము సాటివచ్చునే యెందు. నీ నళ రాజన్యుఁడెటు కుండె తనదు, మానిని వేఱొక్క మనుజేశు కోరి, పరిణయంబగునన్న వచనంబు విన్న, పటుబుద్ధి రాజ్యంబుఁ బాయుట కోర్చె. నటు కాననముల పాలగుటకు నోర్చెఁ

బుత్త్రియైనను మానిపోవంగ నోర్చె...చిత్ర బాధలకెల్ల చేర్వడి యోర్చె. మానినీ మణిఁ బాసి మలయంగ నోర్చె....ప్రతికూల నీచ సేవల కోర్చె. నవని సంకటముల కన్నిటికోర్చె. నువిద రెండవ పెండ్లి కోర్వలేఁడాయె."

పాంచాలీ స్వయంవరమున బాల్య వివాహములఁ గూర్చిన వాదోపవాదములు గలవు. జరాయువు భార్య యగు హేమ కుశలకు పదుమూడేండ్లు వచ్చుటచే వెంటనే వివాహము చేయవలెనని భర్తను తొందర పెట్టెను. "రజస్వలను వివాహ మాడిన వానిని వృషలీపతి యని తెగడుట శాస్త్రముల యర్థమే తెలియ లేక తప్పు దారిని పోవుట. తక్కిన యన్ని జాతుల వారును యువతీ వివాహముల నొనర్చుకొను చుండఁగా బ్రాహ్మణులకు మాత్రమే కన్యా వివాహమే దేవుఁడు విధించియున్నాఁడు. వా రేమి చెడినారు ? పెండ్లిలోఁ బాను పని యొక యంగము నాల్గవ దినమునఁ బెట్టి గర్భాధాన ఖండ చదివెదరే ! ఏమి దాని యర్థము ? మొదటి నుండి యున్న యువతీ వివాహము నెవరో నిష్కారణముగా నిషేధించి యవాచ్య కష్టములకు పా లయిన బాలా వివాహము నాదరించినారు. కాని దానియందు దోష మింతయినఁ గలదా !" యని యతఁడు వాదించెను. దానికి హేమ అందఱును బాలా వివాహములనే చేయు చుండఁగా మనము మాత్రము వెఱు మార్గమున పోవ నేల యని ప్రశ్నించెను. జరా యువు "దురాచార సేతుచ్ఛేదనమున కెవఁ డయిన నొకఁ డేర్పడవలయునుగదా ! గుణ మున్నయెడల కావలసిన భంగి సేతుచ్ఛేదన మొనర్పనే వలయు లేక యెవరి మట్టుకు వా రూర కున్నచో నా దురాచార మట్లే కొనసాగిపోవును." అని తాను సాధారణ పద్ధతి నుల్లంఘించుట కొక యప్రత్యాఖ్యేయమైన హేతువును సూచించెను.

అదిగాక తొందరపడి పెండ్లిచేసినచో నే పనికిరాని వాఁడో, యే వికలాం గుఁడో దొరకును గాని తగినవాఁడు లభింపక పోవుటచే కుమార్తె యావజ్జీవమును కష్టముల ననుభవింపవలసి వచ్చును. పుత్త్రుల కంటె పుత్త్రిక లే విధముగను తక్కువ కాదనియు, కుశలకు దేశ మంతయుఁ దిరిగి మంచి వరుని కూర్చుటకు ప్రయత్నించెద ననియు, నట్లు గానిచో ప్రౌఢ యయిన పిదప తగిన వాఁ డవశ్య మేతెంచి వివాహ మాడఁగలఁ డనియు, నాతఁడు భార్యకు నచ్చఁ జెప్పెను. అతఁడు సర్వ శాస్త్రములు నెఱింగిన పండితుఁడే కాని మూఢుఁడు గాఁడు. అట్టివాఁడే యాలో చించి యువతీ వివాహమున కంగీకరించు చుండఁగా నది శాస్త్ర విరుద్ధ మనియు, పాతక దాయి యనియు వెనకంజ వేయుట యుక్తము గాదని యాచార్యులు గారి తలంపు. ఈ విషయమున నాయన యభిప్రాయ మంతయు నీ క్రింది వాక్యములలో నిమిడి యున్నది.

"తన బిడ్డ పౌఢయౌ తఱి వచ్చె ననుచు. మనమున భీతిల్లి మార్గంబు గనక, యెట్టి వానికి నయిన నీతని భార్య కట్టు మంచదరి నిక్కచ్చి యొనర్చె. ఈ జరా యువు శాస్త్ర వృత్తంబు లెల్ల నోజమై నెఱిఁగిన యోగ్యుఁడై యుంట, నీడు మీఱక యున్న యెలనాగ పెండ్లి పాడి గా దని శాస్త్ర పద్ధతి పూనె, సరియీడు వడయని సతులకు నెందు పరిణయం బది యేమి పరిణయం బకట !...యువతీ వివాహమే యుర్వి ము న్నెందు సవిధ సమంచి తాచారంబు సుండి....ఏ కాలముననొ యేమొ వివాహంబు కాకున్న యువతుల కాంక్షించి బలిమి నంది రాఁదీసెడు నధికారు లుండి నందున నేమొ యీ యవరోధ పుడపు వెరవు గానక తమ వెలఁదుల కెల్ల నరసి యొక్కటి సమర్థాదక మున్నె ...పరిణయం బొనరించు భంగి వ్యాపించె....సుత యేమి తక్కువ సుతుఁ డేమి హెచ్చు - సుతున కూఱడ నేల సుత కేడ్వనేల.... అతివ పెండ్లికి మున్నపూర్తవ యయిన నతి పాప మనుమాట యది కల్ల కల్ల.... ఈ పాప మనునది యింతికే కాని యేపార మగవాని కేటికి లేదొ !....యువతీ వివాహమే యొప్పగు సుండి - అపుర నిక్కపు వివాహంబు లౌసుండి. అపుడు పున ర్వివాహము కాదు సుండి. అపుడు సుతులు సుబలాఢ్యులు సుండి. అపుడు జనాళి ధీరాత్ములు సుండి. అపుడు దేశము వృద్ధి నలరెడు సుండి——"

ఆచార్యులుగారు వర శుల్కమును గూడ మిక్కిలి నిరసించు స్వభావము గల వారు. జరాయువు దేశ దేశములఁ ద్రిమ్మరి దక్షిణ యవసరములేని వరుని నన్వే షించెనని చెప్పుటలో నిది దృష్టాంతపడుచున్నది. పురుషులవలె స్త్రీలు గూడ విద్యా సంపన్నలయినప్పుడు గాని దేశ ముచ్చదశను బొందుట కవకాశము లేదని యాచా ర్యులు గారి యాశయము. వారు కూడ విద్యావతులయినచో తప్పుదారినిఁ బోవు మగ వారి మనస్సుల మరలించి గృహ సౌఖ్యమునకు మిక్కిలిగాఁ దోడ్పడుదురు. స్త్రీలకు విద్య వచ్చిన చేటు వచ్చునను పలుకులు అజ్ఞులాడవలసినవి. విద్యకు సన్మార్గదాయిని యను ప్రఖ్యాతి యుండఁగా నది నరులయొద్ద నున్నప్పుడు హృద్యేతరమగు నను మాట విన్నచో నా విద్యా సతి కూడ విలపించునఁట: మోహిని యంత యుత్తమ బుద్ధి గలిగి తన శీలమును రూపుమాప నరుదెంచిన మనోహరునికి గురుప్రాయురాలై వేదాంతము నుపదేశించి సత్పథమును జూపఁగల్గుట కామె విద్యయే మూల కారణ మఁట. కావున 'శీతాంశు ముఖులార చెల్లియలార.... ఈ విధి మీ సుతల్ హితమతి నుండఁగా వలెనని మీరు కాంక్షింతురేని మీ సుతలకు నెల్ల విద్య చెప్పింప వాసి చెందుదు రిది పథ్యంబు సుండి' అని యాచార్యులుగారు చిరకారి నాటకములో నుపదే

శించిరి. ఈ విషయమునే ప్రమీలార్జునీయములో సుస్పష్టముగా వివరించిరి. పుత్త్రి లకు మాతృబుద్ధి యలవడును గాన లలన తప్పక విద్య నేర్వవలయును. స్త్రీకి విద్య వచ్చినంతనే మగవాఁడు కూడుడికింపవలయుననియు, ఆమె స్వాతంత్ర్య మడర భక్తి విడనాడుననియుఁ దలంచుట పొరపాటు. ఏలయన విద్యలేని వారి సంఖ్యయే వెల యాండ్రలో నధికముగా నున్నది.

స్త్రీకి స్వాతంత్ర్య మొసంగిన మిక్కిలి యనర్థము వాటిల్లుననియు 'స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ' యనియు తలంచు పెద్దలు పెక్కురుందురు. ఆసాయము గృహ కృత్యములలోఁ బడి కొట్టుమిట్టాడుచు నవకాశముఁ బసి బిడ్డల కనుచు కాలము గడ పుటయే స్త్రీయొక్క ధర్మమని వారి యుద్దేశము. ఆచార్యులుగా రిట్టి యుద్దేశమును మిక్కిలి నిరసించునట్లు కానిపించుచున్నది. "ఏ రాజ్యంబున తరుణు లుదార కళా కుశల సుస్వతంత్రలు కలరో యా రాజ్యంబుననే పురుషులు ధీరులు నధికారులు నమల ధీసువిచారులు నగుదు"రని యాయన తలంపు. మున్ను భరత ఖండమున సత్యభామా సుభద్రాదులగు ధీర సతులు పెక్కురుండిరి. అట్టివా రిప్పుడు లేకుండుటయే భారతదేశముయొక్క భాగ్య హీనతకు ప్రథమ కారణము. భాగ్య సంపన్నములగు నింగ్లాండు మొదలగు దేశము లన్నింటను విద్యా విభవోపేతలగు విక్టోరియావంటి విదుషీమణులు కలరు. అందుచే పురుషులు దయోజ్జ్వల బుద్ధితో స్త్రీలకు సమత్వము నొసంగుట మిక్కిలి యవసరము. స్త్రీలకు స్వాతంత్ర్య మొసంగినను లేకున్నను పార తంత్ర్యము మాత్రము విధింపరాదు. వారికెల్ల విద్యల నేర్పినను నేర్పకున్నను అజ్ఞాన వారిధి ముంచరాదు. అప్పుడే పురుషులు మానవులగుటయు స్వాతంత్ర్య శోభితు లగుటయుఁ బొసఁగును. స్త్రీలకుఁ గూడ స్వాతంత్ర్య మొసంగినచో వారును పురుషుల వలె రాజ్యపాలనాదుల నిర్విఘ్నముగ నొనరించి దేశ సౌభాగ్యమునకు సహాయపడుదు రను విషయము ప్రమీలా చరిత్రము వలన తెలియుచున్నది.

దేశమునందలి చాతుర్వర్ణ్యము వారును తమ తమ వృత్తులలో నప్రమత్తముగా మెలఁగుటయే కాక తమ దేహబలమును గూడ వృద్ధి చేసికొనవలయును. కేవల విజ్ఞానమునకై పాటుపడువాఁడు శారీరికముగా దుర్బలుఁడై సమయ మరుదెంచనప్పుడు దేశము కొఱకై పోరి దానిని సంరక్షించుటకు సమర్థుఁడు కాఁజాలఁడు. అదియును గాక శరీరము తగినంత బలము గలిగి యుండినఁ గాని విద్యార్జన మధికముగాఁ జేయుట కవకాశ ముండదు. ఈ విషయము జరాయువు తన కుమారుఁడగు దీపకునికి బోధించిన యుపదేశ వాక్యములవలన దెలియుచున్నది.

సోదె చెప్పుట కేవలము బూటకమే యగుటచే నం దిసుమంతయు విశ్వాస ముంచరాదని యాచార్యులవారి యూహ. దశరూపుఁడు వ్యాపింపఁ జేసిన బూటకపు వార్త వలన దుర్యోధనాదులు పాండవులు మరణించిరనియే నమ్మియుండిరి ప్రజ లందఱును నట్లే నమ్మియుండిరి. ఎఱుకసాని ద్రౌపదికి సోదెచెప్పుచు నామె మొట్టమొదట నైదుగుర వలచెననియు, వారు చచ్చిపోయిరనియు, నామె తన కిష్టములేని వానినే వివాహము చేసికొనవలసి వచ్చుననియు నెడనెడ కొల్హాపురమ్మ దేవతా నామముల నుచ్చరించుచు తెలిపెను. నిజమున కీమె చెప్పినదంతయు బూటకమే. తానచ్చటికి వచ్చుటకు ముందుగా కొన్ని సామాన్య విషయముల గ్రహించి యామె యందఱు ననుకొనునట్టి వృత్తాంతమునే చెప్పెను. అట్లు గానిచో నిది ద్రౌపదికి పాండవులు చనిపోయిరని తెల్పుటకై దుర్యోధనాదులు చేసిన మాయ యని చెప్పినను దోసము లేదు.

రాజకీయ సమస్యలఁ గూడ తమ నాటకములలో తర్కించుట యాచార్యుల గారి కలవాటు. ప్రజలు సర్వ సామాన్యము లయిన కొన్ని రాజకీయ విషయములను గూర్చి కూడ నెఱుంగుట యవసరము. సదాచార నాగరికుల సంభాషణములలో ఉప్పు పన్ను విషయమైన చర్చ గలదు. చంద్రహాసుని క్షేమ రాజ్యములో నుప్పు రూపాయకు పరశ్శత మానము లొసంగినను ప్రియమే యఁట. ఈ విషయము రూపాయకు పది పది రెండు కొలారముల చొప్పున నుప్పును గొను నలవాటుఁ గల నాగరికునికి నాశ్చర్యముఁ గలిగించెను. చంద్రహాసుని రాజ్యమున నుప్పునకు పన్నే లేదఁట. సముద్ర జలము దేవుఁ డొసంగినదియే యగుటచే దాని నుప్పుగా తయారు చేసి తీసికొని వచ్చిన పనికి మాత్రము ధన మొసంగిన చాలునఁట. ఉప్పునకు పన్ను వేయఁబడుట సదాచారునికి నాశ్చర్యమును గలిగించెను. మొన్న మొన్నటిదాఁక గాంధి మొదలగు భారతదేశ నాయకులు సైతమీ పన్ను విషయమై ఆంగ్ల ప్రభుత్వము వారితో నన్యాయమని పోరాడిరి. ఈ విషయము నాచార్యులు గా రీ శతాబ్ది ఆరంభముననే యూహించి తమ నాటకమున సూచించిరి.

ఈ కాలమున బ్రాహ్మణా బ్రాహ్మణ వైరుధ్యము విరివిగా వినఁబడు చున్నది. ఇట్టి భేదములు దేశము యొక్క నాశనమునకు కారణ భూతము లగును. పూర్వకాలమున నిట్టి భేదములు లేవు. విప్ర వేషమున నున్న పాండవులు పాంచాలపురిని అనేక సత్రములు, దేవాలయములు నుండఁగా కుమ్మరి గుండప్ప యింట బస చేయుట

ఈ విషయమును విశదము చేయుచున్నది. 'ఏమె యెక్కువయంచు మే మెక్కువంచు తొల్లిటి మనవారు దొరరిరే యెందు విలసిల్లు కడు మైత్రి వెలసిరి గాక': ఇట్టి భేదము లున్నచో జను లైకమత్యము మాని యఖిల రీతులను పోకారి నశియించి పోవుచే నిజము. కులము పుట్టుకచేతగాఁక జ్ఞాన గుణముచేఁ గలుగును. పూర్వము వృత్తి భేదము వలన కుల భేదము లేర్పడెను గాని ఒండొంటి కంటె తక్కువ యని కాని యెక్కువ యని గాని దురభిప్రాయము లుండుటవలనఁ గాదు. తొల్లి నాలుగుగా నున్న జాతు లిప్పుడు నాల్గు వే లయ్యెను. "ఈలా గయిన నింక నెక్కడి కవధి. కలుషంబు నించి దుఃఖము లెంచుకొన, కుల దోషముల నెంచఁ గోరమి లెస్స."

ద్రుపదుఁడు పాంచాలీ స్వయంవరమైన తరువాత స్వదేశ వస్త్రముల నేయింప నాజ్ఞాపించెను. కాని చీనా మొదలగు దేశముల నుండి వచ్చుచున్న బట్టలపై ద్రుపదుఁడు పన్ను విధింపక యుపేక్ష చేయుటచే జను లందఱును చవుకగా నున్న వానినే వాడుచు స్వదేశ వస్త్రముల నాదరించుట మానివేసిరి. అందుచే నేఁతగాండ్రు తమ వృత్తిని బాసి వేఱు వృత్తి నవలంబించి జీవనాధారము సంపాదించుకొనుచుండిరి. వారి మగ్గము లన్నియు శిథిలములై పిన్నవాండ్రయాటలకై యుపయోగపడుచుండెను. మంత్రి యీ యాపదను ముందే యూహించి పరదేశ వస్త్రములపై పన్ను విధింపుఁ డని రాజుగారితో చెప్పెను. కాని రా జుపేక్ష చేయుటకు ఫలితము తంతు వాయ వృత్తి వినాశమున ఫలించెను. చివరికి బట్టలు కావలసి వచ్చుటచే దు్రపదుఁడే మగ్గములు మొదలగునవి చేయించి యిచ్చి తంతువాయుల నేరి తీసికొని వచ్చి వానిని నేయించుకొనుట తటస్థించెను. ప్రస్తుతము మన దేశము యొక్క హీనస్థితి గూడ నిట్లే యున్నది (1937). పన్ను లేక బేళ్ళకొలది దిగుమతి యగుచున్న పరదేశ వస్త్ర మగ్గువగా లభించుటచే ప్రజలు స్వదేశ వస్త్ర పరిశ్రమ నాదరింపక ఆ వస్త్రములనే కొని ధరించుచున్నారు. ఆ కారణముచే స్వదేశ పరిశ్రమ యంతయు నడు గంటినది. మఱల నా వృత్తి నుజ్జీవింపఁ జేయుటకై సాధ్యమైనంతవఱకు పరదేశ వస్త్రముల దిగుమతి నాటంకపఱుపవలెను. లేదా వానిపై తగినంత పన్నయిన విధింపవలెను. ప్రస్తుతము దేశవాసుల యందఱ దృష్టి నాకర్షించు చున్న యిట్టి సాంఘిక రాజకీయ విషయములను ఆచార్యులు గా రానాఁడే యూహించి ప్రజల యుద్బోధము కొఱకై నాటకములలో వానిని సందర్భ సహితముగాఁ బ్రివేశపెట్టుట వారి సామర్థ్యమును దేశభక్తిని వేనోళ్ళఁ జాటుచున్నది.

★

# 11. ఆంధ్ర నాటక పితామహుని నాటకములు : నీతి

## I

ఏ కావ్యమునకైనను రసానందమే యవ్యవహిత ఫలమని ప్రాచ్యలాక్షణికుల యభిప్రాయము. రసానందప్రాప్తికి నీతిబోధ మాట యెట్లున్నను దుర్నీతి లేకుండుట మాత్రము మిక్కిలి యవసరము. ఏలయన, దుర్నీతి పఠితల హృదయమున నసహ్యభావము కలిగించి రసానందానుభవమున కాటంకము కలుగఁజేయును. అందుచేఁ గవి తన కావ్యమున నీతిబోధ కావించినను, గావింపకున్నను దుర్నీతిని దొలఁగించుటకు మాత్రము ప్రయత్నింపవలెను. మఱియు నీతిబోధ కావ్యమున నతిమాత్రమైనచో నదియు కావ్య గౌరవమునకు భంగకారియే. ఏలయన, నీతిమాత్ర ప్రయోజనమయిన కావ్యము ధర్మశాస్త్రాదులవలె వ్యుత్పత్తి జనకమే కాని రసానంద ప్రాప్తికి సహకారి కాదు. అందుచేఁ గవి తన నాటకమున నానందానుభవమున కాటంకము కలిగింపని నీతిని గథా నిర్వహణము ద్వారా గూఢముగా నుపదేశించుట యుత్తమ రీతి. ఇందున్నంత బలము, శక్తి, కవి నీతి సూత్రములఁదెచ్చి యుద్ఘాటించుటలో లేదు. రసవంతముగా వ్రాయఁబడిన హరిశ్చంద్రుని చరిత్ర నొకమాఱు పఠింపఁగాఁ గలుగు సత్యాభినివేశము 'సత్యంవద' అని చెవి నిల్లు కట్టుకొని వేయిమాఱులు చెప్పినను గలుగ దనుటలో నతిశయోక్తి లేదు.

కావ్యములలో నుత్తమ మనఁబడు నాటకములలోఁ గూడ నీతికి స్థాన మింతే. దశరూపక కర్త ధనంజయుఁ డానందైక ఫలములగు రూపకములను వ్యుత్పత్తిమాత్ర ఫలకములని నమ్ము జనుఁ డల్పబుద్ధియని తెగడెను. అనఁగా నాటకమునకు రసానంద మపరిహార్యమయిన పరమ ప్రయోజనము. వ్యుత్పత్తి నీతి మొదలగునవి యానుషంగికములయిన ప్రయోజనములు. కాని లోకకళ్యాణార్థము కవి రచించు కావ్యములలో దోషదూషణమును గుణభూషణమును గూడ నుండుట కొంత యవసరమే. దుష్టులకుఁ గష్టమును, శిష్టులకు సుఖమును గలుగఁజేయుట సామాన్య నీతి. ఈ నీతికి భిన్నముగా ప్రవర్తించుట దుర్నీతి బోధకు దారి చూపును. కలియుగమున నయ విహీనులే ధన కనక పస్తువాహనాది సకల సౌఖ్య సేవధులై విలసిల్లుచుండుటయు, నీతిపరులు కష్ట పరంపల కాకరము లగుచుండుటయు మనము చూచుచున్నాము. కాన సహజముగా నుండుటకై నాటకమునఁ గూడ నష్టేల సంధానము చేయరాదని కొందఱందురు. కాని

దుర్మార్గ లబ్ధమైన సంపద క్షణికమును నాపదుత్పాదకము నగుటచే దాని నాదర్శముగాఁ గైకొనుట కూడని పని. మఱియు నీతిబోధ సహజముగ, గూఢముగ, చిరస్థాయిగ నుండవలెను. దానికి నీతిబోధ కనువగు కథనే వస్తువుగాఁ గైకొనుట యవసరము. ఇట్లు చేసినచో నాటకముల యానంద నిష్యందిత్వమునకును, నీతిబోధనమునకును గూడ నాటంకము వాటిల్లదు.

పాశ్చాత్యులలోఁ గూడ నీ నాటకముల నీతి విషయమై భిన్నాభిప్రాయములు కలవు. ఒక తెగవారు నాటకములలో నీతి కేవిధమయిన స్థానమును లేదందురు. Ogier, Molier మున్నగువారీ తెగకుఁ జెందినవారు. "Dramatic poetry is made for pleasure and amusement" అని వారి యూహ. తరువాత బయలు దేఱిన విమర్శకులు పెక్కురానందబోధనములు రెండును కూడ నాటక కవి దృష్టి పథమున నుండవలయుననిరి. Sir Philip Sydeny మోదాంత నాటకములు సామాన్య దోషములను, విషాదాంత నాటకములు రాజ దోషములను వ్యక్తముచేయుచుఁ బ్రపంచము యొక్క యశాశ్వతత్వమును జాటుచున్నవని నుడివెను. ప్రేక్షకుల కానందము కలిగించుటయే నాటకముయొక్క ముఖ్య ధర్మమైనను, అట్లు పొందఁబడిన యానందమున నీతి కూడ నంతర్భూతమై యుండునని Pierre Corneille అను నతఁడు వ్రాసెచ్చెను. మఱియొక విమర్శకుఁడు నాటకశాల దోషనిరాసమునకు పాఠశాల వంటిదని సూచించెను. Dryden సంతోషముగా బోధించుటయే సర్వ కావ్యముల సామాన్య ప్రయోజనమని పల్కెను. Lessing అను నతఁడు నాటక మొకానొక నీతి సూత్రమునకు లక్ష్యముగా నుండుటలోఁ దప్పులేదు గాని యందలి కథా సంవిధానము లన్నియు నట్లే యుండవలెనను నిర్బంధము లేదనెను. నీతి సూత్రముల యుద్ఘాటనము లేకయే గాఢముగా నీతిని బోధించు నాటకములు పెక్కు లుండుటయే దీనికిఁ దార్కాణము. నీతిబోధను బట్టియే మనము నాటకముయొక్క న్యూనతాధిక్యములనుఁ బరీక్షింపరాదు. అసలు నాటకమున మనము ప్రప్రథమమున నపేక్షించునది యానందమే కాని నీతి కాదు. అట్లని నాటకమున నీతికి స్థానమే లేదనరాదు. కవి Sophocles వలె నుదాత్తచిత్తుఁడయినచో నతఁడేది యొనర్చినను అతని ప్రభావము నైతికముగనే యుండునని Goethe చెప్పుటలోని సత్యమును మన మిచ్చట గమనింపవలయును (If a poet has a high soul as Sophocles, his influence will alway be moral, let him do what he will).

# II

శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములు నీతి బోధనకు మిక్కిలి యుపక రించునని ఆచార్యులుగారి తప్పని యభిప్రాయము. అందును సాధారణ నాటకముల కంటె విషాదాంత నాటకము లా పనిని నిర్వర్తించుటలో నెక్కువ శక్తి కలవని యాయన నమ్మిక. ఏదో యొక నీతిని సూక్ష్మముగానైనను బోధింపని నాటక మాయన రచనలలో లేదు. సాధారణముగా నాయన యా నీతుల నన్నింటి నుత్తర రంగమునఁ గ్రోడీకరించుచుందురు. నాటకమునందలి పాత్రల యాదర్శార్హతనుబట్టి యాయన యందు స్త్రీలకు, బాలురకు, పురుషులకు వేర్వేఱుగా నా నీతుల నుపన్యసించుచుందురు. ఆయన స్వీకరించిన కథలన్నియు నీతిబోధ కనువగునట్టివే. ఆ కథలను బ్రపంచించు తఱి నాయన నీతిబోధ నెట్లోయొక విధమున నం దిముడ్చుచుందురు. నాటకమున వేషములు వేయుట శాస్త్రదూష్యమగుటచే నా కాలమున మిక్కిలి నీచముగాఁ బరిగ ణింపఁబడుచుండెను కాని యా నిషేధము నాటకమువలన జీవించువారికి సంబంధించి నదియే కాని "వేడుక కొఱకును, నీతిబోధ కొఱకును నాటక ఖేలన మొనరించువారి విషయమునఁ జెప్పఁబడినట్లు లే"దని యాయన వాదము. ఏలయన, "ఒకవేళ అట్లే యున్నట్లెంచి దూష్యమని తలంచినను ఉద్దేశము మంచిదై జనులకు సుబోధ కలి గించినయెడల నున్న స్వల్పదోషమును గూడ నడఁగిపోవు"నని యాయన చిత్రనళీయ ప్రస్తావనలో వివరించెను. ఈ హేతువును బురస్కరించుకొనియే ఆయన స్వయ ముగాఁ గూడ నాటక ఖేలనము నారంభించెను.

కావ్యన్యాయము (Poetic Justice) ప్రకారము దుష్టులు దుఃఖము లనుభవించు టయు, శిష్టులు సుఖముల ననుభవించుటయు సాధారణ నీతి. ఆచార్యులుగారి నాట కములలో నీ నీతికిఁ దార్కాణము పెక్కుచోట్లఁ గన్పించుచున్నది. నలుఁడు, సత్య వంతుఁడు, రుక్మాంగదుఁడు, పాండవులు, రాముఁడు, భరతుఁడు మొదలగువారు సత్పురుషులలో నెంచఁదగుటయే కాక మానవలోకమునకెల్ల నాదర్శప్రాయులు. అట్టివారు మధ్య నెన్నికష్టములు పడినను అంత్యమున నానందముఁ బడయుట సమంజ సము. హిరణ్యకశిపుఁడు, దుష్టబుద్ధి, నాగకేతుఁడు, పుష్కరుఁడు మొదలగువారు దుష్ట గణములలోఁ జేరినవారు. ఇట్టివా రంతమున నిధనమును బొందుటయే నీతి బోధకు సులువైన మార్గము. లేనిచో దౌర్మార్గ్యము సైతము జయముచే బహూకరింపఁ బడు నను చెడ్డ తలంపు సామాజికులలోఁ గలిగిన నీతి ధ్వంసమైపోవును. ఇట్లే సజ్జనులకుఁ జివరికి సుఖములు కలుగకపోయినచో సత్పథానువర్తనమునకు దుఃఖమే ప్రతిఫలమను

నైరాశ్య ముదయించి ధర్మాభినివేశమును క్షీణింపఁజేయును. నాటక కవి నీతిని బోధించి నను బోధింపకపోయినను దుర్నీతిని సమర్థించుట మాత్రము లోకమునకు మహాప కారము. ఆచార్యులుగారి నాటకము లన్నిటిలో విషాద సారంగధర మీ నీతి సూత్రి మునకు మిక్కిలి ప్రతికూలముగ నున్నది. సర్వ సద్గుణ విభాసితుఁడును, పితృ మాతృ భక్తి సేవధియును, జితేంద్రియుఁడు నగు సారంగధరుఁడు తన సత్ప్రవర్తనకుఁ బ్రతి ఫలముగా ఘోరశిక్ష ననుభవించుటతోడనే నాటకమును ముగించుట మెత్తని చిత్తము కలవారి కుత్తలంపాటు కలిగింపక మానదు. సజ్జనులుకూడ లోకమునఁ గష్టము లనుభ వించుట కాననగుచుండుటయు, (సారంగధరుఁడు తన ప్రియమిత్రుఁడయిన సుబుద్ధి మాటల నుపేక్షించుటయు నను నీ రెండు విషయములు నీ శిక్షను సమర్థింపఁగలవని యాచార్యులుగారు వ్రాసిరి. కాని సజ్జనులు కష్టముల పాలగుట యెడనెడఁ గానవచ్చు చుండుట నిక్కువమే యయినను అది విశ్వజనీనము కాదు. ఇట్టివానిని గావ్యములలోఁ బ్రకటించినచో గంభీరమును శాశ్వతమును గావలసిన కావ్య సత్యము లౌకిక సత్యము వలెఁ దాత్కాలికమును, ఏకదేశమును నగుట తటస్థించును. సారంగధరుఁడు సుబుద్ధి మాటల వినకుండుట యొక దోషమే కాని యంత ఘోర శిక్ష యనుభవింపవలసినంత దారుణమైనది కాదు. ఈ కారణముచే నాచార్యులుగారు నీతి పరిపోషణము కొఱకీ కథ యుపసంహృతిలో కొంత మార్పుచేసి యుండవలసినది.)

స్త్రీలలోఁ బాతివ్రత్యమును బోలిన మహోదార గుణము మఱొండు లేదని యాచార్యులుగారు పెక్కు నాటకములలో విశదీకరించిరి. అది వినా ఇతర సద్గుణము లెన్ని యున్నను వారికి శోభ లేదు. సావిత్రీ చిత్రాశ్వమున నాచార్యులుగారి యీ భావ మత్యుదారముగఁ బోషింపఁబడినది. సావిత్రికి "చటుల దుస్తర తపఃశక్తిచే నయిన, పటు నియమాంచిత భక్తిచేనైన, ఘనతర బహుయోగ గరిమలనైన, కనుఁగొనఁగారాని కాలుండు వచ్చి, యగణితరీతి ప్రత్యక్షమౌటెల్ల" నామె పతివ్రతా మహిమ వలననే. ఇంతియకాక యామె శ్యామాదేవిని గాంచి యామెచేఁ గొనియాడఁబడుటయు, అత్త మామలకును దల్లి దండ్రులకును మనోరథా వాప్తి కలిగించుటయుఁ దన పతి ప్రాణ ములను మరల సంపాదించుకొనుటయు నీ పాతివ్రత్య ప్రభావమును వేనోళ్ళఁ జాటు చున్నవి. సావిత్రి శ్యామాదేవికిఁ జెప్పిన పతివ్రతా ధర్మములలో స్త్రీ తన భర్తయెడఁ బ్రవర్తింపవలసిన పద్ధతి యంతయు నుపన్యసింపఁబడియున్నది. దమయంతి యన్ని యిక్కట్లు పడినను దుదికిఁ దన మనోవల్లభునిఁ గలసికొని సుఖించుట కామె పాతి వ్రత్య ప్రభావము తప్ప మఱి యే హేతువును గానరాదు. స్త్రీలకుఁ బాతివ్రత్యము పెట్టనికోట. దమయంతి యడవిలో నేకాకినియై యెఱుకవానిచే బలాత్కరింపఁబడినపు

డామె నంతత సన్నికృష్టమయిన యీ పాతివ్రత్యమను పావకునిచే నాతని భస్మసాత్కృతునిఁ గావించెను. సంధ్యావళి సవతులు రుక్మాంగదుఁడు మోహినిని వలచుట విని యాతని చర్యను నిరసించునప్పుడు వారికి బుద్ధిచెప్పి, యాతఁ డామెతో సుఖముగా నుండుటకు నయాచితముగాఁ దనంతఁదానే యంగీకారమును సూచించుచుఁ బత్రమును బంపెను. ఏవిధముననైనను భర్తసుఖించుటయే యామె మనోరథము. ఆతని సుఖముచేఁ దన సుఖమున కాటంకము కలిగినను ఆమె లెక్కచేయదు. అతి మానవమయిన యీ పాతివ్రత్యము మోహిని కాశ్చర్యమును గలిగించెను. సంధ్యావళి పాదపద్మములపైఁ బడి క్షమింపుమని ప్రార్థించినఁ గాని తన పాపము పోదని యామె యాతురపడెను. రోషనార శివాజీని ప్రేమించినది మొదలు తన పాతివ్రత్యమున కేవిధముగను భంగము రాకుండుటకై ప్రయత్నించెను. తన్ను మిక్కిలిగా ప్రేమించిన యౌరంగజీబు నాజ్ఞను సైతము ధిక్కరించి తన పతికిఁ గారాగార విముక్తిఁ గావించెను. అహల్యా ప్రముఖ లగు శివాజీ యితర భార్యలు రోషనార నీర్ష్యాళువులయి పరికింపక తమకు పతి భిక్ష నిడిన దేవతగా భావించుట హిందూనారులకు మాత్రమే శక్యమయిన యసాధారణ కార్యము. కళావతి తన భర్తయుఁ దనవలెనే స్త్రీ యగుట గుర్తించినను, ఆమెను (ముక్తావళిని) ప్రేమించుట యద్భుతము. ఒకసారి కన్నారఁ జూచి ప్రేమించిన యాతఁ డెట్టివాఁడయినను నిశ్చల భక్తితో నాతని సేవించుచుండుట స్త్రీకిఁ బరమ ధర్మము. జగంధరుఁ డెంత భయపెట్టినను ముక్తావళి యాతనికి లొంగకుండుట కతి మానుషమయిన యామె పతి భక్తియే కారణము. చంద్రరేఖ తన భర్త చిరకారిని తన్ను వధింపుమని పంపినప్పుడు తనలో నేదేని దోషముండెనేమోయని యాలోచించెను కాని, నిజముగాఁ దానెట్టి దోషము నాచరించి యుండమి నెఱింగియు భర్త యవిమృశ్యకారిత్వమును నిరసింపలేదు. భర్త యాజ్ఞచే మరణించుటయే పరమ పుణ్యమని యామె భావించెను. ఇట్లే రత్నాంగి, లీలావతి, ద్రౌపది, కౌసల్య, సీత మొదలగు వారు కూడ నీ పాతివ్రత్యమను మహోదార గుణముతో శోభిలునట్టివారే. చిత్రాంగి యనురాగము నిర్మలమయినదియు, గాఢమయినదియు నగుట నిజమే కాని యామె యగ్నిహోత్ర సాక్షిగాఁ బెండ్లాడిన భర్తను వీడి యితరుని, అందుని కుమారుని, కామించుట పరమ తుచ్ఛము. ఆమె ప్రేమ నైర్మల్యమామె చర్యకు హేతువును జూపజాలునేమో కాని యందలి పాపమును బరిహరింపలేదు. అందుచేతనే ఆమె యట్టి నికృష్టపుఁ జావు చచ్చెను. పాతివ్రత్య సంపద లేని స్త్రీల గతి యిట్టిదే. "భామకు పతి భక్తి బహుజన్మ ఫలము; రామకు పతి భక్తి రత్నభూషణము; కలికికి పతిభక్తి కామితదాయి; నిరత వ్రతాదుల నెల్లను మోక్ష, మతివలు పొందంగ నడరుటలెల్ల, రిత్తపోవఁగ నల్ల రేగుపండులకు, ముత్తియంబులు పోయు మూర్ఖతకాదె." సారంగ

ధర నాటకమున నీతికి భంగపాటు కలిగినదని కొందఱి తలంపు. ఆద్యంతము నీచ శృంగారపు ముద్దయయిన యా నాటకము దుర్నీతిని దప్పక కలిగించుననియు, చిత్రాంగి శృంగార చర్యలన్నియు వర్ణించి వర్ణించి చివరికిఁ దెరలో నామె గింజుకొని చచ్చె నన్నంతమాత్రమున నీతి ప్రబోధము కలుగదనియు, వారి వాదము. స్థూలదృష్టి కిట్లే తోఁచును కాని ఆచార్యులుగా రామె నిర్మల ప్రేమ ప్రకాశనము ద్వారా, పశ్చాత్తాపము ద్వారా, ఆ క్రౌర్యమును చాలవఱకు తగ్గించిరి. పైఁగా మంచి పాత్రలకు వన్నె చేకూర్చుటకై చెడ్డ పాత్రలుకూడ వర్ణింపఁబడుట మిక్కిలి యవసరమని యాచార్యులుగారి తలంపు. కాని నాటకములు పామర లోకముయొక్క నీతిభావములపై నెక్కుడు ప్రభావమును ప్రదర్శింప సమర్థములయి యుండును గావున నీ నీతివిషయమయి కవి అతి మాత్రమయిన శ్రద్ధ వహింపవలెను. విషము మందునకే యయినను స్వల్పముగా మాత్రము గ్రహింపఁబడవలెను కదా!

పురుషుఁడు పరవనితను గాంక్షించుట కాని, స్త్రీ పరపురుషునిఁ గాంక్షించుట కాని మహా పాతకము. ఆచార్యులు గారి కీ వ్యభిచారముపైఁ గల వైముఖ్య మింతింత యని చెప్పలేము. ఏ ఘోర పాపము నయినను సైరించును గాని యాయన యీ పాపమును మాత్రమే పరిస్థితులలోను సైరింపఁజాలరు. ఇట్టి ప్రసంగము వచ్చిన చోటుల నెల్ల నీ విషయమును గూర్చి యాయన నొక్కి చెప్పుచుండును. కీచకుఁడు కామాంధుఁడై మహా పతివ్రత యగు ద్రౌపదిని మోహించెను. దానికి ప్రతిఫలముగా నతఁడు బలాఢ్యుఁడే యయినను భీమునిచేత నికృష్టమయిన చావు చచ్చెను. ఆచార్యులు గా రీ విషయము నుత్తర రంగములో నిట్లు చెప్పుచున్నారు. కీచకుఁడు "ఘనబాహు బల ధుర్య! కంజాప్త శౌర్య! జనదద్రి ధైర్య! కీచక వర్యయంచు, భూ జనంబులు సర్వ భూముల పొగడ, రాజన్యు లరుల నిరంతర మివ్వ, దారుణంబుగ వసుంధర నేలినాఁడు! కాని పరసతీమణి భంగపఱచిన పాప భరమున మతి దూలి పరశక్తి సోలి ప్రాభవగతి మాలి పడియెఁ గాకున్న నా భీముఁ డయిన నే మాతని కెదురె?" కామము వలన :

"అపకీర్తి యొకటి పాయని పాప మొకటి
యుపతాప మొక్కటి యురు దుఃఖ మొకటి
పరిభవ మొకటి ప్రాభవ హాని యొకటి
చిరభీతి యొకటి హెచ్చిన వైర మొకటి
ధన హాని యొక్కటి తను హాని యొకటి

ఘన భయంకర నరకంబె యం దొకటి
అతి కామమున రావణాసురుఁ డీల్గె
క్షితి నిందుఁ దలపోయ కీచకుఁ డీల్గె
కావున ధర పరకాంతల మీఁది
భావ మెన్నఁడు కాని వలవదు సుండి."

శేఖర్జీ ముందు వెనుక లాలోచింపక పతివ్రత యైన రోషనారను బలాత్కరించుటచే చరుపాతము ననుభవించెను. ముక్తావళిలో నామెను పరిభవించిన తురకలును చిత్రనళీయములో దమయంతిని కాంక్షించిన యెఱుక నాయకుఁడును నిట్లే తమ పాణములను విడువ వలసిన వా రయిరి. పరకాంతల మాట యటుండ, వేశ్యల కామించుట సైతము పాప కారణమే. అందు తమ్ము నొల్లనివారి మాయోపాయమునఁ గాని నిర్బంధమునఁ గాని కవయఁ జూచుట మఱియుఁ బాపహేతువు. వీరసేనుఁడు వరూధినిని మాయామార్గమునఁ గవిసినందుకుఁ బదునాలు గేండ్లు పాషాణాకృతిని వహింపవలసి వచ్చెను. మనోహరుఁడు మోహినిని మోహించి తన ధనమును, అభిమానమును గూడఁ గోల్పోయెను.

స్త్రీల విషయమునఁ గూడ నింతే. పరపురుషులఁ జూచుట కాని, స్మరించుట కాని వారి నంధతామిస్రమునఁ గూలఁ దోయును. ఇంతియకాక పురుష రూపమున నున్న స్త్రీల స్పృశించినను వారు పాపమునకు గుఱి యగుదురు. చంద్రరేఖ మొట్ట మొదటఁ బురుష వేషమునఁ దనతో శృంగారాలాపము లొనర్చుచున్న మోహినిని మిక్కిలి దూషించెను. కాని యది మోహినిచే హాస్యమునకు కావింపఁబడిన నాటక మని యెఱింగి యామె నాలింగనము చేసికొనెను. ఈ సమయమున నచటికి వచ్చిన మేధానిధి వారి నిరువురిని జూచి చంద్రరేఖను ఖండింపు మని కళానిధి కాజ్ఞాపించెను. పతివ్రత యయిన చంద్రరేఖ విమర్శించి విమర్శించి రాజు తన కంత దారుణ శిక్ష విధించుటకుఁ దా నా పురుషాకృతి నున్న మోహిని నాలింగనము చేసికొనుటయే కారణ మనియు, నిజమున కా పాపమున కట్టి శిక్ష విధింపఁదగినదే యనియుఁ దల పోసెను. వేశ్యలు స్వైరిణు లయ్యు ననాలోచితముగాఁ దమ కంటికి సుందరులుగాఁ గానిపించిన యేరి నయినను గామించుటకు వీలులేదు. వరూధిని పవిత్రుఁ డయిన ప్రవరాఖ్యుని మోహించి దానికిఁ దగిన శిక్ష ననుభవించెను.

ఆచార్యులు గా రిట్టివే తమ నాటకములలోఁ బెక్కు నీతుల నుద్బోధించి యున్నారు. హాస్యము చేయుట యానంద హేతువే కాని దానికి సమయా సమయములు కలవు. అట్లు సమయా సమయములఁ బరికింపక హాస్యముఁ జేసినచో దాని వలన నివారింపరాని మోసము వాటిల్లును. మోహిని వేళాకోళమునకుఁ జేసిన హాస్యమే పతివ్రత యగు చంద్రరేఖ మరణమునకు హేతు వయ్యెను. దైవ వశమునఁ జిరకారి మాతృ భక్తికిని, పితృాజ్ఞకును దన మనమునఁ గలిగిన యంతర్యుద్ధము వలన శ్రేయోమార్గము నన్వేషించుచు నాలసించెను గాని లేకున్నచో నన్యాయముగా, నకారణముగా నా పతివ్రత ఖండింపఁబడియుండును. చిరకారి మేధాశాలి కాన తొందర పడక యా విషయమును గూర్చి యాలోచించుచుఁ గొంత కాలయాపనము చేసెను. అదియే నాటకము యొక్క మోదాంతమునకుఁ గారణ మయ్యెను.* తొందరపడి పను లాచరించుట కష్ట నష్టములు రెంటికిని మూల హేతు వగును. రాజరాజ నరేంద్రుఁడు చిత్రాంగి చెప్పిన మాటలు విని సదయుఁడు కోరినను గాల వ్యవధానమున కంగీకరింపక యాత్రముతో సారంగధరుని కా శిక్ష విధించెను. ఆతఁడు కొంత కాల వ్యవధానము నంగీకరించి యుండినచో నా నిజము బయటఁబడుటయు, సారంగ ధరుఁడు విముక్తుఁ డగుటయుఁ దటస్థించి యుండును.

కామ క్రోధాది యగు నరిషడ్వర్గము మానవు నాకర్షించి యాతనిచే చేయరాని పనులు చేయించి యైహికాముష్మిక సౌఖ్యములకు వెలిచేయును. రాజరాజ నరేంద్రుఁ డంత వివేకి యయ్యు తన సుతునికై యేర్పఱుపఁబడిన తరుణిని సౌందర్య లాలసుఁడై తానే వివాహ మాడఁగోరుట కాతని కామాంధతయే కారణము. చిరకారిలో మోహిని నుడివినట్లు మోహము (శాశ్వత ప్రేమ) వలన దోషము లేదు కాని కామము నీచాతినీచము. క్రోధము మనుష్యుని బరవశునిఁగాఁ జేయును. "క్రుద్ధో హన్యా ద్గురూనపి" అను నా నుడిలో నెంతేని యాథార్థ్యము కలదు. లోభము నీచాతినీచ గుణములలో నొకటి. ఈ రెండును గూడెనా మనుష్యునికి రాని యాపద యుండదు. దుష్టబుద్ధి మిక్కిలి కోప స్వభావము కలవాఁడు. మంచి యయినను చెడ్డ యయినను నితరులు చెప్పుటయే చాలును. అతని కోపము మితిమీఱి సాహసమున ఫలించును. ఈర్ష్య కితఁడే పుట్టినిల్లు. తనకు సంబంధ మున్నను లేకున్నను ఇతరులు సౌఖ్యపడుట చూచి యీతఁ డోర్వలేఁడు.‡ ఐహిక మైనట్టియు, క్షణిక మైనట్టియు

---

* ఏ కార్యమయినఁ బరీక్షించి యోర్చి, ప్రాకట గతి చేయవలయును సుండి.

‡ ఇతరు లెవ్వారైన నిద్దరు మంచి, హితు లన్నమాట నొక్కింత విన్నంత
నెనలేని క్రోధంబు హృదయంబు కలప, మనసు నిల్పఁగలేక మాటాడలేక
వారల మైత్రిని వారించుదాఁక, కూడును నిదురనే కోరక యుందు.

రాజ్య సంపద కాసపడి యాతఁడు తన యేకైక కుమారిని ముదివగ్గున కిచ్చి వివాహము చేయ నొప్పుకొనెను. ఆ కారణము చేతనే చంద్రహాసుని నన్యాయముగాఁ జంపుట కొడిగట్టెను. అసలు చంద్రహాసునిపై నతనికి క్రోధ ముదయించుట కీర్ష్య తప్ప మఱి యే హేతువును గానరాదు. ఈ యీర్ష్యయే యతని యధఃపతనమునకు మూల హేతు వయ్యెను. † ఇట్లే దుర్యోధనుఁడు పాండవులఁ బలుపాట్లు పెట్టుటకు బెక్కు విధముల ప్రయత్నించెను. లోభేర్ష్యాపరాయణుఁ డయిన యాతని ప్రయత్నము లన్నియు భగ్నములై తుది కాతనికిఁ తలవంపు చేకూర్చెను. వీరసేనుని మోహమునకు ఫలితము తత్క్షణమే కానిపించెను. హిరణ్యకశిపుఁడు వరగర్వముచే మదోన్మత్తుఁడై సంచరించెను. అతనికి హరి భక్తిపూరితుఁ డయిన ప్రహ్లాదుఁ 'డంగ వార్షితములోని దుష్టాంగము' వలెఁ గానిపించెను. అతఁడు ప్రహ్లాదునిఁ బఱిచిన పాట్లన్నిటికిని మద క్రోధములే కారణము. నరసింహమూర్తి యా యౌద్ధత్యమునకు ఫలముగా నాతనిని నఖ క్రీడావినోదముగాఁ దునియలు తునియలు చేసి మదము గల వారి కందఱికిని మంచి నీతి గఱపెను.

ఏ కార్యమునం దయినను అవిచలితమయిన యవధాన ముంచి పట్టుదలతో పనిచేయుట శ్రేయమునకు రాచబాట. ఆ పట్టుదల, నిష్ఠ, లేకపోయినచో మానవ శక్తి (energy) నష్టమే కాని ఫలితము కానిపించదు. కష్ట నిష్ఠురముల కోర్చి తాను మనసార ధర్మ్య మని నమ్మిన యొక కార్యమును వీడని యుత్సాహముతో నొనరించు వారికి విజయము తథ్యము. ప్రహ్లాదుఁడు చచ్చుట కైన నోర్చెఁ గాని తన మనమున నాటియున్న హరిభక్తిని మాత్రము విసర్జించుట కంగీకరింప లేదు. సావిత్రి తన పతి ప్రాణములు సంపాదించుటకుఁ గాలుని ననుసరించుచునే యుండెను. రుక్మాంగదుఁడు తన కుమారుఁడు మృత్యు ముఖమునఁ బడనున్నప్పుడు సైతము ఏకాదశీ వ్రత నిష్ఠ పరిత్యజింప లేదు. ముక్తావళి, చంద్రమతి, రోషనార యెన్ని కష్టముల కోర్చియైనను పాతివ్రత్య భంగమున కొడిగట్ట లేదు. వీరందఱును దమ నిష్ఠకుఁ బదులుగా కష్టముల నుత్తరించి యంత్యమున నవ్యయమయిన సౌఖ్యము నందఁగలిగిరి.

ధర్మానుసారియైన సత్యవస్తువు కడగండ్లఁ గడచి యఖండమయిన విజయముఁ గాంచుట ధ్రువము. ధర్మ నైర్మల్యము లెన్నఁడు నొండొంటి విడువనే విడువవు. అవి పరస్పరాశ్రయములు. నైర్మల్యముతోడి పొత్తులేని ధర్మము విజయముఁ

† నా యసూయ గుణంబునకు ఫలం బిదియె నా యీర్ష్య జన్మంబునకు ఫలం బిదియె
నాదు క్రోధగుణంబునకు ఫలం బిదియె నాదు మాత్సర్యంబునకు ఫలం బిదియె.

బొందుట కవకాశము కలదు కాని ధర్మహీనమయిన నైర్మల్యము సిద్ధిఁ బొందనేరదు. చిత్రాంగి పరిణయమున నైర్మల్యము కలదు కాని ధర్మము కొఱవడి యున్నది. ఆ కారణముచే నామె కోరిన సిద్ధి వడయలేదు. దమయంతి, సావిత్రి, రోషనార, ముక్తావళి, చంద్రరేఖ, ద్రౌపది మొదలగు వారి యనురాగము ధర్మ నైర్మల్యములు రెంటికిని ఆటపట్టులు. ఆ హేతువుచేతనే వారి యనురాగములు దైవకల్పితములయిన వియోగ విఘ్నములచేఁ గొంత యొడుదొడుకు పోకపోయినను జివరికి సుస్థిరమయిన యనంతమయిన రాచబాటలోఁ బడెను. సత్య పరిణయము (True love) అంత్యమున సుఖ సంపూర్ణమయిన యఖండ సిద్ధిని పొందితీరును. (triumphs in the end).



# 12. ఆంధ్రనాటక పితామహుని నాటకములు-హాస్యము

## I

రసానంద జనకతా నీతిబోధనలు నాటక వృక్షము యొక్క రెండు పరిపక్వము లయిన ఫలములు. ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికు లందఱు నీ విషయమున నేకీభావము వహించియున్నారు. ధనంజయుఁడు నాటకమున కానందమే ప్రధాన ఫలమనియు; నీతి వ్యుత్పత్త్యాదు లానుషంగికములనియు నుడివెను. డ్రైడెను మున్నగు పాశ్చాత్య విమర్శకులు కూడ సంతోషమును కలిగించి నీతిని బోధించుటయే (to delight and teach) నాటకముయొక్క ప్రధాన ప్రయోజనమని నుడివియున్నారు. రసానంద జనకత్వము నాటకమున కందలి రసపరిపోషణమునుబట్టి వచ్చును. ప్రధాన రసము పర్యాప్తముగాఁ బోషింపఁబడకపోయినచో రససిద్ధి కలుగనే కలుగదు. నీతి బోధనము నాటక కవి గ్రహించు వస్తువుపై నాధారపడియుండును. అతఁడు నీతిబోధ కనువగు వస్తువునే గ్రహించుటచే నీ ప్రయోజనము మిక్కిలి సులభముగా సాధింపఁబడును.

నాటకమున దుర్నీతి వర్ణింపఁబడుచో నది లోక కల్యాణమునకు భంగము కల్గించుట యట్లుండ, సామాజికులలో ననహ్య భావమును బుట్టించి రససిద్ధి కాటంకము కలుగఁజేయును. అందుచే నాటక కర్త నాటకమునకుఁ బ్రధాన ప్రయోజనమయిన రసానందమునకు నిరోధము కలిగించునంత యధికముగాఁ గాక సామాన్యముగాఁ గథ ద్వారా నీతిని బోధించుచుండవలెను. దుర్నీతి నొక విధముగ హేళన చేసినచో నది సామాజికుల మనస్సులను బాగుగా నాకర్షించును. "ఇది దుర్నీతి. దీని బరిహరింప వలయును" అని పాత్రలచే ననిపించుట కంటె హేళనపూర్వకముగా దుర్నీతిని బరిహసించుట నీతిబోధకు మిక్కిలి శక్తిమంతమయిన సాధనము. ఇట్టి పద్ధతి పరిహసిత మగు దుర్నీతికే వశులగు సామాజికులకు సైతము నీతిబోధతో పాటానందమును గూడఁ గలిగించుచుండును. లేనిచో నాటకము కొందఱికైనను వైముఖ్యము ఘటించుట తటస్థించును.

హాస్యమువలన జనించు నవ్వే యానందమని భ్రమించుట పొరపాటు రసానంద హాస్యములకు స్వర్గ మర్త్యముల కున్నంత భేదము కలదు. రసానందమిహమును విస్మ

రింపఁజేసి, పాపమును బ్రిక్షాళించు పరమానందము. హాస్యజాతమగు నన్యేతరుల యాకారాదుల యందలి వికృతత్వముచేఁ గాని, వైపరీత్యముచేఁ గాని కలిగెడు నధర చలన రూపమగు హాసము. హాస్యము గూడఁ బ్రాచ్య లాక్షణికులచే నొక రసముగాఁ జెప్పఁబడినది కాని దీని కాధారమునకుఁ గొంత లాఘవము చేకూర్చు గుణము కలదు. విదూషకాది సామాన్య పాత్రల ద్వారా మాత్రమే హాస్యమును వర్ణించుట కవకాశము కలదు; కాని నాయకాద్యుత్తమ పాత్రలచే దానిని బోషించుట కంత వీలు లేదు. ఏలయన నుత్తమ పాత్రల ముఖమున హాస్యమును బ్రయోగింపఁజేయుట వారి యుదాత్తతకు భంగము కలుగఁజేయును. కులీనులగు స్త్రీ పురుషులు మాత్రమే ప్రాధాన్యము వహింపవలసిన విషాద నాటకములలో నీ కారణముచేతనే హాస్యమంతగాఁ గానిపింపదు. అందుఁ గూడ హాస్యమును బ్రివేశపెట్టవలెనన్న నందలి పాత్రల యుదాత్తతను గొంతవఱకుఁ దగ్గించి సామాన్య పాత్రలకుఁ గూడఁ బ్రవేశము కలిగింపవలెను. అందుచేతనే "గోల్డు స్మిత్" (Gold smith) ఉదాత్తమైన హాస్యము (Exalted humour) మాత్రమే కావ్యములలో నుండవలెనని యనుటలోని యుదాత్త హాస్యపదములు రెండును బరస్పర విరుద్ధములని నుడివెను. ఏలయన హాస్యమునకు నుదాత్తముగా నుండుటకుఁ జాల యంతరము.

శ్రవ్య కావ్యములు పండితులకు మాత్ర ముద్బోధము కలిగించును. అవి పామరుల విజ్ఞానమున కందరాని వగుటచే వారి కెట్టి లాభమును కలిగింపఁజాలవు. దృశ్య కావ్యము లట్లుకాక పండితులకుఁ బామరులకుఁ గూడ నానందము కలిగింపఁ గలవు. అందుచేతనే "కావ్యేషు నాటకం రమ్య"మ్మను నా నుడి యేర్పడినది. నాటకములలోఁ బామరులను సైతము రంజించు శక్తి నిసర్గముగానే యున్నను, హాస్యము దానికి మఱింత తోడ్పడును. నీతి యౌషధము వంటిది. కటువయిన యా యౌషధమునకు హాస్యమను తియ్యని పంచదార కొంచెము కలిపినచోఁ బామరుఁడగు రోగి దాని నానందముతోఁ గైకొనును. అంత నాతని దుర్ణయరోగము తేలికగాఁ గుదురును. లేనిచో నీ నీత్యౌషధము ఒంటఁ బట్టుటయే దుర్లభము. కాని యీ హాస్యము నాటక కథలో నంతర్గతమయి యుండుట మిక్కిలి యావశ్యకము. కొన్ని వీథి నాటకములలో నటకుల నేపథ్యధారణ యాలస్యమగుటచేతనో, పామరజనుల సంతృప్తికొఱకో కథతో సంబంధము లేని కొంత హాస్యమును బ్రదర్శించుచుందురు. ఇట్లు కేవల హాస్యము కొఱకే ప్రదర్శించు హాస్యము కథాసంవిధానముపై నంతగా దృష్టి లేని పామర జనులకు

బాధకము కాకపోయినను, మొత్తముమీఁద రస సిద్ధికి విచ్ఛేదము కలిగించుననుటలో సందేహము లేదు. అందుచే నాటకమున హాస్యము కథా వస్త్వంతర్గతముగానే యుండ వలయును గాని నేల విడిన సాముగా నుండరాదు.

రసములలో నన్నిటికిని పరస్పర సామరస్యము లేదు. కొన్ని రసములకు మఱి కొన్ని రసములతోఁ బొత్తు కుదురదు. ఇట్లొండొంటితోఁ బొత్తు కుదురని రసముల నొకే నాటకమునఁ బోషింప యత్నించుట యా నాటకమునందలి రస పరిణామమునకు విఘ్నము కలిగించుటే. శృంగార హాస్యములకుఁ బోలెఁ గరుణమునకును హాస్యము నకును బొత్తు కుదురదు. అందుచేఁ గరుణ రస ప్రధానములయిన నాటకములలో నీ హాస్యము ఛాయ కూడఁ గానిపింపదు. షేక్స్పియరు (Shakespeare) హాస్య ప్రియుఁడే యయ్యుఁ దన విషాద నాటకములలో హాస్యమును బ్రవేశింపఁజేయకుండుట కిదియే హేతువై యుండును. కావున నాటకము నందలి ప్రధాన రసమును బట్టియు దీని నల్పముగనో యధికముగనో వాడుచుండవలయును.

హాస్యమును హాస్యము కొఱకే (Humour for the sake of Humour) వాడినచో నుండునంత నైర్మల్యము దానివలన నన్యప్రయోజనమును గూడ నాశించుచో నుండదు. నీతిబోధకైనను హాస్యము సహాయకారియే కాని యేకైక సాధనము కాదు. కొందఱు తమ మనస్సులలోని సంస్కార భావములను బ్రజల హృదయములలోని కెక్కించుటకై యీ హాస్యము నూఁతగాఁ గొందురు. కాని యిట్టి సమయములలో హాస్యము ప్రారంభమున మృదువుగానే యున్నను రానురాను దీవ్రమై దూషణము లోనికి దిగును. ఇట్టి దూషణము హాస్యముయొక్క నైర్మల్యమును జెఱుచుటయే కాక సామాజికుల కసహ్యభావమును గూడఁ గలిగించును. మన వాఙ్మయమున నన్యథా నిర్మలముగా నుండవలసిన వీరేశలింగంపంతులుగారి హాస్యమును వేమన హాస్యమును గొంతవఱకుఁ గలుషితము లగుటకుఁ గారణ మీ సంస్కారము నెడ వారికిఁ గల యత్యుత్సాహమే.

కవియును సహృదయుఁడగు సామాజికుఁడును బెక్కు విషయముల నితరేతర సానుభూతి దర్శకులుగా నుండవలయును. లేనిచోఁ గవి తన నైపుణ్యముచే సామా జికుల కానందము నొసంగలేఁడు; సామాజికుఁడు కవి సామర్థ్యము మెచ్చుకొని యానందింపను లేఁడు. హాస్య విషయమునఁ గూడ గవి సహృదయు లిరువురును సమరస భావమును గలిగియుండుట మిక్కిలి యవసరము. కవి యెట్టి పరిస్థితులం

దయినను దాను బ్రయోగించు హాస్యమున కసభ్యతా దోషమును కలిగింపరాదు. అతఁడు జనుల నాగరికత పరిశీలించి తదనుగుణమగు సరస హాస్యమునే ప్రదర్శింపవలెను గాని యా మేర మీఱి ప్రవర్తించినచో నతని హాస్యము కౌశలముతోఁ గూర్పఁబడిన దయినను సామాజికులలో రోఁత కలిగించును. పానుగంటివారి హాస్యమున కిట్టి గతియే కొంత వఱకుఁ బట్టినది. సామాజికుఁడును నిట్టి విషయములలోఁ దన యహంకారమును గొంతవఱకు విడువవలెను. లేనిచో నాటక జన్యమగు రస మతని పాలి కుండనే యుండదు.

నాటక పాత్రలకును సామాజికులకును గల సంబంధ మన్ని యెడల నొకే మాదిరిగా నుండదు. నాటక కథా పరిస్థితులనుబట్టి కొన్ని పాత్రలు శోచ్యములుగా నుండును. కొన్ని యసహ్యములుగా నుండును. శోచ్యులయినవారు ప్రమాదవశమున దోషముల నొనరించువారే యయ్యును సామాజికులు వారియెడ సానుభూతి చూపుదురు. ఇట్లు సానుభూతి సంధుక్షకములగు పాత్రలను బరిహాస పాత్రములుగా నొనరించుట సామాజికుల మనములకు నొప్పి కలిగించును. ఇట్టి విషయములలోఁ గవి మిక్కిలి జాగరూకత వహింపవలయును. సురాపానాది వ్యసనము లోకవిధముగా శోచనీయములే యయ్యు హాస్యమునకు మూలము లగుటయును, ఇట్టి హాస్యము దురాచార నిరాస మునకు శక్తిమంతమయిన సాధనమగుటయుఁ గానిపించుచున్నది. ఇట్టిది తెలుచు నాటక కవి కథా నిర్వాహముపై నాధారపడియుండును. ఎట్లయినను హాస్యము నీచ విషయ జన్యమును, క్రూరతాచ్ఛాదితమును, నరసికతా మయమును గాకుండుట యావశ్యకము.

## II

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు వేమన యుపన్యాసములలోఁ జెప్పినట్లు మనలో నయముతోఁ గూడిన నిర్మల మయిన హాస్యము చాల తక్కువ. ఎక్కడఁ జూచినను అశ్లీలములతోఁ గూడిన కటువాక్యములే మనలో హాస్యమున కునికిపట్టులు. సంస్కృత నాటక కర్తలు తమ నాటకములలో విదూషక పాత్ర ద్వారా కొంత హాస్యమును బ్రదర్శించిరి. కాని యది చాలమట్టు కాతని కుక్షింభరిత్వముతోఁ గూడి నట్టిదిగా నుండును. కాళిదాసు తన ప్రథమ నాటక మయిన మాళవికాగ్ని మిత్రమున గొంత చుఱుకుఁ దనము గల విదూషకుని సృష్టించెను. కాని యే కారణము చేతనో తరువాతి రెండు నాటకములలో మరల నా తిండిపోతు విదూషకునే యచ్చుకొట్టెను.

సంస్కృతపుఁ బోకడలనే యనుకరించు తెలుఁగువారు సైతము తమ నాటకములలో నట్టి మొఱకు విదూషకునే సృష్టించిరి. పూర్వు లయిన పురాణ కవులును ప్రబంధ కవులును నెక్కుడనో తక్క మనః పూర్వకముగా హాస్యము పొంతకే పోలేదు. తెనాలి రామలింగనివని చెప్పఁబడు నాస్థాన చాటువు లందును, జగ్గకవి చంద్రరేఖా విలాపమునందును గొంత హాస్య మున్నను అందు మొదటిది కేవలము వ్యక్తిగత మయిన దగుటచేతను, రెండవ దసభ్యతా దోషమున కాకర మగుటచేతను నయము నను నిర్మలత్వమునను గొఱవడి యున్నవి. వేమన తన పద్యములలోఁ బెక్కు చోట్ల నయముతోడి హాస్యమును బ్రదర్శించెను. సభ్యమును నిర్మలము నయిన హాస్య మునకుఁ దెలుఁగు వాఙ్మయమున మొట్టమొదట భిక్ష పెట్టినవాఁడు సన్న్యాసి యైనను వేమనయే. తరువాత నాధునికులలో శ్రీ వీరేశలింగం పంతులుగారు కొన్నిచోట్ల సభ్య మయిన హాస్యమునకై యత్నించిరి. కాని కాలక్రమమున సంస్కార దృష్టి ప్రబల మగుటచే నాయన యుత్తర కాలమునఁ బ్రదర్శించిన హాస్యము కొంతవఱకుఁ గలుషిత మయినది. కాఁగా నైర్మల్య విషయమునఁ గన్యాశుల్కము నందలి హాస్యమును మించినది వేఱొకటి లేదు. మన పండితులు మాటాడునప్పుడు చతుర మయిన హాస్యమును బ్రదర్శించు నలవాటు కలవారే యయ్యు వ్రాయునప్పు డేలొకో లేని గాంభీర్యమును దెచ్చుకొని దాని మాటయైనఁ దలపెట్టరు.

ఆంధ్ర నాటక పితామహులు తమ నాటకములలో హాస్యమును బెక్కుచోట్లఁ బ్రదర్శించిరి. ఆయన విషాద నాటకములలో మాత్రము హాస్యరసమయము లయిన రంగములు మృగ్యములై యుండును. అసలు కరుణమునకును హాస్యమునకును బొత్తు కుదురదు. కావున విషాద నాటకములలో హాస్యమును బ్రదర్శించుట యొక్కొ క్కప్పుడు రసాభాసమున కాకర మగుచుండును. ఇందుచేతనే కాఁబోలు నాచార్యులు గారు సహజముగా హాస్యప్రియు లయ్యు విషాదాంతములలో దానిని జొలఁ దగ్గించి వైచిరి. సంస్కృత నాటకము లందలి విదూషక పాత్రలను బోలి కేవల హాస్యము కొఱకు సృష్టింపఁబడిన పాత్రలు వారి నాటకములలో మూఁడు కలవు. వారి నాట కము లన్నిటిలో సావిత్రి చిత్రాశ్వమునఁ బ్రాచ్య నాటక లక్షణములు సంపూర్ణముగా గోచరించును. అందలి విదూషకుఁ డయిన సుమాలి పాత్ర మీ విషయమును మఱింత దృఢపఱుచు చున్నది. వరూథినిలోని శతానందుని పాత్రమును, ప్రమీ లార్జునీయము నందలి సుయోగుని పాత్రమును సంస్కృత నాటకము లందలి విదూషకుని కనుకర ణములే. పై మూఁడు నాటకములందు నా విదూషకుల ప్రవేశనము హాస్యరస ప్రద ర్శనమునకు మంచి యవకాశము నొసంగినది. ఇతర మోదాంత నాటకములలో హాస్య

రస పోషణమునకై ప్రియత్నపూర్వకముగా సృజింపఁ బడిన యిట్టి పాత్రిలు లేక పోయినను హాస్యరస నైర్మల్యము గల సన్నివేశము లెన్నియేని కలవు.

ఆచార్యులు గారు హాస్యము ననేక విధములుగాఁ బ్రిదర్శింతురు. అందుఁ బాత్రిల శరీరము యొక్క కాని యవయవముల యొక్క కాని వైకల్యముచేఁ గలిగించు హాస్య మొక విధము. పాత్రిల యవయవ సంఘటనమున నేదేని లోప మున్నప్పుడు కాని వాని యాకారమున సాధారణ రూపము కంటె భిన్నమైన వింతఁ దనము గోచరించినప్పుడు కాని సామాజికులలో హాస్యము జనించును. మంధర గూనియును, గుంటికాలును, సుయోగుని రొయ్యమీసములును నిట్టి హాస్యమునకు మూలములు. సాధారణముగా నిట్టి వైరూప్యము దుష్టపాత్రిలందు వలె సత్పాత్రలందు గోచరించినప్పు డంతగా హాస్యము కలిగింప నేరదు. ఏలయన నప్పుడు సామాజికులా పాత్రిల సౌశీల్యముచే ముందే యాకర్షింపఁ బడినవారై యుండుటచే వారి వైరూప్యమునకుఁ గనికరము వహింతురే కాని హాస్యము ననుభవింపఁ జాలరు. సుబుద్ధి పిచ్చితన మిట్టిదే. అతఁడు వైద్యుని ప్రిశ్నములకు "దాసి, చిత్రాంగి, ప్రమాణము" మొదలగు జవాబు లిచ్చునప్పు డవస్థాంతరములో నవ్వు కలుగుట కవకాశము కలదు. కాని యా సందర్భమున మాత్ర మది హాస్యమును గలిగించుటకు బదులు విషాద నైశిత్యమునే పెంపొందింపఁ జాలుచున్నది. లీయరు నాటకములోని 'ఫూల్' హాస్యము కూడ నిట్లే యచ్చటి విషాద భావమున కుత్కర్ష కలిగించుచుండును. దైవ మూలకము లయిన యంధతా బాధిర్యము లీ విధముగనే శోచనీయము లయినను నవి పాత్రిల బుద్ధి లోపముచేఁ గాని భ్రాంతిచేఁ గాని కలిగినప్పుడు తప్పక నవ్వు పుట్టించును. బృహన్నల నాటకమున హలాయుధుఁడు భీముఁడు తన సోదరునిఁ జంపిన పగ తీర్చుకొనుటకై దుర్యోధనాదులతోఁ జేరి పాండవుల యజ్ఞాతవాసస్థలము నెఱింగి యపకారము కావింప నెంచెను. కాని శక్తి ప్రభావముచే నాతఁ డతి హైన్యమును గాంచుటయే కాక మూకత్వమును గూడఁ బొందవలసి వచ్చెను. దుర్యోధనాదు లాతనిఁ బాండవుల యునికిపట్టును గూర్చి ప్రశ్నింప నాతఁడు తనకుఁ దెలియు నని తల యూపుచు వారు వేసిన కొన్ని వేషములఁ దెలుపుటకై వికృతము లయిన సైగలు చేయును. దుర్యోధనాదు లా సైగలు బోధపఱుచుకొనలేక లేనిపోని యర్థములు కల్పించు కొందురు. ఇచ్చట నీ సన్నివేశ మెంతో హాస్యమున కాకరమై యున్నది. ఇట్లే చిరకారిలో మోహిని కల్పించిన చమత్కారము మిక్కిలి హాస్యరసభరితమై యున్నది. చంద్రరేఖయును తిలకయును మోహిని పల్కులను విశ్వసించి యొండొరులను బధిరలుగా భావించి పేరిగులు తెగునట్లుగా నఱతురు. తరువాత నది యంతయు

మోహినీ కల్పితమయిన చమత్కార మని యెఱిఁగి నప్పుడు వారికే నవ్వు కలిగెను. ముక్తావళి నాటకము నందలి ద్వితీయాంక ప్రథమ రంగమున బాదరాయణుని ప్రశ్న ములకు బధిరుఁ డయిన వీరబాహుఁ డొసంగిన సంబంధము లేని యుత్తరములు నవ్వు పుట్టించును గాని దానికి వీరబాహుని బాధిర్యము కంటెఁ బ్రశ్నోత్తరములకుఁ గల యసందర్భమే యెక్కువ కారణము*. ఇట్లంగ వైకల్యముచేఁ గలుగు హాస్య మితర విధముల కంటెఁ గొంచెము లఘువైనది. నిరక్షరాస్యు లయిన పామరులు సైత మిట్టి హాస్యమును సులభముగా గ్రహించి యనుభవింతురు.

నాటకస్థ పాత్రల యాచార వ్యవహారములు కాని ప్రవర్తన కాని సాధారణమైన వానికంటె భిన్నముగా నున్నప్పుడు హాస్యము కలుగును. సర్వవిధముల నున్నతమైన పాత్ర యేదో స్వప్రయోజనము నాసించి నీచసేవ చేసినప్పుడు కాని తన గాంభీర్య ముతోఁ బొందని మఱి యే కార్యము నయినఁ జేసినప్పుడు కాని నవ్వు కలుగును. కీచకుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు; రాజు తరువాత రాజు నంతవాఁడు. అతఁడు కామాంధుఁడై ద్రౌపదిని వెంబడించుటయు, నామె నెట్లయినఁ గూర్పు మని బృహ న్నల పాదములపైఁ బడుటయు నతని యున్నతికి విరుద్ధమయిన యనాగరికతను బ్రకటించుచు హాస్య సంజనకము లగుచున్నవి. అందును బృహన్నల యర్జునుఁ డగు టయు నపుంసకుఁ డగుటయు నిచ్చటి హాస్యమునకు మఱింత పుష్టి కలిగించుచున్నది. సావిత్రీ చిత్రాశ్వము నందలి ప్రథ మాంక తృతీయ రంగములో నెచ్చట నయిన జలాశయ మున్న దేమో చూచిరమ్మని సత్యవంతుఁడు పంపఁగా, సుమాలి నేలపైఁ బండుకొని సైగలతో దాహమును దౌర్బల్యమును జూపును. ఆ సందర్భమున సుమాలి వంటి విదూషకులు తప్ప నట్టి వికృత చర్యల నాచరింపరు. ప్రపంచ విషయములను నాచార వ్యవహారములు నెఱుంగని యనాగరికుఁడు నాగరిక సంఘమున నుండి వికృత కృత్యము లాచరించునప్పుడును, బలువురు స్త్రీల మధ్య నొక పురుషుఁ డేమి చేయుటకును దోఁపక విన్నఁదనము పొందునప్పుడును హాస్యము జనించుట కవ కాశము కలదు. సుయోగుఁడు ప్రమీల సభలోని కేగి యొనర్చిన యనాగరిక చేష్ట

---

బాద : (గట్టిగా) నీకు మిక్కిలిగా చెవుడు కాదా !

వీర : నా పేరు వీరబాహుఁడు.

బాద : (నవ్వి) కొంచె మయినను వినఁబడదా ?

వీర : వాన నిలిచినది. కుంచె యెందుకు ?

బాద : ఎక్కువగా నున్నదే ?

వీర : మీవంటి వా రుండ నేమి తక్కువ.

లన్నియు హాస్యమున కాకరములై యున్నవి. అశ్వపతి మొట్టమొదట ద్యుమత్సేనునిఁ జూడ నేతెంచినప్పుడు "సందర్శన మయినది కావున నింకఁ దమరు వెవళ్ళచ్చు" ననిఁ సుమాలి చెప్పుట యందలి మోటుఁ దనము కూడఁ దప్పక నవ్వు పుట్టించును. చిర కారిలోఁ గామసుందరుని మనోహరాదులు బలవంతముగా వేశ్యా గృహమున కీడ్చు కొని పోవుట కూడ హాస్య జనకముగానే యున్నది.

ఇట్లే పాత్రల శీలము నందలి పూర్వాపర వైరుద్ధ్యము కూడ హాస్యరసమున కాలంబన మగుచుండును. ఏదయిన ఘనకార్యము నొనర్చెద నని ప్రజ్ఞావాదము లొనర్చి యట్లు చేయలేక తద్విరుద్ధముగా వర్తించుటయు, దురాశచే నందని మ్రాని పండ్ల కట్టులు సాచుటయు, హృదయము నందలి నిజమైన యభిప్రాయమును గప్పి పుచ్చి సమయానుకూలముగా నెదుటివారి స్వభావము ననుసరించి కపటముగా మాటాడు టయు, నిట్టి శీల సంబంధి హాస్యమునకుఁ గారణము లగును. బృహన్నలలో నుత్త రుఁడు కౌరవసేన నొక్కఁడనే తునుమాడఁ గల్గుదు నని ప్రగల్భములు పల్కి చివరకు శత్రుసేనను జూచినంత మాత్రమున భీతుఁడై రథము దిగి పరుగెత్తఁ బూనుటయు, ప్రమీలార్జునీయమున సాత్యకి, సుయోగుఁడు, మేఘనాథుఁడు మొదలగు మహాయోధు లొక్క క్షణములో యాగాశ్వమును దెత్తు మని యర్జును నెదుట వీరా లాపము లాడి యా స్త్రీలను జూచి నంతనే మోహితు లయి ప్రణయ ప్రసంగములకు దిగుటయు హాస్యము నుత్పాదించుచున్నవి. ఈ యోధులు కారాగారమునఁ గనక లతా దుల పరోక్షమున నుద్రిక్తులై యుద్ధము చేయుటకు నిశ్చయించినను వారు రాఁగానే యా మాట మఱచి యొండొరులఁ గౌఁగిలించుకొనఁ బూనుట కూడ నవ్వు పుట్టించు చున్నది. ఇచ్చటి హాస్యము నాచార సంబంధి యని చెప్పినను దోషము లేదు. మంథర వైరూప్యముల కెల్ల నాటపట్టగుటయే కాక వయసు మీఱిని ముది జంత. ఆమె తన మాయోపాయముచేఁ గైకను మోసగించి యామెచే భరతునికిఁ బట్టాభిషేకము చేయు మని దశరథు నడిగించెను. నిజముగా రాముఁ డరణ్యమున కేగుటకుఁ గాని రాజ్యము భరతునికి సంక్రమింపఁ జేయుటకుఁ గాని యామెయే కారణము. తా నొనర్చిన మహోపకారమును గూర్చి యామె వెంటనే భరతునికిఁ దెలియపఱిచెను. అతని మనస్సును సరిగా గుర్తించినది కాకపోవుటచే నతఁడు తాఁ జూపిన మతి కౌశలమున కలరి తన్ను వివాహ మాడు నని తలంచెను. తన వార్ధకమును గాని వైరూప్యమును గాని తలంపక తన కంటె వయస్సునఁ గొంచెము చిన్నయే యైన భరతుని వంటి రాజసుతుఁడు తన్ను వివాహ మాడు నని యామె తలంచుట మిక్కిలి హాస్యమును గలిగించు చున్నది. నారదుఁడు పరమ భాగవతుఁడు. ప్రహ్లాదుని యపార మయిన

విష్ణు భక్తి కతని బోధయే కారణము. కుమారునిబుద్ధి మళ్ళింప లేక హిరణ్యకశిపుఁడు విచారించు చుండఁగా నారదుఁ డచ్చటి కేగి సమయోచితముగా "చిన్నపాపఁడు వాఁడు నిన్నంత తిరస్కరించినాఁడా ? నీ తమ్ముని( జంపిన మహా విరోధి నీ చిన్న బాలుఁడు నీ యెదుటనే నుతించునది విని యోర్చుటకు సాధ్య మగునా ? అట్టి యహంకార బుద్ధి మాత్రము పెరుఁగ నీయరాదు. తుదకు వాఁడు పోయిన నేమి ? మీ రిరువురు చల్లగ నున్న నెంద అట్టి కుమారులు కలుగరు ?" అని పలుకుట కడు పుబ్బ నవ్వు పుట్టించుచున్నది.

నాటక కవి కేవల హాస్య రస పోషణము కొఱకు కొన్ని సన్నివేశములు కల్పింపవచ్చును. ఇందు శీలాచార సంబంధి హాస్యము కూడ నిమిడి యుండుట తటస్థించును. సాధారణముగాఁ బాత్ర లొండొరుల వేషాంతర ధారణాది కారణములచే నెఱుంగఁ జాలక పోయినప్పుడును, సమయమునుబట్టి తమ స్వభావమునకు విరుద్ధముగా వర్తించునప్పుడును, బరస్పర విరుద్ధ స్వభావము గల పాత్రలు కలసి ప్రసంగింపవలసి వచ్చినప్పుడును నిట్టి హాస్యము గోచర మగును. ఆచార్యులు గారి నాటకములలో హాస్య మయము లయిన యట్టి సన్నివేశము లెన్నియో కలవు. సావిత్రీ చిత్రాశ్వమున సుమాలి వృద్ధ విప్ర వేషము వేసికొని యడవి నుండి సావిత్రీ ప్రణయమును గూర్చి చింతించుచు వచ్చుచున్న సత్యవంతునికిఁ దా నశ్వపతి పురోహితుఁడనియు, సత్యవంతుఁ డెవతెనో భిల్లాంగనను వివాహమాడెనని తాఁ జెప్పియుండుటచే నశ్వపతి తన కుమార్తెను ఘటకేతుని కుమారుని కిచ్చి పెండ్లి చేయుటకు నిశ్చయించెననియుఁజెప్పుట మిక్కిలి హాస్య పరిపోషకముగ నున్నది. ఇట్లే వరూధినిలోని సరస్వతచక్రవంతుల సంభాషణమును (III-1) చిత్రనళీయము నందలి పర్ణాద సుదేవుల సంభాషణమును చిరకారిలోఁ బురుష వేషధారిణి యయిన మోహిని చంద్రరేఖను బలాత్కరించుటయు నెంత గంభీరుని కయినను నవ్వు పుట్టింపక మానవు. అర్జునుఁడు యతి వేష ధారియై ప్రమీల యంతఃపురమును బ్రవేశించెను. చారుమతి యాతఁ డర్జునుఁడని యంతకు ముందే తెలిసికొనెను. ఆతనిఁ బట్టుకొమ్మని యన్య స్త్రీలు పలుకఁగా నర్జునుఁడు పరుగెత్త నారంభించెను. సుయోగుఁడు పక పక నవ్వ మొదలుపెట్టెను. ఈ సన్నివేశమున నర్జునుని పలాయనమునకును సహజమయిన యాతని వీరత్వమునకును గల యంతరము హాస్య రసమునకుఁ బ్రభవమై యున్నది. వరూధిని నాటకమునఁ బరమ నైష్ఠికుఁ డయిన ప్రవరుని నప్సరోవతంస మయిన వరూధిని కామించుట మిక్కిలి హాస్య జనకముగా నున్నది. ఈ విషయము చదువునప్పుడు కంటె రంగమునఁ జూచునప్పుడు ప్రవరుని ఛాందస వేషమునకును వరూధిని గణికా వేషమునకును

గల యంతరము మిక్కిలి స్పష్టముగా గోచరించుటచే హాస్యరస ముత్కర్ష నొందుట కెక్కువ యవకాశ మున్నది. ఈ నాటకముననే శతానందుఁడు వీరసేనుని కామ పరవశత్వము నన్యాపదేశముగా నపహసించు సన్నివేశము హాస్యరస పుష్టి కలిగి యున్నది. ఆంగ్లేయ కవులు పలువురు తమ నాటకములలో సన్నివేశముల ద్వారా హాస్యమును గలిగించు పద్ధతినే యవలంబించి యుండిరి.

సమయోచితముగాఁ బదముల నన్యార్థస్ఫూర్తి కలుగునట్లు ప్రయోగించుటకూడ హాస్యరసమును గలిగించును. ఎట్టి హాస్యమునకైనను బదములే యవలంబనములయి యుండును. పద సాహాయ్యము లేని కేవల సన్నివేశాదులు హాస్యరసము నంతగాఁ గలిగింప నేరవు. అందుచేఁ బైని పేర్కొనఁబడిన యుదాహరణములలో సైతము పదజనితమయిన హాస్యము కలదనుటలో సందియము లేదు. పదజనితమైన హాస్యము ప్రధానముగా మూఁడు రకములు. అందు నాటక పాత్రలు మనస్సంక్షోభముచేఁ గాని యజ్ఞానముచేఁ గాని పదములను సరిగా నుచ్చరింపలేకపోవుట యొకటి. ప్రమీలార్జు నీయమున సుయోగుఁడు ప్రమీల సభలో "మహారాణీ! మనత్కారము. నన్ను రాయ బారి అర్జునుఁడుగా—కాదు రాయహారికి అర్జునుఁ డమ్మా! అయ్యో బాబు (జాబు)" అని పల్కుటయు వరూధిని నాటకమున స్వరోచి భటులు కంధర మంధరులు వరణా నదిని గూర్చియుఁ బ్రవరుని గూర్చియు బాటసారులఁ బ్రశ్నించునప్పుడు ధర్మానది యనియు, మర్మానది యనియు, ఋణాపద యనియు, నిత్యాగ్ని యనియు, సత్యాగ్ని యనియు నేదో పలుకుటయు నవ్వు పుట్టించుచున్నది. ఎవరయిన నడిగిన ప్రశ్నకు విరుద్ధమయిన జవాబొసంగుట కాని యన్యాపదేశముగాఁ బాత్రల నపహసించుట కాని రెండవ పద్ధతి. ద్యుమత్సేనుఁడు తన పట్టణము ఘటకేతునిచే నరికట్టఁ బడినప్పుడు సుమాలిని బిలిపించి తన మనోజాడ్యము నెఱింగించెను. అంత సుమాలి "ఇట్టి మహా జాడ్యమునకు నే నొక మందే యెఱుఁగుదును. వేషాంతర ధారణమను ననుపానమునఁ బలాయనరస మింత సేవించినఁ జాలును" అని జవాబొసంగుట హాస్యసంజనకముగా నుండును. ఆ నాటకముననే సావిత్రీ సత్యవంతులు మాటాడుకొనుట స్వయముగాఁ జూచిన సుమాలి తాను రెండు పెద్దపులులఁ జూచెననియు, ఒకటితో నొకటి సరస మాడుచు నుండి తన ధ్వని విన్నంతనే యొకటి పరువెత్తి తన చెంతకు వచ్చెననియు నన్యాపదేశముగా వారిని బులులతోఁ బోల్చి చెప్పుటలో హాస్యము చిప్పిలుచున్నది. వరూధిని నాటకమున వీరసేనుఁడు "ఆ వధూమణి యొద్దకుఁ బోవలె నన్న నాకు తెక్కలు కట్టినట్లగును. ఆ చెలి చెంతఁ బాసి రావలెనన్నఁ గాళ్ళకు గుండ్లు కట్టి నట్లుండు" నని చెప్పినప్పుడు శతానందుఁడు "అప్పుడు నీ వీదులాడఁ బోయిన

బాగుండు" ననుట సమయవిరుద్ధమయిన యుత్తర మగుటచే హాస్యమును కలిగించు చున్నది. సాధారణ మానవాచారములకు భిన్నముగాఁ బల్కుట మూఁడవ పద్ధతి. ఇదివఱకుఁ జెప్పఁ బడినట్లు సుమాలి యశ్వపతి నింకఁ దమరు వెళ్ళవచ్చుననుటయు, యముఁ దేమివరము కావలె నన్నప్పుడు ధర్మదేవతవై మానవుల కగోచరుఁడవైనను నీ సౌమ్యమగు బ్రాహ్మణ రూపమున నిట దర్శించు భాగ్యము కంటిమి. మా పుణ్యముల కీడు లేదు. అయినను మాత్రము నీ పునర్దర్శనము మాకు లేకుండ నను గ్రహింపు" మనుటలో హాస్యరసము కలదు. ఆచార్యులుగారి నాటకములలో వాక్య జనితమయిన యిట్టి హాస్య మింక ననేక స్థలముల నున్నది.

హాస్యమువలెనే చమత్కారము (wit) కూడ వారి నాటకములలోఁ బెక్కు చోట్లఁ గాననగును. హాస్య చమత్కారములకు సూక్ష్మమయిన తారతమ్యము గలదు. హాస్యమును శిల సన్నివేశములద్వారా సైతము కొంత వ్యక్తము చేయవచ్చును. చమత్కారము కేవల శబ్దాశ్రియము, ఇది విద్వత్ప్రియుక్తము. శబ్ద చిత్రమే (Word play) దానికి జీవాతువు. హాస్యజనకములయిన పాత్రములకుఁ దమలోని హాస్య స్ఫోరకమయిన గుణ మేదో తెలియదు. చమత్కారము ప్రయత్నపూర్వకముగాఁ జేయఁబడును. "వింత వస్తువును యథాస్థితముగా వర్ణించుట హాస్యము. దానిని వేఱు వస్తువులతోఁ బోల్చి హాస్యమును వెల్లడించుట చమత్కారము" అని (హాజ్లిట్) నుడివెను. * "విద్యా వివేకశాలియగు పండితుఁడు కాని సామాన్యుఁడు కాని యితరుల లోని యసామాన్య గుణములఁ జూచి నవ్వుట చమత్కారము. వింత మనుష్యుఁడు తనలోని వింతఁదనమునకే యజ్ఞాతముగా నవ్వుట హాస్యము" అని ప్రొఫెసర్ నికోల్ చెప్పెను. *

---

* Humour is the describing the ludicrous as it is in itself; wit is the exposing it by comparing or contrasting it with something else. ఇతఁడే చమత్కారమునుగూర్చి యిట్లు పల్కెను. Wit is thus as we have already seen purely conscious. The wit sets himself to raise a laugh. He plays with words. His fancy works swiftly and out of the movement of his fancy he orders phrases and ideas in such a manner that others laugh along with him.

* wit is the laughter of the ordinary man or of the intellectual man directed at others abnormal : Humour is the laughter of the eccentric directed against himself.

ఆంధ్ర ప్రబంధములలోఁ జమత్కార మచ్చటచ్చటఁ గలదు. ప్రబంధ కవులు పుష్పలావికలను వర్ణించునప్పటి శబ్ద చిత్రముతోడి విటవిటీ సంవాదమున నిట్టి చమత్కార మధికముగాఁ గానవచ్చును. ఆచార్యులుగారు తమ నాటకములలోఁ జమత్కారమును వాడినచోట్లు కొన్ని గలవు. ప్రమీలార్జునీయము నందలి ద్వితీయాంక ప్రథమ రంగము దీనికి మంచి నిదర్శనము. ఇట్లే సుమాలి శతానందాదుల పల్కులందును హాస్యముతోపాటు చమత్కారముకూడ గోచరించును. (సావిత్రి II-2; P. 44 పరూ I-6).*

హాస్య మెప్పుడును సాంఘికమయినది. ఒంటరిగా నున్నప్పుడుకంటెఁ బలువురు కూడియుండునప్పుడు దానికిఁ బుష్టి యెక్కువ. పుస్తకమునందలి హాస్యమయ రంగమును మన మొంటరిగాఁ జదువుకొనునప్పుడు నవ్వు రాకపోవుటయుఁ గలదు. కాని సంఘముగాఁ గూడి యా దృశ్యమునే రంగమునఁ జూచునప్పుడు నవ్వు పుట్టి తీరును. ఆచార్యులుగారు హాస్యము నుపయోగించిన వెంటనే యపహసితమయిన పాత్రముచే "నన్ను హాస్యము చేసెద వేల" యని యనిపించుచుందురు. ఆయన నాటకములలో హాస్యమున్నచోట్ల నెల్ల నీ సూచన కాననగును.

ఆచార్యులుగారి హాస్యము సాధారణముగా నీచ మధ్యమపాత్రల నాశ్రయించియే యుండును. ఉత్తమపాత్ర లెచ్చటను దాని పొంతకుఁబోనే పోవరు. సుమాలి, సుయోగుఁడు, శతానందుఁడు, అలాయుధుఁడు మొదలగువా రందఱును నీ విషయమునకు నిదర్శనములు. ఈ నాటకములలో హాస్య మెల్లయెడల వచనమునందు మాత్రమే గోచరించును. పైని పేర్కొనఁబడిన నాటక పాత్రలకు పద్యము లంతగా లేకపోవుటయే దానికి కారణమై యుండును. సుమాలి యశ్వపతి నింకఁ దమరు వెళ్ళవచ్చునని చెప్పిన చోట మాత్ర మది పద్యములో నున్నది.

ఆచార్యులుగారి నాటకములలో సన్నివేశములలోఁ జక్కగా నతుకుకొను హాస్యమే పెక్కుచోట్ల నున్నను గేవల పామర జనులకై ప్రయత్నపూర్వకముగాఁ గల్పింపఁబడిన హాస్యము కూడఁ గొన్నిచోట్ల గానిపించును. చిరకారిలోని చెవిటివారి వినోదము, వరూధినిలోని సరస్వత చక్రవంతుల సంవాదము, కీచకుఁడు బృహన్నల పాదములపైఁ బడుట మున్నగున విట్టివి. వారి హాస్యములో నచ్చటచ్చట సభ్యతా దూరములయిన పదములు దొర్లుచుండుటయుఁ గలదు. దీనిని విని పామరులు సంతో

* శతానంద వీరసేనుల సంభాషణము.

షించినను బండితు లేవగించుకొందురు. ఇట్టివి తఱుచు శృంగారరస సందర్భములందే కాననగును. చిరకారిలో మోహిని పురుషవేషము వేసికొనుట కేవల చమత్కారము కొఱకే. కాని తరువాతి కార్యమంతయు దాని యవ్యవహిత ఫలముగానే పరిణమించి నది. ఇట్లు తేలిక యయినట్టియు నప్రధానమయినట్టియుఁ జమత్కారమునకే కథలో మిక్కిలి ప్రాధాన్య మొసంగుట లాఘవాపాదకముగా నుండును.

ఈ నాటకములలో సమయమునకు సరిపడని యసందర్భహాస్యముకూడఁ గొన్ని చోట్లఁ గలదు. ద్యుమత్సేనుఁడు కోట శత్రుసమాక్రాంత మగుటకు చింత నొందుచుండ సుమాలి హాస్యమునకై కడంగుట హాస్యాస్పదముగా నున్నది. మఱియు నింటికి వచ్చిన యతిథిని, అందును నొక మహారాజును నాతఁ డవమానపఱుచుట మోటుఁదన మున కాకరముగా నున్నది. చిత్రాశ్వుఁడు "సుమాలీ! నీవు హాస్యము చూపుట కిదియా సమయ"మని ప్రశ్నింప, "హాస్యమునకు సమయము కావలెనా? క్రొత్తఫక్కి తెచ్చితి" వని పల్కెను. ఈతని హాస్యము పెక్కుచోట్ల నసామయికముగానే యున్నది. మోహిని హాస్యమును దల్లియెడనే ప్రయోగించుటయు, శతానందుఁడు తన మిత్రునికి ప్రియాసంగమోపాయమును జెప్పుటకు బదు లాతని మేర మీఱి పరిహసించుటయుఁ గూడ నిట్టిదే.



# 13. ఆంధ్ర నాటక పితామహుఁడు

ఆంధ్రవాఙ్మయమును బరిశీలించినంతనే యందు సుమారొక శతాబ్ది క్రిందటి వఱకును నాటకములు రచింపఁబడకుండుట వింతగాఁ గానిపించును. పూర్వాంధ్ర కవులు "కావ్యేషు నాటకం రమ్య"మ్మను విషయము నెఱింగినవారయ్యును, నాటక రచనోచిత మయిన ప్రతిభా సంపద కలవారయ్యును ఏలొకో నాటక రచనకుఁ బూనుకొనియుండ లేదు. తంజావూరు మధురానాయకుల పాలనమున దక్షిణ దేశములో నసంఖ్యాకము లయిన యక్షగానములు రచింపఁబడినవి. అవి దేశీయ నాటకములు. వానికిని సంస్కృత నాటకములకును స్వరూప స్వభావ లక్షణాదులయందు సామ్యముకన్న భేదమే యెక్కువ. ఈ విధముగా నాంధ్రదేశమున క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధము వఱకును మన మిప్పుడు చూచుచున్న నాటకములవంటి నాటకములు బయలుదేఱలేదని చెప్పవచ్చును.

ఆ రోజులలో నుత్తర హిందూస్థానమునుండి కొన్ని నాటక సంఘములు హిందీ నాటకములను బ్రదర్శించుచు దేశమునందలి పలు ప్రాంతముల సంచరించుచుండెను. అట్టి నాటక ప్రదర్శనములు కొన్ని యాంధ్రదేశమునఁగూడ జరిగి వేలకొలఁది ప్రజల నాకర్షించియుండెను. నాటక ప్రదర్శనములందుఁ బ్రజలు చూపుచుండిన యుత్సాహమును గాంచిన యాంధ్ర పండితులు కొందఱప్పుడు తెలుఁగునఁగూడ నేల నాటకములు రచించి ప్రజల నానందపఱుపరాదను నుద్దేశమున మొదట ప్రసిద్ధములయిన సంస్కృత నాటకముల నాంధ్రీకరింప నారంభించిరి. తరువాత బుద్ధిశాలులగు విద్వాంసులు పురాణములనుండియుఁ జరిత్రనుండియు వస్తువు గ్రహించి స్వతంత్రములగు నాటకములు రచించుటకుఁ గడంగిరి-అట్లా యారంభదినములలో స్వతంత్ర నాటక రచనాధురీణులై ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణములకు సమన్వయము కలిగించి, యుత్తమములయిన నాటకము లనేకములు సృష్టించి, ఆంధ్ర నాటక పితామహులను నన్వర్థమయిన బిరుదమును గడించినవారు కీ. శే. ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు.

రామకృష్ణమాచార్యులుగారు క్రీ. శ. 1853 వ సంవత్సరమునఁ (పరీధావినామ సంవత్సర కార్తీక శుద్ధ ఏకాదశి) నాఁడు అనంతపుర మండలమునందలి తాడిపత్రి తాలూకాలోని ధర్మపురి అగ్రహారమున జనన మొందిరి. వారి జనకులయిన కృష్ణమా

చార్యులుగారు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. వారు బళ్ళారి నగరము నందలి వార్డా కాలేజీలో నాంధ్ర పండిత పదమలంకరించిరి. రామకృష్ణమాచార్యులు గారు తండ్రిగారి యొద్దనే సంస్కృతాంధ్రము లభ్యసించి చక్కని సాహిత్యముతో పాటు కవితాశక్తిని గూడ నలవఱుచుకొని యష్టశతావధానము లొనరించుచు యౌవనముననే పలువురి మన్ననలు పడయఁజాలిరి. తరువాత వా రాంగ్లభాష నభ్యసించి ఎఫ్. ఏ. పరీక్షలోఁ గృతార్థులయి ఆదవాని తాలూకా కచ్చేరిలోఁ గొన్నాళ్ళు లేఖకులుగాఁ బనిచేసియుండిరి. తరువాత వారు బళ్ళారికి వచ్చి "కంటోన్‌మెంటు మేజస్ట్రేటు" కోర్టులోఁ గొంతకాలము "ప్రైవేటు వకీలు"గా నుండి, పిమ్మట ఫస్టుగ్రేడు న్యాయవాది పరీక్షయం దుత్తీర్ణులయి మరణకాలమువఱకును న్యాయవాదిగానే పనిచేసియుండిరి. న్యాయవాదిగా వారికిఁ గల కీర్తి యనన్యసామాన్యమయినది.

ఆచార్యులుగారికి సారస్వతమునందే కాక ఆయుర్వేదము జ్యోతిశ్శాస్త్రము మున్నగు శాస్త్రములయందుఁ గూడ నపారమయిన యభినివేశముండెను. వారు విద్యార్థిగా నుండిన కాలమునఁ బెక్కు నాటకములలో నేర్పుతో నభినయించి పేరు గడించిరి. అభినయముతోపాటు గానకళయందుఁ గూడ వారు విశేషప్రజ్ఞ ప్రదర్శించుచుండిరని తమ నాటకము లందలి ప్రధాన పాత్రలను వారు స్వయముగా నభినయించుచుండఁగాఁ జూచిన పెద్దలు ప్రశంసించియుండిరి. వారు బళ్ళారిలో నొక నాటక సమాజమును స్థాపించి తద్ద్వారా పెక్కు నాటకములను బ్రదర్శింపఁజేయుచుండిరి. ఆంధ్రముననే కాక కన్నడమునఁ గూడ వారు కొన్ని నాటకములు రచించిరి. వామన చరితము, స్వప్నానిరుద్ధము అనునవి వారి కన్నడ నాటకములు. ఇట్లాంధ్ర నాటక వాఙ్మయమున కపూర్వమయిన వన్నె కలిగించి ఆచార్యులుగారు క్రీ. శ. 1912 వ సంవత్సరమున దివంగతులయిరి.

ఆచార్యులుగారు సృజించిన నాటకములు * ముప్పదికిఁ బైఁగా నున్నను అందు ముద్రితములయినవి పదునాల్గు మాత్రమే. ఈ పదునాల్గింటిలోఁ బెక్కాయన జీవిత కాలమునందును మరణానంతరమును బహు నాటక సమాజములచేఁ బ్రదర్శింపఁబడినట్టివే. అముద్రితములయిన వానిలో సైతమజామిళ చరిత్రాదులు కొన్ని ప్రదర్శింపఁబడి జనాదరము నొందినట్లు నాటకముఖస్థములయిన పీఠికలవలనఁ దెలియుచున్నది. దిన దిన ప్రవర్ధమానమై యతి మాత్రమైన యీ జనాదరమే యాచార్యులుగా రన్ని నాట

---

* ఉషాపరిణయము, అజామిళ నాటకము, మదనవిలాసము, సుశీలా జయపాలీయము, సుగ్రీవపట్టాభిషేకము మున్నగునవి వారి అముద్రిత నాటకములు.

కములు రచించుటకుఁ బ్రోత్సాహ మొసంగెను. చిత్రనళీయము, చంద్రహాస, ప్రమీలార్జునీయము మున్నగు నాటకము లిప్పటికిని దమ కొ్రత్తఁదనమును బాయక సహస్రముల కొలఁది సామాజికుల నాకర్షించుచునే యున్నవి. ఇట్టి నాటకము లింతకాలమవిచ్ఛిన్నమయిన యభిమానము నాహరించుట యందలి యపూర్వమయిన శిల్ప గౌరవమును జెప్పక చెప్పుచున్నది. అట్లు కానిచో నవి పెక్కితర నాటకములవలెఁ దమ కర్తల జీవితములతోనే యంతరించి యుండెడివి.

ఆచార్యులుగారు గ్రహించిన వస్తువు లన్నియుఁ గొంచె మించు మించుగాఁ బ్రఖ్యాతములే. పరిచితపూర్వములయిన కథలందే సామాజికుల కపారమయిన యభిరుచి కలిగించుట యం దాయన నైపుణ్యము బహువిధముల గోచరించును. మూలవస్తువునకు నాటకరూప మొసంగుటలో నాయన స్వతంత్రించి క్రొంగొ త్తవన్నియ లెన్నో కూర్చుచుండును. అందుచే నాటకవస్తువు పాత్రఁదయ్యుఁ బ్రత్యగ్రమువోలెఁ గన్పట్టి సామాజికుల మనస్సులను మిక్కిలి యవహితములుగా నొనరించును. శిశిరమున శుష్కించి నిష్పత్రములయి చూచుట కింపుగొల్పని పాదపములే వసంతాగమమున నవనవములయి నేత్రానందము సంధానించునట్లు మూలమున నీరసములయిన వస్తువులే యాయన నాటకముల రసనిర్భరములయి యపూర్వ రామణీయకముతో విలసిల్లుచుండుననుటకు చిరకారి, బృహన్నల మొదలగు నాటకములు నిదర్శనములు. కథా నిర్మాణమున స్వతంత్రించి మూలభిన్నమయిన మార్గము నవలంబించుటయే యాయనయందలి శిల్పవిశేషము కాదు. మూల వస్తువునే యావశ్యకములయిన కించిద్భిన్న కల్పనలచే నభినవముగా గోచరింపఁజేయుట యం దది మూర్తీభవించియున్నది.

కథ లెంత ప్రాచీనములయినను ఆధునికములయిన సాంఘిక రాజకీయాది విషయముల నందు సందర్భోచితముగాఁ జొప్పించి సామాజికులకు వానియం దత్యుత్సాహము కల్పించుట వస్తు నిర్మాణమున నాయన యవలంబించు పద్ధతులలో నొకటి. ఇట్టిదాని నాంగ్లేయులు Anachronism అను దోషముగాఁ బరిగణింతురు. అయ్యునట్టివి కొన్నిచోట్ల సామాజికుల యభిరుచికిఁ బోషకములే యగుచుండును. పాంచాలీ పరిణయమునందలి యువతీ వివాహ ప్రశంసయు, ప్రమీలార్జునీయము నందలి స్త్రీ స్వాతంత్ర్య సంబంధి చర్చయు, చంద్రహాసలోని యుప్పుపన్నుమీఁది యుపన్యాసమును నిట్టివే. అనిశ్చితము లగుటచే దేశమునం దల్లకల్లోలము కలిగించునట్టి సమస్యలు నాటకమున నేదో యొక విధమునఁ బరిష్కరింపఁబడు నప్పుడు సామాజికు లవహిత చిత్తులయి యా వాదోపవాదముల నానందముతో ననుసరింతురు. ఇట్టివి శ్రద్ధతో నాల

కించుటవలన వారికిఁ దాత్కాలికానందమే కాక యట్టి సమస్యల పరిష్కారమునకుఁ బూనికతోఁ బ్రయత్నించు నుద్దేశములు కూడ జనించును.

రస పరిపోషణమున నాచార్యులుగారు సిద్ధహస్తులు. నాటకాదియందు నిర్దేశింపఁబడిన రసమునకు విచ్ఛిత్తి కలుగకుండఁ గట్టకడదాఁక దానిని నిపుణముగాఁ బోషించుట యాయనకువలెఁ బెక్కురు నాటక కర్తల కందరానిది. శృంగార, కరుణ, హాస్య రసము లాయన నాటకములలో మిక్కిలి యుదారముగఁ బోషింపఁబడియున్నవి. కరుణ రసము నాంధ్రమున నింత నిశితముగఁ బోషించిన నాటక కవి యింకొకఁడు లేఁడని చెప్పవచ్చును. పాదుకా పట్టాభిషేక విషాద సారంగధర నాటకములలోని కరుణ మనన్యాదృశమయినట్టిది. ఆచార్యులుగారు శృంగారమును మిక్కిలి చాకచక్యముతో వర్ణింతురు. ఆయన నాటకములలోని ప్రణయ సంవాదములన్నియు సహజములయి నిర్మలమయిన యనురాగమున కాకరములుగా నున్నవి. హాస్యరస పోషణమున నాయనకుఁ గల కౌశలమునకు వరూధిని చివరి యంకమునందలి పిరా పుత్త్రిల సంవాదమును గాని, చిరకారిలోని మోహినీ కల్పితమయిన హాస్యవినోదమునుగాని చూచినఁ జాలును.

ఆచార్యులవారి నాటకములలోని పాత్రిలు పెక్కు సుస్పష్ట రేఖలతోఁ దీర్చిదిద్దఁబడియున్నవి. ఏ పాత్రి యే సందర్భమున నే స్థానము వహింపవలయునో యాయన బాగుగా నెఱుంగును. మంథరాదు లొకరిద్దరు తప్ప నాయన నాటకములందలి స్త్రీ పాత్రలన్నియుఁ బాతివ్రత్యమునకుఁ బరమాదర్శములు. పాత్రలందు దాను బ్రదర్శింపఁదలఁచిన భావముల కాయన సమగ్రమయిన రూపొసంగి సామాజికుల మనఃఫలకములందు వానిని సుస్థిరముగా నచ్చొత్తుకొనునట్లొనరించును. నలాదులలోని యౌదార్యమును, దుష్టబుద్ధిలోని దౌష్ట్యమును, రుక్మాంగద ప్రిహ్లాద ప్రభృతులందలి భక్తి నిష్ఠను ఆయన మిక్కిలి విశుద్ధముగా వర్ణించెను. ఆయన నాటకము లందలి పాత్రిలు మంచివైనను, చెడ్డవైనను, సుస్పష్ట రేఖలతో గోచరించుననుట కింకను అనేక నిదర్శనము లున్నవి.

పాత్రల చిత్తవృత్తి నిరూపణమున నాచార్యులవా రప్రతిమానులు. మానవ మనఃప్రవృత్తు లనేక సందర్భములలో ననేక విధములుగా గోచరించుటయే కాక యుత్తమ మధ్యమాధములలో నొక్కొక్కరియం దొక్కొక్క విధమునఁ బ్రతిఫలించుచుండును. వీని నన్నింటిని పర్యాప్తముగా గ్రహించిన యనుభవ మాచార్యుల

గారి నాటకములలోఁ బెక్కుచోట్లఁ గానిపించుచున్నది విషాద సారంగధరమునఁ జిత్రాంగి చిత్తవృత్తి నాయన ప్రదర్శించిన విధ మత్యద్భుతముగా నుండును. ఆమె నిర్మలమయిన యనురాగము తిరస్కారముచే ననివార్యమయిన మహా క్రోధముగా మాఱుటయు, నా క్రోధముయొక్క క్రమ పరిణామమున మరల ననురాగచ్ఛాయ లెడనెడ గోచరించుటయు నందు విశదముగా వర్ణింపఁబడియున్నవి. ఇట్లే కైకా మంధరల మనోవృత్తులఁ బ్రదర్శించుటయందును, స్త్రీయైన భర్తను బెండ్లాడిన కళావతి మనోభావములను, నపుంసకుఁడై భార్య నన్యుఁ డవమానించుచుండఁ జూచుచు నూరకుండవలసిన బృహన్నల మనో భావములను ఆయన మిక్కిలి నేర్పుతో వర్ణించెను. ఈ విధముగ స్త్రీ పురుషుల చిత్తవృత్తుల మనోహరముగాఁ బ్రదర్శించుటలోనే నాటకకవి శిల్పగరిమ గోచరించును.

అర్థసన్నివేశ సంఘటనమున నాచార్యులుగారిని మించువా రెందరో యుండరు. ఆంధ్ర నాటక కర్తలలో నాచార్యులుగారు సన్నివేశ కల్పనములవలనను, పానుగంటి వారు సంవాద నైపుణ్యమువలనను, తిరుపతి వేంకటకవులు తీరైన పద్యములవలనను పేరు గడించిరను నొకానొక విమర్శకుని వాక్యమెంతయు సమంజసముగా నున్నది. చిత్రనళీయమునఁ బర్ణాదసుదేవుల సమాగమమును, జరకారిలోఁ జంద్రరేఖ పురుష వేషమున నున్న మోహినిని ముద్దాడుటయుఁ, జిత్రాంగియు రాజరాజును మాటాడు కొనుచుండఁగా రత్నాంగి యచ్చటికిఁ వచ్చి పుత్రభిక్ష వేఁడుటయు, ముక్తావళి తన యాడుఁదనమును గళావతి కెఱింగించుటయు, నభిమన్యుఁడు తన తండ్రులఁ జూడ నరుదెంచి వారిని వేర్వేరఁ బిలువ వారు తాము పాండవులు కానట్లు నటించుటయు నఖండమయిన భావోజ్జృంభణము (Thrill) కలిగించు నద్భుతములయిన సన్నివేశ ములు. ఇట్టివాచార్యులుగారి నాటకము లన్నింటిలోఁ గానిపించును. రసమయములు నాశ్చర్యావహములునగు నిట్టి సన్నివేశముల సంఘటనమే యాయన నాటకముల కధిక సౌందర్యము చేకూర్చి వాని ప్రచారమునకు మిక్కిలిగాఁ దోడ్పడఁజాలినది.

నాటకారంభములను నిపుణముగా రచించుట కవికి మిక్కిలి క్లేశకరమయిన విషయము. నాటక మంతయు రచించుట యొక యెత్తు. ఈ యారంభమును నిసర్గ కోమలముగా వెలయించుట యింకొక యెత్తు. నాటక గాథకుఁ దత్పూర్వగాథతో నవిచ్ఛిన్నమయిన సంబంధము కల్పించుటలోఁ గవి మిక్కిలి శ్రద్ధ వహింపవలెను. మఱియు విస్తృతమయిన మూల కథలోని యే భాగముతోఁ బ్రకృత నాటక కథ నారంభింపవలయునో కవి ముఖ్యముగా గమనింపవలయును. ఆ యారంభమే ప్రధాన

కథతో సంబంధింపని యనావశ్యక విషయములతోఁ గూడి యందదుకులుగా నున్నచో సామాజికులకుఁ దొలుదొల్తనే నాటకమునెడ వైముఖ్య ముదయించును. ఆచార్యులుగారీ నాటకారంభ రంగములను మిక్కిలి చతురముగా నిర్వహింతురు. ఆయన నాటకములు తఱచు చంతకుఁ బూర్వమునుండియు జరుగుచున్న యొక సంవాదముయొక్క నడుమ నారంభించును. దీనివలనఁ బూర్వగాథకును నాటక గాథకును గల సంబంధమెంతో సాంద్రముగా నతుకఁబడుటయే కాక సామాజికుల యుత్కంఠ ద్విగుణీకృతమగుటయు సంభవించును. పాదుకాపట్టాభిషేకము, వరూధిని మొదలగు నాటకములలో నీ యారంభములు మఱియు రమణీయములుగా నున్నవి.

వ రూ ధి ని :

వీర : శతానందా ! నీవు చెప్పుదువు కాని ఆ చింత యెట్లు విడిచి పెట్టవలయును ?

శతా : దానిని తలఁచుకొనకయే యున్న సరి.

పాదుకా పట్టాభిషేకము :

వశిష్ఠుఁడు : అట్లయిన నీ యిష్టము. నీకే భయముగా నున్నపుడు కానిమ్ము.

దశరథుఁడు : భయమునకుఁ గాదు. నా కేమో చేయవలయునని యే యున్నది.

విషాద సారంగధరము :

మతిమంతుఁడు : నీతిజ్ఞా ! నయార్ణవా ! మన రాజుగారి శిరశ్శూల యిప్పు డెట్లున్నదని తెలిసినది.

నాటకము సారస్వత ప్రయోజనమునే కాక రంగ ప్రయోజనమును గూడ సాధింపవలయును కావున నందలి శైలి సామాజికులలోని పండితులకును బామరులకును గూడ సుబోధ మగునట్లుగా నుండవలయును. శ్రివ్య కావ్యములందు రచన సమాస భూయిష్ఠమై కొంత క్లిష్టముగా నున్నను అవి సావకాశముగాఁ బఠింపఁబడును కాన తదవగాహన విషయమున నంత కష్ట ముండదు. నాటకమున వాక్యపర్యాలోచనకు వీలులేదు. అందుచే నందలి రచన యేకవారశ్రివణ మాత్రము చేతనే స్పష్టముగా బోధపడునంత సరళముగా నుండవలెను. అయ్యును నది పేలవతాదోషమున కాకరము కాకూడదు. అట్లయినచో నాటక జీవమే సడలి నీరసమై పోవును. సంస్కృత నాటకములో మిక్కిలి నాటకోచితమును సుగ్రహము నయిన శైలి కలవాఁడు కాళిదాసు.

ఆతని నాటకముల ప్రసిద్ధికిఁ బ్రబలముగా దోడ్పడిన సాధనములలో నిది కూడ నొకటి. ఆచార్యులు గారి రచనలోఁ బద్యములోఁ గాని గద్యములోఁ గాని క్లిష్టత యంతగా నుండదు. అందలి శైలి సర్వజన సుబోధమై యొప్పారుచుండును. చిత్ర నళీయము నందలి బాహుకుని పద్యములు మాత్రి మిందు కొకవిధముగా నపవాదము లని చెప్పనగును. ఆయన పద్యములు పెక్కింటిలో భావ గౌరవము లేదను మాట నిజమే కాని యవి దుర్గ్రహము లనుటకు మాత్ర మవకాశము లేదు. ఆయన చెప్పఁ దలఁచిన భావమును మిక్కిలి స్పష్టముగాఁ జెప్పుచుండును. ఆయన స్వయముగాఁ బాత్రల ధరించినప్పు డాయా సందర్భములలోఁ బదములను దగినంత యొత్తిడితో నర్థస్ఫోరకములుగా నుచ్చరించుట వినఁదగిన దని యాయన పాత్రధారణమును జూచినవారు పలువురు నుడువుచుందురు. పదముల నుచ్చరించుటలోని యాయన యా గాంభీర్యము రచనలో సైతము కానిపించు చున్నది.

నాటక పాత్రల స్వభావములను స్పష్టముగా వివరించుటకై యాయన పెక్కు విధములఁ బ్రయత్నించును. క్లిష్టముగా నున్న యెడలఁ బాత్రల యూహలను వానితో సంబంధించియున్న కథా భాగములను ఆయన వేఱు వేఱు ప్రక్రియలద్వారా సులభ గ్రాహ్యముల నొనరించుచుండును. ఆయన వ్రాసిన రెండు పూర్వరంగములును బాత్రల శీల స్వభావావబోధనమునకుఁ దోడ్పడునట్టివే. ఆయన రచించు స్వగతము లును, ఉత్తరములును జరిగిన కథాంశములను సామాజికులకు విశద మొనరించుటకు మిక్కిలిగా సహాయపడుచుండును. పూర్వులు విష్కంభాదుల ద్వారా సూచించు సూచ్య వస్తువు నాయన రంగములలోఁ బాత్రల సంవాద మూలముననే వ్యక్తము చేయు చుండును. ఆయన సంవాదములు తఱచు సహజములయి ప్రస్తుత వస్తువు నంటియుండు నుక్తి ప్రత్యుక్తులతో సరసముగా సాగుచుండును. ఆయన రాఁబోవు కథాంశములఁ గూర్చి యప్పు డప్పుడు కావించుచుండు నాటకోచితమయిన సూచన సామాజికులను ఫలాగమము నెడ సంశయగ్రస్తులఁ గావించి వారికి నాటక కథానుసరణమున నెక్కువ యుత్సాహము నొదవించుచుండును. ఇట్టి భావి కథా సూచకమయిన ధ్వని నుపయోగించు ప్రజ్ఞ సంస్కృత నాటక కర్తల కెల్లఁ గరతలామలక మయినట్టిది. ఆచార్యులు గారు ప్రాచ్య పాశ్చాత్య వాఙ్మయములు రెండింటియందు నారితేఱినవా రగుటచే వారి నాటకములలో నాటక సౌందర్యమునకుఁ బుష్టి చేకూర్చు తదుభయ లక్షణ సమ్మేళనమును గానిపించుచుండును.

ఆచార్యులు గారి నాటకములను సర్వజనాదృతములు కావించిన గుణ విశేషము వేఱొకటి కలదు. ఆయన స్వయముగా నటు లగుటచే నితర నటుల యొక్కయు

సామాజికుల యొక్కయు నిష్టానిష్టములను జాగరూకతతో గమనించి వారి యాను కూల్యములను మనసునం దుంచుకొనియే నాటకములను రచించె నని చెప్పుదురు. ఇట్లు రంగము వైపు కూడ దృష్టి నిగిడ్చి నాటకములు వ్రాయువారు ప్రాచ్యులలోఁ జాలఁ దక్కువ. సంస్కృత నాటక కవులు నాటకముల సారస్వత ప్రయోజనమును సాధించుటకై కైకొనినంత శ్రద్ధ రంగ ప్రయోజన సాధనమునకై తీసికొనియుండ లేదు అందుచేతనే వారి నాటకములు పెక్కు భాషా భావములందు రమ్యములేయయ్యుఁ బ్రదర్శనమున కంతగాఁ బనికిరాకపోయినవి. లక్షణ వ్యతిరేకమున కయిన నంగీకరించి కేవలము సామాజికుల యభిరుచుల కనుగుణముగా నుండునను దృష్టితో నవలంబింపఁ బడిన పద్ధతు లాయన నాటకములలో నెన్నియో కలవు. ధీర నాటకములలోఁ బాట లకుఁ దావు లేకున్నను ఆ ప్రాంతము వారు సంవిధానచాతుర్యము మొదలయిన యితర గుణముల కంటె సంగీతము నెడ మిక్కిలి యాదరము గలవా రగుటచే వాని నెడ నెడ రచింపవలసి వచ్చె నవి యాయనయే చిత్రనళీయ ప్రస్తావనలోఁ దేటపఱిచి యుండిరి. ఈ జనాదర ప్రాప్తియందలి యభిలాష చేతనే వా రుచ్చ నీచ భావము లతో సంబంధము లేకుండఁ బాత్ర లన్నింటికి నెచ్చటనో యొకచోటఁ బద్యపఠనావ కాశము కలుగఁజేసి యుండిరి. ఇట్లే కేవల హాస్యముతోఁగూడిన రంగములను విషాద సారంగధరము నందలి న్యాయస్థాన రంగమువంటి యితర రంగములను ఆయన రచించుట జనుల యభిరుచులకుఁ బోషకములుగా నుండు ననియే. ప్రకరణమున కవ సరము లేకపోయినను రాజసభలలో రంభాదుల నాట్యము ప్రదర్శించుటయు సామాజి కుల యానందము కొఱకే. రంగ స్థలమునకును నాటకమునకును సన్నిహితమయిన సంబంధ ముండుట యావశ్యకమే యయ్యు నది నాటకము యొక్క కళా సౌందర్యము నకు విధ్వంసక మగునంత యధికముగా నుండరాదు. అట్లున్నచో నాటకము తాత్కా లికముగా సామాజిక బృందముల మెచ్చుకోలు పడయఁ గల్గినను జిరస్థాయియయిన ప్రతిష్ఠను సంపాదించుకొనఁజాలదు. అందుచేతనే నిజమైన నాటక కర్త నాటకమున రంగ సారస్వత ప్రయోజనముల రెండింటిని యథార్థముగా సాధింపవలెను. ఆచా ర్యుల వారి నాటకములలో నిట్టి సాధనమునకుఁ జేయఁబడిన ప్రయత్నము సర్వత్ర గోచరించుచున్నది.

కళకును నీతికిని నపరిహార్యమైన యవినాభావ సంబంధము లేదు. ఉత్తమమైన కళాపద్ధతిలో నీతి యంతరితమై యుండినను ఎన్నఁడును బ్రాధాన్యము వహింపఁ

జాలదు. కేవల నీతిబోధనమునకై ప్రయత్నించు కవి కావ్యకళా గౌరవమునకుఁ గళంకము తెచ్చి పెట్టినవాఁ డగును. కళారూపము కళంకిత కాకుండఁ గావ్యమున సరసముగా నీతిని బోధింపఁ జాలుట ప్రతిభైక సాధ్యమయిన పద్ధతి. ఆచార్యుల వారి నాటకము లన్నింటిలో నీతి యంతర్వాహినిగాఁ బ్రవహించుచునే యుండును. అది కొంత నిశితముగనే సూచింపఁబడినను శిల్ప సౌందర్యమున కెట్టి వైరూప్యమును గలిగించుట లేదు. ఇట్లు నైతికముగా శిల్ప సంఘటన మొనరించుట యాచార్యుల వారి యపార కళా వైదుష్యమున కర్హమైన తార్కాణము.

ఏ కళలో నయినను సమగ్రత్వము సంపాదించుట కష్టము. నిరవద్యమయిన కళాసృష్టి నిర్జరలోకమునను లేదు. ఆచార్యులు గారు స్వతంత్ర నాటకములు పెక్కు రచించి యాంధ్రవాఙ్మయమును బెంపొందించినవా రగుట నిర్వివాదమే యయ్యుఁ గళాదృష్టితోఁ జూచినచోఁ గొన్ని దోషములు సైతము వారి నాటకములలో గోచరించును. ఈయన నాటకవస్తువులలో బీజము మొదలు ఫలాగమము వఱకు నుండఁదగిన పరిణామావస్థలు పెక్కుచోట్లఁ గానిపింపవు. నాటక ప్రారంభమున బీజప్రాయముగా సూచింపఁబడు విషయమే నిర్వహణమున ఫలోన్ముఖ మగుట సహజమైన పద్ధతి. ఉపసంహృతిలోని కార్యమును బట్టియే బీజాదుల నిర్ణయమున కారంభించినచో నవి వారి నాటకములలో నే నడుమనో కానిపించుచుండును. అట్టిచోట్ల నంతకు ముందున్న విషయము నాటకములం దప్రస్తుత మేమో యనిపించును. వరూధినిలో వరూధినీ వీరసేనుల ప్రణయముతో నారంభించిన కథ మనోరమా స్వరోచుల వివాహముతో ముగియుటలోను, అర్జునుని శాపముతో నారంభించు బృహన్నల నాటక ముత్తరాభిమన్యుల వివాహముతో ముగియుటలోను జిరకారి కా నామము వచ్చుటతో ముగిసిన యా నాటకము మేధాతిధి రాజు యోగసాధనతో నారంభించుటలోను సంబంధ మేమియుఁ గానిపించుటలేదు. అందుచే నా నాటకములు చరిత్ర వలెఁ గొన్ని సన్నివేశముల కూర్పులుగా గోచరించు చున్నవి. ప్రమీలార్జునీయమున నర్జునుఁడు కర్ణ వధకై పశ్చాత్తాప మొందు రంగమునకును, పాంచాలీ స్వయంవరమున నేకచక్రపుర ప్రసంగమునకును, చిరకారి నాటకమున మోహినీ వృత్తాంతమునకును, బృహన్నలలోఁ గీచకవధకును గల స్థాన మేదియో నిర్ణయించుట కష్టము. అవన్నియు నా నాటకములలో ననవసరముగాఁ గల్పింపఁ బడినవి. ఈ యనావశ్యకవస్తు విస్తరణముచే నాచార్యులుగా రందు నాటక మూలసూత్రమయిన సంక్షేపమున కంతరాయము కల్పించిరి.

ఇట్లు సంక్షిప్తతకు భంగము కల్పించిన విధానములలోఁ బద్య గద్య గేయముల లోని భావముల పౌనరుక్త్యము వేఱొకటి. ఇది నాటకములఁ బ్రదర్శించు నట సమాజ ములకు సహాయకారియే యయ్యు సారస్వత దృష్టితోఁ జదువుకొనువారి కసహ్య భావమును గలిగించును. ఈ పౌనరుక్త్యమును దొలఁగించినచో నీ నాటకములు ప్రస్తుత పరిమాణమును సగము కోల్పోవు ననుటలో సందేహము లేదు. మూల వస్తువున కేదో విధమునఁ గొంత నూతనత్వమును గూర్పవలె ననియేకాని యందలి యనా వశ్యక విషయములను దొలఁగింపవలె నను నుద్దేశమే యాయన కున్నట్లు లేదు. అందలి విషయము లన్నిటి నెట్లో యొక ట్లతుకుటకై యాయన చేసిన ప్రయ త్నమే కీచకవధాదుల కా యా నాటకములలో నస్థానోపస్థితి సంభవించుటకుఁ గారణ మైనది.

ఆచార్యుల వారి నాటకములలోఁ బ్రధాన పాత్రలు పెక్కు క్రియా శూన్యములు. చంద్రహాసుఁడు, సత్యవంతుఁడు, సారంగధరుఁడు మున్నగువారి వృత్తాంతములు పరిశీలించినచో నీ విషయములు బోధపడును. మగవారి కంటె నాడువారి కీ నాటకము లలోఁ గొంత ప్రాధాన్యము హెచ్చు. అందుచే వారిలో స్త్రీ సహజమయిన లాలిత్యము కొఱఁతవడిన దని చెప్పవచ్చును. తిలక, మంథర, కమల మున్నగు నీచపాత్రలపై నా యా నాటకములలోని కథ యంతయు నాధారపడియుండుట వాని సామాన్య గౌర వమునకు లాఘవ మాపాదించుచున్నది. వీని యన్నిటికిని దోడు నాటక కార్యముతో నంతగా సంబంధములేని పాత్రలను సైతము కొన్నింటిని సృష్టించుట యందందుఁ గానఁబడును. చిరకారిలోని శ్వేతకేతు పాత్ర మిట్టిది. స్త్రీలకుఁ బురుష వేషములు వేసి నాటక కథను నడిపించుట యాచార్యులగారి కిష్ట మనుటకు ముక్తావళి, చిర కారి, మోహినీ రుక్మాంగద యను నాటకములు నిదర్శనములు. ఆ నాటకములలో ముక్తావళీ మోహిన్యాదులు పురుషవేషములు ధరించుటమీఁదనే కథ చాలవఱ కాధారపడి యున్నది.

ప్రబంధ కథలవలె నాచార్యులవారి నాటక వస్తువు లన్నియు రాజ కుటుంబము లతో సంబంధించి యున్నవే. ఒక్క చిరకారిలో మాత్రమది కొంత సహజమై సాధా రణ మానవుల జీవితముతో సంబంధించి యున్నది. పాశ్చాత్యుల పద్ధతుల నంత గాఢ ముగా నలవఱచుకొన్న యాచార్యులుగారు తమ నాటకములలో సాధారణ మానవ జీవి తములను గూడ వర్ణించుట కేల యత్నించియుండలేదో తెలియదు. బహుశః ఆంగ్ల

నాటక కర్తలలో నగ్రేసరుఁడయిన షేక్స్పియరు నాటకము లందలి కులీనపాత్ర సంఘటనము చూచి యాయనయు నట్లే కూర్చియుండును. అదిగాక యాయన పెక్కు వస్తువులను బురాణ ప్రబంధాదుల నుండియే గ్రహించియుండుటచే నవి యంతకంటెఁ గ్రిందికి దిగుట యసంభవము.

ఆచార్యులవారి నాటకములలోఁ బ్రబంధముల ప్రభావము పెక్కు విధములఁ గాననగుచున్నది. ఆయన మొదట రచించిన నాటకములు నాలుగైదు నాటకరూపమున నున్న ప్రబంధము లనియే చెప్పవచ్చును. అందుఁ బురవర్ణనము, వియోగవర్ణనము మొదలగున వన్నియుఁ బ్రబంధ పద్ధతి కనుసరణములుగా నుండును. మధురగతి వృషభగతి రగడలు, పద్యగద్యములలోని శబ్దాలంకారములు వానికిఁ బ్రబంధములతోఁ గల సారూప్యమును జెప్పక చెప్పుచున్నవి. వచనమున సైత మవకాశమును బట్టి యనుప్రాసముల నుపయోగించుట యాచార్యులుగారి సంబోధనలలోఁ బెక్కుచోట్లఁ గానిపించును. సీస పద్యములలో రాగనామములు చొప్పించి వ్రాయుటయు, బహువిధ వృత్తముల ప్రయోగమును, ఆ నాటకములలోని పద్యముల నడకకును, రసోత్పాదనము నకును మిక్కిలి భంగము కలిగించుచున్నవి. అస లాచార్యులవారి పద్యములలో భావ గాంభీర్యము తక్కువ. ఆయన శబ్దమున కిచ్చినంత ప్రాధాన్యమును భావమున కొసం గరు. ఇదియుఁ బ్రబంధ కవిత్వాభిమానమువలన వచ్చినదొసఁగే.

నాటకమునకు సంవాదము ప్రాణము వంటిది. అట్లుగాక కథన మార్గమే యవ లంబింపఁబడుచో రూపమునఁ దప్పఁ దత్త్వమున నది నాటకమే యనిపించుకొనదు. షేక్స్పియరు Tempest నాటకములో నారంభమున Prospero నోట ననిపించిన యుపన్యాసమును, Hamlet నాటకమున Haratio రాజకీయ చరిత్రను గూర్చి యొసం గిన యుపన్యాసమును, గథనమార్గము నాశ్రయించుటచే నా నాటకములకుఁ గళంకము సంపాదించుచున్నవని విమర్శకులు నుడివియున్నారు. ఆచార్యులవారి నాటకములలో సంవాద మెంతయో కథనముకూడ నంత. కథా రహస్యమును విప్పిచెప్పునప్పుడాయన పాత్రల సంభాషణ యుపన్యాసధోరణి ననుసరించి పోవుచుండును. చిరకారి నాటకము నందలి తిలక కావించిన చివరి యుపన్యాసమునకు నాటకముకంటె నవల యుచితతర మయిన స్థానము.

నాటక లక్షణ విషయమునఁ బాశ్చాత్యుల ననుసరించుటయేకాక ప్రాచ్య లక్షణ ములను బరిహాసముచేయుట కూడ నాచార్యులవారి నాటకములు కొన్నింటిలోఁ గాని

పించును. ప్రాచ్యలక్షణోల్లంఘనమును, నాటకములను విషాదాంతములుగా నొనరించుటయును, మరణాద్యుద్వేగకరములగు విషయములను నీరస విషయములను రంగముమీఁదనే ప్రదర్శించుటయును, నను కొన్ని పద్ధతులు పండితుల కాయన నాటకములయెడ నుండవలసిన యభిమానాదరములను గొంతవఱకుఁ దగ్గించివైచినవి. అంకములను రంగములుగా విభజించుటలో దోసఁగులేదు. కాని యవి యధిక సంఖ్యాకములగుచో నాటకానురక్తి ఖండితమయి సామాజికుల రసాస్వాదనమునకు భంగము కలిగించును. Antony Cleopatra లో షేక్స్పియరు రచించిన బహురంగములు తన్నిర్మాణ క్రియమునకుఁ గొంత లోప మాపాదించుచున్నవని పెక్కురు నుడివిరి. ఆచార్యులుగారు సైత మంకముల ననేక రంగములుగా విభజించుట ముక్తావళిలో గానఁగును. ఇంతేకాక రంగమునకును రంగమునకును విశేషకాల వ్యవధానముండుట వారి నాటకములలోఁ దఱుచు. అంకమునకు నంకమునకు నే కాలవ్యవధాన మంతగా నుండరాదను లాక్షణికులు దీనిని మఱియు నిషేధింతురు. అదిగాక యొకే దినమున ముగియవలసిన యంకము వ్యవధానముతోడి పెక్కు రంగములతో సంవత్సరముల కొలఁది సాగుట సహజముకూడఁ గాదు.

ఇట్టి దోషము లచ్చటచ్చటఁ గానవచ్చుచున్నను ఆచార్యులవారి నాటకములలో నాదరావర్జకములయిన గుణ విశేషములే పెక్కులు గలవు. అస లనవద్యముగా నాటకమును రచించుటయే కష్టము. కాళిదాస భవభూత్యాదుల నాటకములలో సైతము కళా సంబంధిదోషములు కొన్ని కలవని విమర్శకులు సూచించియున్నారు. ఆచార్యులుగారి నాటకముల కాంధ్రదేశమునఁ గల యతిప్రచారమే వానియందలి గుణబాహుళ్యమునకు గొప్ప నిదర్శనము. ఆంధ్రమున నాటకములే లేని రోజులలో, పరివర్తనములు చేయుటకుఁ గూడఁ బండితులు వెనుకాడుచున్న దినములలో సంవిధాన చాతుర్యముతో విలసిల్లు స్వతంత్ర నాటకము లన్నిటి రచించి ప్రదర్శింపఁజేసి యాంధ్రవాఙ్మయమునకు మహోపకార మొనరించిన నాటకపితామహుఁ డెంతయు స్తుతిపాత్రుఁడనుటలో సందియము లేదు. మఱియుఁ బాశ్చాత్య నాటకముల బాగుగాఁ బరిశీలించి యందు సహజములును రమ్యములు నని తోఁచిన కొన్ని మార్గములఁ దెలుఁగున గూడఁ బ్రవేశ పెట్టుట యాయన ప్రజ్ఞావిశేషమునకుఁ దార్కాణము. ఆంగ్ల నాటకములలో విషాదాంత నాటకములకు గౌరవప్రతిష్ఠలు హెచ్చు. మోదాంతములకంటె విషాదాంతములలో మానవస్వభావ వైవిధ్యమును గళాపరిణతియు నెక్కువగా గోచరించుటయే దానికిఁ గారణము. ఆచార్యులుగా రీ సంగతి గుర్తించి యట్టివానిని సైతము మన వాఙ్మయమున నెలకొల్పిరి. ఇంతేకాక యా యారంభదివసములందే యాయన నాటకములలోని

యన్ని రకములను రచింపఁగలుగుటయు వారి యసామాన్య ప్రతిభా విశేషమును జాటుచున్నది. చిత్రనళీయాదుల రచించి పురాణ నాట ములకును, చిరకారి రచించి సాంఘిక నాటకములకును, రోషనార రచించి చరిత్ర నాటకములకును నాయన యా నాఁడే బీజము నాఁటియుండెను. ఇప్పటికిని ఆయన సంపాదించిన యా బీజముల నాఁటుకొనుటయే కాని క్రొత్త విత్తనములఁ గూడఁబెట్టుట యెచ్చటను గానరాదు. ఆయన రచించిన నాటకము లనేకము లముద్రితములుగానే యుండిపోయినవి. అవి కూడ నచిరకాలములో ముద్రితము లగుచో నాంధ్ర నాటకవాఙ్మయమున కితోఽధిక మైన యభివృద్ధి చేకూరునని యాశింపవచ్చును.

